

# సమాధానమ్

జిజ్ఞాసువుల సందేహాలకు-

బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మగారి
సమాధానాలు





ఋషిపీఠం ప్రచురణలు

# సమాధానమ్

(భాగం-1)

**జిజ్ఞాసువుల సందేహాలకు**
**సామవేదం వారి**
**సమాధానాలు**

**ప్రథమ ముద్రణ:**
శ్రీదుర్ముఖనామ సంవత్సరం
పుష్యం-జనవరి, 2017

**ద్వితీయ ముద్రణ:**
శ్రీహేమలంబి నామ సంవత్సరం
మార్గశిరం-డిశంబర్, 2017

**వెల:** రూ. 100/-లు

**డిజైనింగ్ :** రాముపండా

**ప్రచురణ:**
**ఋషిపీఠం చారిటబుల్ ట్రస్ట్**
ప్లాట్ నెం-1-19-46,
హెచ్.ఐ.జి.ఎ-40,
డా॥ఎ.ఎస్.రావు నగర్,
హైదరాబాద్-500 062.
ఫోన్: 040 27134557, 27132550

# ఇది ఆర్షభారతి సమర్పనం

**స**నాతన ధర్మంపై అనేక సందేహాలు కలుగుతుంటాయి. ముఖ్యంగా జిజ్ఞాసువులకు సాధనార్థం కలిగే సందేహాలు ప్రధానమైనవి.

సాధన దశలో తమలో కలిగే ప్రశ్నలే కాక, బైట నుండి వినబడే కొన్ని సందేహాస్పద విషయాలు సందిగ్ధంలో పడవేస్తాయి. వాటిని దూరం చేసి మనసును సమాధాన పరచే ప్రయత్నంలో వివిధ శాస్త్రాల ప్రమాణాలతో అందించిన సమాధానాలను 'ఋషిపీఠం'లో ధారావాహికగా ప్రచురించడం జరిగింది.

వాటిలో కొన్నిటిని సంకలనం చేసి పుస్తకరూపంలో అందించాలని చాలామంది సహృదయులు ఆకాంక్షను వ్యక్తపరచడంతో ఈ గ్రంథం రూపుదిద్దుకుంది.

***సహృదయులు శ్రీకొలిపాక వేంకటేశ్వరరావు, విమలాదేవి దంపతులు (కూకట్‌పల్లి, హైదరాబాద్) ఆ పుస్తక ప్రచురణార్థం ఆర్థిక సహాయాన్ని అందించారు.***

***వారికి ఋషిపాఠం పక్షాన కృతజ్ఞతలు. ఆర్ష సరస్వతి ఆశీస్సులు.***

జ్ఞానం సమృద్ధిగా ఉన్న చోట మీమాంసకి అవకాశం ఉంటుంది. యుగయుగాల అనాది సనాతన ధర్మంలో విస్తార వాఙ్మయం, వివిధ కాలాలలో మహాత్ములచే జరిగిన సమన్వయాలు, సంస్కరణలు, సామాన్య-విశేష- ఆపద్ధర్మాలు... వంటి బహుళాంశాలున్నాయి.

నేటి కాలంలో మన సనాతన ధర్మవిషయంలో కలిగే సందేహాలను-✦అపోహలు, ✦అవగాహనారాహిత్యం ✦ అధ్యయన-సమన్వయలోపం ✦ సాధనాపరమైన జిజ్ఞాస ✦ కువిమర్శలు- అనే భాగాలుగా విభజించవచ్చు.

వాటికి సాధికారంగా, శాస్త్రప్రమాణాల సమన్వయంతో చెప్పే సమాధానాల సమాహారమే ఈ గ్రంథం. మిగిలిన సంపుటాలను క్రమంగా ప్రచురించి సహృదయులకు అందించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. త్వరలోనే అవి సాఫల్యం కావాలని ఆశయం.

ఋషిపరంపరకు ప్రాంజలిస్తూ, ఆర్షభారతిచరణసేవగా సమర్పిస్తూ...



**బుధజనవిధేయుడు**

సామవేదం షణ్ముఖ శర్మ

**ప్ర: 'ఆర్షసంస్కృతి' అనే మాటకి అర్థం ఏమిటి?**

**జ:** 'ఆర్ష' అంటే 'ఋషి సంబంధమైన' అని అర్థం. మన సంస్కృతి అంతా ఋషులద్వారా లభించినదే. అందుకే దీనిని 'ఆర్షసంస్కృతి' అన్నారు.

**ప్ర: రావణుడి నాభిలో అమృతభాండం ఉందనీ, దానిని కొడితేనే అతడు మరణిస్తాడని విభీషణుడు ఇంటిగుట్టు చెప్పి లంకకు చేటు తేవడం న్యాయమా? రాముడు ఆ మాట వినడం ధర్మమా?**

**జ:** అసలు రామాయణమంటే తెలియని వాళ్లు నమ్మే కథ ఇది. ఏ హరికథల కాలక్షేపంలోనో పుట్టిన పిట్టకథ. నిజానికి రామాయణంలో ఈ ఘట్టమే లేదు.



రావణుడితో రాముడు నేరుగా యుద్ధం చేశాడు. బ్రహ్మాస్త్రంతో రావణ సంహారం చేశాడు అంతే. అతడి నాభిలో ఏ భాండమూ లేదు. విభీషణుడు ఏ ఇంటిగుట్టూ చెప్పలేదు. కాబట్టి విభీషణుడి న్యాయానికీ, రాముడి ధర్మానికీ వచ్చిన లోటేమీ లేదు.

**ప్ర: సత్యభామ అలగడం, కృష్ణుడు ఆమె కాలు పట్టుకొని బతిమాలడం కథ వింటే, అతడు దేవుడేనా? అనిపిస్తుంది. నరకాసురుణ్ణి చంపినందువల్లే సత్యభామకు కృష్ణుడు దాసుడయ్యాడా?**

**జ:** మనకు అసలు కథలకన్నా అబద్ధపు కథలే వ్యాప్తిలో ఉండడం, వాటినే మనం నమ్మడం ఒక గ్రహచారం. కృష్ణుడు ఏ ఒక్కరికీ దాసుడు కాలేదు. భాగవతంలో గానీ, భారతంలోగానీ సత్యభామ గయ్యాళితనం ఎక్కడా చెప్పబడలేదు. 'భామా కలాపం'లో రసపోషణ కోసం గయ్యాళి సత్యభామ పాత్రను కూచిపూడి నాట్యకళలో ఒక నాయికగా సృష్టించారు. ఇది కృష్ణకథాధారం కాదు. అలాగే ముక్కుతిమ్మన 'పారిజాతాపహరణం' ప్రబంధంలో గయ్యాళి సత్యభామను కల్పించాడు. దాని వెనుక అంతఃపుర రాజకీయ కారణాలున్నాయి. అంతే కానీ పురాణాలలో ఎక్కడా కృష్ణుని

ఏ భార్యా గయ్యాళికాదు. యోగీశ్వరుడుగానే కృష్ణుడు స్పష్టంగా కనిపిస్తాడు. భారత, భాగవతాలలో నరకాసురునితో కృష్ణుడు యుద్ధం చేసేటప్పుడు, అతడితో పాటు సత్యభామ ఉంటుంది గానీ ఏ యుద్ధమూ చేయదు. నరకుని చంపనూ చంపదు. నరకాసుర సంహారం చేసినవాడు శ్రీకృష్ణుడే.

**ప్ర: శివుని లింగరూపంలో ఎందుకు పూజిస్తారు. ఏదైనా శాపమా?**

**జ:** శాపాలేవీ కావు. సదాశివునికి 1 అకల, 2. సకల అనే రెండు తత్త్వాలున్నాయి. అకలం– నిరాకారం, నిరంజనం, నిర్గుణం. సకలం– సగుణం. మొదటిది– బ్రహ్మ జ్యోతి స్వరూపం. రెండవది– భక్తానుగ్రహ విగ్రహం. 'అకల' తత్త్వాన్ని తెలియజేసేదే– అవయవరహితమై, జ్యోతి స్వరూపంగా, ఆద్యంతములు లేని లింగరూపం. 'సకలం'గా– చంద్రశేఖర, శూలధారి, చర్మాంబరుడు మొదలైన దివ్యమూర్తులు. ఈ అకల, సకల తత్త్వాలు రెండూ ఆరాధ్యాలే. 'లింగం' అంటే 'చిహ్నం' అని అర్థం. పరతత్త్వానికి చిహ్నం లింగం.

'లయనాల్లింగముచ్యతే' అని నిర్వచనం. సర్వం దేనిలో లీనమై ఉంటుందో ఆ పరమాత్మే లింగరూపి. ఈ కారణంచేతనే లింగరూపంలో శివుని ఆరాధిస్తారు. ఈ సమాధానానికి ప్రధాన ఆధారం శివ పురాణాదులు.



**ప్ర: దైవకార్యాల్లో, సంధ్యావందనాది కర్మల్లో ముక్కు మూసుకోమంటారెందుకు?**

**జ:** చేసేవారికి ఆసక్తి లేక, చేయించే పెద్దలు కొందరికి అవగాహన లేక ఇది జరుగుతోంది. ముక్కు మూసుకోవడం కాదు అది. దానిని ప్రాణాయామం అంటారు. దైవధ్యానానికి కావలసిన శరీర శుద్ధి, ఏకాగ్రత సిద్ధించడానికి అది శాస్త్రం విధించిన విధానం. ఊరక ముక్కు మూసుకోవడం ప్రాణాయామం కాదు. ప్రాణాయామం చేయకుండా ముక్కు మూసుకున్నా ఒకటే, చెవి మూసుకున్నా ఒకటే. అది చేసే విధానం ప్రధానంగా ఇది : కుడి ముక్కుని కుడిచేతి బొటనవ్రేలితో మూసి (ముక్కు పక్క నుండి మూయాలి. రంధ్రానికి దిగువ కాదు) ఎడమ ముక్కుతో నెమ్మదిగా గాలిని పీల్చాలి. దీనిని 'పూరకం' అంటారు. అలా పీల్చి, గాలి అలాగే నిలిపి కాసేపు ఉంచాలి. దీనిని 'కుంభకం' అంటారు. ఆ తరువాత కుడిచేతి చూపుడు వ్రేలు, మధ్యమ (లేదా అనామిక) లతో ఎడమముక్కు మూసి, కుడి ముక్కు నుండి గాలిని నెమ్మదిగా వదలాలి. దానిని 'రేచకం' అంటారు. అలాగే కుడి ముక్కునుండి పీల్చి ఎడమ ముక్కు నుండి వదలాలి. ఇది కొద్ది సెకన్ల కాలం.

పూరకానికి 4 సెకన్లు, కుంభకానికి ముప్ఫై సెకన్లు, రేచకానికి 4 సెకన్లు చాలు. వీటిని క్రమంగా పెంచుకుంటూ అనేకసార్లు చేయవచ్చు. 'పూరకం' చేసేటప్పుడు దైవధ్యానం, మంత్రధ్యానం చేయాలి. ఈ ప్రాణాయామం కర్మకి అర్హతనిస్తుంది. ఇలా చేయనప్పుడు, కేవలం ముక్కు పట్టుకొని ప్రయోజనం లేదు.

**ప్ర: కొన్ని దేవాలయాల్లోకెళ్లగానే పైన గంట వేలాడుతూ ఉంటుంది. కొన్ని చోట్ల కనబడదు. ఎందుచేత?**

**జ:** ఏ దేవాలయమైనా గంట ఉండి తీరుతుంది. అయితే పైన వేలాడుతూ ఉండక పోయినా, వేరేచోటనైనా ఉంటుంది. గంటని ఎప్పుడు పడితే అప్పుడు కొట్ట కూడదు. దర్శనానికి వెళ్లగానే గంట కొట్టడం అన్ని వేళలా పనికిరాదు. కొన్ని సేవల కాలంలో (ముఖ్యంగా మంగళహారతి నిచ్చేటప్పుడు) ఘంటానాదం వినిపిస్తారు. ఈ నాదం 'మంగళకరం, దేవవశ్యకరం' అని శాస్త్రోక్తి.

**ప్ర: విష్ణు సహస్రనామాలలో 'శర్వః', 'శంభుః', 'ఈశ్వరః', 'స్థాణు', 'రుద్ర' మొదలైన శివనామాలు కూడా కనిపిస్తాయి. ఎందువల్ల?**

**జ:** శర్వ– అంటే లయకర్త. శంభు– అంటే శుభకారకుడు, ఈశ్వర –అంటే పాలకుడు, స్థాణు– అంటే అచలుడు, రుద్ర– అంటే దుఃఖమోచకుడు. విష్ణువు పనులే ఇవి. పైగా ఈ నామాలు విష్ణువి వైనట్లే, ఈ నామాల వాచ్యుడు– శివుడు కూడా విష్ణువే. విష్ణువంటే 'సర్వవ్యాపకుడు'. శివుడంటే 'శాశ్వత శుభస్వరూపుడు'. శివుడూ సర్వవ్యాపకుడే విష్ణువూ శుభ స్వరూపుడే. విభిన్న కార్యాల కోసం విభిన్న రూపాలు. మనం ఉపాసించే దైవమే సర్వదేవతల సమాహారం. ఈ కారణం చేతనే శివసహస్రం లో విష్ణునామాలూ కనబడతాయి. దేవతలెందరైనా దైవత్వం ఒక్కటే. ఆ దైవత్వాన్ని మన అభీష్ట దైవంలో దర్శించాలి. అందుకే "హరి అవతారములే అఖిల దేవతలు" అన్నాడు అన్నమయ్య. దేవతా భేదం పాపకారకం. ఆ భేదదృష్టి పోవడానికి ఈ సహస్ర నామాలు ఇలా ఉపదేశిస్తున్నాయి. అన్ని నామాల తాత్పర్యం ఒకే పరమాత్మ.

**ప్ర: వేణువు ఊదుతున్న శ్రీకృష్ణుని విగ్రహం ఇంట్లో ఉండకూడదని మా మిత్రుడొకాయన అన్నాడు. అలాగే రాధాకృష్ణుల విగ్రహం (పటం) ఉంటే సంతానం కలగదనీ, నిలుచున్న లక్ష్మీదేవి పటం ఉండకూడదనీ కూడా విన్నాను. ఇవి నిజమేనా?**

**జ:** మీరు విన్న ఆ మాటలు నిజాలు కావు. మనలో ఇలా అర్థం లేని నమ్మకాలు చాలా ఉండిపోయాయి. ఎవరికో ఏదో కలుగుతుంది. దానికి మరేదో ఒక కారణం ఊహి

స్తారు. దానినే శాస్త్రాలుగా ప్రచారాలు కూడా చేసి పదిమందినీ భయపెడతారు. శ్రీకృష్ణుడు వేణువుతోనూ, రాధతోనూ– ఎలా ఉన్నా మంచిదే. అలాగే లక్ష్మీదేవి పటం కూడా. వీటిని హాయిగా ఇంట్లో పెట్టుకోవచ్చు. నిత్యం పూజించుకోనూవచ్చు.

**ప్ర: దేవుడి మందిరంలో విగ్రహాలు పెద్దవి ఉండకూడదా? ఉంటే ఏమౌతుంది? స్టీలు, వైట్ మెటల్ విగ్రహాలు పూజకి పనికి వస్తాయా?**

**జ:** దేవాలయాల్లో పెద్ద విగ్రహాలయినా ఫరవాలేదు. వాటికి కొన్ని కొలతల్ని ఆగమ శాస్త్రం నిర్దేశించింది. వాటికి పెద్ద ఆగమ విధానాలతో అర్చన ఉంటుంది గనుక, సామూహికమైన ప్రజలకు సంబంధించింది గనుక శాంతికి లోటు రాదు. కానీ ఇంట్లో దేవుడి మందిరాల్లో– శివలింగం అంగుష్ఠ (బొటనవ్రేలు) ప్రమాణం మించ కూడదు అని శాస్త్రం. విగ్రహాలైతే మన చేతి పిడికిలిని మించరాదు. 'వితస్తి'(అరచేతి) ప్రమాణంలో ఉండవచ్చని కూడా శాస్త్రవచనం. అంతకన్నా ఎక్కువైతే తగిన విశేష అర్చన, శాంతి చేయడం కష్టం. అవి ఇంట్లో అనర్థాలకు కూడా కారణాలవుతాయి. స్టీలు, వైట్‌మెటల్ లాంటివి విగ్రహాలుగానే కాదు, పూజాద్రవ్య పాత్రలుగా, దాన పాత్రలుగా, హారతి పళ్లేలుగా కూడా వాడుకోరాదు.



**ప్ర: గరుడ పురాణం ఇంట్లో ఉంచకూడదంటారు నిజమేనా? దేవాలయంలోనే ఉంచాలని విన్నాను. కేవలం మృతాశౌచంలోనే తప్ప మిగిలిన వేళల్లో చదవకూడదంటారుకదా?**

**జ:** వాటికి శాస్త్ర ఆధారం లేదు. అష్టాదశ పురాణాలూ ఇంట్లో ఉంచుకోవచ్చు. గరుడ పురాణం 18 పురాణాల్లో ఒకటి. వాటిని మృతాశౌచంలో చదవడం వల్ల, అప్పుడు చేసే కర్మకాండ పట్ల కర్తకి శ్రద్ధ కలుగుతుందనీ, ఈ పురాణ మహిమ వల్ల మరణించిన వారికి సద్గతి కలుగుతుందనీ– ఆ సమయంలో తప్పనిసరిగా చదువుతారు. అంతే గానీ, మిగిలిన వేళల్లో చదవకూడదని కాదు. ఎవరైనా ఎప్పుడైనా చదువుకోవచ్చు. పైగా తెలుసుకోదగ్గ పరలోక విజ్ఞానం, జీవుడి జనన మరణాలకు ఆవలి విషయాలు ఎన్నో ఉన్న గొప్ప గ్రంథమది. గరుడపురాణం ఉన్న చోట లక్ష్మీ నివాసమని ఆ పురాణంలోనే చెప్పారు.

**ప్ర: నది– నదం ఈ రెండింటికీ తేడా ఏమిటి?**

**జ:** తూర్పు దిక్కువైపు ప్రవహిస్తూ పోయి, తనంత తానే సముద్రంలో కలిసేది– నది. పడమటి దిక్కున ప్రవహిస్తూ వెళ్ళి, అక్కడ నదితో చేరి, సముద్రంలో కలిసేది 'నదం'.

**ప్ర: ఎందరో అవతార పురుషులు ఉన్నారిప్పుడు, వారందర్నీ దేవతలుగా భావించవచ్చా?**

**జ:** ఇప్పుడు అవతారాలేవీ లేవు. జ్ఞానులు, సిద్ధులు, భక్తులు, తపస్సంపన్నులు... మొదలైన మహానుభావులు అన్ని కాలాలలోనూ ఉంటారు. వారు అవతార పురుషులూ కారు, దేవతలూ కారు. నమస్కార యోగ్యులు. మనల్ని ఆశీర్వదించి, ఆదర్శంగా నిలిచేవారు మాత్రమే. అవతారాలు ఏమిటేమిటో శాస్త్రాల్లోనే చెప్పబడ్డాయి. కొత్త అవతారాలుండవు.

**ప్ర: స్త్రీలు సాష్టాంగ నమస్కారం చేయవచ్చా?**

**జ:** చేయరాదు. పంచాంగ నమస్కారమే చేయాలి. వక్షస్థలం, శిరస్సు, కన్నులు, మనస్సు, వాక్కు, పాదాలు, చేతులు, చెవులు... వీటితో భూమిని తాకి చేసే నమస్కారం 'సాష్టాంగం'. స్త్రీలు వక్షోభాగం నేలకి తాకేలా నమస్కరించరాదు. స్త్రీలు అష్టాంగంలో వక్షస్థలం, చెవులు, కన్నులు నేలపై తాకించరాదు.

**ప్ర: రామాయణంలో హనుమంతుడు 'రామదూత' మాత్రమే కదా? రామభక్తునిగా చెప్పబడలేదు. ఎందుకని?**

**జ:** భక్తి అంటే భజన చేయడం కాదు. ప్రేమ, గౌరవం, 'సర్వస్వం' అనే భావన. ఆ మూడూ రాముని పట్ల హనుమంతునికున్నాయి. 'దాసోహం కోసలేంద్రస్య రామస్య' (రాముని దాసుడను) అని హనుమంతుడు ప్రకటించాడు. అంతేకాక– సీతాన్వేషణ సమయంలో, అశోకవనంలోకి ప్రవేశించే సమయంలో– రుద్ర, ఇంద్ర, యమాదులకు నమస్కరించడానికి ముందు **"నమోస్తు రామాయ సలక్ష్మణాయ, దేవ్యైచ తస్యై జనకాత్మజాయై"**– అని సీతాదేవిని, లక్ష్మణసహితుడైన రాముని నమస్కరించాడు. దీనినిబట్టి దైవంగా కూడా హనుమంతుడు రాముని ప్రథమ స్థానంలో ఉంచాడని స్పష్టమవుతుంది. ఇలాంటి ఉదాహరణలు వాల్మీకి రామాయణంలో అనేకం కనబడతాయి.

**ప్ర: యోగాసనాలు వేస్తూ ఉంటే, ఎంత కాలానికి 'యోగి' కాగలం?**

**జ:** యోగాసనాలు వేసినంత మాత్రాన యోగి కాడు. క్రమం తప్పకుండా యోగాసనాలు వేస్తే మంచి ఆరోగ్యవంతుడౌతాడు అంతే. యోగవిద్య వేరు. యోగాసనాలు వేరు. 'యోగశ్చిత్తవృత్తి నిరోధః'– అన్నారు పతంజలి. చిత్తవృత్తులు నిరోధించి, పరమాత్మతో కలిగే సంయోగమే యోగం. దానికి అష్టాంగయోగం ఆధారం. యమ, నియమ, ప్రాణాయామ, ధ్యానాదులు ఇందులో చెప్పబడతాయి. అది ఆహార విహార నియ

మాలతో, ఇంద్రియ నిగ్రహాలతో సాగించాల్సిన సాధన.

ప్ర: **రాక్షస సంహారం కోసం, ధర్మప్రతిష్ఠాపన కోసం శ్రీ మహావిష్ణువే ఎక్కువగా అవతరించాడు. లేదా అమ్మవారు. అంతేగానీ శివుడు ఎందుకు అలా అవతరించలేదు. కారణం ఏమిటి?**

జ: శ్రీ మహావిష్ణువు స్థితి కారకుడు. జగత్తంతా సక్రమంగా నడిచేలా చూడడానికి పరబ్రహ్మ విష్ణ్వాకృతితో 'స్థితికృత్యాన్ని' నిర్వహిస్తున్నాడు. స్థితికి ముఖ్యం ధర్మమార్గం. కాబట్టి సృష్టికి ఆధారమైన ధర్మంలో ఏ విఘాతం ఏర్పడినా, ఏ సంక్షోభం కలిగినా– అధర్మాన్ని శిక్షించి, ధర్మాన్ని నిలిపి విశ్వస్థితిని సవరించడం ఆయన కర్తవ్యం. ఈ కారణం చేతనే విష్ణువు మాత్రమే అవతారధారణ చేశాడు.

**'యా ఉమా సా స్వయం విష్ణుః'–** ఆ విష్ణుశక్తే అమ్మవారు. ఆమె కూడా రాక్షస సంహారం కోసం అనేకమార్లు అవతరించి, ఉపాస్యమూర్తుల్ని మనకు అనుగ్రహించింది. శివుడు లయకర్త, కాబట్టి ఆయనకు అవతారధారణ అంత అవసరం లేదు. కానీ ఆయన కూడా ఆదిశంకర, దుర్వాస, ఆంజనేయాది అవతారాలు ధరించాడు. అయితే 'జ్ఞానప్రధాన దేవత' గనుక శివుడు జ్ఞాన మూర్తులుగానే ఎక్కువగా అవతరించాడు. భక్తరక్షణ కోసం తత్కాలంలో ఆవిర్భవించి యముని, భీమాసురుని, త్రిపురాసురుల్ని శిక్షించిన సందర్భాలూ ఉన్నాయి.

ప్ర: **లక్ష్మణుడు ఎంతగా చెప్పివెళ్లినా, సీతాదేవి లక్ష్మణరేఖను ఎందుకు దాటింది?**

జ: 'లక్ష్మణరేఖ' ప్రసక్తి రామాయణంలో లేదు. జానపద గాథల మూలంగా తరువాతి కాలంలో ఎవరో కల్పించిన కథ ఇది. లక్ష్మణుడు ఏ గీతా గీయలేదు. గీతే లేనప్పుడు దాటడం ప్రసక్తి దేనికి.

ప్ర: **ఎన్నో రామాయణాలున్నాయి. దేనిని నమ్మాలి? ఏది పారాయణం చేయాలి?**

జ: రామాయణం ఒక్కటే. జరిగిన కథను యథాతథంగా దర్శించి అందించినవాడు వాల్మీకి. ఆయన రచించిన రామాయణాన్నే ప్రమాణంగా స్వీకరించాలి. రామ కథని తమ శక్తికొలది భావించి తరించాలని, ఆ తరువాత అన్ని భాషల కవులు యథాశక్తి తమకు తోచిన వాటితో చాలా రామాయణాలు వ్రాశారు. అవి చదువుకోవచ్చు. వారి భావాలకు ఆనందించవచ్చు. కానీ ప్రమాణం విషయాని కొచ్చేటప్పటికి వాల్మీకుల వారే దిక్కు.

అయితే– పురాణాల్లో కూడా రామాయణం చెప్పబడింది. అవి ఆయా కల్పాలలో

జరిగిన రామావతార గాథలు కనుక, కథకీ కథకీ మార్పులు కనబడతాయి. ఇప్పటికి పూర్వం జరిగిన రామకథే వాల్మీకి రామాయణం. పారాయణం చేయాల్సినది కూడా వాల్మీకి రామాయణమే.

ప్ర: **జ్యోతిషం, వాస్తు- ఇవన్నీ శాస్త్రాలేనా? ఒకరు చెప్పినవి జరగడం, మరొకరు చెప్పినవి జరగకపోవడం ఏమిటి? ఒకరికీ, మరొకరికీ తేడా ఉన్నప్పుడు శాస్త్రంగా ఒప్పుకోవచ్చా?**

**జ:** శాస్త్రం వేరు, శాస్త్రవేత్తలు వేరు. శాస్త్రంలో ఒక్కొక్కరి అభ్యాసం, పరిశోధన, అధ్యయనం, అవగాహన... ఒక్కొక్క విధంగా ఉంటుంది. చక్కని అవగాహన, సమగ్రమైన అధ్యయనం ఉన్న శాస్త్రవేత్త ఖచ్చితంగా సమాధానాలు చెప్పగలడు.

వైద్యులందరూ వైద్యశాస్త్రం చదివినా, కొందరి హస్తవాసి మాత్రమే బాగుండటం, ఒక వైద్యుడు నవరించలేని దానిని మరో వైద్యుడు నవరించడం మనం చూస్తున్నాం. అంతమాత్రాన అది శాస్త్రం కాకుండాపోదు కదా! అది ఆయా విద్యల్లో సాధించిన పరిణతి, నైపుణ్యం మీద ఆధారపడి ఉంటుంది. కాబట్టి తేడా కనిపించినంత మాత్రాన జ్యోతిషాదుల్ని 'శాస్త్రం కాదు' అనలేం.



ప్ర: **హనుమంతుడు బ్రహ్మచారి అయితే, మరి 'సువర్చల' అనే భార్య ఉన్నట్లుగా ఎక్కడ ఉంది? రామాయణంలోనేనా?**

**జ:** రామాయణం వరకూ హనుమంతుడి భార్యల పేర్లు లేవు. మంత్రశాస్త్రంలో- మంత్రాధిదేవతలున్నారు. ఒక హనుమన్మంత్రం- 'సువర్చలాంజనేయం'. మంత్రాధిదేవతని శక్తిసహితంగా ఉపాసించాలి. హనుమంతుని శక్తి 'సువర్చస్సు'- సువర్చలగా ఉపాసింపబడుతోంది. ఇది ఉపాసనకి సంబంధించినది. అలాగే పంచముఖాంజనేయుడు కూడా మంత్రోపాసనమూర్తి. రామకథలోని హనుమంతుడు- ఆ మంత్రమూర్తి ధరించిన ఒక అవతారం. రామాయణంలో సువర్చల ప్రసక్తి లేకున్నా ఉపాసనాపరంగా అది సప్రమాణమే.

ప్ర: ***ఆంజనేయుడు సూర్యుని పుత్రిక అయిన సువర్చలను వివాహమాడాడనీ, వారిరువురికీ కళ్యాణాలు కూడా చేస్తున్నారు. ఇది రామాయణంలో ఉందా? గురుపుత్రికను వివాహమాడడం సమంజసమా? ఇంకా అనేక హనుమంతుని రూపాలలో అంతరార్థం ఏమిటి?***

**జ:** సువర్చలా ప్రసక్తి రామాయణంలో లేదు. ఇది రామాయణాలకు సంబంధించిన

కథకాదు. అలాగని దీనిని తోసి పుచ్చడమూ తగదు. ఇది పూర్తిగా 'ఉపాసన'కు సంబంధించినది. ఒక మంత్రం ద్వారా ఒక దేవత చెప్పబడుతుంది. అలానే మంత్ర శాస్త్రంలో హనుమమూర్తులు, దానికి సంబంధించిన మంత్రాలు చాలా ఉన్నాయి. అందులో ఒకటి సువర్చలాంజనేయం. ఇది లౌకికమైన విషయం కాదు. మంత్రశక్తికి సంబంధించిన మంత్రం. హనుమ సూర్యుని శిష్యుడన్నది పౌరాణిక కథ. మంత్ర పరంగా– హనుమంతుని యొక్క శక్తి 'సువర్చస్సు'– తపస్సు వల్ల వచ్చే తేజస్సును 'వర్చస్సు' అంటారు. అలాంటి శ్రేష్టమైన ప్రకాశమే హనుమ యొక్క శక్తి. శక్తి సహితంగా భగవంతుని ఆరాధించే సంప్రదాయంలో, ఆయన శక్తి అయిన సువ ర్చస్సునే 'సువర్చల'గా ఉపాసిస్తాం. ఇది సౌరశక్తి. ఈ సౌరశక్తితో ప్రకాశించే దైవ చైతన్యమే ఈ ఆంజ నేయుడు. ఈ శక్తీ సహితునిగా భగవంతుని ఆరాధించేవారికి ఆ వర్చస్సువల్ల అన్ని ఫలాలు లభిస్తాయి. సౌర (సూర్యుని) శక్తి గొప్ప వర్చస్సు గనుక– దానిని 'సూర్యపుత్రిక' అన్నారు. అంతేగానీ అది లౌకికంగా తండ్రీ కూతుళ్లు కాదు. సువర్చలాంజనేయులు లౌకికంగా భార్యాభర్తలు కారు. ఇది శక్తీ సహితమైన దేవతోపాసన. శక్తి సమేతంగా చూడడమే కల్యాణంలో పరమార్థం. అంతేగానీ ఇది సీతారాముల, శివ పార్వతుల కల్యాణాల వంటిది కాదు.

ఒకే దేవతకి పలురూపాలు ఉండడంలో అర్థం– ఆ దేవతకి సంబంధించిన అనేక మంత్రాల వల్లనే అనేక రూపాలు. శబ్దాల కూర్పుబట్టి దేవతాకృతులు ఏర్పడతాయి. 'మంత్రం– దేవత' సంబంధం తెలిస్తే ఇది అర్థమౌతుంది. ఎన్ని మంత్రాలున్నాయో అందరు దేవతలు, అన్ని దేవతా రూపాలు ఉంటాయి. అంతేగానీ అన్ని దేవతల రూపాలకీ పౌరాణికమైన కథలు ఉండవు. ఉన్నా అవీ మంత్ర సంకేతాలే. అంతేగానీ జరిగిన ఇతిహాసాలు కావు. రూపం కేవలం ఆ దేవతాశక్తిని ప్రకటించే ఒక సాధనం మాత్రమే. ఆ శక్తి శబ్దంలో చెప్పినప్పుడు 'మంత్రం'. దృశ్యంగా ధ్యానించినప్పుడు 'రూపం'.

**ప్ర: గణపతి ఆర్యులదేవుడు కాదనీ, ద్రావిడుల వల్ల వచ్చిన అనార్యదేవుడనీ చదివాను. వేదాలలో గణపతి ప్రసక్తి లేదని అంటారు. నిజమేనా?**

**జ:** వేదజ్ఞానం ఏమాత్రం లేని వారు తీసుకొచ్చిన వాదన ఇది. 'గణానాం త్వా గణ పతిగ్ం హవామహే' – అని ఋగ్వేదంలోని గణపతి సూక్తం. 'ఆహమజాని గర్భధమా', 'తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నోదంతీ ప్రచోదయాత్'

'తత్కరటాయ విద్మహే వక్రతుండాయ ధీమహి, తన్నోదంతీ ప్రచోదయాత్', 'లంబోదరాయ విద్మహే...' ఇలా వేదాలలో అనేక మంత్రాలు గణపతికి సంబంధ మైనవి కనబడతాయి. అంతేకాక- అథర్వవేదంలో 'గణపత్యుపనిషత్తు' గణపతి స్వరూపాన్నీ, మంత్ర స్వరూపాన్నీ తెలియజేస్తుంది. ఇంకా 'గణేశ తాపినీ ఉపనిషత్తు' అని ప్రసిద్ధి గల వేదోపనిషత్తు ఉన్నది.

గణపతి పూర్తిగా వైదిక దేవతే. వైదిక దేవతలను తాంత్రిక సాధనాల ద్వారా కూడా ప్రసన్నం చేసుకొనే తంత్రమార్గాలూ ఉన్నాయి.

**ప్ర: 'త్రయీ' అని వేదాలనంటారు. అంటే వేదాలు మూడేనా? 'అథర్వణ వేదం ఆర్యుల అనంతర కాలపు రచన' అని అంటారు. ఈ విషయం స్పష్టం చేయండి.**

**జ:** 'త్రయీ' అంటే 'మూడు వేదాలు' అని అర్థం కాదు. వేదాలు అపౌరుషేయాలు. ఆర్య, ద్రావిడ విభజన సరియైన చరిత్ర కాదనీ, తప్పుడు చరిత్రనే మనం చదువు తున్నామని- సరియైన శాస్త్రీయ పరిశోధనతో మన దేశచరిత్రకారులు నిరూపించారు. కానీ పాశ్చాత్య వ్యామోహంలో వారు చెప్పిన చరిత్రే మనకు ఆధారంగా భావిస్తున్నాం. నాలుగు వేదాలలోనూ మూడు రకాలైన మంత్రాలే ఉన్నాయి.



అవి: 1. ఋక్కులు, 2. యజుస్సులు, 3. సామములు. గద్య పద్య గీతాత్మకాలు ఇవి. ఈ మూడు విధాలైన మంత్రాలే నాలుగు వేదాలలో ఉన్నాయి. కాబట్టి నాలుగు వేదాలనీ కలిపి 'త్రయీ' అంటారు. ఇంతేకాక ఇంకా ఎన్నో అర్థాలు చెప్పబడ్డాయి. అవి 'నిరుక్తం' అనే వేదాంగంలో లభిస్తాయి. వేదశబ్దాలకు అర్థాలను తెలియజేసే శాస్త్రం- 'నిరుక్తం'. 'ఋగ్యజుస్సామరూపేణ మంత్రో వేదచతుష్టయమ్'- అనే ఆర్షవాక్యమే దీనికి ప్రమాణం. అథర్వ వేదం మహోత్కృష్టమైనది. అవి సిద్ధమంత్రాలు. ఈ వేదాన్ని 'అంగిరస' వేదం అనీ, 'భైషజ్య' వేదం అని అంటారు.

**ప్ర: 'లక్ష్మీ గణపతి' అంటే ఏమిటి? లక్ష్మి విష్ణుపత్ని కదా? గణపతితో ఉన్న లక్ష్మి ఎవరు?**

**జ:** ఆ లక్ష్మి వేరు. ఈ లక్ష్మి వేరు. ఇవన్నీ మంత్రశాస్త్ర విషయాలు. ఉపాసనా రహస్యాలు. 'లక్ష్మి' అంటే 'లక్షణశక్తి'. ప్రతి దేవతకీ, ఆ దేవతా శక్తి లక్ష్మి. ఐశ్వర్యమే లక్ష్మి. ఆ దైవం యొక్క శక్తే ఆ దైవానికి ఐశ్వర్యం. కాబట్టి ఆ దైవ శక్తిని 'లక్ష్మి' అన్నారు. విష్ణుపత్ని లక్ష్మికీ, గణపతిశక్తి లక్ష్మికీ భేదం ఉంది. వీటిని పౌరాణికంగా వ్యాఖ్యానించనవసరం లేదు. మంత్రోపాసనలో భాగాలివి. ఉపాస్య దైవంలో సర్వదేవతా

శక్తులూ ఉంటాయి. ఆ విధంగా– పరాశక్తి 'లక్ష్మి' పేరుతో నున్న గౌరిగా శివాంకంలో ఉన్నట్లు తంత్రశాస్త్రం వర్ణిస్తోంది.

**ప్ర: విగ్రహాల్లో దేవుళ్లుంటారా?**

**జ:** ఉండి తీరతారు. ఒక ఆకృతి ఇవ్వగానే, ఒక భావం కూడా ఆవిష్కరింపబడుతుంది. ఈ రెండూ కలసి ఒక ప్రభావాన్ని ఏర్పరుస్తాయి. ఒక చక్కని దృశ్యాన్ని చూసినప్పుడు ఆహ్లాదం, వికృత దృశ్యం చూస్తే ఆందోళన కలగడం సహజమే కదా! అలాగే దేవతాకృతి చిత్రంగానైనా, శిల్పంగానైనా కనబడితే ఎదుటివారిలో ఆ దేవతా లక్షణాన్ని తెలియజేస్తూ స్పందింపజేస్తుంది. అయితే ఆరాధన సమయంలో విగ్రహాలలో 'ఆవాహన' అనే కార్యక్రమం జరుగుతుంది. కొన్ని చోట్ల 'ప్రాణప్రతిష్ఠ' చేస్తారు. అంటే– మనం ధ్యానించే దైవమూర్తిని శబ్దశక్తి (మంత్రం) ద్వారా, భావన ద్వారా బింబం (విగ్రహం/ యంత్రం)లో ఆవహింపజేయడం. ఇది జరిగాక– మన నమ్మకాలతో పనిలేదు. అందులో దైవశక్తి వచ్చి తీరుతుంది. దానిని ఆరాధించడం అనేది మన అదృష్టం మీద ఆధారపడుతుంది. దురదృష్టవంతులకి విగ్రహంలోనే కాదు, దైవంలోనూ దైవం కనబడదు.



**ప్ర: శ్రుతులు, స్మృతులు– రెండింటికీ తేడా ఏమిటి? వీటిలో ఏవి ప్రమాణాలు?**

**జ:** శ్రుతులు అంటే వేదాలు. స్మృతులు– ధర్మశాస్త్రాలు. వేదాలలో చెప్పబడ్డ ధర్మ విషయాలు, విధి (చేయాల్సినవి), నిషేధాలు (చేయకూడనివి) తెలియజేసేవి స్మృతులు. 'స్మృతి' అంటే జ్ఞాపకం. వేదధర్మాలను జ్ఞాపకముంచడానికి వాటి ఆదేశాలను, కర్మలను ఒక పద్ధతిగా– ఆయా కాలాలకు అవసరమైన విధంగా అందించినవే స్మృతులు. మనువు, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు మొదలైన మహర్షులు తమ తపశ్శక్తితో వేదవిషయాలను గ్రహించి, స్మృతులుగా అందించారు.

**ప్ర: చతుర్దశ విద్యలు– అంటే ఏమిటి?**

***"అంగాని వేదశ్చత్వారో మీమాంసా న్యాయ విస్తరః।***
***పురాణం ధర్మశాస్త్రం చ విద్యాహ్యేతాశ్చతుర్దశ॥***

**జ:** నాలుగు వేదాలు (ఋగ్వేదం , యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదం), ఆరు వేదాంగాలు (శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం), నాలుగు ఉపాంగాలు (మీమాంస, న్యాయం, తర్కం, పురాణం, ధర్మశాస్త్రం)– ఇవీ చతుర్దశ (14) విద్యలు.

**ప్ర: ఇతిహాసాలన్నీ జరిగిన కథలేనా? కల్పితాలా?**

**జ:** "ఇతి–హా–ఆసం" = ఇతిహాసం. 'నిస్సంశయంగా ఈ విధంగా జరిగింది' అని ఈ పదానికి అర్థం. ఊహ, కల్పన ఉంటే 'ఇతిహాసం' అనరు. ఆ విషయాలు జరిగిన కాలంలో వ్రాయబడ్డప్పుడు ఇతిహాసాలవుతాయి. రామాయణ, మహా భారతాలు ఇతిహాసాలు.

**ప్ర: శివాలయంలో నంది ఎందుకుంటుంది? నంది కొమ్ముల మధ్యనుండి శివుని చూడమంటారెందుకు?**

**జ:** ఆగమశాస్త్ర ప్రకారం దేవాలయంలోని స్వామివారి వాహనం స్వామి ముందు ఉండాలి. శివుని వాహనం కనుక నంది ఉంటుంది. అంతేకాక శివగణాలకు అతి ముఖ్య నాయకుడు నంది– వృషభం. ఇది ధర్మానికి సంకేతం. సత్యం, అహింస, అస్తేయం (అక్రమార్జన లేకపోవడం), శౌచం (శుచి)– ఈ నాలుగు పాదాలతో ఉండే ధర్మమే వృషభం. దైవం ధర్మాన్నే అధిష్ఠించి ఉంటాడు. ధర్మం ద్వారానే భగవంతుని చూడ గలం. ధర్మహీనుని దైవం అనుగ్రహించడు. ధర్మమే భగవత్సాక్షాత్కారానికి మూలం అని తెలియజేసేందుకే, నంది కొమ్ముల మధ్య నుండి శివుని చూడమంటారు. అంతేకాక ప్రతివారూ భ్రూమధ్యంలో (కను బొమ్మల నడుమ) జ్యోతిర్లింగ స్వరూపునిగా శివుని ధ్యానించడం ఉత్తమ మార్గమని ఉపని షత్తులు చెప్తున్నాయి. కొమ్ముల మధ్య నుండి చూడడం ఈ విధానాన్నే ఉపదేశిస్తుంది.

**ప్ర: నేను విష్ణు సహస్రం పారాయణం చేస్తుంటాను. అర్థం తెలియకుండా పారాయణ చేస్తే ఫలితం ఉండదని కొందరన్నారు. నాకు అన్ని నామాలకీ అర్థం తెలియదు. మరి పారాయణ చేస్తే ఫలితం ఉంటుందా?**

**జ:** అర్థం తెలియకపోయినా ఫలితం ఉంటుంది. అయితే అర్థం తెలిసి చేస్తే భావన, ఏకాగ్రత ఇంకా కుదిరి ఫలితం పరిపూర్ణంగా ఉంటుంది. ఋషులు వాడే శబ్దా లలో ఎవరూ చెప్పలేని అనేక అర్థాలు దాగి ఉంటాయి. అందుకే అవి మహాశక్తి మంతాలు, మహిమాన్వితాలు. క్రమ క్రమంగా అవి మనకి అర్థమయ్యేటట్లు, అర్థం (ప్రయోజనం) కలిగించేటట్టు– ఆ పారాయణ ఫలితంగా భగవంతుడే అనుగ్రహిస్తాడు. అర్థం తెలిసి చేస్తే జ్ఞానం, శీఘ్రఫలం లభిస్తాయి.

**ప్ర: శ్రీరామపట్టాభిషేక సమయంలో సీతాదేవి ముత్యాలహారం హనుమంతునికి అంద**

**జేయడం, ఆయన ఆ ముత్యాలు ఏరిపారేయడం, గుండె చీల్చి అందులో సీతా రాముల్ని చూపించడం- అంతా వింతగా ఉంది. అలా గుండె చీల్చితే దేవుళ్లు కనబడతారా?**

**జ:** ఇలాంటి ఘట్టాలు రామాయణంలో లేవు. రామకార్యంలో హనుమంతుని దక్షతా, రామభక్తి, సీతా శోక వినాశనకారిగా ఆయన చూపించిన సామర్థ్యం తెలిసిన సీతమ్మ హారాన్ని హనుమంతునికి బహుమతిగా ఇచ్చిందని మాత్రమే రామాయణం లో ఉంది. రామభక్తే మెండుగా ఉంటే, ఏ భక్తుడూ ఈ తల్లి ఇచ్చిన ప్రసాదాన్ని ఏరిపారేయడం చేయడు. దేవతలు ఉండే హృదయం వేరు. ఆ హృదయమూ, ఆ దైవమూ, ఆ భావనా, ధ్యానం- ఇవి సూక్ష్మాలు. స్థూల దృష్టికి కనబడవు. హనుమ హృదయంలో సీతారాములున్నారని చెప్పే సంకేతం మాత్రమే ఈ కథ.

**ప్ర: సీతా స్వయంవరానికి రావణాసురుడు వచ్చాడా?**

**జ:** సీతా స్వయంవరం అనే ఘట్టమే రామాయణంలో లేదు. విశ్వామిత్రునితో పాటూ జనకుని యజ్ఞానికి వెళ్లారు రామలక్ష్మణులు. అక్కడ మాటల సందర్భంలో సీతా దేవిని మహావీరునికిచ్చి (వీర్యశుల్క) వివాహం చేయదలచుకున్నాననీ, దానికి శివధనుస్సు నెక్కిడువానిని ఎంచుకోదలచుకున్నాననీ, అందుకెవరూ సమర్థులు కాలేదని జనక మహారాజు చెప్పాడు. అప్పుడు విశ్వామిత్రుని అనుమతితో రాముడు శివధనుర్భంగం చేయడం... ఇదే కథ రామాయణంలో ప్రస్తావించినది

**ప్ర: ఇంట్లో భారతం మొత్తం చదవకూడదనీ, కలహాలు వస్తాయనీ కొందరు చెప్పారు. నిజమేనా?**

**జ:** కాదు. మహాభారతం మొత్తం హాయిగా ఇంట్లో చదువుకోవచ్చు. చదవాలి కూడా. మన జీవితాన్ని తీర్చిదిద్దే శక్తి ఆ పంచమవేదానికి ఉంది.

**ప్ర: 'ప్రస్థానత్రయం' అంటే ఏమిటి? వీటిని ఆది శంకరులు వ్రాశారా?**

**జ:** 'ప్రస్థానత్రయం' అంటే- మూడు ప్రస్థానాలు (మార్గాలు)- 1. ఉపనిషత్తులు, 2. భగవద్గీత, 3. బ్రహ్మసూత్రాలు. ఈ మూడు బ్రహ్మ (ఆత్మ) విద్యలో ముఖ్య మైనవి. మన తత్త్వశాస్త్రమంతా ప్రధానంగా ఈ మూడింటిలోనే ఉంది. ఉపని షత్తులు వేదాంతం, వేదాలలోని భాగాలు. భగవద్గీత- ఆ ఉపనిషత్తుల సారాన్ని జగద్గురువు శ్రీకృష్ణుడు అందించిన వాక్యాలు. బ్రహ్మసూత్రాలు- పరబ్రహ్మ

తత్త్వాన్నీ, మోక్ష ప్రాప్తి సాధనాలనీ వ్యాసులవారు సూత్రాలుగా రచించిన గ్రంథం. ఈ మూడింటికీ ఆదిశంకరులు 'భాష్యం' వ్రాశారు. ఆయన భాష్యంతో ఉన్న ఈ మూడు గ్రంథాలను 'ప్రస్థానత్రయం' అంటారు. ఇవి గురుముఖతః అభ్యసిస్తే భారతీయతత్త్వ శాస్త్రం పట్ల చక్కని అవగాహన ఏర్పడుతుంది. బ్రహ్మవిద్యకి మార్గాలు (ప్రస్థానాలు)గా ఇవి 'ప్రస్థాన త్రయం' అనిపించుకున్నాయి.

ప్ర: **శ్రీకృష్ణుడు కురుక్షేత్ర సంగ్రామంలో అర్జునునికి ఎన్ని రోజుల్లో గీతోపదేశం చేశారు? అంత పెద్ద గీతోపదేశ కావ్యాన్ని ఆయనకు చెప్పడానికి ఎన్ని రోజులు పట్టిందో తెలుసుకోగోరుతున్నాను.**

జ: రోజుల కొద్దీ గీతను ఉపదేశించలేదు కృష్ణుడు. యుద్ధం ఆరంభమైన రోజున ఉభయ సైన్యాలూ రణరంగంలో ప్రవేశించిన వెంటనే సమరం ఆరంభం కాలేదు. ముందుగా చిన్న చిన్న సంఘటనలు జరిగాయి. అర్జునుడి కోరిక మీద ఉభయ సైన్యం మధ్య కృష్ణుడు రథాన్ని నిలిపాడు. వారిరువురి సంవాద రూపంలో గీతోపదేశం జరిగింది. ఆ తరువాత ధర్మరాజు పాదచారిగా సోదరులతో పాటు శత్రుసైన్యం వైపు నడచి భీష్మ ద్రోణాది కురువృద్ధుల్ని నమస్కరించి వచ్చాడు. ఆ తరువాత శత్రు పక్షంలో ఎవరైనా శరణువేడితే అభయమిస్తానని రథంపై నిలబడి ప్రకటించాడు. అప్పుడు యుయుత్సుడు పాండవపక్షంలో చేరాడు. ఆ తరువాత యుద్ధం ప్రారంభ మయ్యింది. గీతలో ఏడువందల శ్లోకాలున్నాయి. అవన్నీ సామాన్య వేగంతో చదివితే ఒకటిన్నర గంటలో పూర్తవుతుంది. ఈ శ్లోక సంఖ్యలో వందకుపైగా 'సంజయ ఉవాచ'లు, వర్ణనలు, విమర్శలూ ఉన్నాయి.

అవన్నీ తీసేస్తే శ్రీకృష్ణుని ఉపదేశం ఆరు వందల కన్నా తక్కువే. ఈ భాగం చదవాలంటే గంటాపదిహేను నిమిషాలకు మించి ఉండదు. ఒక విషయం మాట్లాడ్డానికి పట్టే సమయం కంటే, గ్రంథస్థం చేసి చదవడానికి ఎక్కువ సమయం అవుతుందన్నది స్పష్టమయిన విషయమే. పైగా మాట్లాడే విషయం వ్యాసమహర్షి ఛందోరూపంలో వ్రాశారు. కృష్ణుడు చెప్పే విషయాలను నొక్కి చెప్పే కొన్ని ఉపనిషద్వాక్యాలు కూడా చేర్చారు. ఇలా చూస్తే భగవద్గీత కృష్ణార్జున సంభాషణం మహా అయితే పదిహేను ఇరవై నిమిషాలు పడుతుంది. ఈ గీతను రోజుల తరబడి ఉపన్యాసాలిస్తూ ఉంటారు పెద్దలు. కృష్ణుడు మాత్రం రోజుల తరబడి చెప్పలేదు. మరో విషయం – గీతోపదేశాన్ని 'కావ్యం' అనరు. అది తత్త్వశాస్త్రం.

**ప్ర: నాకు 'లలితా సహస్రం' పారాయణం చేసే అలవాటు ఉంది. అది చదివిన వెంటనే 'విష్ణుసహస్రం' కూడా చదువుతుండే దానిని. అయితే ఒకరోజు ఒక సన్యాసిని మా ఇంటికొచ్చి, 'లలితా సహస్రం' చదివాక ఇంకే దేవుడి స్తోత్రాలూ చదవకూడదు అన్నారు. లలిత కన్నా ఇతర దేవతలు ఎక్కువకారు అని కూడా అన్నారు. నిజమేనా?**

**జ:** అలా అని ఏ శాస్త్రమూ లేదు. మన తృప్తి కోసం ఏ స్తోత్రం చదువుకున్నా తప్పు లేదు. లలితా సహస్రం చదివాక, విష్ణు సహస్రం హాయిగా చదువుకోవచ్చు. మన ఓపిక ఎంతుంటే అంతగా చదువుకోవచ్చు. 'కూడదు అనకూడదు. లలిత, విష్ణువు, శివుడు- ఒకే తత్త్వానికి చెందినవారు. పరబ్రహ్మ స్వరూపులు. వీరి ముగ్గుర్ని 'రత్నత్రయం' అన్నారు అప్పయ్య దీక్షితులు. 'ముకుందా ముక్తి రూపిణీ', 'వైష్ణవీ', 'గోప్త్రీ గోవిందరూపిణీ' అని అమ్మవారి నామాలు.

దేవతలలో ఎక్కువ తక్కువలుండవు. మనం ఉపాసించే దైవాన్ని 'సర్వాధిక్యం'గా ఉపాసించడం మంచిదే. కాని ఇతర దేవతలను తక్కువగా చూడకూడదు. మన ఉపాస్యదైవాన్ని భావిస్తూ ఉంటే అంతా ఆ దేవత యొక్క ఆధిక్యమే కనబడడం సహజం, ఇతర దేవుళ్లను మన ఉపాస్యదైవం యొక్క రూపాలుగా చూడాలి. ఈ భావమే అన్ని సహస్ర నామాలలో బోధింపబడే తత్త్వం.

**ప్ర: మడీ, ఆచారాలు దైవారాధనలో అవసరమా? ఎందుకు? ఇక్కడ తినం, అక్కడ తినం అని నోరుకట్టుకోవడం అనాగరికం కాదా?**

**జ:** మడి, ఆచారాలు అవసరమే. ఉపాసన, అనుష్ఠానం, ఆరాధన- వీటికి శౌచం, నియమం అవసరం. వీటివల్ల మనలో దైవశక్తి జాగృతమవుతుంది. ఎక్కడ పడితే అక్కడ తినడమే అనాగరికతగానీ, ఆహార నియమం అనాగరికత ఎలా అవు తుంది? శుచిగా ఉండడం అనేది విజ్ఞాన శాస్త్రపరంగా కూడా గొప్పవిష యమే కదా? ఆహార విషయంలో నియమం అనేది- నాగరికత ఎదిగిన ఉన్నత త్వానికి చిహ్నం. నియమిత ఆహారం, సకాలంలో, సక్రమంగా తినడం వల్ల ఆరోగ్యమూ, బుద్ధీ రెండు పనిచేస్తాయి. 'శౌచం' దైవారాధనలో ప్రధానమైనది. భక్తిలో భాగంగా గానం, కీర్తన, నామస్మరణ మొదలైనవి ఎప్పుడైనా, ఎక్కడైనా, ఎలాగైనా చేయవచ్చు. నిరంతర చింతనకి ఏ మడి అక్కర్లేదు. అర్చన, ఆరాధన, అనుష్ఠానం- వీటికి మాత్రం సదా చారం అవసరం. 'సదాచార ప్రవర్తినీ'- అనీ, 'శుచి'- అని అమ్మవారి సహస్ర నామాల్లోనే చెప్పారు కదా!

**ప్ర: ఈ మధ్య ఓ వైష్ణవస్వామీజీ ఉపన్యాసం చెప్తూ- 'శివుడు విషాన్నంతటినీ తాగలేదనీ, విష్ణువు విషపానం చేయమని ఆజ్ఞాపించగానే, పార్వతి సలహా కోసం వెళ్లాడనీ, పార్వతి తన మాంగల్యం మీద నమ్మకంతో సమ్మతించిందనీ, తిరిగి శివుడు వచ్చేసరికే, లోక కల్యాణం కోసం విష్ణువు విషాన్ని మ్రింగాడనీ, ఒక్క బొట్టు శివునికోసం ఉంచితే, దానిని శివుడు పానం చేశాడనీ' చెప్పారు. నేను ఆశ్చర్యపోయాను. ఇది ఏ పురాణంలో ఉంది?**

**జ:** ఆ స్వామీజీ వారి దగ్గర ఏ పురాణాలున్నాయో ఏమోగానీ, మన ప్రామాణిక భారతీయ పురాణాల్లో ఎక్కడా ఈ కథలేదు. క్షీరసాగర మథన సమయంలో పుట్టిన హాలాహలాన్ని, లోక రక్షణకోసం శివుడు ఆరగించాడని, బాహ్యాజగత్తునీ లోపల జగత్తునీ కాపాడేందుకు కంఠంలో ఉంచాడని పురాణ కథ. విష్ణు ప్రశస్తిని చెప్పే భాగవతంలో కూడా ఈ కథే ఉంది. శివ, కేశవ భేదాన్ని సృష్టిస్తూ, ఉపన్యాసాలిచ్చే వాళ్ళని- మన ఆర్ష సంస్కృతికి ప్రతినిధులుగా భావించడం తగదు. ఒక విధంగా- సనాతనమైన మన మతాన్ని దెబ్బతీసే ఇటువంటి సంకుచిత ధోరణులు గల వాళ్లు ఇంకా గురువులుగా 'చెలామణీ' అవడం విచారకరం.



మరో విషయం- **"మద్భక్తో శివవిద్వేషీ, మద్వేషీ శంకరప్రియః, తావుభౌ నరకం యాతః యావచ్చంద్ర దివాకరౌ!"**- నాకు భక్తుడై శివుని ద్వేషించేవాడు, శివభక్తుడై నన్ను ద్వేషించేవాడు-ఇద్దరూ సూర్యచంద్రులున్నంత వరకూ నరకంలో ఉంటారు' అని విష్ణువు నారదునితో చెప్పాడు.

**ప్ర: శివుని లింగాకారంగానే అర్చించాలి అంటారు కదా, మరి నటరాజస్వామి విగ్రహాన్ని పూజించవచ్చా? ఆయన పాదాలకింద ఉన్న రాక్షసుడి పేరేమిటి?**

**జ:** నటరాజస్వామి విగ్రహాన్ని పూజించవచ్చు. స్వామి పాదాలకింద ఉన్న రాక్షసుడి పేరు- అపస్మారుడు. శివుని లింగాకారంలోనూ, నటరాజస్వామి వంటి వివిధ ఆకారాలలోనూ పూజించవచ్చు.

**ప్ర: 'సౌందర్యలహరి' నిత్య పారాయణం చేయవచ్చా? ఎవరైనా చేయవచ్చా? నేను విద్యార్థిని. ఈ వయస్సులో చదవవచ్చా?**

**జ:** ఎవరైనా సరే, ఏ వయసులోనైనా సరే 'సౌందర్యలహరి' నిత్యపారాయణం చేయవచ్చు. అమ్మవారి అనుగ్రహం కలుగజేసే మహిమాన్వితమైన స్తోత్రమిది.

**ప్ర: ఈ యాంత్రిక జీవితంలో సంధ్యావందనాదులు చేయడానికి సమయం ఎక్కడిది?**

**ఏదైనా క్లుప్తంగా చేసుకొనే విధానముందా?**

**జ:** సంధ్యావందనాది నిత్యకృత్యాలను క్లుప్తపరచే పద్ధతుల్లేవు. నిజానికి– ఈ సత్కర్మల ఆచరణకు సమయం లేదనడం ఆత్మవంచన. వీటికి కేటాయించాల్సిన సమయం ఎక్కువ కాదు. శ్రద్ధలోపం చేత, బద్ధకం చేత మాత్రమే వీటిని వదులుకుంటాం. టీవీల ముందు కూర్చోడానికి, వ్యసనాలలో పాల్గొనడానికి బోలెడంత సమయాన్ని ఖర్చు చేసే మనకు సమయం లేదనడం సబబా?

**ప్ర: దేవుడి పూజ చేసేటప్పుడు, స్తోత్రాలు చదివేటప్పుడు కింద కూర్చోవచ్చా? ఆసనం అవసరమా? ఏ ఆసనం మంచిది?**

**జ:** క్రింద కూర్చుని పూజ, జప, స్తోత్ర పఠనాది అనుష్ఠానాలు చేయకూడదు. కఱ్ఱ, రాయి, నేల– పై కూర్చుని అనుష్ఠానం చేయరాదు. కఱ్ఱ పీట వేసుకున్నా పైన కంబళి ఆసనం, చిత్రాసనం, ఊలుతో చేసిన ఆసనం, దర్భాసనం వంటివి వేసు కోవచ్చు.

**ప్ర: బొట్లు పెట్టుకోవడం, రుద్రాక్షలు, తులసిమాలలు వేసుకోవడం 'ప్రదర్శన' అనిపించు కోదా? భక్తి మనసులో ఉంటే చాలదా? బైటకు ప్రదర్శించాలా?**

**జ:** మనసులో ఉంటే తప్పకుండా బయటా ఉంటుంది. శరీరాన్ని శుద్ధి చేసే విధానాల్లో ఇవి ఒకటి. వీటిని దైవచిహ్నాలు, దైవరక్షలు అంటారు. ఇవి ప్రదర్శన కోసం అనడం తగదు. అయితే కొందరు ఆడంబరం కోసం చేసి ఉండవచ్చు. కానీ అందరిదీ అదే పద్ధతి అనడం తగదుకదా. సంఘం దృష్టిలో గౌరవంగా కనబడ డానికి ఒక్కొక్కరు ఒక్కో విధంగా అలంకరించుకుంటారు. అలాంటి అలంకరణలో భాగంగా కొందరు దీన్ని భావించవచ్చు.

శాస్త్రరీత్యా– భ్రూమధ్యం (కనుబొమల నడుమ) జ్ఞానరూపుడైన దైవం యొక్క స్థానం. అక్కడ బిందు రూపుడిగా భగవంతుని ధ్యానించే యోగ విధానమూ ఉంది. అలాగే రుద్రాక్ష, తులసి, స్ఫటికం– వీటి వైద్య మహిమలు కూడా ఇటీవల శాస్త్రవేత్తలు నిరూపించారు.

ఆధ్యాత్మికంగా కూడా ఈ చిహ్నాలధారణ కవచమవుతుందనీ, కనిపించని సూక్ష్మ జగత్తులో కూడా రక్షణ నిస్తుందనీ మన పురాణాలు, మన శాస్త్రాలు వివరిస్తున్నాయి. భక్తులైన వారికి దైవంపైనా, శాస్త్రం పైనా నమ్మకం ఉంటుంది. ఈ చిహ్నాల వల్ల దైవకృప, దైవచింతన నిరంతరం సన్నిహితమవు తుందని భక్తులు దీనిని ధరిస్తారు.

అంతేకానీ ఆర్భాటం కోసం కాదు. బైట కనిపించేదంతా మనసులో ఉండకపోవచ్చు గానీ, మనసులో ఉన్నది మాత్రం బైట కనిపించి తీరుతుంది.

ప్ర: **కొన్ని రోజుల్లో 'తులసి'ని కోయకూడదు అంటారు. ఆ రోజులు ఏమిటి? తులసి కోటలో పూజించుకొనే తులసిని కోయవచ్చా? స్త్రీలు తులసిని తుంచవచ్చా?**

జ: శుక్రవారం, ఏకాదశి, అమావాస్య, పౌర్ణమి– వంటి రోజుల్లో తులసి కోయకూడదు. పూజకి, ఔషధానికి వాడేందుకు వేరే తులసిని పెంచుకోవాలి. స్త్రీలు తులసిని తుంచరాదు. కానీ తులసిదళాలతో దైవాన్ని పూజించవచ్చు. అయితే గణపతిని మాత్రం తులసితో పూజించకూడదు. **'న తులస్యా గణేశ్వరమ్'** అని ధర్మశాస్త్ర వచనం.

ప్ర: **మన పురాణాల్లోనూ, రామాయణ, భారతాల్లోనూ చాలా ప్రక్షిప్తాలు ఉన్నాయంటారు. నిజమేనా? వాటిని తొలగించి, అసలు గ్రంథాలు ముద్రిస్తే మంచిది కదా?**

జ: అనేక యుగాల మీద కొన్ని ప్రక్షిప్తాలు జరిగి ఉండవచ్చు. అయితే 'ఇవి ప్రక్షిప్తాలు' అని నిర్ధారణ చేసేదెవరు? కొంతమంది ప్రక్షిప్తాలని చెప్పినవాటిని, కాదని ఖండించిన పండితులూ ఉన్నారు. కాబట్టి తమకి నచ్చనివీ, అన్వయించు కోలేనివీ ఎవరికివారు ప్రక్షిప్తాలంటూ తొలగించుకుపోతే చివరికి ఏమీ మిగలదు. కాబట్టి ఇప్పుడు లభ్యమౌతున్న వాటిని యధాతథంగా భద్రపరచుకోవాల్సినవే.

మనకు మన కాలంలో తోచని ఎన్నో రహస్యాలు, భవిష్యత్తులో ఎవరైనా మేధావులకు తోచవచ్చు. వారు ఆయా గ్రంథాలను అన్వయించేలా వ్యాఖ్యానించవచ్చు.

ప్ర: **మహాభక్తుడైన ఆంజనేయుడు రామునితోనూ, అలాగే అర్జునుడు శ్రీకృష్ణునితోనూ యుద్ధం చేశారు. ఇది సమంజసమా?**

జ: రెండు యుద్ధాలూ రామాయణంలోగానీ, భారత భాగవతాలలో గానీ లేవు. ఎవరో తరువాత కవులు తమ ఊహల్నీ, కవిత్వాల్నీ అల్లి ఈ కథలు సృష్టించారు, అంతే. ఇవి ప్రమాణాలు కావు. కల్పితాలు మాత్రమే.

ప్ర: **రావణుడంతటి మహాబలశాలి శివధనుస్సు ఎందుకు మోయలేక పోయాడు? శివభక్తి వల్లనా?**

జ: అసలు రావణుడు శివధనుస్సు జోలికే వెళ్లలేదు, సీతా స్వయంవరమూ జరుగలేదు. యజ్ఞ నిమిత్తం వెళ్లిన విశ్వామిత్రునితోపాటూ మిథిలకు చేరారు రామలక్ష్మణులు. అక్కడ ప్రసంగవశాత్తూ శివధనువును చూపించాడు జనక మహారాజు. దీనిని ఎక్కిడిన వీరునికి తన తనయ సీతమ్మనిచ్చి వివాహం చేయాలనుకున్నట్లు జనకుడు వివరిం

చాక, విశ్వామిత్రుని యానతితో రాముడు శివధనుస్సును ఎక్కిడి, ధనుర్భంగం చేశాడు. ఇంతే రామాయణంలో ఉన్న కథ. రామ వనవాస సమయంలో, శూర్పణఖ భంగపడిన తరువాత, ప్రహస్తుడు చెప్పాకగానీ సీతారాముల గురించి రావణునికి తెలియదు. కాబట్టి రావణునికీ శివధనుస్సుకీ సంబంధమే లేదు. శ్రీరాముడు కూడా శివభక్తుడే.

**ప్ర: భగవంతుని పటాలకి ప్లాస్టిక్ పూల మాలలు వేయవచ్చునా?**

**జ:** ఏ దేవుడి పటానికైనా ప్లాస్టిక్ పూలమాలలు వాడరాదు.

**ప్ర: జరగవలసినవి జరిగి తీరుతాయన్నప్పుడు, మరి హోమాలు, పూజలు... వీటివల్ల ఫలితం ఉంటుందా?**

**జ:** ప్రారబ్ధకర్మ అనుభవించవలసిందే. అయితే అందులో 'సాధారణకర్మ' వ్రతహోమాదుల ద్వారా తొలగించవచ్చు. అనివార్యమైన దానిని పూర్తిగా మార్చలేకపోవచ్చును గానీ దాని తీవ్రతను తగ్గించవచ్చు. ఎండనీ, వాననీ మనం మార్చలేం గానీ, వాటి నుండి కాపాడుకోడానికి గొడుగు వంటివాటిని వినియోగించుకుంటాం కదా. అలాంటిదే ఇది కూడా.

**'తచ్ఛాంతిః ఔషధైః దానైః జపహోమార్చనాదిభిః'** అని శాస్త్ర వాక్యం. ఔషధ, దాన, జప,హోమార్చనాదులవల్ల పురాకృత కర్మ ఫలాలైన వ్యాధులవంటి దుఃఖాలనుండి బయట పడవచ్చు.



**ప్ర: శివునికి మంగళవారం బిల్వార్చన చేయకూడదు అనీ, శివుని పటాలు ఇంట్లో పెట్టుకోకూడదని కొందరు నాతో అన్నారు. నిజమేనా?**

**జ:** ఏ వారమైనా శివునికి బిల్వార్చన చేయవచ్చు. లక్షణంగా శివుని పటాలు ఇంట్లో పెట్టుకోవచ్చు.

**ప్ర: సుబ్రహ్మణ్యస్వామిని 'మురుగ' అంటారు కదా. తమిళులు పెట్టుకున్న ఈ పేరుకి అర్థమేమై ఉంటుంది?**

**జ:** 'మురుగన్' అనే పేరు తమిళ భాషలో 'అందగాడు' అనే అర్థం. అయితే, సుబ్రహ్మణ్యుని నామాలు సంస్కృతంలో అనేకం ఉన్నాయి. అందులో 'మురుక' అనేది ఒకటి. దీనికి అర్థం 'స్కాంద పురాణం' ఇలా చెప్తోంది.

**'ము' కారాస్తు ముకుందః స్యాత్**

**'రు' కారో రుద్రవాచకః।**

**'క' కారో బ్రహ్మావాదీచ**

**'మురుకో' గుహ వాచకః॥**

'ము' అనేది విష్ణువునీ, 'రు'– రుద్రునీ, 'క'– బ్రహ్మనీ తెలియజేస్తుంది. బ్రహ్మవిష్ణు శివాత్మకమైన పరబ్రహ్మగా సుబ్రహ్మణ్యుని (గుహుని) ఉపాసిస్తూ 'మురుక' అని స్వామిని పిలుస్తారు. అని ఒక నిర్వచనం. తమిళ భాషలో 'క' కారానికీ, 'గ' కారానికీ తేడా లేదు కనుక 'మురుగ' అని వారంటారు అంతే.

ప్ర: **ఏవో దేవతల పేర్లమీద, వారి మహిమల మీద మా ఇంటికి చాలా ఉత్తరాలొచ్చాయి. అలాంటి ఉత్తరాలే మరో ఇరవై మందికో, నలభైమందికో వ్రాసి పంపాలని, అలా చేయకపోతే ఎన్నో కష్టాలు కలుగుతాయని భయపెడుతూ వస్తుంటాయి. అది నిజమేనా? మాకు భయంగా ఉంది.**

**జ:** ఆ ఉత్తరాల రచన ఒక రకం పిచ్చితనం. వాటిని పట్టించుకోనవసరం లేదు. వాటిని సుబ్బరంగా చించిపారేయవచ్చు. భయపడడం అనవసరం. ఇటువంటి పిచ్చిపనులవల్లే అసలైన దైవమతం అపార్థాల పాలవుతుంది.



ప్ర: **నాకు రుద్రనమకం వంటివి రావు. రోజూ ఓ వెండి శివలింగాన్ని పూజించుకుంటుంటాను. అయితే రుద్రంతో తప్ప శివుని పూజించకూడదని, శివలింగాన్ని ఇంట్లో ఉంచుకోకూడదని కొందరంటున్నారు. నిజమేనా?**

**జ:** మీరు విన్నవి సరైనవి కావు. శివలింగాన్ని ఇంట్లో ఉంచి పూజించడం సర్వైశ్వర్య కరం. రుద్ర నమకాదులతోనే అభిషేకించనవసరం లేదు. శివనామాలు చెప్తూ అభిషేకించవచ్చు. అష్టోత్తరశత నామాలతోనూ అభిషేకించవచ్చు. ఏదీ రానప్పుడు 'శివాయ నమః' అని చెప్తూ అభిషేకించినా చాలు. నిత్యం ఇంట్లో శివార్చన జరగడం మంచిది. శివపూజ అందరూ చేయవచ్చు.

అయితే బాణలింగం, స్ఫటికలింగం, సాలగ్రామం వంటి వాటికే ఎక్కువ నియమాలు, విధులూ ఉన్నాయి. అవి యోగ్యులైన గురువుల సహాయంతోనే స్వీకరించాలి. అవి లేకున్నా, వెండిలింగాన్ని అర్చించడం మంచిదే.

ప్ర: **మావారు ఈ మధ్య ఒక స్వామీజీ ఉపదేశాలకి ప్రభావితులైపోయి 'అంతా మిథ్య– ఎవరి కర్మవారిది'– అని మాట్లాడుతూ ఇంటి విషయాలు పట్టించుకోవడం లేదు. సంపాదన, పోషణ వంటి విషయాల్లో కూడా నిర్లక్ష్యం చేస్తున్నారు. సంపాదనంతా**

**స్వామీజీ ఆశ్రమానికే ఎక్కువగా ధారపోస్తున్నారు. ఈ వైరాగ్యం చూస్తే భయం వేస్తోంది. ఇలా కుటుంబాల్ని క్షోభ పెట్టే ఆధ్యాత్మికత ఎందుకు?**

**జ:** మీ వారికి ఉపదేశించిన స్వామీజీలోనే దోషమంతా ఉంది. ఇటువంటి వైరాగ్యాన్ని 'పతనహేతువు'గా వర్ణించారు ఆది శంకరులు.

గృహస్థాశ్రమం స్వీకరించాక, భార్యాబిడ్డల్ని లోటు లేకుండా ప్రేమాభిమానాలతో పోషించడం ధర్మం. ధర్మపూర్వకంగా అర్థాన్ని సంపాదించడం, జాగ్రత్త చేయడం, గృహస్థు బాధ్యత. కుటుంబాన్ని క్షోభ పెట్టడం ఆధ్యాత్మికతకి విరుద్ధం. పాపం కూడా. రామాయణ భారతాలలో, ఇతర ఆధ్యాత్మిక గ్రంథాలలో ఈ విషయాలే చెప్పారు.

భగవద్భక్తి, ధర్మచింతన, కర్తవ్య నిర్వహణ – వీటితో జీవితం సాగాలి. మనం పూజిస్తున్న శ్రీరాముడు, శ్రీకృష్ణుడు సన్యాసులు కారు. ఆటుపోట్లకి ధీరులై నిలిచి, ధర్మాన్ని నిలబెట్టిన గృహస్థులు. వారి ఉపదేశం ప్రకారం– ఇటువంటి బైరాగుల జోలి మనకు అక్కర్లేదు. మన ధర్మం మనకు రక్షే.

ఇవిలేని 'వైరాగ్యం' ఆధ్యాత్మికత అనిపించుకోదు. కేవలం పలాయనవాదమే. ఇది మూర్ఖత్వం, అవగాహనారాహిత్యం అనిపించుకుంటుంది. కాబట్టి మీ కుటుంబ క్షోభకి మీవారి అధర్మ వర్తనం, అజ్ఞానమే కారణంగానీ, ఆధ్యాత్మికత కాదు. నిజంగా వైరాగ్యమే కలిగితే, కోపతాపాలకి లోను కాకుండా, దురాశకీ, నిరాశకీ చోటీయ కుండా, ఈర్ష్యాసూయలకు గురి కాకుండా ధర్మ నిర్వహణ చేయడం ముఖ్యం. అంతేగానీ, తనవారిని ఉపేక్షించకూడదు. సన్న్యాసి ధర్మాలు గృహస్థుకి పనికిరావు. 'ధర్మం' తర్వాతే 'మోక్షం'. దయచేసి– ఆ స్వామీజీల బారినుండి మీవార్ని కాపాడు కోండి. ఆయన్ని తిరిగి కర్తవ్యపాలన వైపు మళ్లించడం ధర్మపత్నిగా మీదే బాధ్యత.

**ప్ర: పంచముఖాంజనేయుడు వంటి హనుమాన్ రూపాలు రామాయణంలో కనిపించవు. మరి వీటిని నమ్మవచ్చా?**

**జ:** రామాయణంలో హనుమంతుని పరిమితి, లక్ష్యం, ప్రయోజనం వేరు. వాటికి అనుగుణమైన రూపమే ధరించాడు రామకథలో. పంచముఖాంజనేయుడు– వంటివి మంత్రశాస్త్ర విషయాలు. మంత్రోపాసనలో మంత్రాధిదేవతా మూర్తులవి. రామాయణ హనుమంతుని రూపాలే ఇవి. అయితే ఆ కథలో అవి ప్రకటితం కావు. ఆయా మంత్రాన్ని ఉపాసించేటప్పుడు మంత్రోద్దిష్ట దేవతగా దైవం ఆవిర్భవిస్తాడు. గరుడ,

వరాహ, కపి, సింహ, తురగ– వదనాలతో ఉన్న పంచ ముఖాంజనేయుడూ మంత్ర మూర్తే. ఆ దివ్యమూర్తుల లక్షణాలన్నీ కలిసిన స్వామి. రుద్రాంశ సంభూతుడైన హనుమంతుడు ఇచ్ఛారూపధారణ చేయగలడని రామాయణంలోనే చెప్పారు కదా! ఒకచోట చెప్పని విశేషం, మరొకచోట చెప్పబడుతుంది అంతే. కాబట్టి రెండూ నిజాలే. నిరభ్యంతరంగా వీటిని నమ్మవచ్చు. పూజించవచ్చు.

**ప్ర: సీతాదేవి రావణుని కూతురనీ, రావణుడు శివపూజ చేస్తూండగా పుష్పంలోంచి పుట్టిందనీ ఒకచోట చదివాను. ఈ కథ నిజమేనా?**

**జ:** ఇది అసంగతమైన కథ. కేవలం 'అయోనిజగా' జనక మహారాజుకి, భూ గర్భంలో లభించిన లక్ష్మీదేవి సీత. ఇదే రామాయణంలో ప్రస్తావించిన కథ.

**ప్ర: మా ఇంట్లో అందరు దేవతల పటాలూ ఉంటాయి. చివరికి ఇతర మతాల దేవుళ్లవి కూడా. ఇది చూసి ఒకరు విమర్శించారు. మేం చేస్తున్నది తప్పా?**

**జ:** ఇతర మతాల్ని గౌరవించడం అంటే వాళ్ల చిహ్నాలని మనం పూజించనవసరం లేదు. మన హైందవ దేవతల అందరి పటాలూ పెట్టుకోవచ్చు. కారణం– ఇవన్నీ ఒకే సంప్రదాయానికీ, ఒకే పద్ధతికీ చెందినవి. బొట్టు, కట్టు, పూజా విధానం... అన్నీ ఒకే విధానానికి సంబంధించినవి. ఇతర మతాల దేశాలూ, కాలాలూ, పరిస్థితులూ, పద్ధతులూ, సంప్రదాయాలూ వేరు. అవి మన విధానంతో కలుపుకుంటే కలవవు.

ఇతర మతాలలో ఒకటో రెండో మనకు తెలుసు. ఇంకా మనకు తెలియని సవాలక్ష మతాలున్నాయి. వాళ్ల దేవుళ్ళందర్నీ తెచ్చి పెట్టుకుంటే ఇల్లే సరిపోదు. పైగా భారతీయేతర మతాలు విగ్రహారాధనను కాదన్నవేనని గుర్తుంచుకోండి. దీనితో పోటీ పడ్డాక వాళ్ల ప్రార్థనా మందిరాలని పటాలుగా అమ్ముతున్నారు. అంతే. ఎవరి సంప్రదాయం వారు పాటిస్తే చాలు. సహజీవనం కోసం ఇతరుల్ని ద్వేషించకుండా ఉంటే చాలు. ఇందులో ఎక్కువ, తక్కువల ప్రసక్తి లేదు.

మరో విషయం– మీరు 'సామరస్యం' పేరుతో వాళ్ల పటాల్ని మీ పూజామందిరంలో పెట్టుకున్నట్లుగా– వాళ్లు మన దేవుళ్లని పెట్టుకొని పూజిస్తారా? వాళ్లకి ఉన్న 'నిబద్ధత' మనకెందుకు లేదు? ఇప్పుడు మనకి కావలసింది మన సంప్రదాయాన్నీ, మతాన్నీ గౌరవించడం, దీనిని అర్థం చేసుకోవడం. 'స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః'.

**ప్ర: లక్ష్మణుడు శ్రీరామునితో సహా వనవాసానికి వెళ్లాక, పధ్నాలుగేళ్ళూ నిద్రపోయిన ఊర్మిళ ప్రశస్తి ఎక్కువగా వర్ణించలేదెందుకు?**

**జ:** అసలు 'ఊర్మిళ నిద్ర' అనేది ఎక్కడా లేదు. జానపదాల్లో కల్పించబడ్డ ఒక ఊహ మాత్రమే. అందులో 'ప్రశస్తి' ప్రస్తావన అనవసరం. భర్త విదేశాలకు వెళితే, భార్య స్వదేశంలో ఉండడం ఇప్పటికీ ఉంది కదా!

వనవాసానికి వెళ్లేటప్పుడు గానీ, వెళ్లాక గానీ ఊర్మిళ గురించి రామాయణంలో ప్రస్తావించనే లేదు. కథా సందర్భానికి అది అనవసరం.

**ప్ర: నామస్మరణ చేస్తే చాలు కదా? ఇతర మంత్ర తంత్రాలు, ఆచారాలు, ధర్మాలు ఎందుకు? పురాణాల్లోనూ ఈ విషయమే చెప్పారు కదా?**

**జ:** నామస్మరణ చేస్తే చాలు– కానీ ధర్మం, ఆచారం విడిచిపెట్టకూడదు. శక్తి వంచన లేకుండా ధర్మాచరణ చేస్తూ, ప్రేమపూర్వకంగా నామస్మరణ చేయాలి. ఈ విషయమే పురాణాల్లో చెప్పారు. ఆచారాలను, ధర్మాలను మాత్రం విడిచిపెట్టరాదు. ధర్మాన్ని విడిచి పెడితే ఏదీ ఫలించదు. నామస్మరణ ప్రాధాన్యం చెప్పడమే ఆ వాక్యాల ఉద్దేశం. అంతేకానీ మిగిలినవి అనవసరమని చెప్పడం కాదు.

**ప్ర: 'నాసాగ్ర దృష్టి'తో ధ్యానం చేయమని భగవద్గీతలో ఉంది. 'నాసాగ్రం' అంటే 'ముక్కు కొన' అని అర్థమా? లేక భ్రూమధ్యమా (కనుబొమల నడిమి)? నాసాగ్రే నవమౌక్తికం అనేటప్పుడు 'ముక్కు కొనలో ముత్యమ'నే అర్థం కదా?**

**జ:** శ్రీకృష్ణుని సౌందర్యాన్ని వర్ణిస్తూ చెప్పిన 'నాసాగ్రే నవమౌక్తికం' అంటే 'ముక్కు కొనపై అలంకరించుకున్న ముత్యం' అనే అర్థం. కానీ ధ్యాన విషయంలో చెప్పే టప్పుడు మాత్రం 'నాసాగ్ర దృష్టి' అంటే 'కనుబొమల మధ్య (భ్రూమధ్యం) దృష్టి' అనే అర్థం.

ఎందుకంటే– రెండూ నాసానికి 'అగ్రాలే' (కొనలే). కానీ ధ్యానంలో అధోదృష్టి కూడదు. ఊర్ధ్వ దృష్టే ముఖ్యం. పైగా– యోగశాస్త్రంలో భ్రూమధ్య దృష్టినే ధ్యానానికి ముఖ్యంగా చెప్పారు. 'అవిముక్తోపాసన' అని ఉపనిషత్తులలో ప్రత్యేకించి చెప్పబడింది. 'భ్రూఘ్రాణంబుల సంధి అవిముక్తం' అని అక్కడ నిర్వచించారు. కాశీ/లేదా అవిముక్త క్షేత్రం మన శరీరంలో కనుబొమల నడుమ ఉంది. అక్కడ బిందు (జ్యోతి) రూపంగా నున్న పరమాత్మను ధ్యానించడమే అవిముక్తోపాసన అని చెప్పారు. ఇలా అనేక యోగశాస్త్రాలలో 'నాసాగ్రం' అనే పదానికి, 'భ్రూమధ్యం' అనే చెప్పబడింది. కనుక

గీతలో చెప్పబడిన 'నాసాగ్ర దృష్టి'కి భ్రూమధ్యమనే అర్థం.

**ప్ర: 'సంధ్యా కాలం' చాలా పవిత్రమైనదని, ఆ సమయంలో భగవద్ధ్యానం మంచిదనీ అంటారు. సంధ్యాకాలం అంటే సరిగ్గా ఏ సమయం? 'సకాలం'లో సంధ్యావందనం చేయాలి కదా? ఆ 'సకాలం' ఏమిటి?**

**జ:** రోజుకి మూడు సంధ్యలు శాస్త్రంలో చెప్పబడ్డాయి. 1. ప్రాతఃసంధ్య, 2. మధ్యాహ్న సంధ్య, 3. సాయం సంధ్య. ఇవికాక కొన్ని ఉపాసనలకు చెప్పబడ్డ సంధ్య – తురీయ సంధ్య. ఇది నాలుగవది. దీని సమయం అర్ధరాత్రి.

ఉదయానికి ముందు వచ్చేకాలం 'ప్రాతఃసంధ్య'. రాత్రికి ముందు వచ్చేది 'సాయంసంధ్య'. మధ్యాహ్నవేళ 'మధ్యాహ్నిక సంధ్య'.

**ఉదయా ప్రాక్తనీ సంధ్యా**
**ఘటికా త్రయ ముచ్యతే।**
**సాయం సంధ్యా త్రిఘటికా**
**అస్తాదుపరి భాస్వతః ॥**

సూర్యోదయానికి ముందు దాదాపు 70 నిమిషాల కాలం ప్రాతః సంధ్యకు ముఖ్యకాలం. సూర్యుడస్తమించడానికి ముందు ఇరవై నిమిషాలు మొదలుకొని, సూర్యుడస్తమించిన తరువాత 30 నిమిషాల కాలం సాయంసంధ్యకు ముఖ్య కాలం. ఇందులోనూ ఉత్తమ, మధ్యమ, అధమ భేదాలున్నాయి.

**1. ఉత్తమా తారకోపేతా**
**మధ్యమా లుప్త తారకా।**
**అధమా సూర్యసహితా**
**ప్రాతఃసంధ్యా త్రిధామతా॥**

తెల్లవారు ఝామున నక్షత్రాలుండగా ప్రాతః సంధ్యావందనానికి ముఖ్యకాలం. ఇదే సకాలం. తారకలు లేని ప్రాతఃకాలం మధ్య కాలం, సూర్యుడు ఉదయించిన తరువాత సంధ్యా వందనానికి అధమ కాలం, సకాలంలో చేయడమే సర్వశ్రేష్ఠం. అలా కుదరనప్పుడు, మానేయడం మంచిది కాదు కనుక, "ముఖ్య కాలాతిక్రమణ దోష పరిహారార్థం" అధిక అర్ఘ్యప్రదానంతో సంధ్యోపాసన చేయాలి.

**2. ఉత్తమా సూర్యసహితా**
**మధ్యమా లుప్త భాస్కరా।**

**అధమా తారకోపేతా**

**సాయం సంధ్యా త్రిధామతా॥**

సాయంవేళ సూర్యుడుండగా చేసే సంధ్యావందనం ముఖ్యకాలం, సకాలం. సూర్యుడస్తమించినప్పుడు మధ్యమం. నక్షత్రోదయం తరువాత చేయడం అధమం. కానీ 'సకాలం' దాటిపోతే, ప్రాతః సంధ్యకు లాగానే, 'ముఖ్య కాలాతిక్రమణ దోష పరిహారార్థం' అధిక అర్ఘ్య ప్రదానం చేయాలి.

'మధ్యాహ్న సంధ్య' అంటే మధ్యాహ్నం 11 గంటల తరువాత నుండి సాయంత్రం లోపల చేయాలి.

ప్ర: **ఆంజనేయుడు 'సంజీవని' తేవడానికి వెళ్లినప్పుడు సమయం దాటి వెళ్లేలా చేయాలని 'కాలనేమి' అనే రాక్షసుడు సాధువేషం ధరించి రామభజన చేశాడనీ, అది చూసి హనుమంతుడు మైమరచి పోయి తానూ రామభజన చేశాడనీ ఒక కథ విన్నాను. భక్తి మైకంలో పడి కర్తవ్యం మరచిపోవడం మంచిదేనా?**

జ: ఈ కాలనేమి కథ వాల్మీకి రామాయణంలో లేనే లేదు. తరువాతి కాలంలో పుట్టింది. భక్తి ఏనాడు మైమరపో, మైకమో కాదు. పైగా రామసోదరుడు బాధితుడై ఉన్నప్పుడు సాక్షాత్తూ రాముడే శోకతప్తుడై ఉన్నప్పుడు, వారి క్షేమం కోసమని బయలుదేరిన హనుమంతుడు ఆ కర్తవ్యం మరచిపోతే ఇంక రామభక్తి ఏమిటి? భక్తి తనని తాను మైమరచి పోకుండా, నిత్య జాగృతం చేసే శక్తి. కాబట్టి ఎవడో రామభజన చేస్తూ ఉంటే, యుక్తాయుక్త విచక్షణ కోల్పోయి తానూ భజన చేస్తూ కూర్చొని కర్తవ్యాన్ని విస్మరించడం బుద్ధిమంతుడి లక్షణం కాదు.

ఆంజనేయ స్వామి బుద్ధిమంతులలో అగ్రగణ్యుడు. బుద్ధిమతాం వరిష్ఠం.



ప్ర: **'రుద్రనమక మంత్రాలు' యజుర్వేదంలో 'చిత్యగ్ని హోమోక్తి' అనే భాగంలో చెప్పబడ్డాయి. అంటే అగ్నిచయన దీక్షలో చెప్పిన మంత్రాలే కదా అవి. మరి రుద్రాభిషేకంలో ఎందుకు ఆ మంత్రాలు ఉపయోగిస్తారు. కేవలం ఒక హోమ మంత్రాలను అనేక విధాలుగా జప, అభిషేకాదులకు ఉపయోగించాలని ఎక్కడ చెప్పారు?**

జ: యజుర్వేదంలో 'చిత్యగ్ని హోమోక్తి'లోనే రుద్రనమకం చెప్పబడింది నిజమే. కానీ సమస్త వేదవిద్యలో హృదయ స్థానంలో నున్నది యజుర్వేదం. దానికి మధ్యభాగంలో నున్నది నమకం. అంటే వేదం యొక్క సమగ్ర సారం ఒకచోట చేరితే అది రుద్రం.

వేదం 1. కర్మకాండ, 2. జ్ఞానకాండ, 3. ఉపాసన కాండ – అని మూడు విధాలు. కనుక వేద మధ్య భాగంలో నున్న 'మంత్రభాగం' ఈ మూడు లక్షణాలతో ఉన్నదే కావాలి. కాబట్టి రుద్ర మంత్రాలు కర్మ, జ్ఞాన, ఉపాసనాత్మకాలు.

వేదమంత్రాల ప్రయోగ విధులను తెలియజేసే శాస్త్రం 'కల్పం'. ఇది షడంగాలలో ఒకటి. (షడంగాలు: 1. శిక్ష, 2. వ్యాకరణ, 3. ఛంద, 4. నిరుక్త, 5. జ్యోతిష, 6. కల్ప). బోధాయన మహర్షి మొదలైనవారు ఈ 'కల్ప' శాస్త్రకర్తలు. వారు రుద్ర మంత్ర ప్రయోగ విధులు తెలియజేస్తూ, జప, హోమ, అర్చన, అభిషేకాదులకు నమక మంత్రాలు ఉపయోగించే విధానం తెలియజేశారు.

అంతేకాక 'రుద్రనమకం' ఉపనిషత్తుగా కూడా ఇతర ఉపనిషత్తులలో పేర్కొనబడింది. 'మేరు తంత్రం' వంటి తంత్ర శాస్త్ర గ్రంథాలలో 'రుద్రనమక మంత్రాల' లో ఒక్కొక్క మంత్రాన్ని ఏ విధంగా జపించాలీ, ఏ విధంగా పునశ్చరణ చేయాలి అనే విషయాలు వివరించబడ్డాయి. ఈ విధంగా జ్ఞానబోధకమైన తత్త్వశాస్త్రంగానూ, యజ్ఞాది కర్మలలో ప్రయోగింపబడే కర్మకాండగా, ఉపాసనపరమైన తంత్రంగానూ 'రుద్ర నమక మంత్రాలు' శాస్త్ర సమ్మతంగా ఉపయోగింపబడుతున్నాయి.



**ప్ర: భస్మధారణ కేవలం శైవులకేనా? వైష్ణవులకు లేదా?**

**జ:** శైవం, వైష్ణవం అనే మతభేదాలు మధ్యలో వచ్చినవి. వాటిబట్టే ఈ తేడాలు కనిపించేది. నిజానికి భస్మధారణ అనేది వేదమతం. అగ్నిహోత్ర, కర్మానంతరం ఆ భస్మాన్ని 'అగ్నిసారం'గా భగవత్ప్రసాదంగా నొసట ధరించడం వేదపద్ధతి. ఇది ఎవరికైనా అవసరమే. ఇందులో శైవవైష్ణవ భేదం లేదు.

ఈ భస్మధారణ వల్ల సూక్ష్మజగత్తులోనున్న అరిష్టాలు, దృష్టి దోషాదుల భీతి ఉండదు. దైవరక్ష లభిస్తుంది. ఆ దైవం శివుడన్నా, విష్ణువన్నా, అగ్ని అన్నా... ఏదన్నా ఒక్కటే.

**ప్ర: "ధనమూలమిదం జగత్" అంటారు కదా! ఇది ఏ సందర్భంలో చెప్పారు? ధనానికి అంత ప్రాధాన్యమిచ్చారా?**

**జ:** ***"వేదమూల మిదంజ్ఞానం***
***కృషిమూల మిదం ధాన్యం***
***భార్యామూల మిదంగృహం***
***ధనమూల మిదం జగత్॥"*** – ఇది జీవితంలో మనిషికి ముఖ్యమైన విషయాలు చెప్పే ప్రాచీన నీతి శ్లోకం. లౌకిక విషయాలు క్రమంగా సాధించి, పరాన్ని పొందాలి.

ఉపాధి నిలవడానికి అవసరమైన భౌతిక ప్రయోజనాలకు ధనం ముఖ్యం. ఇల్లు నిలవడానికి ఇల్లాలు హేతువు. ధాన్యానికి కృషి ప్రధానం. జ్ఞానానికి వేదం మూలం. ఇలా దేనికి ఏది మూలమో చెప్తూ వివరించిన సందర్భమిది.

**ప్ర: బలి వామనునికి దానం చేస్తున్న సమయంలో, శుక్రాచార్యుడు పురుగుగా మారి కలశ ధారకి అడ్డు వచ్చాడనీ, దానితో వామనుడు దర్భ పుల్ల తీసుకుని శుక్రాచార్యుడి కన్ను పొడిచాడనీ కథ ఉంది కదా! వామనుడు అలా చేయడం న్యాయమా?**

**జ:** నిజంగా ఈ కథ 'వామన చరిత్ర' ఉన్న మూల భాగవతంలో లేదు. పోతనగారి భాగవతంలో కూడా కొన్ని ముద్రణలలో కనబడడం లేదు. తరువాతి వారెవరో కల్పించి ఉంటారు. దాన సమయంలో కులగురువుగా అసలు విషయాన్ని చెప్పడం బాధ్యత కనుక శుక్రాచార్యులు హెచ్చరించారు. అయినా సరే, విష్ణువని తెలిసి ఇంకా భక్తితో బలి సిద్ధమయ్యాడు. దానమిచ్చాడు. అంతే– మధ్యలో శుక్రా చార్యుడు పురుగుగా మారడం లేదు.

**ప్ర: వాల్మీకి దారి దోపిడీ దొంగ అని ఒకచోట, బోయవాడనీ, పక్షి జంటలో ఒక పక్షిని కొట్టగా మరో పక్షి శోకం చూసి శ్లోకం చెప్పాడనీ ఇంకోచోట చదివాను. ఏది నిజం. వాల్మీకి ఎవరి పుత్రుడు?**



**జ:** వాల్మీకి ప్రచేతస మహర్షి కుమారుడు. కనుక 'ప్రాచేతసుడు' అంటారు. ప్రచేతసుని పదవ పుత్రుడు– అని రామాయణంలో చెప్పబడింది. నారదుని ద్వారా రామచరిత్ర విన్నాక, వాల్మీకి మహర్షి భరద్వాజాది శిష్యులతో తమసానదీ తీరానికి వెళతాడు. అక్కడ ఒక బోయవాడు క్రౌంచ పక్షుల జంటలో మగపక్షిని బాణంతో చంపుతాడు. అది చూసిన వాల్మీకి, కరుణతో చలించి, ఆ బోయవానిని నిందిస్తూ, వేదనతో శ్లోకం చెప్తాడు. అంతేగానీ వాల్మీకి బోయవాడు కాదు.

అయితే ఆధ్యాత్మ రామాయణం ప్రకారం, ప్రచేతసుని కుమారుడైన ప్రాచేతసుడు పసితనంలోనే దైవవశాత్తు, తప్పిపోయి ఒక దొంగల గుంపుకి కనబడతాడు. వారు అతడ్ని పెంచి పోషిస్తారు. అతడూ దొంగగా పెరుగుతాడు.

కొంత కాలానికి సప్తర్షుల వల్ల సత్యం తెలుసుకొని, రామనామోపదేశం పొంది, ఆ నామజపంతో మహా తపస్సు చేసి, తన చుట్టూ వల్మీకం (పుట్ట) ఏర్పడి, తిరిగి తపస్సు ఫలించాక పుట్ట నుండి దివ్యతేజస్సుతో వెలువడి, బ్రహ్మర్షియై, 'వాల్మీకి'(పుట్ట నుండి పుట్టిన వాడు) అయ్యాడు.

ఇది ప్రసిద్ధ రామాయణం కథే కనుక 'వాల్మీకి' పేరుకున్న ప్రశస్తిని బట్టి దీనిని ప్రమాణంగా భావించవచ్చు.

**ప్ర: శ్రీకృష్ణుడు పదహారు వేలమంది గోపికలను వివాహమాడాడా?**

**జ:** పదహారువేలమంది 'గోపికలు' కారు. వారు నరకాసురుని వల్ల చెరలో బంధితులైన రాచకన్యలు. నరకవధానంతరం, వారిని శ్రీకృష్ణుడు బంధవిముక్తులను చేశాడు. వారంతా శ్రీకృష్ణునే పతిగా భావించారు. భావనానికనుగుణంగా 16 వేల రూపాలతో శ్రీకృష్ణుడు వారిని ధార్మికంగా వివాహమాడాడు. ఎవరికి వారికే కృష్ణుడు. ఆ లీలా మయ చరిత్రను నారదుడు తిలకించి, ఏ ఇంటికి వెళ్లినా, ఆ ఇంటి గృహస్థుగా శ్రీకృష్ణుని ధార్మిక కృత్యాలను చూసి, ఆ యోగీశ్వరేశ్వరుని తత్త్వానికి ఆశ్చర్యచకితు డయ్యాడు.

**ప్ర: శ్రీరాముడిగా పాటించిన ధర్మం, శ్రీకృష్ణునిగా పాటించలేదేమి? రెండు అవతారాలలో తేడా ఎందుకు?**

**జ:** అవతారాలలో తేడా ఉందేమో గానీ, ధర్మాచరణలో లేదు. శ్రీకృష్ణుడు కూడా శ్రీరామునిలాగే పితృవాక్య పాలకుడు, సత్యవ్రతుడు, ధర్మజ్ఞుడు, ధర్మప్రతిష్ఠాత. రెండింటి లీలలూ వేరు. లక్ష్యం, లక్షణం ఒకటే. ధర్మస్థాపన లక్ష్యం, ధర్మమయ జీవనం లక్షణం. అందుకు కృష్ణ కథ మూల భాగవతం, భారతం చదివితే అంతా స్పష్టమవుతుంది.



**ప్ర: విష్ణు సహస్రంలో 'మహర్షిః కపిలాచార్యః' అని ఉంది కదా? అంటే కపిల మహర్షి విష్ణువు అవతారమని అర్థమా? ఎవరీ కపిల మహర్షి?**

**జ:** కపిలమహర్షి నారాయణాంశ సంభవుడు. కర్దమ ప్రజాపతికీ, దేవహూతికీ జన్మించిన వాడు. ఈ కపిలాచార్యుడు తల్లికి తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించిన మహాత్ముడు. ఈ మహర్షి 'సాంఖ్యమతానికి' ఆది.

**ప్ర: ఆ మధ్య 'ఋషిపీఠం'లో "ఆ నగరం 22వ మహానరకంలా ఉంది" అన్నారు. అంటే 21 నరకాలు ఉన్నాయని అర్థమా? ఆ 21 మహా నరకాలు ఏమిటి? అవి ఎక్కడ పేర్కొనబడ్డాయి?**

**జ:** అవి వివిధ పురాణాదుల్లో చెప్పబడ్డాయి. చిన్న చిన్న భేదాలున్నా, అన్నీ ఇంచుమించు ఒక పేర్లని చెప్పాలి. కొన్ని సందర్భాల్లో ఒకే నరకానికి రెండు పేర్లుండవచ్చు. ఉదా: వాటి వివరాలు: ఏక వింశతి (21) మహా నరకములు,

**యాజ్ఞవల్క్యస్మృతి –** తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుట్మలము, పూతిమృత్తికము, కాలసూత్రకము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రతానము, మహానరకము, కాకోలము, సంజీవనము, నదీపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్ర వనము, తపనము.

**భాగవత పురాణం –** తామిస్రము, అయఃపసానము, మహారౌరవము, వజ్రకంటక శాల్మలి, రౌరవము, విశసనము, పూయోదము, కాలసూత్రము, సందశము, సూకర ముఖము, కృమిభోజనము, అంధకూపము, వైతరణి, వాలాభక్షము, ప్రాణరోధము, సారమేయాదనము, వీచి, అంధతామిస్రతము, కుంభీపాకము, అసిపత్ర వనము, తప్తోర్మి.

**మనుస్మృతి –** తామిస్రము, లోహశంకువు, మహారౌరవము, శాల్మలి, రౌరవము, కుడ్మలము, ప్రతిమూర్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహదారకము, నది, సంప్రతానము, మహానరకము, సకాకోలము, సంజీవనము, పథము, మహావీచి, అంధతామిస్రతము, ఋజీషము, అసిపత్రవనము, తపనము.

**గరుడ పురాణం –** తామిస్రము, లోహకుండము, మహారౌరవము, శాల్మలి, రౌరవము, కుడ్మలము, పూతిమృత్తిక, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రతానము, మహానిరయము, కాకోలము, సంజీవనము, మహాపదము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్ర వనము, తపనము.

**ప్ర: ఒక సామాన్య రజకుని మాట పట్టించుకొని సీతమ్మను అడవులపాలు చేయడం రాముని వంటి వానికి తగునా?**

**జ:** రామాయణం ప్రకారం– 'సామాన్య రజకుని మాట'– అనే కథ లేదు. పట్టాభిషేకానంతరం శ్రీరాముడు సీతమ్మ చాలాకాలం సుఖంగా జీవించారు. ఒక రాత్రివేళ వారు సుఖాసీనులై మాట్లాడు కుంటూండగా, తనకు వాల్మీకుల వారి ఆశ్రమం చూడాలని ఉందనీ, అక్కడ కొంతకాలం నివసించాలని ఉందనీ– గర్భవతిగా నున్న సీతమ్మ కోరుకుంటుంది. ఆ సమయంలో– సభా భవనంలో పురజనుల అభిప్రాయం తెలుసుకునే సమావేశం జరగనుంది. శ్రీరాముడు సీతతో సంభాషించాక, ఆ సమావేశానికి వెళ్లాడు. అక్కడ అయోధ్య మంత్రి అయిన భద్రుడు, ఎంతో రామప్రేమ ఉన్నప్పటికీ, ప్రభుత్వ ధర్మాపాలనలో భాగంగా, అయోధ్య ప్రజల అభిప్రాయాన్ని చెప్తాడు. అందరూ, శృంగాటకముల (జంక్షన్స్) దగ్గర కూడా "సీతమ్మ ఏడాదిపాటు

లంకలో ఉన్నప్పటికీ శ్రీరాముడు ఏలుకున్నాడు. ఎంతటి విమోహి?” అని అను కుంటున్నారన్న విషయం చెప్పాడు.

‘దీనికి పరిష్కారంగా మీ అభిప్రాయ మేమిటని’ రాముడు న్యాయవేత్తల్ని ప్రశ్నిస్తాడు. దానికి వారు మౌనంగా ఉంటారు. అది అర్థం చేసుకున్నాడు రాముడు. ఆ రోజుల్లో ప్రజాభిప్రాయం ఎలాంటిదైనా దానికి విలువ నివ్వాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. రాజుకి వ్యక్తిగత జీవితం కన్నా, ప్రజల వద్ద బాధ్యతగా స్పందించాల్సి ఉంది. ఇది పరాంపరాగత రాజధర్మం.

సమావేశం చాలించి, లక్ష్మణుని పిలిచి, గుండె ఊయి చేసుకొని, సీత వాల్మీకుల వారి ఆశ్రమం చూడాలని అంది కనుక, మరురోజు సకల మర్యాదలతో ఆశ్రమా నికి తీసుకువెళ్లమ’ని ఆజ్ఞాపిస్తాడు. అంతేగానీ అడవుల్లో వదిలి రమ్మనలేదు. సీతమ్మను తాను శంకించలేదు. రామో విగ్రహవాన్ ధర్మః. లక్ష్మణుడు వాల్మీకి ఆశ్రమానికి తీసుకువెళ్లి, ఆశ్రమవాసుల రక్షణలో అమ్మవారిని ఉంచాడు.

అడవిలో ఒంటరిగా వదల్లేదు.

32 **ప్ర: మనసులో భక్తి ఉంటే చాలదా? గుళ్లూ, గోపురాలూ వెళ్లాలా? అంటూంటారు చాలామంది. నిజమేనా?**

**జ:** మనసులో భక్తి ఉన్నవాళ్లెవరూ ఇలా అనరు. మనసులోనూ, బయటా కూడా భగవత్ ధ్యాస లేనివాళ్లు మాత్రమే, తప్పించుకునేందుకు ఇలా అంటూంటారు లోకంలో. అయినా దేవాలయాలు మనసు కోసం మాత్రమే కాదు. మనసూ, దేహమూ గల జీవుడు తనకే తెలియని పాశాలతో, పాపాలతో చుట్టుకుని ఉంటాడు. వాటిని నిర్మూలించగలిగే శక్తి– దేవతా శక్తులు నిక్షిప్తమైన చోట ఉంటుంది. మనకు మామూలు కంటితో చూడలేని సూక్ష్మప్రపంచం అనంతంగా ఉంది. దాని ప్రభావం మనపై ఉంది. వాటికి సంబంధించిన విషయమిది.

**ప్ర: ఆంజనేయస్వామికి ‘బజరంగబలీ’ అనే పేరు ఉంది కదా! ఈ పదానికి అర్థం ఏమిటి?**

**జ:** ‘బజరంగబలీ’ అనేది సరైన మాట కాదు. సంస్కృతంలోని **‘వజ్రాంగబలీ’** అని ఆంజనేయుని పేరు. వజ్రములవలె దృఢమైన దేహం కలిగిన బలశాలి అని ఈ పదానికి అర్థం. ఉత్తర భారతదేశంలో, అక్కడి భాష ప్రకారం ‘వ’ కాస్తా ‘బ’గా మారి ‘బజ్రాంగ బలీ’ (బజ్‌రంగ్‌బలీ) అయ్యింది. మళ్లీ మన వైపు వచ్చి ‘బజరంగ

బలీ'గా మారింది. దీని అసలు రూపం 'వజ్రాంగబలీ'.

ప్ర: **రావణుడు చనిపోయేటప్పుడు కొన ప్రాణంలో ఉండగా, లక్ష్మణుని అతని వద్దకు పంపి రాముడు రాజనీతిని నేర్చుకోమని చెప్పాడని ఒక సందర్భంలో విన్నాను. నిజమేనా? "మంచిని వాయిదా వేయకు, చెడు ఆలోచన అమలు చేయడానికి తొందర పడకు"అని అక్కడ రావణుడు చెప్పినట్లు కూడా విన్నాను.**

జ: ఈ కథ ఏ రామాయణంలోనూ లేదు. లక్ష్మణుడు రావణునికి శిష్యరికం చేసి తెలుసుకోవలసిన రాజనీతి ఏదీ లేదు. అంతేకాక– 'మంచిని వాయిదా వేయ కూడదు' లాంటి అతి సామాన్య విషయం, అంతిమ స్థితిలో ఉన్న రావణుని ద్వారానే వినడమనేది మరో హాస్యాస్పదం. రామలక్ష్మణులకు తెలియని రాజనీతి లేదు. కొన్ని మంచి విషయాలను జనసామాన్యానికి అందివ్వడానికి ఇలాంటి పిట్టకథలు పుట్టిస్తుంటారు. మనందరికీ రామలక్ష్మణ, కృష్ణాది పాత్రల పట్ల ఉన్న గౌరవం చేత ఆ విషయం బాగా హృదయానికి హత్తుకుంటుందని వారి అభిప్రాయం కావచ్చు. మనం వాటిని ప్రమాణంగా భావించవద్దు. పాత్రౌచిత్యాలు దెబ్బతినే కల్పనలు ప్రమాదకరాలే!



ప్ర: **ఒకే కథ ఒక్కొక్క పురాణంలో ఒక్కొక్కలా చెప్తుంటారు. ఎందుచేత? అంటే అవి జరగలేదని అర్థమా?**

జ: ఇక్కడ రెండు పద్ధతులు ఉన్నాయి. ఒక కథ ఒక పురాణంలో చెప్పేటప్పుడు, అందులో చెప్పిన కొన్ని వివరాలు, మరో పురాణంలో చెప్తారు. మరో విషయం... పురాణాల కథలు కల్పభేదాల బట్టి ఉంటాయి. కొన్ని చరిత్రలు ఒక్కొక్క కల్పంలో ఒక్కొక్క విధంగానే ఉంటాయి. 'పద్మకల్పం'లో జరిగిన రామకథకీ, 'శ్వేతవరాహ కల్పం'లో జరిగిన రామకథకీ కొన్ని తేడాలు, కొన్ని సామ్యాలు ఉంటాయి. ఇవి కల్పభేదాల ఫలితమే తప్ప, జరగలేదని అర్థం కాదు.

ప్ర: **తంత్ర ఉపాసన వల్ల భగవంతుని సాయుజ్యం సాధ్యమా?**

జ: మంత్రం– యంత్రం... ఉన్నదే తంత్రం. మన పూజాదులన్నీ తంత్రం కిందికే వస్తాయి. సృష్టిలో ఐహికావసరాల్ని అనేక పద్ధతుల్లో తీర్చుకోవచ్చు. భౌతిక ప్రయత్నాలతో పాటూ, సూక్ష్మ ప్రపంచంలోని శక్తుల సాయంతో కూడా నెరవేర్చు కోవచ్చు. అలా ఐహిక ప్రయోజనాల కోసం సూక్ష్మ శక్తుల సాయం తీసుకోవడమే తంత్రం. వాటి ఉపాసన ఆ ఫలసిద్ధితోనే పరిపూర్తి అవుతుంది. పైగా – వామాచార పద్ధతుల్లో

వెళితే తత్కాల ప్రయోజనమూ, అనంతర కాల వేదనే ఫలితం.

అలాకాక– ఉత్తమ శ్రేణికి చెందిన దివ్య మంత్రాలను ఉత్తమ గురువు ద్వారా ఉపాసిస్తే, అదీ ఫలాపేక్ష రహితంగా సాగిస్తే దేవత అనుగ్రహించి సాయుజ్యానికి అవసరమైన పరిపక్వతని ప్రసాదిస్తుంది.

**ప్ర: పడుకొనే గదిలో దేవుడి పటాలు ఉంచవచ్చా? ఒకే గదిలో కాపురం చేసేవారి విషయం ఏమిటి?**

**జ:** పడుకొనే ముందు, పడుకొని లేచిన తర్వాత భగవంతుని తలచుకోవడం, ధ్యానించడం అవసరం. అందుచేత, నిరభ్యంతరంగా దేవుడి పటాలు, కేలండర్లు ఉంచవచ్చు. అయితే నిత్యం పూజించే దైవపీఠం పడక గదిలో ఉంచుకోకూడదు. ఒకే గదిలో కాపురం చేసేటప్పుడు తప్పదు కనుక ఒక మూలన, శుద్ధిగా దేవుడి పీఠం ఉంచవచ్చు. వీలైన ఎత్తైన స్థలంలో ఉంచాలి.

**ప్ర: భగవంతుని నామం ఏఏ సమయాల్లో, ఏ ఏ నియమాల్లో చేయాలి? వాటికి ఉపదేశం ఉండాలా?**



**జ:** భగవన్నామ జపానికి ఇది సమయమనీ, ఇది నియమమనీ లేదు. సర్వకాల సర్వావస్థలలోనూ చేయవచ్చు. రామ, కృష్ణ, శివ, దుర్గ, లక్ష్మి, సరస్వతి వంటి ఏ నామమైనా, ఏ సమయంలోనైనా స్మరించవచ్చు. నియమాలూ, పద్ధతులూ మంత్రజపానికి మాత్రమే అవసరం. నామ జపానికి ఏ ఉపదేశాలూ అక్కర్లేదు. మంత్ర జపానికి మాత్రం ఉపదేశం అవసరం. సర్వకాల సర్వావస్థల్లోనూ నామ జపం చేయడం వల్ల భగవత్కృప తప్పక లభిస్తుంది.

**ప్ర: నేను రోజూ విష్ణు సహస్రం, శివసహస్రం చదువుకుంటూంటాను. అవి ఇంట్లో చదవకూడదనీ, ఏ దేవాలయాల్లోనే చదవాలనీ ఒకరన్నారు? మైల (అశౌచం) ఉన్నప్పుడు చదవవచ్చా?**

విష్ణు సహస్రం, శివసహస్రం నిరభ్యంతరంగా ఇంట్లో చదవవచ్చు. చదవరాదని ఏ శాస్త్రము లేదు. అయితే మైల (అశౌచం) ఉన్నప్పుడు మాత్రం చదవరాదు.

**ప్ర: ఈ మధ్య ఒక సంస్థవాళ్లు వేదాలలో దేవుడు, దైవ పూజ లాంటివి లేవనీ, ప్రకృతి శక్తులను ఉదాత్త భావాలతో గానం చేశారనీ– ఒక సభలో చెప్పగా విన్నాను. అగ్ని, వాయువు, వరుణుడు లాంటివారి ప్రసక్తే తప్ప, శివ, విష్ణు శక్తి లాంటివి లేవని వాళ్లు చెప్పారు. మానవ మేధతో స్వప్రయోజనాల కోసమే దేవుడ్ని సృష్టించారనీ,**

**అది మూఢనమ్మకమనీ కూడా అన్నారు. ఈ దేవుడమ్మలూ, దేవుడయ్యలూ మోసాలనీ చెప్పారు? నిజంగా దేవపూజల ప్రసక్తి వేదాలలో లేదా?**

**జ:** ఆ చెప్పినవాళ్లు ఎక్కడో ఏవో కొన్ని అరకొర విజ్ఞానపు వ్యాసాలను చదివేసి మిడిమిడి జ్ఞానంతో ఆడిన మాటలే ఇవి. ఒక శాస్త్రం గురించి మాట్లాడేముందు ఆ శాస్త్రానికి సంబంధించిన పారిభాషిక పదాల అవగాహనను మొదలుకొని, ఆ శాస్త్ర సంప్రదాయం తెలిసి, అధ్యయనం చేసి అప్పుడు మాట్లాడాలి.

కేవలం కొన్ని ఉటంకింపులు నోటపట్టి మాట్లాడ్డం సరిపోదు. దేవుడమ్మలూ, దేవుడయ్యలూ మోసాలేనని మన సంస్కృతి మీద అవగాహన ఉన్న ఎవరైనా అంగీకరించి తీరతారు. ఎంత గొప్ప పురుషుడినైనా 'దేవుడు' అని ఆరాధించడం అజ్ఞానమే. గొప్పవాడిగా గౌరవించడం మటుకు చాలు. ఈ రకమైన అజ్ఞానపు ఆరాధనని వేదసంస్కృతే నిరసించింది.

ఇక దైవం అంటే అర్థం ఏమిటి? ఒకే విశ్వచైతన్య శక్తి, ఉపాసనకై వివిధ రూపాలుగా ఆవిర్భవించిందనీ, ఆ రూపాలు తాపసులైన ఋషులకు గోచరించిన విధానం వేదాలలోనే ఉంది. అవి అర్థం చేసుకోవాలంటే, దుర్భావ దూషితంకాని మనస్సు, ఏకాగ్రమైన శ్రద్ధతో కూడిన అధ్యయనం అవసరం.

'ఇదం విష్ణుర్విచక్రమే...' 'వేదాహమేతం పురుషం మహాన్తం'– వంటి మంత్రాలే గాక, ఋగ్వేదం మొదలుకొని అనేక విష్ణుసూక్తాలు ఉన్నాయి. మంత్ర, ఉపాసనాదులకు సంబంధించిన అథర్వణవేదంలోనూ అనేక రహస్యాలు చెప్పబడ్డాయి.

'నీలగ్రీవో విలోహితః', 'పినాకం బిభ్రదాగహి', 'నమశ్శివాయ చ శివతరాయ' మొదలైన శివరూపాలు, శివ మంత్రాలూ వేదాలలో చెప్పబడ్డాయి.

'తాం మ ఆ వహ జాతవేదో లక్ష్మీం', 'శ్రియం దేవీం', 'హిరణ్యవర్ణాం', 'సువర్ణ రజతస్రజాం', 'అహం రుద్రేభిర్వసుభిశ్చరామి'– వంటి దేవీ సంబంధ సూక్తాలూ వేదాల్లో వేవేలు. ఇంకా కేనోపనిషత్తు, భావనోపనిషత్తు వంటి వేదభాగాలలో దేవీ ప్రభావం చెప్పారు.

'గణానాం త్వా', 'మహాన్‌హస్తీ', 'ఏకదంతాయ విద్మహే'– వంటి గణపతి మంత్రాలూ ఉన్నాయి. ఇప్పుడు మన మతంలోనున్న దేవతా రూపాలన్నీ వేదాలలోని ఉపాసన కాండలో చెప్పినవే. కంటికి కనబడే అగ్ని, నీరు మొదలైన వాటిని దర్శించడం కాదు వేదమంటే. వాటివెనుక భౌతికదృష్టికి గోచరించని దేవతాశక్తుల్ని చూసి,

వాటిని భగవచ్ఛైతన్యంగా దర్శించినదే వేదం.

వైదికమైన సంస్కారంతో చూస్తే ఏది మూఢనమ్మకమో నిర్ణయించగలం. అరకొర చదువులకి అన్నీ మూఢాలే. అందుకే అల్పజ్ఞాని అర్థం చెప్పడానికి వస్తే వేదమాత భయపడుతుందన్నారు పెద్దలు.

శిక్ష, వ్యాకరణం, ఛందం, నిరుక్తం, జ్యోతిషం, కల్పం– అనే షడంగాలలో నైపుణ్యం ఉన్నవాడే వేదానికి అర్థం చెప్పగలడు.

వీటితో పురాణ సంప్రదాయం తెలియాలి. ఇవేవీ మనం చేయలేకపోతే, అలా చదువు కున్న పెద్దల దగ్గర వినయంగా విద్య నేర్చుకోవాలి. శిక్షణే లేకుండా, జ్ఞానలవదుర్వి దగ్ధులై మిడిసి పడితే చాలదు.

**'బిభేత్యల్ప శ్రుతాత్ వేదం**

**మామయం ప్రహరిష్యతి'–** 'అల్పజ్ఞానివల్ల తన హృదయమే దెబ్బతింటుందని వేదం భయపడుతోంది.' 'యజామహే'– అంటే అర్చిస్తున్నాననే అర్థం. ఈ అర్చనా విధానమూ వేదవిహితమే. 'త్ర్యంబకం' లాంటి దేవతామూర్తులు ఋగ్వేదంలోనే చెప్పబడ్డారు కదా. 'దేవపితృ కార్యాభ్యాం నప్రమదితవ్యమ్'– దేవపితృ కర్మలలో ఏమరపాటు కూడదు– అంటే వేదమే దైవోపాసన చెప్పింది.

**'తస్య తే భక్తి వాంసః స్యామ'–** "దైవమా! మేము నీ భక్తులం" అని వేదమే దైవ భక్తిని పేర్కొంది. 'అర్చత' అని దేవతార్చనని ప్రబోధించింది వేదమే.

వేద వేదాంగజ్ఞులైన పెద్దలందరూ, దేవతారాధనలతో పునీతులయ్యారు. అవుతున్నారు. వాటి రహస్యాలేమిటీ అని ఆలోచించడం మాని, అనూచానంగా వస్తున్న ఒక మహద్విషయాన్ని, అవగాహన రాహిత్యంతో, కాదనడం– మూఢత్వానికి నిదర్శనం. ఆచరించేవాడికే అవగాహన కలుగుతుంది. అలాంటి అనుష్ఠానంతో కూడిన ఆలో చనకే సత్యం దర్శనమిస్తుంది.

ప్ర: **'భగవంతుడు', 'భగవతి' అంటే అర్థం ఏమిటి?**

జ: ***ఐశ్వర్యస్య సమగ్రశ్చ వీర్యశ్చయశసః శ్రియః।***
***జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరిణా॥***

1. సమగ్రమైన ఐశ్వర్యం, 2. వీరం, 3. యశస్సు, 4. శ్రీ(ప్రభ), 5. జ్ఞానం, 6. వైరాగ్యము– ఈ ఆరుగుణాలూ ఉన్నవాడు భగవంతుడు. దీనికి స్త్రీరూపమే 'భగవతి'. ఇదేకాక మరో అర్థం కూడా ఉంది.

**ఉత్పత్తిం ప్రళయం చైవ**
**భూతానా మాగతిం గతిమ్।**
**వేత్తి విద్యామవిద్యాం చ**
**స వాచ్యో భగవానితి॥**

1. సృష్టి, 2.ప్రళయం, 3.ప్రాణుల రాక, 4.పోక, 5. విద్య (మోక్షం), 6. అవిద్య (బంధనం)– వీటిపై అధికారం గలవాడు 'భగవంతుడు'. (స్త్రీరూపం – భగవతి).

**ప్ర: విష్ణువుని భృగుమహర్షి తన్నాడనీ, భృగుమహర్షి కాలికింద కన్ను ఉందనీ, దానిని విష్ణువు నొక్కేశాడని కథ ఉంది. కాలి కింద ఎవరికైనా కన్ను ఉంటుందా?**

**జ:** ఎవరికీ కాలికింద కన్ను ఉండదు. భృగుమహర్షికి కూడా లేదు. ఏ పురాణంలోనూ ఈ ప్రసక్తి లేదు. సత్వగుణసంపన్నుని కోసం పరీక్షించడానికి వెళ్ళిన భృగుమహర్షి ఉద్రేకంతో విష్ణువక్షస్థలాన్ని తన్నగానే, ఆయన నవ్వుతూ సహనంగా భృగువుని ఆదరించి, పాదాలనొత్తాడు. ఆ సత్వగుణాన్ని చూసి, భృగువు పశ్చాత్తప్తుడై తనను క్షమించమని ప్రార్థించాడు. ఇది మాత్రమే వరాహపురాణాదుల్లో ఉన్న కథ. ఏ పురాణంలోనూ కాలికింద కన్ను లేదు. ఇలాంటి అసహజాలు ఏ శాపకథల్లోనో, రాక్షసుల వికృత రూపాల్లోనో తప్ప ఇంకెక్కడా ఉండవు.

**ప్ర: చాలా పుస్తకాల్లో బీజాక్షరాలతో నున్న మంత్రాలు, యంత్రాలు ముద్రిస్తున్నారు. అంతేకాక కేవలం ఒక్క మంత్రం మాత్రమే (గాయత్రి, పంచాక్షరి వంటివి) ఉచ్చరిస్తూ పూర్తి కేసెట్లు వినుకోవచ్చా?**

**జ:** కలి ముదిరిందనడానికి ఇవి నిదర్శనాలు. భగవంతుడి కరుణ పొందడానికి నామోచ్చారణ, స్తోత్రాల పఠనం మనకు ఉన్నాయి. ఇవి చాలు. మంత్ర విద్యకి చాలా సంప్రదాయం ఉంది. ఒక మంత్రం అంటే సరిపోదు. దానికి ఋషి, శక్తి బీజం, కీలకం, అంగన్యాస, కరన్యాసాదులు తెలియాలి. సంప్రదాయం తెలిసిన గురువు వద్ద ఉపదేశం పొంది, మౌనంగా జపించాల్సినది మంత్రం. అలాకాక పుస్తకాల్లో ఉంది కదా అని జపించేయడం మహాపాపం. మంత్రం ప్రచారానికి కాదు. భగవన్మహిమ, స్తోత్రం, నామం, కీర్తన మాత్రమే ప్రచారం చేయాలి. వేటి ప్రయోజనం వాటిదే. సంప్రదాయం తెలియక, కేవలం జనాకర్షణ కోసం, మంత్రశాస్త్రోల్లంఘన చేయడం దుస్సాహసం. అలాంటి దుస్సాహసంతో, ధనాపేక్షతో పుస్తకాల్లో ప్రచురిం

చడం, కేసెట్లు తేవడం జరుగుతోంది. మంత్రం ఉపదేశం పొందాక, ఎవరికి వారు జపం చేసుకోదగినది మాత్రమే. అంతే గానీ పాటలవలె మంత్రాన్ని కేసెట్లుగా వినడం తగదు. భజనగా ఉచ్చరించడం, పాడడం తగదు. మంత్రానికి బాణీ కట్టడం కూడా పాపం. ఇలాంటి పనులు చేయడం, వాటిని మనం వినడం రెండూ విపరీతాలకే దారి తీస్తాయి.

వీటిని ఖండించడానికి విద్వాంసులు ముందుకు రాక, 'మనకెందుకులే' అనే ఉదాసీన వైఖరి అవలంబించడం వల్ల ఈ విపరీత ధోరణులు ప్రబలుతున్నాయి.

కొన్ని పాటల్నీ స్తోత్రాల్ని వాటి వాద్యపరికరాలతో రికార్డు చేయడానికి అయ్యే ఖర్చు కన్నా, ఒక్క శ్రుతిబాక్స్‌తో, ఒక్కసారి ఒక్క మంత్రం చెప్పి, ఆధునిక సాంకేతిక సదుపాయంతో కేసెట్టంతా అదే నింపడం – చాలా తక్కువ ఖర్చుతో కూడిన పని. అందుకే కేవలం డబ్బు తప్ప ఏమీ పట్టని వ్యాపార సంస్థలు ఈ పనికి పూనుకుంటున్నాయి. పుణ్యమొచ్చేస్తుందేమోననే భ్రమతో పాపం మూటకట్టుకోడానికి ఇవి కొనుక్కొని, వింటున్నాం. మంత్రం, యంత్రం – వాటి నియమాలు తెలుసుకొని సాగాలి. భక్తికి ఇవి అనవసరం. మహిమాన్వితమైన స్తోత్రాలు, వాగ్గేయకారుల కీర్తనలు మనకు లెక్కలేనన్ని ఉన్నాయి. అవి చాలు.



**ప్ర: అన్ని మతాలకు లాగే మనకీ మతగ్రంథం– 'భగవద్గీత' ఉంది. మరి మన మతానికి ప్రవక్త ఎవరు?**

**జ:** అన్ని మతాలకు ఉన్నట్లే మనకు ప్రత్యేకించి ఏ మతగ్రంథమూ లేదు. మన మతం వేరూ, జీవితం వేరూ కాదు. మనది ధార్మిక జీవన విధానం. దీనికి మతగ్రంథం – 'భగవద్గీత' కాదు. వేదాలను ఆధారం చేసుకున్న సంస్కృతి మనది. వేదం గ్రంథం కాదు. వేద ధర్మాన్ని తెలియజేస్తూ పురాణాలు, ఇతిహాసాలూ ఉన్నాయి. వాటిలో మహా భారతం ఒకటి. అందులో ఉన్న అనేక అంశాలలో 'భగవద్గీత' ఒకటి. అంతే.

అయితే సాక్షాత్తు పరమాత్మ వచనం కనుక, సర్వోపనిషత్సారం కనుక దానికి ప్రత్యేక గౌరవం. అటువంటి విషయాలే మన వాఙ్మయమంతా చెప్తోంది. అనేకమంది ఋషులు తపస్సుతో దర్శించిన సత్యాలే ఆర్ష వాఙ్మయమంతా ఉన్నవి. కాబట్టి మనకో మతమూ, మతగ్రంథమూ, మతప్రవక్తా లేరు. సనాతన ధార్మిక తాత్త్విక జీవన విధానమైన భారతీయ సంస్కృతినే మనం 'హిందూమతం' అంటున్నాం.

**ప్ర: ఇతరుల ప్రార్థనా మందిరాలకీ, మన దేవాలయాలకీ చాలా భేదాలు కనిపిస్తాయి. ఎందుచేత?**

**జ:** మనవి 'దేవాలయాలు'! ప్రార్థనా మందిరాలు కావు. మనకి ప్రతి ఇల్లూ ప్రార్థనా మందిరమే. దేవాలయాలు గ్రామ, దేశ క్షేమాల కోసం నిర్మించినవి. వాటి వెనుక శాస్త్రపు పునాది చాలా ఉంది. దేవాలయ స్థలం, గోపుర నిర్మాణం, ఆవ రణలు, పరివార దేవతలు, ధ్వజ స్తంభం..... ఇవన్నీ ఏవో అలంకారం కోసం కట్టినవి కావు. ఆగమశాస్త్రాలను అనుసరించి – మంత్రశక్తితో, యంత్రశక్తితో ఆయా దేవతలను ఆవహింపజేసి దేవాలయ నిర్మాణం చేస్తారు. మూల విరాట్టును చేసే రాతిని కూడా శాస్త్రానుసారం పరీక్షించి, యంత్ర మంత్ర నియమాల ఆధారితమైన గణితాన్ననుసరించి నిర్మిస్తారు. ఇవి కాక ఉత్సవ విగ్రహాలు, వాటి నిర్మాణ విధానాలు వేరే ఉంటాయి. ఈ దేవాలయాలలోనికి మనం వెళ్లినా వెళ్ళకపోయినా అర్చనాది నియమాలు జరుగుతుంటాయి. మనం దైవాన్ని ప్రార్థించుకోవడానికీ, అర్చించుకోవ డానికీ గుడికి వెళ్ళడం మన ఆసక్తి, పుణ్యఫలంపై ఆధారపడి ఉంటుంది.

మన దేవాలయాలకీ, ఇతరుల ప్రార్థనా మందిరాలకీ విధానంలోనూ, ఉద్దేశ్యం లోనూ పోలికలే లేవు. దేవాలయ ప్రవేశం చేతనే–అక్కడ నిర్మాణమైన ఆగమశాస్త్ర విధానం చేత ఆవిష్కృతమైన దేవతాశక్తుల వల్ల పునీతమైన వాతావరణ ప్రభావం కారణంగా మనం పునీతులమవుతాం. ఆ శక్తులన్నీ సూక్ష్మప్రపంచానికి సంబం ధించినవి. స్థూల నేత్రాలకు అగోచరం.

ధ్యాన, ఉపాసనల ద్వారా గోచరమయ్యే దేవతా శక్తుల ఉనికి, ఆ సాధనలేవీ లేనివారి కన్నులకి కనబడవు. కానీ వాటి ప్రభావం ఉండి తీరుతుంది. మరోవైపు కుడ్యాల మీద, స్తంభాలపై, గోపురం పై చెక్కే శిల్పాలలోనూ కేవలం కళ మాత్రమే కాదు. దైవశక్తి సంబంధించిన శాస్త్ర మర్యాదలున్నాయి. ఇంత శాస్త్ర సంస్కార శక్తి గుడి పునాదులకి పునాది.

**ప్ర: 'శతమానం భవతి', జీవేమ శరదశ్శతం' వంటి వేదాల మాటల్లో మనిషి ఆయువు నూరేళ్ళు అని ఉంది. మరి నాటికాలంలో వేల సంవత్సరాలు బ్రతికేవారనే పురాణ వాక్యాలు అబద్ధాలు కావా?**

**జ:** ఎంతమాత్రమూ కావు. అందుకే వేదానికి అర్థం చెప్పేటప్పుడు చాలా జాగ్రత్త అవసరం అన్నారు. వేదాల పదాలకి అర్థాలు తెలుసుకునే సూత్రాలని చెప్పే శాస్త్రాలు

ఉన్నాయి. వాటి ద్వారా వేద పదాలని చూడాలి. ఆ చోట్లలో 'శతం' అనే మాటకి 'అనంతం' అని అర్థం. వందేళ్ళకి మించినవాళ్ళూ మనకి అక్కడ క్కడా, ఈ 'కాలూష్య' యుగంలో కూడా కనిపిస్తున్నదే! దానినేమంటాం!

'శతమనంతం భవతి' అనే వేదవాక్యంతో పాటూ, 'విశ్వం శతం సహస్రం సర్వ మక్షయ వాచకం' – అని "శతం" అంటే అనంతమనే అర్థం చెప్పడానికి శాస్త్ర ప్రమాణాలు ఉన్నాయి. మోక్ష పర్యంతం ఉండే పూర్ణాయువుని 'శతం' అంటారు. 'శాతం' వలె.

**ప్ర: ఈమధ్య ఒక స్వామిజీ (ఆయన కేవలం విష్ణువు గురించే చెప్తుంటారు), మా చేత పూజ చేయిస్తూండగా, నేను మా అలవాటు ప్రకారం పసుపు గణపతిని చేసి పూజిం చాలనుకుంటూ, పసుపు ముద్ద చేస్తుండగా – ఆయన "ఆ పసుపు ముద్దలూ, ఆ పూజలూ అక్కర్లేదు" అన్నారు. అలా గణపతి పూజను నిరసించడం తగునా?**

**జ:** ఏ వేద విరుద్ధ ధోరణులు, సంకుచిత నీచ స్వభావాలు పోవాలని ఎందరో మహాను భావులు తపించిపోయారో, మళ్ళీ ఆ ధోరణులన్నీ ఇలాంటి స్వామీజీల వల్ల బయలు దేరడం విచారకరమైన విషయం.



మన ప్రతి దేవతారాధనలోనూ ఇతర దేవతల్ని పూజించడం ఉంది. అంటే ఇతర దేవతలు, మన ప్రధానదేవతకు భిన్నం కారని తెలుసుకోవడానికే. ఒకే పరబ్రహ్మ– "భక్తానుగ్రహ విగ్రహం" –భక్తులను అనుగ్రహించడానికే వివిధ రూపాలు ధరించిం దని వేదమతం.

సృష్టి అంతా గణ (సమూహ) మయం. అన్ని గణాలలో (జీవులలో) అంతర్యామిగా ఉంటూ, శాసకుడైన పరమేశ్వరుడే 'గణపతి'. ఈ నామానికి ఈ భావనకి ఆర్ష దృష్టిలో గోచరమైన రూపం గజముఖుడైన స్వామి. విఘ్నములను తొలగించే ఈ వినాయకునే కాదంటే శివుడుగానీ, విష్ణువుగానీ సంతోషించరు.

శివ, కేశవ, శక్తి, సూర్య, గణనాథ, స్కంద...... మొదలైన వైదిక దేవతలంతా ఒక పరమేశ్వరుని పలురూపాలు. వీరిమధ్య భేదదృష్టి చూపిస్తే వ్యక్తికీ, విశ్వానికీ క్షేమం కాదు. కాబట్టి విజ్ఞులైన వారంతా ఈ విపరీత ధోరణులను నిరసించాలి.

**ప్ర: త్యాగరాజస్వామివారు ఒక కీర్తనలో "శివమంత్రమునకు" 'మ' జీవము, మాధవ మంత్రమునకు 'రా' జీవము. ఈ వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెద" అన్నారు. ఇది నాకు అర్థంకాలేదు. కాస్త వివరిస్తారా!**

**జ:** శ్రీ త్యాగరాజు మంత్ర శాస్త్రాది రహస్యాలు తెలిసిన మహాయోగి. అందుకే ఆయన రచించిన అనేక కీర్తనలు గంభీరంగా ఉంటాయి.

'నమశ్శివాయ' - అనేది శివమంత్రం. ఇందులో ప్రధానాక్షరం 'మ'. ఇది తీసేస్తే 'న శివాయ' - శుభము కొరకు కాదు-అనే విపరీతార్థం వస్తుంది. 'మ' ఉన్నందు వల్లనే శుభమైన అర్థం ఈ మంత్రంలో ఉంది. అందుకే ఈ మంత్రానికి 'మ' జీవమయ్యింది.

అలాగే 'నమో నారాయణాయ'- అనేది నారాయణ (మాధవ) మంత్రం. ఇందులో ప్రధానాక్షరం 'రా'. ఇది తీస్తే 'న అయనాయ' -తోవ(తరించేమార్గం) కొరకు కాదు - అనే విపరీతార్థమవుతుంది. అందువల్ల ఈ మంత్రానికి 'రా'జీవమైంది.

రెండు మహామంత్రాలలోని జీవాక్షరాలు కలిసి 'రామ' అయ్యింది. 'అందమూ మనోహరమూ' అని ఈ మాటకి అర్థం.

ఏది సత్యమైన శివమైన (శాశ్వత) సౌందర్యమో అదే పరబ్రహ్మ. అదే 'రామ'. సర్వజనుల అంతరంగంలో ఆనందరూపంగా ఉండే అంతర్యామినే 'రాముడు' అన్నారు. అందుకే త్యాగరాజు మరికొన్ని కీర్తనల్లో .. "రామాయన బ్రహ్మమునకు పేరు", "రమించువారెవరురా రఘూత్తమా నిను వినా"- అనీ 'రామ' శబ్దాన్ని నిర్వ చించారు. రామ తారక మంత్రాన్ని అనేక కోట్లు జపించిన ఉపాసనాబలం వల్ల, ఆ మహాత్మునికి ఆ మంత్రరహస్యాలు గోచరించాయి. అవి కీర్తనలుగా పల్లవించాయి.

**ప్ర: మహాభారతం అతిపెద్ద ఇతిహాసం. అది అంతా వ్యాసుడే వ్రాశాడా? అలా రాయ గలగడం ఎవరికైనా సాధ్యమా?**

**జ:** ఒక్క 'మహర్షి'కే సాధ్యం. మామూలు లౌకిక రచయితల మేధస్సును కొలబద్దగా తీసుకొని మహర్షుల మేధస్సు గురించి నిర్ణయించడం తప్పు.

తపోజనితమైన దర్శనశక్తితో, అక్షర పరబ్రహ్మను సాక్షాత్కరించుకున్న మహర్షికి - అందునా నారాయణాంశజుడైన వేదవ్యాసమహర్షికి -'మహాభారత' మనే మహేతి హాసం రచించడం ఎంతమాత్రమూ అసాధ్యంకాదు. అనంతవేదరాశిని చతుర్వే దాలుగా అందించి, భాగవత రచన చేసి, బ్రహ్మసూత్రాలను కూడా గ్రథనం చేసిన కారణజన్ముడాయన. అపారవాఙ్మయాన్నిచ్చిన ఆ మహాత్మునికి మహాభారత రచన పెద్ద పనేంకాదుగా. అందుకే పంచమవేదంగా తీర్చిదిద్ది, తన తపశ్శక్తిని ప్రత్యక్షరంలో నిబద్ధం చేశాడు.

**ప్ర: 'దర్శన శాస్త్రాలు' అంటే ఏమిటి? ఎవరు రాశారు?**

**జ:** 'దృశ్యతే జ్ఞాయతే అనేనేతి దర్శనమ్'. వస్తుతత్త్వాన్ని తెలియజేసేది దర్శనం. జగత్తు గురించి, జీవుడి గురించీ రకరకాల మేధావులు చేసిన ఆలోచనే 'దర్శనం'. అన్ని రకాల ఆలోచనల్ని ఆహ్వానించి పరిశీలించమంటుంది మన సనాతన సంస్కృతి. ప్రతి ఆలోచననీ దాటిన తర్వాత వచ్చే పరమసమాధానం వేదంలో లభిస్తుంది. ప్రాచీనులు ఆరింటినే దర్శనాలుగా పేర్కొన్నారు.

1.పాణిని వ్యాకరణం (శబ్దనిత్యవాదం), 2.జైమిని పూర్వమీమాంస (ధర్మ మీమాంస), 3.వ్యాసుని ఉత్తరమీమాంస (బ్రహ్మసూత్రాలు), 4. కపిలమహర్షి సాంఖ్యమతం (24తత్త్వాల జగత్పరిణామం), 5. కణాదుని వైశేషికం (పరమాణు వాదం), 6.అక్షపాదుని। గౌతముని తర్కం.

**పాణినే ర్జైమినే శ్చైవ**
**వ్యాసస్య కపిలస్య చ।**
**కణాదస్యాక్షపాదస్య**
**దర్శనాని షడైవహి॥** –అని ఈ ఆరూ దర్శనాలన్నారు.



అయితే తరువాతి కాలంలో 16 దర్శనాలు చెప్పారు. మొదటి ఆరూ కాక– మత ప్రాధాన్యాన్ని బట్టి తరువాత పదీ వచ్చాయి. చార్వాక, బౌద్ధ, ఆర్హత (జైన), రామానుజ (విశిష్టాద్వైత) పూర్ణ ప్రజ్ఞ (ద్వైత) నకులీపాశుపతశైవ, ప్రత్యభిజ్ఞ, రసేశ్వర, పాతంజల దర్శనాలు.

అయితే 'సర్వదర్శన సంగ్రహం' రచించిన మాధవ విద్యారణ్యుల వారు వేదంతాన్ని దర్శనం (వ్యాస దర్శనం) గా పేర్కొనక, మిగిలిన వాటినే (15) సంగ్రహించారు. దీనికి హేతువు – అన్ని దర్శనాలకూ సమాధానం ఉపనిషన్మతం (వేదాంతం)తో లభించింది. వేదాంతంతో సమన్వ యించబడ్డాయి.

**ప్ర: నాకు ఒక దేవీ మంత్రం ఉపదేశమయ్యింది. అది చేశాక, శివ, విష్ణు నామాలు, స్తోత్రాలు కూడా జపిస్తుంటాను. అలా చేయకూడదనీ, ఒకే దైవాన్ని పూజించాలనీ, లేకపోతే ఏకాగ్రత దెబ్బతింటుందనీ ఒకాయన చెప్పారు. అది నిజమేనా?**

**జ:** మనం ఎందరు దేవతల్ని పూజిస్తున్నా, మనకంటూ ఒక అభీష్ట దైవముంటుంది. ఆ అభీష్టమే ఏకాగ్రత. ఆ దైవంతో పాటూ ఇతర దేవతల్నీ స్మరించడం ఏకాగ్రతకి భంగమేమీ కాదు. పైగా అలా దేవతల్ని స్మరించడం ఉత్తమం కూడా.

దైవాలు మన కల్పనలు కావు. ఉన్నవారినే మనం భావిస్తున్నాం. అందరు దేవతలూ మనకవసరమే. సర్వ దేవతలూ స్మరించదగినవారే. స్మరించాలి కూడా. అందుకే ఆదిశంకరులు అభీష్ట దైవంతో పాటూ, ఇతర దేవతల్నీ అర్చించే వైదిక సంప్రదాయాన్ని ఆచారంగా ఉంచారు. అంతేకాక-మనం పరిశీలించి చూస్తే, ప్రతి దేవతా పూజలోనూ ఇతర దేవతల అర్చన కనబడుతుంది. ఒక సత్యనారాయణుని ఉంచినా, గణనాథ, బ్రహ్మ, శివ, పార్వతీ, సరస్వతీ, ఇంద్ర, నవగ్రహాది దేవతలందరినీ అర్చిస్తాం. అలాగే మిగిలిన పూజల్లోనూ. కారణం – మనమూ, ఈ విశ్వమూ ఒకే పరబ్రహ్మ యొక్క వివిధ దేవతా రూపాల వల్లనే నడుస్తోంది. అందుకే అందరినీ అర్చించడం దోషం కాదు.

ప్ర: **దేవుడ్ని ప్రార్థిస్తేనే ఆయన అనుగ్రహిస్తాడా? అలా అయితే ఆయన కూడా ఒక సాధారణ వ్యక్తి వంటివాడే కదా!**

**జ:** దేవుడ్ని ప్రార్థించినా, ప్రార్థించకపోయినా జీవితం వెళ్ళమారడం మానదు. అయితే దైవస్మరణ వల్ల – ఆ దివ్యభావంతో బుద్ధి, మనస్సు అనుసంధానమవుతుంది. తద్వారా పుట్టే ఆలోచన, జరిగే ప్రేరణ పవిత్రమౌతాయి. ఆ కారణంగా కార్యం సఫలమవుతుంది.

దైవప్రార్థన, స్మరణ, స్తుతి – సాధారణ వ్యక్తికి చేసే స్తుతి వంటివి కావు. అవి దైవశక్తిని మనలో జాగృతం చేసే సాధనలు. సర్వం భగవదాజ్ఞతో నడుస్తుందనే స్పృహ మనకు ఏర్పడడానికే దైవారాధన.

ప్ర: **భగవంతుడు సర్వత్రా ఉన్నప్పుడు దేవాలయాలెందుకు?**

**జ:** సర్వత్రా (అన్నిచోట్ల) భగవంతుడ్ని చూడగలిగేటంత స్థితి మనకు ఉంటే దేవాలయాలతో పనిలేదు. ఆ స్థితి కలగడానికే దేవాలయం. అంతేకాక-దేవాలయ నిర్మాణం ఆగమ శాస్త్ర రహస్యాలతో ఉన్నది. వాటి ద్వారా సూక్ష్మ ప్రపంచంలోని దివ్యశక్తులు ఆ పరిసర ప్రాంతాలను క్షేమంగా మలచుతాయి. ఏ అవధూత స్థాయిలోనో చెప్పాల్సిన మాటని, అన్నిటికీ అన్వయించకూడదు. మనం ఆ స్థాయిలో ఉన్నామా లేదా అని చూడాలి. దేవాలయం వలన ఏర్పడే దివ్యశక్తులు వ్యక్తులనీ, గ్రామాలనీ రక్షిస్తాయి.

ప్ర: **'భక్తి' అనేది పురాణకాలంలో వచ్చిందనీ, వేదాలలో 'భక్తితత్త్వం' గురించి లేదనీ అంటారు కొందరు. కాస్త వివరణ ఇస్తారా?**

**జ:** వేదకాలమనీ, పురాణ కాలమనీ విభజించి చూసే దృష్టే సరియైనదికాదు. వేదా

లలో లేనిది పురాణాల్లో చెప్పరు. 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్'– వేదమే ఇతిహాస పురాణాల్లో విస్తృతంగా చెప్పబడుతుంది.

**"దేవ సంస్థాన సహసాపోషస్యేశిషే।**
**తస్యనో రాస్వ తస్య నో ధేహి**
**తస్య తే భక్తివాంసః స్యామ ॥** (అథర్వ సంహిత)

"ఓ అభ్యుదయదాయీ! నువ్వు ఆధ్యాత్మికాది అసంఖ్య శాశ్వత పుష్టులకు స్వామివి. వాటిని మాకు ప్రసాదించి, మాయందు స్థాపించు..... ఆ మహా పుష్టిపతి అయిన పరమేశ్వరునిపై భక్తియోగాన్ని అవలంబించి, ఆ పావన భక్తి ద్వారా అభీష్ట పుష్టులను సంపాదిస్తాం."

**"యస్యతే స్వాదు సఖ్యం స్వాద్వీ ప్రణీతిః"** (ఋగ్వేదం)

'పరమాత్మతో కమ్మని సఖ్యం, అనన్య భక్తి' – ఈ మంత్రంలో ప్రస్తావించబడింది.

**'తమస్మాకం తవస్మసి' ॥** (ఋగ్వేదం)

'నీవు మావాడవు, మేము నీవారము'

ఇలా ఎన్నో వేదవాక్యాలు భక్తితత్త్వాన్ని తెలియజేసేవి ఉన్నాయి.



**ప్ర: ఎవరైనా చనిపోయినవారి బంధువుల్ని పరామర్శించాక తిరిగి తిన్నగా ఇంటికే చేరాలనీ, మధ్యలో ఇంకెవరి ఇంటికి వెళ్లరాదని అంటారు? ఇది అసలైన ఆచారమేనా?**

**జ:** అసలైన ఆచారమే. సంప్రదాయబద్ధమైనదే. మనవాళ్ల ఆచారాల్లో అనేక సూక్ష్మ ప్రపంచ రహస్యాలు దాగి ఉన్నాయి. అందులో సందేహం లేదు. తిన్నగా మన ఇంటికే చేరాలి. మధ్యలో ఇంకెవరి ఇంటికి వెళ్ళినా అది ఆ ఇంటివారికి క్షేమం కాదు.

**ప్ర: భగవంతుడికి మేలుకొలుపులు, నివేదన, పవళింపు సేవలు ఎందుకు? ఆయనకి మనలాగే నిద్రా, ఆకలీ ఉంటాయా?**

**జ:** ఆయనకి లేవుగానీ మనకు ఉన్నాయి కదా! నిద్రలో ఉండగా మనలో 'ఎరుక' నిద్రాణమవుతోంది. మళ్ళీ మనతోపాటు లేస్తోంది. ఈ సమస్త అవస్థల్లోనూ భగవంతుడే స్ఫురణకు రావాలని, ఆయనకు ఆ సేవలు మనం నివేదించినవి ఈశ్వర చైతన్యంతో పునీతమై ఆహారశుద్ధిని పొందుతాయి. ఆ ఆహారశుద్ధి వల్ల సత్త్వశుద్ధి, దానిద్వారా చిత్తశుద్ధి. ఫలితంగా జ్ఞానోదయం కలుగుతాయి.

**ప్ర: 'అక్షింతలు' కొందరు పసుపుతో కలిపి చేస్తారు. కొందరు కుంకుమ కలుపుతారు. కొందరు నెయ్యి, నూనె కలుపుతారు. ఏది శ్రేష్ఠం?**

**జ:** కుంకుమ, లేదా పసుపు కలుపవచ్చు. అయితే నీటితో తడిపి చేసినవాటిని దాచి ఉంచి నిత్యం చేయడం తగదు. ఎప్పటికప్పుడు చేసి వాడవలసిందే. కానీ నేతితో కుంకుమ లేదా పసుపు కలిపి చేసే అక్షతలు దాచి, రోజూ వాడవచ్చు. రుద్రాభిషేక సమయాల్లో కేవలం బియ్యాన్ని తడిపి 'శుద్ధ (శ్వేత)' అక్షతలుగా వాడతారు. అవి మళ్ళీ వాడరాదు. కొన్ని ప్రాంతాలలో కొన్ని కొన్ని పద్ధతులు అమల్లో ఉంటాయి. వాటి గురించి అంత విచారించనక్కర్లేదు. ముక్కలుకాని బియ్యాన్ని వాడడం ముఖ్యం. ఎక్కడైనా 'పొరపాటున' ముక్కలున్నా పసుపు కుంకుమల కలయికతో ఆ దోషం పోతుంది.

**ప్ర: తప్పు చేసిన అహల్యను 'పతివ్రత'గా ఎంచడం సమంజసమా?**

**జ:** అహల్య బ్రహ్మదేవుని సంకల్పం చేత జనించిన మానస పుత్రిక. ఉత్తమురాలు. కానీ ఒకానొక క్షణంలో తన తపస్సు నుండి భంగం కాబడి, తప్పు చేసిన పరిస్థితి నిజమే. కానీ గౌతముని అనుగ్రహం వల్ల తపోనిష్ఠ పూని, తన పాపం నుండి పవిత్రురాలై తపస్సును పండించుకుంది. శ్రీరాముని అనుగ్రహాన్ని సాధించింది. పునీతురాలయ్యింది. కనుక ఆమె పాపవిమోచనం పొందిన సాధ్వి.

ఒక్క చిన్న తప్పుని తపస్సు చేత సరిదిద్దుకుని పాతివ్రత్యాన్ని పాటించింది. కాబట్టి ఆమెను పతివ్రతగా ఎంచారు.

**ప్ర: వేదాలలో-ముఖ్యంగా ఋగ్వేదంలో అనేక చోట్ల 'ఇంద్రు'నే పరమేశ్వరునిగా వర్ణించారు. అంటే ఇంద్రుడు శివకేశవాదులకన్నా గొప్పవాడా?**

**జ:** వేదాలలో 'ఇంద్ర' శబ్దం పరబ్రహ్మ (పరమేశ్వర) వాచకం. 'త్రిలోకాధిపతి' అయిన పదవిలో ఉన్న ఇంద్రునికి వాచకం కాదది. శివ, కేశవ, ఇంద్ర – ఈ మూడూ పర బ్రహ్మ వాచక శబ్దాలే. వాసవః, ఇంద్రః అనే నామాలు శివ, విష్ణు సహస్రాల్లోనూ ఉన్నాయి.

'ఇంద్ర' – అనే శబ్దానికి 'పరమేశ్వరుడు' (సమస్త ఐశ్వర్యముల పతి)అనే అర్థం. వేదం 'పరబ్రహ్మ' వాచకంగానే 'ఇంద్ర' శబ్దాన్ని వాడింది.

"అగ్నిశ్చమ ఇంద్రశ్చమే సోమశ్చమ ఇంద్రశ్చమే సవితా చమ ఇంద్రశ్చమే సరస్వతి

చమ ఇంద్రశ్చమే...." వంటి వేద భాగాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తాయి.

పైగా – ఉపాసన పరంగా ఇంద్రుడు ఈశ్వరుడే. 'ఇంద్రాణి' పరాశక్తి.

**ప్ర: 'విష్ణు సహస్రనామస్తోత్రం'లో 'అనీశ్వరః', 'అనుత్తమః', – అనే నామాలున్నాయి కదా! 'అనీశ్వరః' – అంటే 'ఈశ్వరుడుకాడు', అనుత్తమః' –అంటే 'ఉత్తముడుకాడు' అనే విపరీతార్థాలు వస్తాయేమో!**

**జ:** ఆ పదాలకు విపరీతార్థాలేమీ లేవు. 'అనీశ్వరః' – అంటే ఇతనికంటే ఈశ్వరుడు (ప్రభువు) లేడు, 'ఇతనికి ఎవరూ ప్రభువు లేడు' అనే అర్థాలు.

అలాగే 'అనుత్తమః' – "ఇతనికంటే (మించిన) ఉత్తముడు లేడు అని అర్థం.

**ప్ర: "సాంగోపాంగంగా నేర్చుకోవాలి, ఏ విషయమైనా " – అంటారు కదా. 'సాంగోపాంగంగా......' అనే మాటకు అర్థం ఏమిటి?**

**జ:** స+అంగ+ఉపాంగం– సాంగోపాంగం. అంగములతో, ఉపాంగములతో సహా – అని అర్థం. ఇది వేదాధ్యయనానికి సంబంధించిన విషయం.

వేదానికి 1. 'అంగములు' ఆరు : శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం.



2. ఉపాంగములు– న్యాయం, పురాణాలు, ధర్మశాస్త్రం.

ఇవన్నీ నేర్చుకుంటే వేదవిద్య సమగ్రంగా అర్థమౌతుంది. ఈ అంగ, ఉపాంగాలతో సహా వేదవిద్యని నేర్చుకోవడాన్నే – 'సాంగోపాంగంగా నేర్చుకోవడం' అంటారు.

**ప్ర: తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి – వంటి వాక్యాలు ఎక్కడ ఉన్నాయి?**

**జ:** అవి మహా వాక్యాలలోనివి. ఉపనిషత్తులలో మహావాక్యాలున్నాయి. మొత్తం అవి నాలుగు మహావాక్యాలు.

1. **ప్రజ్ఞానం బ్రహ్మ** (ఆనందానుభూతే బ్రహ్మం) – ఇది ఋగ్వేదంలో ఐతరేయ ఉపనిషత్తులోని వాక్యం.

2. **అహం బ్రహ్మాస్మి** (నేనే బ్రహ్మమును)– ఇది యజుర్వేదంలో తైత్తిరీయ ఉపనిషత్తులోని వాక్యం.

3. **తత్త్వమసి** (అదే నీవు) – ఇది సామవేదంలో ఛాందోగ్యోపనిషత్తులోనిది.

4. **అయమాత్మాబ్రహ్మ** (ఈఆత్మయే బ్రహ్మము) – ఇది అథర్వవేదంలోని మాండూక్య ఉపనిషత్తులోనిది.

అయితే ఇవి అర్థం చేసుకోడానికి సత్కర్మానుష్ఠానం, సక్రమ అధ్యయనం, సద్గురువు

వద్ద బోధన కావాలి. నివృత్తి మార్గంలో వీటిని అనుసంధానం చేస్తారు. చాలా లోతైన తాత్త్వికమర్మం ఉన్న ఈ నాలుగు మహా వాక్యాలూ నాలుగు వేదాలలోని నాలుగు ఉపనిషత్తుల నుండి ఉద్ధరించినవి.

**ప్ర: లక్ష్మీపూజ (వరలక్ష్మీపూజ, ధనలక్ష్మీ పూజ వంటివి) చేశాక ఉద్వాసన ఎలా చెప్పాలి?**

**జ:** వరలక్ష్మీ పూజగానీ, ధనలక్ష్మీపూజ గానీ ఏ లక్ష్మీపూజ చేసినా 'ఉద్వాసన' చెప్ప కూడదు. ఆవాహన మాత్రమే చెప్పాలి. సరస్వతీ దేవిని పుస్తకాదుల్లో ఆవహింప జేసినప్పుడు కూడా ఉద్వాసన చెప్పరాదు.

నవ రాత్రుల్లో దేవీపూజాదుల్లో కలశస్థాపన చేసే సంప్రదాయం, పద్ధతులు వేరు. నిత్యపూజలలో ఉద్వాసన ఉండదు. అలాగే వరలక్ష్మీపూజవంటివి చేసేటప్పుడు కలశంలో లక్ష్మీదేవిని ఆవహింపజేస్తారు. మరుసటి రోజు నమస్కరించి కలశాన్ని తీయాలి. అంతేగానీ, ఉద్వాసన మంత్రాలు చెప్పరాదని ఆచారం.

**ప్ర: గాయత్రీ మంత్రం పుస్తకంలో చూసి ప్రతి రోజూ మనసులో జపిస్తున్నాం. ఇలా చేయవచ్చా?**

**జ:** ఏ మంత్రమైనా పుస్తకంలో చూసి, జపించడం పనికిరాదు – మనసులో కూడా. 'జపం' ప్రధానంగా మానసికమే కదా! సరియైన విధానంగా యోగ్యులైన గురువుల నుండి ఉపదేశం పొందిన మంత్రాన్నే జపించాలి. ఆ మంత్రానికి చెప్పబడ్డ ఋషి, బీజం, కీలకం, అంగన్యాస, కరన్యాసాదుల తెలియాలి. అలా లేనప్పుడు విపరీత ఫలాలిస్తాయి. రోగాలకి మందులు వైద్య గ్రంథాలలో చూసి వాడకూడదు కదా! అయితే స్తోత్రాల, నామాల విషయంలో ఫరవాలేదు. పుస్తకంలో చూసి, సర్వకాల సర్వావస్థలలోనూ చదువుకోవచ్చు. మంత్రాలను మరో పద్ధతిలో స్తోత్రాదుల ద్వారా అందించారు మహర్షులు. ఏకాగ్రంగా భగవన్నామమో, స్తోత్రమో జపించినా మంచి ఫలితాన్నిస్తాయి.

**ప్ర: 'భగవద్గీత'ను అనుకరిస్తూ శివగీత, గణేశ గీత, దేవీగీత, రామగీత – ఇలా చాలా గీతలు సృష్టించారని ఒక చోట చదివాను. కొంచెం స్పష్టపరుస్తారా?**

**జ:** అసలు 'గీతా' సంప్రదాయం తెలియక పోవడం వల్ల అలాంటి రాతలు రాస్తారు. కేవలం 'భగవద్గీత'నే చూసినవాళ్ళు, సంప్రదాయం తెలియని వాళ్ళు అనే మాటలివి. పురాణ సంప్రదాయాన్ని అనుసరించి రచించిన గ్రంథాలలో 'గీత' ఉంటుంది.

'గీత' అంటే మరేమీకాదు – సాక్షాత్తు భగవంతుడే గురువుగా ఉపదేశించే పరమ సత్యాలను 'భగవంతుని గీతలు' అంటారు.

ఆ భగవంతుడు సాక్షాత్తు పరబ్రహ్మమే. ఆయన ఏ రూపం ధరిస్తే, ఆ రూపంలో తన అత్యంతిక భక్తులకు (అనన్యంగా శరణువేడిన వారికి) సత్యవచనాలు చెప్పాడు. ఆ పరతత్త్వమూ, ఆ సత్యమూ ఎన్నడూ మారవు. అవి శాశ్వతాలు. అవి వేదోపనిషత్తులలో ఉన్నవే. ఆ సత్యమార్గాన్నే పరమేశ్వరుడు చెప్పేది. అందుకే కృష్ణ 'భగవద్గీత' లోనే ఇది 'పరంపరాప్రాప్తం' అనీ, మొదటిగా సూర్యునికి చెప్పాననీ వివరించాడు కదా!

భారతం, భాగవతం కూడా 'పురాణ సంప్రదాయం' ప్రకారం రచించినవే. అష్టాదశ పురాణాల వలెనే, అవి కూడా సూతపౌరాణికుడు ప్రవచించినవి. వివిధ దేవతా రూపాలలో భగవంతుని వివిధ విధాలుగా ఉపాసిస్తుంటారు. ఆయా ఉపాస కులకు ఆయా దేవతలే గురువులు అవుతారు. కాబట్టి సత్యతత్త్వం ఆ దేవతలే ఉపదేశిస్తారు. కృష్ణ, శివ, గణేశ, దేవీ, దత్తాత్రేయుడు – ఇవి అన్నీ ఒకే పరతత్త్వపు రూపాలు. కాబట్టి వీరందరూ చెప్పిన మాటలు 'గీతలు' గా చెప్పబడ్డాయి. పురాణరచనలో ఇది సంప్రదాయం.

అన్ని గీతలలోనూ ఉపనిషద్విషయాలు (వేద ధర్మ సారాలే) చెప్పబడ్డాయి.

గీతలన్నింటిలో ప్రధానంగా కనబడే అంశాలు:

1. కర్మ,జ్ఞాన,భక్తి యోగాదులు
2. విభూతుల వివరణ
3. విశ్వరూప సందర్శనం
4. అజ్ఞాన విమోచనం

కొన్ని గీతలలో 'పిండోత్పత్తి ప్రకరణం' కూడా చెప్పబడింది.

అయితే శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునకు చెప్పిన గీత – నిన్నటి ద్వాపరాంతానిది. ఆయన జగద్గురువుగా చెప్పిన విషయాలను వ్యాఖ్యానించిన వారు శ్రీ ఆదిశంకరులు. ఇంకా అనేకమంది వారి వారి పద్ధతుల్లో వ్యాఖ్యానించారు. అలా చాలా ప్రసిద్ధమయ్యిందా 'గీత'! కృష్ణుని గీతలే 'ఉద్ధవునికి చెప్పినవి' భాగవతంలో (ఉద్ధవ గీత) ఉన్నవి.

కృష్ణగీతతో పాటు అన్నిగీతలూ ఆర్ష సంప్రదాయంలోనివే. ఏవీ అనుకరణలు కావు.

అన్నింటినీ కూర్చినది వ్యాసులవారే. ఇవి ఉపాసనలకు సంబంధించిన పురాణ సంప్రదాయాలు.

ప్ర: **వినాయక చవితి సందర్భంగా, ఎప్పటిలాగే పెద్ద పెద్ద విగ్రహాలు పెట్టడమేకాక, 'కంప్యూటర్ వినాయకుడనీ', 'క్రికెటర్ వినాయకుడ'నీ కొత్తరకం గణపతుల్ని చేసి పెట్టారు. ఇలా చేయడం మంచిదేనా? శాస్త్ర సమ్మతమేనా?**

జ: భగవంతుని మన భావాలకనుగుణంగా మలచుకోవడం, వ్యక్తిగతంగా ఎవరి అభీష్టం వారిదేనని ఊరుకోవచ్చు. కానీ ఆడంబరాలకు పోయి, కొత్తదనం పేరిట భగవంతుని రూపాల్నే మార్చేయడం శాస్త్ర విరుద్ధమే కాదు. అరిష్టం కూడా. అది వైపరీత్యాలకు దారి తీస్తుంది.

'దేవతాప్రతిమ' అనేది ఆగమ శాస్త్రాలకు అనుగుణంగా ఉండాలి. ఆకృతిలోనూ, దాని పరిమాణంలోనూ నిర్దిష్టమైన కొలతలు పాటించాలి. విగ్రహపరిమాణం పెరుగుతున్నకొద్దీ శాంత్యాదికాలు ఎక్కువగా జరగాలి. అవేవీ చూడకుండా కేవలం సరదాల కోసం, డాంబికాలకోసం అతిపెద్ద పరిమాణాల్లో దేవుళ్లను తయారు చేయడం, అందులోనూ మన వికారాలు ఆ విగ్రహాలకు అంటగట్టడం ద్రోహమే.

**యచ్ఛాస్త్ర విధి ముత్సృజ్య**
**వర్తతే కామకారతః ।**
**న చ సిద్ధిమవాప్నోతి**
**నసుఖం నపరాంగతిమ్ ॥** *(భగవద్గీత)*

"శాస్త్ర విధిని విడిచిపెట్టి, ఇష్టానుసారం ప్రవర్తించేవానికి సిద్ధి లభించదు సరి కదా, సుఖమూ పరాగతీ కూడా లభించవు!!

ప్ర: **కెన్యాలో మాకు తెలిసిన ఒకావిడ ఇంట్లో విష్ణుసహస్రం కేసెట్ పెట్టేసి, అది ఆగ కుండా తిరిగేలా ఏర్పాటుచేసి, తాను పేకాటకి వెళ్ళిపోతోంది. ఏమైనా అంటే, పేకాట ఆడిన పాపం కూడా కేసెట్ పెట్టడంవల్ల పోతోందని వాదిస్తోంది. దేవుడి స్తోత్రాలు చేస్తూ, ఎన్ని పాపాలు చేసినా ఫరవాలేదా?**

జ: కేసెట్లు పెట్టేసినంత మాత్రాన పాపాలు పోతాయని ఎక్కడాలేదు. అంతేకాదు. భగవత్పూజలు చేస్తూ పాపాన్ని చేస్తే ఆ పాపం పరిహారమైపోదు. భగవత్పూజ చిత్తశుద్ధినిస్తుంది. గత జన్మల ఫలితంగా ఏవైనా దుఃఖాలనుభవిస్తుంటే వాటిని తొలగించడానికో, తగ్గించడానికో సహకరిస్తుంది. అంతేగానీ అవి చేస్తూ 'పాపము

లను క్షమించుము' అని ప్రార్థించినంత మాత్రాన అనుగ్రహించడు దేవుడు.

'శ్రద్ధయా', 'భక్త్యా' – అని శ్రద్ధతో, భక్తితో పఠనం, శ్రవణం చేయాలి. మన పేరు మీద అర్చనలు చేయించేస్తూ మనం పాపాలు చేసేస్తే వాటిని ఇవి తీసి వేయవు. పైగా అధర్మంగా చేస్తున్నందుకు విపరీత ఫలం లభిస్తుంది. తెలిసో తెలియకో చేసిన తప్పుల్ని క్షమించమని పశ్చాత్తాపంతో భగవంతుని ప్రార్థించడం వేరు. ఇలా మోసం చేయడం వేరు. ఆయన ఈ మోసాలకు లొంగడు, ఆయన ధర్మపక్షపాతి. 'నిత్యం భక్తి సమన్వితః'– అని భక్తితో కూడినవాడై పారాయణ చేసేవానికే ఫలసిద్ధి. పైగా – **'నక్రోధో నచమాత్సర్యం నలోభో నాశుభామతిః'** – విష్ణు భక్తులకు క్రమంగా క్రోధ, మాత్సర్య, లోభ, అశుభాలు తొలగుతాయని అందులోనే చెప్పారు. వాటిని పోగొట్టుకొనే ప్రయత్నంలో మనల్ని సులభంగా సిద్ధి పొందేలా చేసేవి ఈ స్తోత్రాలే. భగవంతుడు ధర్మపక్షపాతి.

ధర్మం ఆచరణ వల్ల కలుగుతుంది. ఆ ధర్మానికి ప్రభువు అచ్యుతుడు. (ఆచార ప్రభవో ధర్మః, ధర్మస్య ప్రభురచ్యుతః అని విష్ణు సహస్రనామాల తరువాత చెప్పబడి ఉంది.) అధర్మాన్ని భగవంతుడు ఏనాడూ క్షమించడు, మన ధర్మానికి సంతోషించి, మనల్ని అనుగ్రహించేవాడే భగవంతుడు.



ప్ర: **ప్రస్తుతం చాలామంది భక్తులు శ్రీరామకోటి వ్రాస్తూ దానిని భద్రపరచడానికి స్థూపం చేసి, అందు పదిలపరస్తున్నారు. నేడు శివదీక్ష తీసుకొను భక్తులు కూడా 'శివకోటి' వ్రాయాలని సంకల్పించి వ్రాస్తున్నారు. శ్రీరామకోటి వ్రాయువారు 'శ్రీరామ' అని వ్రాస్తున్నారు. శివకోటి వ్రాసేవారు కొందమంది 'శివ' అనీ, 'శివశివా' అనీ 'ఓం శివా' అని వ్రాస్తున్నారు. కొందరు 'ఓం నమశ్శివాయ' అనే పూర్తి పంచాక్షరీ వ్రాస్తే మంచిదంటున్నారు. మా మిత్రులందరికీ తగిన సలహానివ్వవలసిందిగా కోరుచున్నాము.**

**జ:** 'శివకోటి' వ్రాసేవారు "శివ" అని వ్రాస్తే చాలు. లేదా 'శ్రీశివాయ నమః' అని వ్రాయవచ్చు. ప్రణవసహిత పంచాక్షరీమంత్రం గురూపదేశంతో జపించాలి. వ్రాయరాదు. రామమంత్రం కూడా వ్రాయరాదు. ఏ మంత్రానికీ వ్రాయడం చెప్పలేదు. నామం మాత్రమే, ఒకదీక్షగా వ్రాయాలి. అందుకే రామమంత్రాన్ని కాకుండా, 'రామ' నామాన్ని మాత్రమే 'రామకోటి'లో వ్రాస్తున్నారు. అలాగే 'శివ' అనే నామాన్ని మాత్రమే వ్రాయాలి. 'శివ శివా' అని వ్రాసినా ఫరవాలేదు.

**ప్ర: శ్రీకృష్ణ తులాభారం – కథ భాగవతంలో ఉన్నదా? గరుదుని కాపాడేందుకు అర్జునుడు కృష్ణునితో యుద్ధంచేయడం భారతంలో ఏ పర్వంలో ఉంది?**

**జ:** శ్రీకృష్ణతులాభారం – భాగవత భారతాల్లోనేకాదు, మరి ఏ పురాణంలోనూ కూడా లేదు. ఇది 'భక్తిమహిమ'ని చాటేందుకు ఓ భక్త కవి కల్పించిన నాటకం. అలాగే, కృష్ణార్జున యుద్ధం కూడా కల్పనయే. అవి జరగలేదు. వాటిని మంచి కల్పనలుగా, నాటక శిల్పంగా చూసి ఆనందించవచ్చు. కానీ ప్రమాణాలుగా భావించరాదు. పారిజాతం విషయమై సత్యభామ అలగడం, ఆ తరువాత కృష్ణుని నారదునికి దానం చేయడం, తిరిగి తులాభార సమయంలో ఎంత సొత్తుకీ స్వామి తూగక పోవడం, రుక్మిణి చేతి తులసీ దళానికి తూగడం... చాలా చక్కని ఊహ. దానిని అభినందించ వలసిందే. అంతేగానీ ఏ పురాణంలోనూ ఈ కథలేదు.

**ప్ర: ఈ మధ్య నేను కేరళ వెళ్లినప్పుదు కొన్ని శివాలయాలకు వెళ్లాను. అక్కడ శివాలయం చుట్టూ ప్రదక్షిణం చేస్తుండగా, అభిషేకజలం బయటకు వచ్చే కాలువను దాట కూడదనీ, వెనుతిరిగి మళ్ళీ మరోవైపు నుండి వచ్చి, ఆ కాలువవద్ద ఆగి శిఖరాన్ని చూసి నమస్కరిం చాలని – అక్కడి వాళ్ళు చెప్పారు. ఇది ఆ దేశాచారమేనా? శాస్త్ర ప్రమాణం ఉందా? ఆ కాలువ ద్వారా వచ్చే అభిషేకజలం తీసుకోవచ్చా?**

**జ:** దానికి శాస్త్ర ప్రమాణం ఉంది. శివాలయాలలో ప్రదక్షిణం చేసే పద్ధతి అదే. దీనినే 'చండీప్రదక్షిణం' అంటారు.అభిషేక జలం ప్రవహించే కాలువలోకి వచ్చే 'తూము' వద్ద కూడా అభిషేక జలాన్ని తాకరాదు. త్రాగరాదు. లోన శివలింగం నుండి పడే అభిషేక జలాన్నే అర్చకులు సంగ్రహించి, అందరికీ తీర్థంగా ఇస్తారు. దానినే స్వీకరించాలి. గుడిబయట నుండి వచ్చే జలాన్ని స్వీకరించకూడదు. అది 'చంద్రేశ్వరుడ'నే ఒక భక్తుని భాగం. శివుడతనికి ఇచ్చిన వరం,

**ప్ర: అభిమన్యుని భార్య శశిరేఖా? ఉత్తరా? ఏది నిజం?**

**జ:** అభిమన్యుని భార్య 'ఉత్తర' అనేదే నిజం. శశిరేఖ అనే పాత్ర భారతంలో లేదు. 'శశిరేఖా పరిణయం' అనే ఊహాకల్పిత గాథ ఉంది. అందులో భావుకత, కళాదృష్టి సంతోషమే. విరాట రాజపుత్రిక ఉత్తర అభిమాన్యుని భార్య.

**ప్ర: 'భర్తృహరి సుభాషితాల'లో –"యతి సంగంబున" చెడిపోతాడని ఉంది. దానికి అర్థం సన్యాసికి ఏ సంగమూ పనికిరాదనా? లేక, కేవలం 'స్త్రీ సంగమ'నే అర్థమా? దీని వివరం ఏమిటి?**

**జ:** ఏ సంగమూ పనికి రాదనే అర్థం. అన్ని సంగములూ విడిచిపెట్టిన 'నిస్సంగు'నీ, 'సర్వసంగపరిత్యాగి'నీ 'యతి' అంటారు. కేవలం పరమాత్మానుసంధానంతో ఉంటూ, లోకంతో ఏ అనుబంధమూ, ఆపేక్షా లేనివాడే సన్యాసి. బోలెడంత సర్కిల్– సంగం– ఉంటే అతడు 'యతి'కాదు. అదే 'భర్తృహరి'భావం.

**ప్ర: మనం రోజును ఎలా లెక్కిస్తాం? అర్ధరాత్రి 12 తరువాత తేదీ మారినట్లు, అప్పుడే మనకి రోజు మారుతుందా?**

**జ:** సూర్యోదయం నుండి సూర్యోదయం వరకు ఒకరోజు క్రింద లెక్క. అర్ధరాత్రి లెక్కకి లేదు. సూర్యోదయమే ప్రధానం.'ఉదయాదుదయం వారం' అని శాస్త్రం.

**ప్ర: గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః – అనే శ్లోకంలో బ్రహ్మ – పరబ్రహ్మ ఒకటి కాదా! దీనిని గురించి కాస్త వివరించగలరు.**

**జ:** 'బ్రహ్మ' అనే మొదటి పదం (గురుః బ్రహ్మ) సృష్టికర్తను సూచిస్తుంది. 'పరబ్రహ్మ' అనేది నిరాకార నిర్గుణ పరతత్త్వాన్ని తెలియజేస్తుంది. బ్రహ్మ, విష్ణు, మహే శ్వరులు– ముగ్గురు సృష్టి స్థితి లయకారకులు. ఈ ముగ్గురూ ఒకే పరబ్రహ్మ (పరతత్త్వం) యొక్క సగుణతత్త్వాలు. ఆ పరబ్రహ్మను కూడా గురురూపంలో భావించమనే ఈ శ్లోకంలో భావం.

**ప్ర: గౌతమ ధర్మ సూత్రములు తెలుగు అనువాదం పుస్తకంలో సూత్రం 1-2-19 'వర్జయేత్ మధుమాంసగంధమాల్య దివాస్వప్న స్నాన దంతధావన హర్షనృత్యగీత పరివాదమవ భయాని'–సదరు పుస్తకంలో ఆ సూత్రమును చూచి స్నానదంత ధావ నలు వర్జించి అనారోగ్యం పాలు కావటానికి ఆ సూత్రకారులు ఎట్లు ప్రతిపాదించారో సమర్థించగోర్తాను?**

**జ:** భోగాలను విసర్జించవలసిందిగా యతులకు (లేదా బ్రహ్మచారులకు) చెప్పే సూత్ర మిది. 'శౌచం' మాత్రం అందరికీ ముఖ్యధర్మం. అది గౌతమ ధర్మ సూత్రాలలోనూ మరోచోట ప్రస్తావితమే. దానిని బట్టి దీనిని ఆలోచించాలి. భోగం కోసం ఉద్దేశితమైన పరిమళ భరితస్నాన – దంతధావనాదులు మాత్రమే, విసర్జించమన్నారు. అంతేకానీ ఆరోగ్యానికి అవసరమై, శౌచంలో భాగమైన నిత్య స్నాన దంతధావనలు వదలరాదు. ఈ వాక్యంలో ప్రతిపాదితమైన ఇతర అంశా లన్నీ భోగాలనీ, శరీర వ్యామోహాన్నీ సూచించేవే. ఆ మేరలోనున్న స్నానాదుల్ని మాత్రమే వర్జించాలి అని భావం.

**ప్ర: షోడశోపచారాలతో భగవదర్చన చేస్తున్నప్పుడు, సాధారణంగా మనం... "..ప్రీత్యర్థం – ఛత్రం ఆచ్ఛాదయామి, చామరంవీజయామి, గజాన్ ఆరోహయామి..." వగైరాలు చెబుతుంటాం కదా! ఏ పెద్ద పెద్ద దేవాలయాలలోనో పీఠాలలోనో అన్ని ఉపచారాలు జరుగుతాయి. కానీ మనం నిత్యం ఇంట్లో అర్చన చేస్తే, కేవలం ఇవి వాచికంగానే మిగులుతాయి కానీ అసలు జరగవుకదా! అలాంటప్పుడు భగవంతునికి మనం ఏమీ చేయకుండా చేస్తున్నట్లు అభినయిస్తాం. మరి మనకు అసత్యదోషం ఉండదా?**

**జ:** మనం పూజకు ముందే 'యావచ్ఛక్తి' అంటాం. అంటే 'శక్తికొలది' అని అర్థం. బాహ్యపూజ చేయడం అవసరమే. కానీ అందులోనూ భావన ప్రధానం. రోజూ రత్నాభరణాలు, వస్త్రయుగ్మాలు సమర్పించలేని వాళ్ళు ఆ ఉపచారాలకు బదులుగా అక్షతలనో, కుసుమాలనో సమర్పిస్తున్నారు కదా! అంటే–భావనాపరంగా భగవంతునికి అందజేయడమే. అదే విధంగా ఛత్రం, చామర, అశ్వారోహణాది ఉపచారాలు కూడా భావనాపరంగా–అంటే భావిస్తూ– ఆచరించాలి. భగవంతుడు భావదర్శి– భావవేద్యుడు. ఆ కారణం చేత వాచికంగా చెప్పినా, ఆ వాచికానికి భావన ఉంటుంది గనుక, అది అసత్య దోషం కాదు. మనం ఇవ్వకుండా ఇచ్చేశాం అనుకున్నట్లే భగవంతుడూ, మన వరాల్ని 'తీర్చేసినట్టు' అనుకోమనడు. ఎందుకంటే – మనమిచ్చేవి భగవంతునికి అవసరం కావు. మన ప్రేమనూ, భక్తినీ వ్యక్తీకరించడానికి సాధనాలు మాత్రమే. కానీ భగవంతుడు మనకు ఇవ్వాల్సినవి– మనకు అవసరమైనవి, మనమడిగినవి. ఈ కారణం చేత భావాన్ని మిళితం చేసిన బాహ్యపూజకు ఫలితం లభిస్తుంది.

**ప్ర: ప్రదక్షిణలో – పాపోహం పాప కర్మాహం పాపాత్మా పాపసంభవః। త్రాహిమాం కృపయాదేవ! శరణాగత వత్సల!... అంటారు. పాపాత్మా పాపసంభవః– అనే విశేషణాలు ఎవర్ని ఉద్దేశించినవి? భగవంతునికా, భక్తునికా?**

ఆ శ్లోకంలో పాపాత్మా, పాపసంభవః–అనే విశేషణాలు భక్తుని ఉద్దేశించినవి. 'అహం' – అంటే 'నేను' – పాపిని, పాపాత్ముడ్ని, పాపంవల్ల కలిగిన వాడ్ని, నన్ను క్షమించి రక్షించమని–భావం.

**ప్ర: పూజంతా చేసి "పాపోహం–పాపకర్మాహం" అని దేవుని ముందు ప్రదక్షిణం చేయడం తప్పుకదా! పూజించాక ఇంకా ఎక్కడ పాపముంటుంది? కాబట్టి "పుణ్యోహం–పుణ్య కర్మాహం" అనుకోవడం మంచిదికదా!**

**జ:** ప్రదక్షిణల వల్ల పాపాలు పోతాయనేది నిజమే. అయితే మనం మనసారా మన

తప్పుల్ని ఒప్పుకోవాల్సిందే. మన పాపాలను దాపరికం లేకుండా దేవుని ముందు ఒప్పుకోవడానికే పెద్దలు ఆ శ్లోకం ఉంచారు. సంప్రదాయంగా వస్తున్న సదాచారాలలో చాలా గంభీరార్థం ఉంటుంది. ఆవేశపడి వెంటనే మార్చేయకూడదు.

పైగా–జీవుడికి కర్మసంచితాలు ఎన్నో అతడే నిర్ణయించలేడు. ఒక్క పూజతోనే పోయేవికావుగా. కొన్ని కొన్ని క్రమ క్రమంగా నశిస్తుంటాయి. ఇంకా చేయ బోయేవీ ఉంటాయి కదా! “పుణ్యోహం” అని చెప్పాక, ఇంక “త్రాహిమాం” ఎందుకు? తప్పులు ఒప్పుకొనే నిజాయతీలో శరణు వేడడం ఆ శ్లోకంలో భావం.

**ప్ర: దేవీ ఖడ్గమాల, త్రిశతి వంటివి నిత్యం పారాయణ చేయవచ్చా?**

**జ:** శ్రీవిద్యకి సంబంధించిన మంత్రాలు సరియైన శ్రీవిద్యోపాసకుని వద్ద నుండి ఉపదేశం పొందినవారు మాత్రమే, ఆ స్తోత్రాలు చదవాలి, పారాయణ చేయాలి. అందులో నున్న దేవతామూర్తులన్నీ శ్రీవిద్యకి, శ్రీచక్రానికీ సంబంధించినవి. కనుక ఆ విద్యా మంత్రాలకు ఈ స్తోత్రములు అంగములు. కనుక – శ్రీవిద్యోపాసన ఉన్నవారు మాత్రమే వాటిని పఠించాలి – పారాయణం చేయాలి. అలా ఉపదేశం లేనప్పుడు, లక్ష్మీఅష్టోత్తర శతనామము, అన్నపూర్ణాష్టకం, భ్రమరాంబిక స్తుతి, కనకధారాస్తోత్రం వంటి మహిమాన్వితాలు నిత్యం పారాయణ చేసుకో వచ్చు.



**ప్ర: ఆర్యులు వైదిక మతాన్ని తెచ్చారని, వారు ద్రావిడులపై దండెత్తారనీ, రాముడు ఆర్యుడనీ, రావణుడు ద్రావిడుడనీ చదివాను. వేదమతస్థుడైన రాముడు, రావణునిపై దండెత్తడం ఆర్యుల ఆధిక్యాన్నీ, ఆక్రమణనీ తెలియజేయడానికేనని విమర్శించారు. ఇదెంత వరకు సమంజసం.**

**జ:** మన భారతదేశ చరిత్రకు పాశ్చాత్యులు చేసిన ద్రోహాలలో ఒకటి –ఆర్య, ద్రావిడ విభజన. ఆర్యులనే ఏదో తెగ ఎక్కడినుండో ఇక్కడికి రాలేదు. వేదమతం ఆర్యులది కాదు. ద్రావిడులదీ కాదు. అది ఈ గడ్డపైన బ్రతికినవారి జీవన విధానం. ఆ మాట కొస్తే ‘ద్రవిడుడు’ అని చెప్పబడే రావణుడు మహా వేదపండితుడు. వైదిక దేవతలను స్వాధీనం చేసుకున్నవాడు. బ్రహ్మదేవుని వంశజుడు, వేదాలలో ఘన పాఠానికి మార్గం వేసినవాడు. దీనిని ఏమంటాం? మన చరిత్రను వక్రీకరించిన పాశ్చాత్యుల గ్రంథాలనే, తరువాత మన ప్రభుత్వాలు మనచేత చదివిస్తున్నాయి. అసలు చరిత్రని ఎందరో మహానుభావులు శాస్త్రీయంగా చూపిస్తూ, ఎన్నో గ్రంథాలను రచిస్తున్నా, అవి మన పాఠ్యగ్రంథాలుగా నోచుకోలేదు. మనం ఇప్పటికీ భావనాపరంగా అస్వతంత్ర భారతీయులమే. పాశ్చాత్య భావదాసులమే.

**ప్ర: మరణించినవారు పది రోజులు, లేదా ఏడాదిలోపు వేరే శరీరధారణ చేస్తారని చాలా చోట్ల చదివాను. అటువంటప్పుడు వారి పేరన ప్రతి ఏడు జరిగే శ్రాద్ధకర్మల అంతరార్థం ఏమిటి? అవి అవసరమంటారా?**

**జ:** మీరు చదివిన విషయం పొరపాటే. మరణించినవారు అంత త్వరగా జన్మను పొందరు. వారి కర్మఫలంగా కొంత కాలం పరలోక వాసం, ఆ తరువాత జన్మ. కొందరి విషయంలో వెంట వెంటనే జన్మలూ ఉంటాయి. అవి వారి కర్మలఫలం మీద ఆధారపడి ఉంటుంది. కొందరు విముక్తి లేక పరలోకాల్లోనే మ్రగ్గిపోయే వాళ్ళూ ఉంటారు. సాధారణంగా-ఒక జీవి తిరిగి జన్మించడానికి కొన్నివందల ఏళ్ళు పడుతుంది. ఆ లెక్క మీద-చనిపోయిన వారి సంతానం-తన-'పితృ-పితామహా - ప్రపితామహ" (తండ్రి-తాత-ముత్తాత) వరకు మాత్రమే శ్రాద్ధకర్మ చేస్తారు. అంతకు పైకి వెళ్లరు. అలాగని... అంతకన్నా పై తరాలలో విముక్తి పొందని వాళ్ళూ ఉండరని లేదు. జన్మే దొరకక, ముక్తీ లభించక నరకాదుల్లో ఉన్నవాళ్లకి శాంతికోసం నిత్యకర్మలలో తర్పణలు కొన్ని చెప్పారు శాస్త్రకారులు.

అయితే- తిరిగి జన్మించినట్లయితే, మనం పెట్టే శ్రాద్ధకర్మలు అనవసరంకదా- అనేది మీ ప్రశ్న. కానీ - మనం పెట్టే శ్రాద్ధకర్మలకు సంతోషించే పితృదేవతలు వేరు. వారు వసు, రుద్ర, ఆదిత్య శక్తులతో నున్న దేవతలు. కర్మకు సాక్ష్యంగా ఉన్న శ్రాద్ధ దేవతలూ, పితృదేవతలూ - కర్మచేసేవారి శ్రద్ధకు సంతోషిస్తారు. వారు ఏ జీవుల్ని ఉద్దేశించి కర్మ చేస్తున్నారో, ఆ జీవులు ఆ వేళ ఏ జన్మలో ఉంటే ఆ జన్మ లోనే ఏదో ఒక రూపంలో వారి ఆ జన్మ ఉపాధికి తగిన ఆహారం అందేలా చేస్తారు. అలా దైవికంగా ఆ జీవికి తాను మరో జన్మలో జీవిస్తున్నా ఆహార మందుతుంది. అది 'ఇందువల్ల' అని వారికి తెలియకపోవచ్చు. ఎందుకంటే - అది స్థూలంగా గ్రహించలేని సూక్ష్మ ప్రపంచం విషయం గనుక.

**ప్ర: ఇంట్లో బిల్వ వృక్షం (మారేడు) ఏ రోజుల్లో కోయాలి? ఎన్నాళ్లు వాడవచ్చు?**

**జ:** ఇంట్లో బిల్వవృక్షం పెంచుకోవచ్చు. తగిన స్థలం ఉండి చక్కగా వృద్ధిపొందే అవకాశం ఉన్నప్పుడు బిల్వాన్ని వేయవచ్చు. తూర్పు, ఉత్తర దిశలలో బిల్వ వృక్షాన్ని వేయవచ్చు. బిల్వంతో శివార్చన చేయడం మహా పుణ్యఫలప్రదం.

బుధ, శని వారాల్లో మారేడు దళాలు కోయాలి. అప్పుడుకోసి భద్రపరచుకొని రోజూ వాడవచ్చు. నిన్న పూజించిన బిల్వాన్ని కడిగి ఇవాళ మళ్ళీ పూజించవచ్చు.

అలా ముప్పది రోజుల వరకు పూజించవచ్చు. చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, చతుర్థి, అష్టమి తిథుల్లో బిల్వాలను కోయకూడదు. వాటినీ ముందేకోసి దాచి వాడుకోవాలి.

ప్ర: **తిలలు, దర్భలు అపరకర్మలో వాడతారుకదా? వాటిని కొన్ని పుణ్యకర్మలలో కూడా వాడగా చూస్తుంటాం. అది సమంజసమేనా?**

జ: తిలలు, దర్భలు పవిత్రమైన పదార్థాలు. వాటిని అపరకర్మలకు కూడా వాడతారు. అంత మాత్రాన అవి అపవిత్రం కావు. దర్భలు లేనిదే ఏ వైదిక కర్మా పుష్టి పొందదు. అలాగే తిలలు చాలా దేవపూజలలో కూడా వాడతారు. అవి నిత్య పవిత్రవస్తువులు. అయితే– అపర, పితృకర్మలలో వాడిన దర్భలు మరి ఉపయోగించరాదు. దైవ కార్యలలో వాడినవి మళ్ళీ వాడవచ్చు.

ప్ర: **ప్రముఖులందరికీ 'వర్ధంతి' సంస్మరణలు చేస్తారు. కానీ త్యాగరాజస్వామికి మాత్రం పరమపదించిన రోజున 'ఆరాధన' అంటారు. అలా ఎందుకు చేస్తారు?**

జ: త్యాగరాజస్వామి ఇతర ప్రముఖులవంటి వారు కాదు. ఆయన సన్న్యాసిగా పరమపదించారు. సన్న్యాసి పరమపదించడాన్ని 'కైవల్యం పొందడం' గానే గ్రహించాలి. వారి వర్ధంతిని 'ఆరాధన' గా చేయడం సన్న్యాసాశ్రమ సంప్రదాయం. త్యాగరాజు తన జీవితాంతానికి ఐదురోజులు ముందు సన్న్యాశ్రమ స్వీకారం చేసి, యతి ధర్మాలు పాటిస్తూ, యతిగానే కైవల్యం పొందారు. అందుకే యతి సంప్రదాయాను సారం సమాధి చేసి, ఏటా ఆరాధన చేయాలి. ఆ సంప్రదాయం ప్రకారమే ఆ నాదయోగికి ఆరాధన.



ప్ర: **వేదమంత్రాలు అనువదించి చదివితే సత్ఫలం వస్తుందా?**

జ: నిజానికి – వేదమంత్రాన్ని అనువదించినంత మాత్రాన దాని అర్థం చెప్పలేం. ఫలాన్నీ ఇవ్వలేం. ఇంతవరకు మన సంప్రదాయంలో వేదభాగాలకి భాష్యాలే ఉన్నాయి. కానీ అనువాదాలు కావు. వేదం లౌకిక సాహిత్యం కాదు.–అర్థం చెప్పి, భావం గ్రహించడానికి. సంస్కృతంలో పాండిత్యం ఉన్నంత మాత్రాన వేదానికి అర్థం చెప్పలేం. వేదార్థం గ్రహించేందుకు – శిక్ష, వ్యాకరణ, ఛందో, నిరుక్త, జ్యోతిష, కల్పాలనే షడంగాలలో ఆరితేరినవారు వ్రాసిన భాష్యమే పని కొస్తుంది. వేదం తన పదం యొక్క అర్థం కన్నా, తన శబ్ద, స్వర శక్తుల ద్వారా కలిగించే ప్రయోజనం అపరిమితం. భావం తెలిసినంత మాత్రాన మరి భాష అవసరంలేని శబ్దజాలమే –

లౌకిక వాఙ్మయం. వేదవాఙ్మయం అలాకాదు - భావం, భాష-కూడా అనంత గాంభీర్యంతో ఉన్నవి. రెండూ అక్కడ అవసరమే.

భావంతో పాటూ శబ్దానికి కూడా సమప్రాధాన్యమున్నది వేదం. అంతేగానీ ఆ శబ్దం నుండి ఆ భావాన్ని వేరు చేసి మరో భాషలో చెప్పలేం. చేస్తే ఏ ప్రయోజనమూ ఏ సత్ఫలమూ లభించదు. వేద భాగాలైన ఉపనిషత్తులకి ఆది శంకరాదులు కూడా సంస్కృతంలో 'భాష్యం' రచించారుగానీ, 'అనువాదం' చేయలేదు. ఆ భాష్యాన్ని మనం అనువదించుకొని అర్థం చేసుకోవచ్చు. తద్వారా మూల మంత్ర హృదయంపై ఒక అవగాహన ఏర్పడుతుంది. కనుక వేదాల అనువాదాలు లాభంలేదు. వేద భాష్యాలని అనువదించచ్చు.

వేదమంత్రాలలో ఒక్కొక్క మంత్రం యొక్క పూర్వాపరాలు, వాటి సాంకేతికార్థాలు, విభిన్న స్థలాలలో వాటి ప్రయోగభేదాలు, పరమార్థాలు... ఇన్ని తెలియాలి. అప్పుడే ఆ మంత్ర శక్తి అవగతమవుతుంది.

**ప్ర: వాల్మీకి రామాయణంలో రాముడు కేవలం మానవుడు మాత్రమేననీ, తరువాతివారు దేవుడిగా చిత్రించారనీ విమర్శలున్నాయి? అయోధ్యకాండ నుండే 'రామాయణం' మొదలనీ, అక్కడ విష్ణు ప్రసక్తి లేదనీ అంటారు. నిజమేనా?**

**జ:** మన వాఙ్మయం జీర్ణించుకోలేని పాశ్చాత్య భావ దూషితులు రచించిన వాఖ్యానాల వల్ల వచ్చిన దుఃస్థితి ఇది. విష్ణువే రామునిగా అవతరించాడని 'బాలకాండ'లో స్పష్టంగా ఉంది. అది ఒప్పుకోడానికి మనస్కరించని నాస్తికులు, ఆ కాండే లేదని కొట్టేశారు. అలాగయితే సీతాకల్యాణాదుల మాటేమిటి? రావణునికి నర వానరుల చేతుల్లోనే మరణం. ఆ కారణం చేత 'కేవల మానవుని' గా రాముడు అవతారకృత్యం నిర్వహించాడు. అయోధ్యాది కాండల్లో అనేక చోట్ల స్పష్టంగా రాముని విష్ణుత్వం చెప్పారు వాల్మీకి.

ఆ అవతార పరిమితిగానే - కేవలం మానవత్వమే ప్రదర్శించాలి గనుక, దానినే ప్రదర్శించాడు. ఋషులు మాత్రం ఆయనలోని నారాయణత్వాన్ని దర్శించారు. ఈ విషయమే శరభంగ మహర్షి, అగస్త్యముని, గౌతముడు, విశ్వామిత్రుడు, మతంగ మహర్షి ఇతివృత్తాలలో వాల్మీకంలోనే స్పష్టమౌతుంది. వాల్మీకి కూడా ఋషి గనుక, 'ధ్వని'గా రాముని విష్ణుత్వాన్ని ప్రకటించాడు. కావ్యంలో ధీరోదాత్త నాయకుని చూపించాలి గనుక, నాయకుడైన రాముడు ధర్మవిగ్రహునిగా సాక్షాత్కరిస్తాడు. పురాణ

సంప్రదాయంలో విష్ణుత్వాన్ని స్పష్టీకరించవచ్చు. కావ్యంలో, అవతార ప్రయోజనం దృష్ట్యా రాముడు ధర్మ విగ్రహుడైన పురుషోత్తమునిగా కనబడడం మూలాన, వాల్మీకికి కావ్య సంప్రదాయంగా ధీరోదాత్తనాయకుని కథ చెప్పడం సులభమయ్యింది.

వాల్మీకి రామాయణం ప్రతి కాండలోనూ శ్రీరాముని విష్ణుత్వం చెప్పబడింది. శ్రీరాముడు ఆదర్శమూ, ఆరాధ్యమూ అయిన దివ్యావతారం. విష్ణుపరమాత్మ 'పరిపూర్ణ మానవునిగా' అవతరించి చూపించిన ధర్మమయలీల.

ప్ర: **శివారాధన వేదకాలానికే ఉందా? రుద్రుడూ, శివుడూ ఒకటేనా? వేరు వేరేనా? మన సంస్కృతిపై అనేక ఇంగ్లీషు గ్రంథాలు, వాటి అనువాదాలు చదివాక నాకు మిగిలిన సందేహాలివి.**

**జ:** వేదకాలమంటూ ఒకటి ప్రత్యేకించి లేదు. వేదాలు అపౌరుషేయాలు. అనంత కాలానికి చెందినవి. ఈ పరమసత్యాన్ని జీర్ణించుకోలేక–వేదాలకీ కాలాన్ని నిర్ణయించాలనీ నానా అగచాట్లూ పడ్డారు, పడుతున్నారు. అస్తు. అలా ఉంచుదాం. ఇక వేదాల్లో శివుని ప్రస్తావన పూర్ణంగా ఉంది. 'ఈశాన స్సర్వవిద్యానాం.... సదాశివోం.' 'తన్మేమనశ్శివ సంకల్ప మస్తు', 'ఉమాసహాయం పరమేశ్వరం విభుం'.



'అంబికా పతయ ఉమాపతయే'– మొదలైన వేదోపనిషన్మంత్రాలెన్నో శివుని స్తుతిస్తున్నాయి. రుద్రుడు, శివుడూ ఒకరే. ఇది వేదంలోనే ప్రస్తావించబడింది. ఘోర రూపాలతో ఉన్న శివతత్త్వం రుద్రునిగా చెప్పబడింది."యాతే రుద్రశివా తనూ" – "నమస్సోమాయచ రుద్రాయచ...నమశ్శంభవేచ మయోభవేచ, నమశ్శం కరాయచ మయస్కరాయచ, నమశ్శివాయ చ శివతరాయచ......" అని రుద్రనమక మంత్రాల్లో ప్రస్తావితాలు. శివుడు లయకారకుడు.

ఈ లయ మూడు విధాలు–

1. సంహారం, 2. తిరోధానం (కనబడకుండా లీనమవడం), 3. అనుగ్రహం (మోక్షప్రదానం). ఈ మూడూ చేసేది 'లయ' స్వరూపుడైన శివుడే. ఒక్కొక్క పనికీ ఒక్కొక్క పేరుతో 1. రుద్ర, 2. మహేశ్వర, 3. సదాశివ. ఈ మూడు ఒకే శివుని పేర్లు. పరతత్త్వంలో లయమైతేనే మోక్షం, ఆనందం. దానినిచ్చేదీ ఆ పరతత్త్వమే.

ప్ర: **సీత 'అగ్ని ప్రవేశ ఘట్టం' హృదయ విదారకం, దారుణం. అలాంటి పని చేయమని రాముడు ఎలా అనగలిగాడు? ఇది ధర్మమా? సీతను రాముడు శంకించడం న్యాయమా?**

**జ:** నిజమే, సీతమ్మ అగ్నిప్రవేశం హృదయవిదారకమైన ఘట్టమే. కానీ అందులో రాముని ధర్మానికి ఏ లోటూ లేదు. రాదు. రాముడు ఏనాడైనా సరే, ఏదైనా పనిచేసేసి, తరువాత, దానిని ధర్మమని సమర్థించుకోడు. పూర్తిగా 'ఇది ధర్మం' అని సూక్ష్మంగా పరిశీలించి, నిర్ధారించాకే ఆచరిస్తాడు. అందుకే ఆయన ధర్మవిగ్రహుడు. సీతను రాముడు శంకించలేదు. ధార్మికంగానే రాముని ప్రవర్తనను దర్శించవచ్చు. రావణ వధానంతరం, రామాజ్ఞపై అంతఃపురస్త్రీలు అలంకరించి తెచ్చిన సీతమ్మను చూసిన రామునకు మహదానందం కలిగింది. రాముడు సీతాపతి మాత్రమే కాదు. రాజ్య పాలనచేసే రాజు కూడా. ఏ విషయాన్ని లోకం ఎలా గ్రహిస్తుందో ఊహించగలిగే జ్ఞానం కలవాడు. తన ధర్మం తనకి తెలిస్తే చాలదు. లోకానికి తెలియాలి. లోకం తప్పుగా గ్రహించకూడదు. రాజైన తాను, మహారాణి కూడా నిష్కళంక చరిత్రలు – అని ప్రజలకి ప్రత్యక్షంగా తెలియాలి. 'రాజ్యపాలన వేరు, వ్యక్తి గత జీవితం వేరు' అనే కాలం కాదది. నిష్కళంక చరిత్ర కలిగిన పాలకులే రాజులు. 'ఆజన్మ శుద్ధానాం' – జన్మించిన దగ్గర నుండి శుద్ధులు రఘువంశరాజులు అని కాళిదాసు అభివర్ణిం చాడు. అందుకు తగ్గట్టుగానే ప్రవర్తించాడు రాముడు.

అతి సామాన్యమానవుడు కూడా, చివరకు రామాయణ ముఖమెరగని దుశ్శీలుడు కూడా 'రాముడిక్కడ అధర్మం చేశాడు' అనగలిగినప్పుడు.... ఆ సందేహం సర్వ శాస్త్రవేత్త అయిన మహర్షి ఊహించలేడా? మరి ఆయన ఏ విధంగా అక్కడ విష యాన్ని వివరించాడో ఏకాగ్రంగా పరిశీలించాలి.

సీతాదేవిని చూడగానే, రాముడు తన హర్షాన్ని లోన దాచుకొని, గాంభీర్యం ప్రకటిస్తూ– "నేత్రరోగికి దీపం వలె నీవు నాకు ప్రతికూలురాలివి. పౌరుష ధర్మాను సారం యుద్ధం చేసి, శత్రుసంహారం చేసి, నిన్ను విముక్తురాల్ని చేశాను. ఇంకనీ ఇష్టానుసారం వెళ్ళు. లక్ష్మణుడైనా, భరతుడైనా– నీకిచ్చవచ్చినట్లుగా వెళ్ళు. " అని అన్నాడు.

ఇందులో హృదయానికి శల్యాలై గ్రుచ్చుకునే తీవ్రత ఉంది. అయితే రావణుడు అపహరించడానికి రాకముందు, మారీచవధకు రాముడు వెళ్ళిన సందర్భంలో లక్ష్మ ణుని శంకిస్తూ సీత మాట్లాడిన మాటలూ ఇంత తీవ్రమైనవే. ఆ తీవ్రత, అప్పుడు లక్ష్మణుడు పడ్డ బాధ సీతకు తెలియాలని కూడా రామ సంకల్పం. "నువ్వు, భరతుడు కలిసి మాయతో నన్ను పొందాలని చూస్తున్నారు. అందుకే రాముని ఆర్తనాదం

విని కూడా నువ్వు కదలడంలేదు" అని ఆనాడు సీత అన్నమాట. లక్ష్మణుడెంత చెప్పినా వినకుండా, తొందర పడడంవల్ల ఇన్ని ఆపత్తులు ఎదుర్కొన వలసి వచ్చి నందుకు కూడా, కొంత కోపం రావడం మానవ స్వభావం. ఇక్కడ మానవ స్వభావం, మానవ ధర్మం – ప్రధానంగా రాజధర్మం కలగలసి కనిపిస్తాయి. అంతేకానీ సీతను అగ్నిలో ప్రవేశించమని రాముడు అనలేదు. అప్పుడు సీత, తనంత తానుగా అగ్నిలో ప్రవేశించేందుకు ఉద్యుక్తురాలైంది. ఆ సమయంలో రాముడు–

***దధ్యౌ ముహూర్తం ధర్మాత్మా***
***బాష్పవ్యాకులలోచనః***

రాముడు కూడా హృదయంలో సీత పట్ల ప్రేమ, విశ్వాసాలున్న వాడే, కానీ 'ధర్మాత్ముడు' కనుక నీళ్ళు నిండిన కళ్ళతో ముఖాన్ని ప్రక్కకు తిప్పుకున్నాడు. ఆ ఘట్టం శ్రీరామునికి హృదయం విదారకంగా ఉంది.

ఆ సందర్భములో – దేవతలంతా రాముని వద్దకు వచ్చారు.

***"ఉపేక్షసే కథం సీతాం***
***పతంతీం హవ్యవాహనే"...***



"లోకేశ్వరుడవు, జ్ఞానవేత్తవైన నీవు, అగ్నిలో పడుతున్న సీతను ఎందుకు ఉపేక్షిం చావు?" అని అడిగారు. "నేను మానవుణ్ణి, దశరథ పుత్రుడ్ని" అని చెప్పాడు రాముడు. అంటే తాను మానవ ధర్మానుసారం ప్రవర్తిస్తున్న వాడినని చెప్పడమే.

ఆ కాలాన్ని ఇక్కడ ఆలోచించాలి. దేవతలతో ప్రత్యక్ష సంబంధం ఉన్న గొప్ప మానవులు, ధర్మశీలురు ఉన్న కాలం అది. అగ్ని, వాయువు, పృథ్వి..... మొదలైనవి ప్రాకృతిక పదార్థాలే కావు. వాటి దేవతా మూర్తులతో, ఉత్తమ మానవులకు ప్రత్యక్షంగా సంబంధాలు ఉండే త్రేతాయుగం అది.

**"శీతో భవ హనూమతః"** – అని అగ్నిని ప్రార్థించి, తన మాటతో హనుమంతుని తోక మంటనే చల్లార్చ కలిగిన పాతివ్రత్యాగ్ని స్వరూపం సీతమ్మ.

**"నాగ్నిరగ్నౌ ప్రవర్తతే"** – అగ్నిని అగ్ని ఏమీ చేయలేదు అని హనుమంతుడే, సీతమ్మను అగ్నిగా గుర్తించాడు. ఆమెను అగ్ని ఏమీ చేయలేదు – అని ప్రత్యక్షంగా చూశాడు. మరి సీతాపతికి ఆ విషయం తెలియదా! బాణాగ్రంతో మహా సముద్రాన్ని శాసిం చిన శ్రీరామునికి, అగ్నిలో సీతప్రవేశించడం– అంటే ఆమె మరణించడం కాదని తెలుసు. సీతక్షేమంగా ఉంటుందనీ తెలుసు.

కానీ ఆమె శక్తి లోకానికి తెలియాలి. అందుచేతే, ప్రజలను దూరంగా తప్పుకోమని విభీషణుడు చెప్పినా, అందరూ అక్కడే ఉండాలని ఆజ్ఞాపించాడు రాముడు.

ఈ ఘట్టంలో వాల్మీకి పదేపదే, "రామో ధర్మభృతాంవరః". "ధర్మాత్మా" – వంటి శబ్దాలతో రాముని ధార్మికతని చాటాడు.

అగ్నిదేవుడు సీతను భద్రంగా తీసుకువచ్చి, రామునకు అప్పగించి, ఆమె సుశీలని అని అందరూ వినేటట్లుగా తన "అగ్నిసాక్షి" త్వాన్ని ప్రకటించాక,

**"ధర్మాత్మా హర్షవ్యాకులలోచనః"** – ఆనందాతిరేకంతో ధర్మాత్ముడైన రాముడు ఇలా అన్నాడు.

**అవశ్యం చాపి లోకేషు**
**సీతాపావన మర్హతి।**
**దీర్ఘకాలోషితా హీయం**
**రావణాంతః పురే శుభా।**
**బాలిశో బత కామాత్మా**
**రామో దశరథాత్మజః।**
**ఇతి వక్ష్యతి మాంలోకో**
**జానకీ మవిశోధ్యహి॥**

పావనత్వానికి తప్పకుండా సీతే అర్హురాలు. అయినా 'దీర్ఘకాలం, రావణాంతఃపురంలో ఉన్న సీతను, రాముడు తిరిగి తెచ్చుకున్నాడు. ఎంత కాముకుడు!' అని లోకం నిందిస్తుంది. సీతను శంకిస్తుంది. కాబట్టి ఆ కళంకం సీతకీ, తనకీ రాకూడదనే రాముడు మిన్నకున్నాడు. లోకాపవాదం ఉన్న రాజు పాలనకి పనికిరాడు. అందుకే ధర్మంగా ఉండడమే కాదు, ఆ ఉన్న ధర్మం ప్రత్యక్షం కావాలి. కేవలం ప్రజల ఊహకే ధర్మాత్ముడవడం కాదు. ప్రత్యక్షంగా తాను, తన పత్ని ధర్మమయులని ఋజువు కావాలి. అందుకే– రాముని ఆ ప్రవర్తన.

**అనన్య హృదయాం సీతాం**
**మచ్చిత్తపరి రక్షిణీమ్।**
**అహమప్యవగచ్ఛామి**
**మైథిలీం జనకాత్మజామ్॥**

సీత హృదయం నన్ను తప్ప మరోవైపు చూడదు. నా చిత్తమును పరిరక్షించేది సీత.

ఆ విషయం నాకు తెలుసు.

**ఇ మామపి విశాలాక్షీం**

**రక్షితాం స్వేనతేజసా॥**

తనను తాను తన తేజస్సు ద్వారా రక్షించుకొనే శక్తిగల మహాశక్తి సీతాదేవి. దుష్టాత్ముడైన రావణుడు మనసా కూడా ఈమెను ఏమీచేయలేడు.

**విశుద్ధాత్రిషు లోకేషు....**

**నవిహాతుం మయాశక్యా**

**కీర్తి రాత్మవతా యథా॥**

ముల్లోకాలలోనూ పవిత్రురాలు సీత. నేను ఆమెను విడవలేను. ఆత్మవంతుడు కీర్తిని వలె. అంటే ఆత్మనిత్య దృష్టి ఉన్నవాడు ధర్మానికే ప్రాధాన్యమిస్తాడు. ఆ ధార్మికత లోకాన కీర్తి. ఆ కీర్తినే కోరుకుంటాడు ఉత్తముడు.

లోకవాక్యానికి అంత గౌరవమిచ్చే కాలమది. రాజైనవాడు సర్వజనామోదం పొందాలనీ, సర్వజనుల చేత రాజకుటుంబం నిష్కల్మషమైనదని మనసా అంగీ కరింపబడాలనీ సనాతన ధర్మం. అందుకే రాముని ఈ ధర్మనిరతిని చూసిన వెంటనే సాక్షాత్తు శంకరుడే–



***"దిష్ట్యా కృతమిదం కర్మ***

***త్వయా ధర్మభృతాంవర!"*** *–అని స్తోత్రించాడు.*

**ప్ర: ప్రదక్షిణం (గుడి చుట్టూ తిరగడం) దేనిగురించి చేస్తారు? ఇక్కడ ఏ మంత్రాలు ఉపయోగిస్తారు? ఎన్నిసార్లు ప్రదక్షిణం చేయాలి.**

**జ:** ప్రదక్షిణం చేయడం వల్ల పాప పరిహారం జరుగుతుంది. దేవాలయాలకు వెళితే 'గుడి చుట్టూ తిరగడం' ప్రదక్షిణం. మామూలుగా ఇంట్లో దేవతారాధన చేస్తే చేయవలసినది 'ఆత్మప్రదక్షిణ'. తనంత తాను దక్షిణం (కుడి) వైపు నుండి తిరగడం, మనలో ఉన్న పరమాత్మను దర్శించేందుకు అది ఒక విధానం. గుడిలో ఆత్మ ప్రదక్షిణ పనికిరాదు.

గుడిని నిర్మించిన ఆగమ శాస్త్రానుసారం గుడి నలువైపులా వివిధ దేవతాశక్తులు ప్రతిష్ఠింపబడి ఉంటాయి. గుడిచుట్టూ తిరగడం వల్ల ఆ దేవతా శక్తుల అనుగ్రహ దృష్టి మనపై పడుతుంది. అంతేకాక – గుడిలోని ప్రధాన దైవం – దీపం వలె

విశ్వతోముఖుడు. అంటే అన్నివైపుల నుండి నమస్కరించడం కూడా- ఆలయ ప్రదక్షిణలో అంతరార్థం. సాధారణంగా దేవాలయంలో ముమ్మార్లు ఆలయ ప్రదక్షిణ చేయాలి. మొక్కుబడుల ప్రకారం 11-108 మొదలైన సంఖ్యలు ఉంటాయి. ప్రదక్షిణ చేసేటప్పుడు, ఈ క్రింది శ్లోకాలను చదువుకోవాలి.

**యానికాని చ పాపాని**
**జన్మాంతరకృతానిచ।**
**తాని తాని ప్రణశ్యంతి**
**ప్రదక్షిణ పదే పదే॥** 1

**పాపోహం పాపకర్మాహం**
**పాపాత్మా పాపసంభవః**
**త్రాహి మాం కృపయా దేవ**
**శరణాగత వత్సల!** 2

**"అన్యథా శరణం నాస్తి**
**త్వమేవ శరణం మమ!**
**తస్మాత్ కారుణ్యభావేన**
**రక్ష రక్ష మహేశ్వర!॥** 3

శక్తి దేవాలయాలకు వెళ్ళినప్పుడు పై శ్లోకాలలో 1,2,3 (రేఖలు గీసినవి) 1.దేవి, 2.శరణాగతవత్సలే!, 3. మహేశ్వరి! - అని మార్చి చదువుకోవాలి.

ఈ శబ్దాలు ఏ శక్తిదేవతకైనా సరిపోతాయి. అలాగే దేవ, మహేశ్వర మొదలైన శబ్దాలు విష్ణువుకైనా, శివునకైనా, ఇతర దైవానికైనా చెప్పవచ్చు.

**ప్ర: యంత్రాలంటే ఏమిటి? 'యజ్ఞం' అంటే ఏమిటి?**

**జ:** మంత్రశక్తిని 'రేఖాబద్ధం' చేసేది 'యంత్రం'(Geometrical interpretation) - అని అనవచ్చు. రేఖల ద్వారా దైవశక్తిని ఆవిష్కరించే పద్ధతి యంత్ర నిర్మాణంలో ఉంది. చతురస్రం, వృత్తం, కోణాలు, బిందువు, పద్మదళాలు.... ఇవి ప్రధానం. వీటి అమరికలు ఒక్కొక్క యంత్రంలో ఒక్కొక్కవిధంగా ఉంటాయి. ఆ అమరికల వల్ల ఏర్పడే ఆవృతులను ఆవరణలంటారు.

ప్రతి ఆవరణలో దేవతామూర్తులు, వాటి మంత్ర బీజాలు ఉంటాయి. కనుక

దేవతామూర్తి 1.మంత్రం ద్వారా, 2. యంత్రం ద్వారా అభివ్యక్తీకరింపబడుతుంది. మూడవది – విగ్రహం.

మన దేవాలయ సంస్కృతిలలో విగ్రహప్రతిష్ఠ –మంత్ర, యంత్రశక్తులతో కూడి ఉంటుంది. దేవతారూప చిత్రణలో కూడా మంత్ర,యంత్ర శక్తులే ప్రకటింప బడతాయి.

ఇక–'యజ్ఞం' – అంటే ఆరాధించడం, అర్పించడం. దేవ ప్రీతికరంగా ఆరాధించి, అర్పించే భావన 'దేవయజ్ఞం', పితృప్రీతికరమైన కర్మ 'పితృయజ్ఞం'. మనుష్య, భూత, ఋషిగణాలకు ప్రీతి కలిగించే కర్మలను మనుష్యయజ్ఞ, భూతయజ్ఞ, ఋషియజ్ఞాలని అంటారు.

ప్ర: **శ్రీరాముడు తనపట్టాభిషేక సమయంలో భరత, శత్రుఘ్నుల గురించి స్మరించనేలే దెందుకని? కనీసం ఒక శ్లోకంలోనైనా, పట్టాభిషేక సమయానికి భరతశత్రుఘ్నులు వచ్చే అవకాశం లేకపోయిందేనని రాముడు ఇసుమంతయినా చింతించినట్లు వాల్మీకి వ్రాసి యుండినా, ఔచిత్యంగా ఉండేదికదా!**



జ: పట్టాభిషేక సమయంలో భరత, శత్రుఘ్నులు రామసన్నిధిలోనే ఉన్నారు. కాబట్టి ప్రత్యేకించి స్మరించనక్కరలేదు. "తన సర్వసంపదలూ తన సోదరుల కోసమే" నని రాముడు అనేక సార్లు ఉద్ఘాటించాడు. వనవాసానికి పూర్వం పట్టాభిషేక ప్రయత్న సమయంలో – శ్రీరాముడు, దానిని పెద్ద ఉత్సవంగా భావించనేలేదు. శ్రీరామునకు, ఎప్పుడైనా, పట్టాభిషేకం ఒక దీక్ష. ప్రజలకు అది ఉత్సవం.

అప్పుడు (వనవాసపూర్వం) ఎవరినీ రాముడు స్మరించలేదు. తన దీక్షలో తాను న్నాడు. స్థితప్రజ్ఞుడైన రాముడు, వనవాస ప్రస్తావన వచ్చినప్పుడు కూడా చలించ లేదు. మన ఇప్పటి లౌకిక వ్యవహారాల వంటిది కాదు అప్పటి పట్టాభిషేకం.

రావణ వధానంతరం జరిగిన పట్టాభిషేకంలో భరతాదుల పట్ల కూడా రాముడు ప్రేమ పూర్వకంగా స్పందించాడు. మరో విషయం– కావ్యంలో ప్రధాన ఘట్టాలను మాత్రమే కవి వర్ణిస్తాడు. కొన్ని విషయాల ప్రస్తావన కనబడనంత మాత్రాన, అవి జరగలేదని కాదు. వాటి ప్రస్తావన కథకు అంత అవసరంలేదని. కవులకు కవి అయిన వాల్మీకి ఏనాడూ అనౌచిత్యం వ్రాయడు. రాముడు భరతశత్రుఘ్నుల పట్ల కూడా సోదరవాత్సల్యం అధికంగా కలవాడే. ఆ విషయం వాల్మీకి స్పష్టంగా అనేక చోట్ల చిత్రించాడు.

రాముడు లక్ష్మణునితో అన్నమాటలు (అప్పుడక్కడ భరత శత్రుఘ్నులులేరు). "లక్ష్మణా! నువ్వు, భరతుడు, శత్రుఘ్నుడు లేని సుఖాలేవీ నాకు వద్దు, అలా మీరు లేకుండా నాకు ఏ సుఖం లభించినా అది బూడిదైపోవాలి.

ఇదీ రామునకు తన సోదరుల పట్ల ఉన్న ప్రీతి.

**'యద్వినా భరతం త్వాం చ శత్రుఘ్నం చాపి మానద।**

**భవేన్మమ సుఖం కియత్ భస్మతత్కురుతాత్ శిఖీ ॥**

ప్ర: **విష్ణుసహస్రం, శివసహస్రం – అనో, లేదా "అష్టోత్తరశతం" అనో మనం చేస్తుంటాం. ఈ శతం, సహస్రం ఎందుకు? ఏభై, రెండువందలు అని ఎందుకుండవు?**

భగవంతుడు అనంతుడు. ఆయనకు అనంత రూపాలు, అనంత నామాలు. అన్ని నామాలూ అనగలిగేంత 'అనంతత్వం' మనకు లేదు. కనుక అనంత నామాలు అన్న ఫలం లభించడానికి, అనంతత్వానికి సంకేతంగా కొన్ని సంఖ్యలు చెప్పాయి శాస్త్రాలు. అవి పూర్ణసంఖ్యలు. శతం, సహస్రం – అటువంటివి.

**"విశ్వం శతం సహస్రం**

**సర్వమక్షయవాచకమ్"** అని 'మహాభారతం' లో వచనం. "విశ్వం, శతం, సహస్రం... ఇవి అక్షయాన్ని (అనంతాన్ని) తెలియజేస్తాయి".

అయితే అష్టోత్తర శతం (108), అష్టోత్తర సహస్రం(1008) ఎందుకంటే – ఇవి పూర్ణ సంఖ్యలు. సంఖ్యా శాస్త్రపరంగా వీటిని కలిపితే '9' అనే పూర్ణ సంఖ్య వస్తుంది. అందుకే ఈ సంఖ్యల్లో మనకు జపాలు, నామావళులు ఏర్పాటు చేశారు మహర్షులు. ఇది 27 నక్షత్ర సంఖ్యనీ సూచిస్తుంది. అంతేకాక–మనలోని ప్రాణశక్తి పరిమాణం 108 అంగుళాలు అని, అది దేహంపై కూడా కొంతవరకు వ్యాపించి ఉంటుందనీ యోగశాస్త్రం చెబుతోంది.

ప్ర: **మన సంస్కృతిని రక్షించుకోవడానికి మన వేద, పురాణ విషయాలు తెలుసుకుంటే సరికదా! చరిత్ర గురించి చర్చించడం, తెలుసుకోవడం ఎందుకు?**

**జ:** మనకి చరిత్ర పట్ల ఉన్న ఈ ఉదాసీన, నిర్లక్ష్య వైఖరి వల్లనే మన సంస్కృతిపట్ల ఇప్పటి తరంలో అలక్ష్యభావం ఏర్పడుతుంది. మన చరిత్రను – మన దేశ సంస్కృతిని తక్కువదృష్టితో చూసేవాళ్ళు వ్రాసిపెడితే, అదే మనం చదివి నమ్ముతున్నాం. ఇప్పటికీ మన విద్యావిధానం, ఆలోచనా విధానం విదేశీయమే. కనుక అసలు చరిత్రను ఎందరు ఘోషించి చెప్తున్నా బధిరశంఖారావమే అవుతోంది.

ఇటువంటి స్థితిలో – మనం మన అసలు చరిత్రని పరిశోధించి, నిగ్గుతేల్చాల్సిన అవసరం ఉంది. చరిత్ర అధ్యయనం లేకపోతే – మన పరంపరలోని అసలు విషయాలు స్పష్టం కావు.

మన సంస్కృతి పరిరక్షణలో ఎన్ని ఆటుపోట్లు, ఉత్థానపతనాలు మనం చవి చూశామో మనకు తెలిసిననాడే సంస్కృతి యొక్క సమగ్రస్వరూపం అర్థమౌతుంది. ఒక హేతు బద్ధత సాధ్యమౌతుంది. కాబట్టి చరిత్ర అధ్యయనం, చర్చించడం, తెలుసుకోవడం అత్యవసరమే.

**ప్ర: ఈ మధ్య ఒక సినిమాలో – "పరస్త్రీ రాధను ప్రేమించిన కృష్ణుడు, అయిదుగురు భర్తలున్నా ఆరో వ్యక్తి(కర్ణుడు) పై మనసుపడ్డ ద్రౌపది..." ఇలా మన పురాణ పాత్రల్ని నిందిస్తూ (ఇంకా అసహ్యకరమైన పదజాలంతో) మాటలున్నాయి. అవి చూసి మన స్తాపం చెందాను. ఇవి ఎంత వరకు నిజాలు?**

**జ:** ఇదీ మన దౌర్భాగ్యం. మనవాళ్ళే మన దేవతల్నీ, పురాణ పాత్రల్నీ నిందిస్తుంటే "ఇవి ఎంత వరకు నిజాలు?" అని అడిగే దుఃస్థితిలో ఉన్నాం. మీరు కనీసం మన స్తాపమైనా చెందారు. మీ సంస్కారానికి వందనాలు. ఆపాటి బాధ కూడా పడనివాళ్ళు ఎందరో! ఇదే ఇతర మతస్తుల దేవతలపై, మత గ్రంథాల పాత్రలపై విమర్శిస్తూ (నిజాలైనా సరే) మాటలుంటే వాళ్ళు ఊరుకుంటారా? పాటికి ఆ సినిమాని తగలబెట్టేవాళ్ళు! వారి ధర్మనిష్ఠ అటువంటిది.



మనం కనీసం నిరసన కూడా ప్రకటించు కోలేకపోతున్నాం. అసలు – చేతిలో కలం ఉందని ఏది తోచితే అది వ్రాసేయడమేనా? ఆ పురాణాలు ఎంత వరకు మనం చదివామని? పోనీ –కనీసం వ్రాసే ముందు పండితుల్నెవర్నైనా అడిగారా? ఏమిటీ బాధ్యతా రాహిత్యం! శక్తిమంతమైన ఒక మాధ్యమం ద్వారా ఈ విష ప్రచారాలు జరిగితే ఎలా సహిస్తున్నాం?

రాధాదేవి లౌకిక పాత్ర కాదు. అలౌకికమైన, గోలోకనివాసిని అయిన పరాశక్తి, శ్రీకృష్ణుడు పరమాత్మ. యోగ, ఆధ్యాత్మిక తత్త్వానికి చెందిన ఆ దివ్యమూర్తుల గురించి, కనీసం ఊహించడానికి అర్హతలేని వాళ్ళు, ఎలా తెగిస్తున్నారు? ద్రౌపది ఇంద్రశక్తి, అయిదు మూర్తులు (పాండవులు) గా వచ్చిన ఒకే ఇంద్రుని శక్తి ఆమె. ఆ సాధ్వి కర్ణుని కోరినట్లు ఏ పురాణంలోనూ, మహాభారతంలోనూ లేదు. ఏ భ్రష్టులో కల్పించిన పిట్టకథని పట్టుకొని పురాణ పాత్రల్ని అవమానించడం తగునా! ఇటువంటి

అనౌచిత్య, వికృత చేష్టల్ని నిరసించి, బహిష్కరించవలసిన బాధ్యత ప్రతి భారతీయునిపైనా ఉంది.

**ప్ర: భగవదనుగ్రహం వల్ల మాకు ద్వాదశ జ్యోతిర్లింగాలను దర్శించే భాగ్యం కలిగింది. కానీ జ్యోతిర్లింగమంటే ఏమిటో, ఇతర శివలింగాలకు, వీటికి గల భేదమేమిటో తెలియలేదు తెలియజేయగోరిక.**

**జ:** 'జ్యోతి' అంటే జ్ఞానస్వరూపం. పరమేశ్వరుడు నిరాకారుడూ, సాకారుడూ కూడా. సృష్టికి పూర్వం తానున్న జ్యోతిఃస్థితి ఆయన స్వస్థితి. జ్ఞానానికి సంకేతం. ఆ వెలుగుకి మూలం పరబ్రహ్మజ్యోతి. జ్ఞాన ప్రధాన దైవంగా తనంతతానుగా వెలసిన లింగస్వరూపాన్ని జ్యోతిర్లింగాలు అంటారు. ఇవి పన్నెండు. కాంతి స్వరూపుడైన సూర్యభగవానుడు శంకరుని వెలుగు మూర్తి. ద్వాదశాదిత్యుల వలె ద్వాదశ జ్యోతిర్లింగాలు ఆత్మజ్ఞాన ప్రకాశాన్ని ప్రసాదించుతాయి.

**ప్ర: శ్రీ కృష్ణ భగవానుడు జన్మించగానే, వసుదేవుడు స్వామి వారిని కారాగారం నుండి, నందుని గృహానికి తీసుకెళ్ళేటప్పుడు, కాపలా భటులంతా విష్ణుమాయ వల్ల నిద్రలో మునిగారు. కానీ ఒక గార్దభం (గాడిద) మాత్రం వసుదేవుని చూసిందని చెబుతారు? ఆ గార్దభాన్ని విష్ణుమాయ ఎందుకు వదిలి వేసింది?**



**జ:** ఈ గార్దభం కథ నిజానికి, కృష్ణ కథలున్న భాగవతాదుల్లో లేదు. ఎవరో కల్పించిన కథ ఇది. ఈ కల్పిత కథ ఆధారంగా 'వసుదేవుడంతటివాడే గాడిద కాళ్ళు పట్టుకున్నాడు' అనే సామెత కూడా పుట్టింది. గాడిద కథే లేనప్పుడు, ఇంక దానికి విష్ణుమాయ పట్టడం, వదలడం ఎలాగూ లేదు కదా!

**ప్ర: నాకు శ్రీకృష్ణుడంటే భక్తి ఎక్కువ. ఆయన ఆరాధన, ధ్యానం, గానం నా నిత్యకృత్యం. అయితే నామిత్రులు కొందరు ఈ మధ్య ఉపనిషత్తులు నేర్చుకుంటున్నారు. వారంతా "ఈ సగుణ భక్తి వదిలేయి. నిర్గుణంలోనికి రా" అంటున్నారు. నాకు ఉపనిషత్తులంటే గౌరవమే. కానీ కృష్ణభక్తిని 'సగుణం' అని వదిలేయలేయక పోతున్నాను. ఇప్పుడేం చేయాలి?**

**జ:** మీరు మీ కృష్ణభక్తిని కొనసాగించండి చాలు. ఉపనిషత్తులు సగుణభక్తికి వ్యతిరేకం కాదు. ఉపనిషత్తులను వ్యాఖ్యానించిన ఆది శంకరాదులు సగుణభక్తిని నిరసించినట్లు మాట్లాడిన వారికి వేదాంతహృదయం అర్థం కాలేదనే చెప్పాలి.

భగవద్భక్తి కలగడమే చాలు, జన్మచరితార్థమైనట్లే. మనకేమి కావాలో ఆయన

చూసుకుంటాడు. మోక్ష సాధనలలో భక్తి ఉత్కృష్ట మైనదని, సర్వోపనిషత్సారమైన 'భగవద్గీత'లో శ్రీకృష్ణుడే భోధించాడు. ఆయన జగద్గురువు. మన యోగక్షేమాలు ఆయనకి ఎరుకే. మీ నిత్యకృత్యమైన కృష్ణభక్తిని విడువవద్దు.

**ప్ర: 'భగవద్గీత' వేదాంతగ్రంథం కదా! అది ఇంట్లో ఉండడం మంచిది కాదని ఒక సంస్థ ప్రచారం చేస్తుండగా విన్నాను. అది నిజమేనా?**

**జ:** 'భగవద్గీత' వేదాంతగ్రంథమే, కాదనం. కానీ అది గృహస్థులకు పనికిరాదని లేదు. అది మానవ జీవితాన్ని పరిపూర్ణంగా తీర్చుదిద్దుకోడానికి ఉపకరించే సర్వ ధర్మాల సారం. కర్మను విడిచిపెట్టి, సన్న్యాసం తీసుకుంటానన్న ఒక క్షత్రి యుని కర్తవ్యోన్ము ఖుని చేసి, స్వధర్మ నిర్వహణ చేయించిన గొప్ప గ్రంథం. అది భగవానుని వచనాల సమాహారం. అది ఉన్న ఇంట ఐశ్వర్యం, అది చదివి అర్థం చేసుకున్న వారికి జీవిత సార్థక్యం లభిస్తాయి. కేవలం కొన్ని క్షుద్రసంస్థలు, మన సనాతన సంస్కృతిని దెబ్బ తీయాలనే ఉద్దేశంతో అటువంటి తప్పుడు ప్రచారాలు చేస్తుండవచ్చు.

**ప్ర: 'అధ్యాత్మరామాయణం'లో అసలు సీత లంకలో లేదనీ, మాయసీతే ఉన్నదనీ, ఆమె అగ్ని ప్రవేశం చేసిందనీ ఉంది. మరి 'మాయసీత' లేదని జిజ్ఞాసలో తెలియజేశారు.**



**జ:** 'అధ్యాత్మరామాయణం'లో ఆ వృత్తాంతం ఉన్నమాట నిజమే, అది ఆర్షమైన గొప్పగ్రంథమే. కొన్ని పురాణాల్లోనూ ఉంది. పురాణాల్లోని కథ మరికొన్ని కల్పాలలోది. కానీ రామాయణాలలో పరమప్రమాణమైనది-వాల్మీకి రామాయణం. దాని ఆధారంగా, 'మాయాసీత' వృత్తాంతం లేదు. అదే నిజమైతే హనుమ సుందరకాండ లోని సీతను చూడడం, ఓదార్చడం, రాముని ధర్మనిరతి. ఇవన్నీ అసంగతంగా కనబడతాయి కూడా. 'మాయసీత' లో ఉన్న ఔచిత్యం కన్నా, శ్రీరాముడు ధర్మనిరతుడై అగ్నిప్రవేశ ఘట్టాన ప్రవర్తించిన తీరులో ఎంతో ఔచిత్యం ఉంది. అందుకే ఆదికవి వాల్మీకి రామాయణాన్నే ప్రమాణంగా చెప్తున్నాము. ఇతర రామాయణాలలో భక్తి మొదలైనవి గొప్పవే. కానీ రామకథా సందర్భాలకు వాల్మీకుల వారే ప్రమాణం. మానవీయ ధర్మాలతోనే రామ కథను సమర్థించాలి.

**ప్ర: భక్తి అంటే ఏమిటని చాలా మంది 'స్కాలర్స్'ని అడిగాను. ఒక్కొక్కరూ ఒక్కో విధంగా చెప్పారు. ఒకరు భక్తి అంటే 'ప్రేమ' అని చెప్పారు. అసలు ప్రేమ అంటే ఏమిటి?**

**జ:** 'భక్తి' అనే మాటకి "సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా" అని భక్తి సూత్రాలలో నారదులు నిర్వచించారు. భగవంతునిపై పరమమైన ప్రేమనే భక్తి-అంటారు. ప్రేమ అంటే

ప్రీతి. 'యా ప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ' అవివేకులం లౌకిక విషయాలపై ఉన్న మమకారమే, వివేకవంతునికి భగవంతునిపై ఉంటుంది. ప్రీతి – అనురక్తి .. ఇవే ప్రేమ. పరమేశ్వరుని గుణ, నామ, లీలలపై ఉండే ఆసక్తి ప్రీతి – భక్తి అనిపించుకుంటుంది. 'భజ్' అనే ధాతువు 'భక్తి' శబ్దానికి మూలం. దీనికి 'ఆశ్రయించడం' అని అర్థం. భగవంతుని ఆశ్రయించడమే భక్తి.

**ప్ర: రాముడు ' ఏకపత్నీవ్రతుడు' కావచ్చు. కానీ కృష్ణుడు, విష్ణువు, శివుడు వీళ్ళంతా కారుకదా! మరి 'బహుభార్యాత్వం' ఉన్నప్పుడు ఎలా 'ధర్మం' అనగలం?**

**జ:** రాముడు 'ఏకపత్నీ' అనే వ్రతాన్ని పట్టినవాడు. తద్వారా కుటుంబ వ్యవస్థ పటిష్టతకు సరియైన ఆదర్శాన్ని చూపించాడు. 'ఒక భర్తకు ఒక భార్య' అనేది ఉత్తమ ధర్మం. దీనికి భిన్నంగా వెళ్ళడానికి ధర్మంగా సమర్ధించరాదు.

అయితే దశరథుడు ధర్మమయుడే. అందులో సందేహం లేదు. రాజ ధర్మంలో కొన్ని సందర్భాల్లో బహుభార్యాత్వం తప్పదు. అది సమర్థనీయం కాకపోవచ్చు. కానీ అప్పటి పరిస్థితుల్లో గర్హనీయమూ కాదు. వాటికి రాజకీయపరమైన కారణాలు ఉంటాయి. కొన్ని దేశకాల పరిస్థితుల్లో అప్పటి సామాజిక అవసరాలూ వాటికి హేతువౌతాయి. అనాదిగా ఈ దేశంలో గౌరవస్థానం పొందినది ఏకపత్నీ ధర్మమే. అత్రిఅనసూయ, వశిష్ఠ అరుంధతులు–వంటి కుటుంబీకులు అందరూ – 'ఒక భర్తకు ఒక భార్య' అనే ధర్మాన్ని అవలంబించినవారే. 'సుందరకాండ'లో సీత–సనాతన దాంపత్య ధర్మానికి ప్రతీకలుగా చెప్పిన పరంపర అంతా ఆ ధర్మావలంబకులే.

ఇక –శ్రీ కృష్ణుడు సాక్షాత్తు దైవంగానే ప్రవర్తించాడు. ఆయన పత్నులందరికీ పతిగా వివిధ రూపాలు ధరించాడు. కృష్ణునిలో దైవలక్షణం,మానుష ధర్మం కలగలిసి కనిపిస్తాయి. మానుషాతీతమైన కృష్ణలీల అనుకరణకు అసాధ్యం. వాటిని కృష్ణుడు ఆయా జీవులను అనుగ్రహించిన పరమాత్మ విధానంగా గుర్తించాలి. అతిమానుషమైన కృష్ణ ధర్మం – ఆదర్శం. యోగీశ్వరేశ్వరుడైన కృష్ణుని కథ ఏకాగ్రబుద్ధితో అధ్యయనం చేయవలసినది.

విష్ణువు, శివుడు దేవతలు. గంగ,గౌరీ దేవతలు ఒకే పరాశక్తి యొక్క రూపాలు. అలాగే ఒకే మహాలక్ష్మీ దేవత శ్రీ లక్ష్మీ భూలక్ష్ములుగానున్నది. వారు ఉపాస్య దైవాలు. వాటికి మానుషపరమైన అన్వయాన్ని ఇవ్వలేం. ఇంకా – వాటి వెనుక మంత్ర, ఉపాసనా పరమైన అంతరార్థాలూ ఉన్నాయి. ఎప్పటికైనా మానవ సమా

జానికి అత్యంత ఆవశ్యక ధర్మం మాత్రం 'ఒక భర్తకు ఒక భార్య' అనే ఉన్నతాదర్శమే.

**ప్ర: రామాయణ భారత కాలాల్లో క్షేత్రాలు దేవాలయాలు లేనే లేవని అంటారు. నిజమేనా? మరి–చాలా క్షేత్రాల్లో పాండవులు దర్శించినట్లు చెప్తుంటారు. ఎంతవరకు నిజం?**

**జ:** రామయణ భారత కాలాల్లో దేవాలయాలు లేవనడానికి వీలు లేదు. రామాయణం లోనే దేవాలయాల ప్రసక్తి ఉంది. శ్రీ రామునికి పట్టాభిషేకం నిర్ణయించగానే నగర మంతా అలంకరించారనీ, అందులో ప్రత్యేకించి దేవాలయాలను విశేషంగా అలంకరించినట్లు తెలియజేశారు.

**తతఃపౌరజనాస్సర్వే**
**శ్రుత్వారామాభిషేచనమ్**
**ప్రభాతాం రజనీం దృష్ట్వా**
**చక్రే శోభయితుం పురీమ్!**
**సితాభ్ర శిఖరాభేషు**
**దేవతాయతనేషు చ ॥** (వాల్మీకి రామాయణం – అయోధ్యకాండ)

"రామాభిషేక వార్తవినగానే పౌరజనులంతా నగరాన్ని అలంకరించారు. తెల్లని మబ్బులవలె ప్రకాశిస్తున్న దేవాలయాలను శోభగా అలంకరించారు." – అని చెప్పబడింది.

మహాభారతంలో పాండవులు చేసిన తీర్థయాత్రలు, దేవదర్శనాలు స్పష్టంగా చెప్ప బడ్డాయి. దివ్య క్షేత్రాలు, తీర్థాలు అనాదిగా మన కర్మభూమికి వరాలు.

**ప్ర: తపస్వి, ముని, ఋషి, యోగి, జీవన్ముక్తుడు పదాలకు ఒకటే అర్థమా! లేక వేర్వేరు అర్థాలున్నాయా?**

**జ:** ఈ పదాలకు అర్థాలు వేర్వేరు. ఉపవాస, యజ్ఞ, జపాది నియమాలతో తనను తాను తపింపజేసుకొనేవాడు తపస్వి, 'తప ఆలోచనే' అనే ధాత్వర్థం ప్రకారం ఒక మహాపరమార్థం కోసం తన బుద్ధి శక్తులను మథనం చేసుకోవడాన్ని కూడా తపస్సు అంటారు. మననశీలి, మౌనిని–ముని అంటారు.

మనోవికారాలు లేకుండా, ఆత్మతత్త్వాన్ని మననం చేసుకొనేవాడు ముని.

**"ఋషయో మంత్ర ద్రష్టారః"**–అని. అమోఘమైన తపస్సు వలన కొందరికి దివ్యమైన మంత్రాలు గోచరమౌతాయి. అతీంద్రియమైన ఆ శక్తిని దర్శించిన వారిని ఋషు లంటారు. "ఋషిర్దర్శనాత్" అని – నిర్వచనం.

పతంజలి మొదలైనవారు ప్రవచించిన యమ నియమాసన ప్రాణయామ ప్రత్యాహార ధ్యానాది యోగపద్ధతుల్ని అవలంబించిన వారు 'యోగులు'. జ్ఞానులను, భక్తులను కూడా 'యోగులు' అనవచ్చు.

ఈ నాలుగింటికీ పరమలక్ష్యం, పరిపూర్ణస్థితి జీవన్ముక్తావస్థ. జీవించి ఉండగానే, బ్రహ్మజ్ఞుడై, ముక్తుడైనవాడు–జీవన్ముక్తుడు.

ప్ర: **మా బంధువుల్లో కొందరు రేకీ అనీ, ప్రాణిక్ హీలింగ్ అనీ కొన్ని విద్యలలో ప్రవీణులు. అయితే వాళ్ళు నిత్య పూజాదికాలు, శ్రాద్ధ, శౌచాదులు పాటించరు. ఆచారాలేవీ గౌరవించరు. "మా దగ్గర 'హీలింగ్ పవర్స్" ఉన్నాయి కనుక, మాకు ఇంక వేటితోనూ అవసరం లేదు" అంటారు. అది సమంజసమా!**

జ: ఎన్ని విద్యలూ, శక్తులూ సంపాదించినా అనూచానమైన సంప్రదాయాల్ని కాదన రాదు. అవి మనకున్న సహజ ఋణాలను తీర్చుకోవడానికి, సూక్ష్మమైన ధర్మ రహస్యాలతో కూడినవీ. వాటిని కాదన్నాక ఏ హీలింగ్సుతోనూ ప్రయోజనం లేదు. అందులోనూ ఒకరకంగా మన సనాతన ధర్మాన్ని దెబ్బతీసే విధానాలుగా ఈ కొత్త విద్యల్ని వాడరాదు. మనది మనం కాపాడుకుంటూనే మిగిలినవి నేర్చుకొని, ఉపయోగించవచ్చు.

**కురు కర్మైవ తస్మాత్ త్వం**
**పూర్వైః పూర్వతరైః కృతమ్ ॥**

మన పూర్వతరం వారు, వేదశాస్త్రాదుల ఆధారంగా పాటిస్తూ వచ్చిన పరంపరాగత ధర్మాన్ని వదలరాదు – అని శ్రీకృష్ణ పరమాత్ముని వచనం. మన పరంపరని వదిలేసేలా చేసే ఏదైనా సరే, ఒక విధంగా మనకు శత్రువే.

ప్ర: **మయసభలో ఒకదానికొకటిగా భ్రమపడ్డ దుర్యోధనుని చూసి ద్రౌపది నవ్వడం తప్పు కాదా! ఆ పరిహాసానికి ప్రతీకారం తీర్చుకున్నాడు దుర్యోధనుడు. అంతే కదా!**

జ: మన కర్మకొద్దీ రావణ, దుర్యోధనాది రాక్షస ప్రవృత్తుల అభిమానులు మనలో ఎక్కువై, వారిని కథానాయకులుగా మలచేందుకు ఎన్నో అకృత్యాలు చేశారు. అలాంటివే – దుర్యోధనుని భంగపాటు చూసి ద్రౌపది నవ్వడం లాంటి కల్పనలు చేయడం.

'మయసభ'లో దుర్యోధనుడు స్థలాన్ని జలంగా, జలాన్ని స్థలంగా భ్రమపడి భంగ

పడ్డాడు. అది చూస్తే నవ్వురావడం సహజం. అన్నదమ్ములే అయిన భీమాదులు అది చూసి నవ్వారు. అంతే. అక్కడ ద్రౌపది లేనే లేదు. రాజమర్యాదలు కూడా మనకు తెలియాలి. ఒక రాజపత్ని ఆ విధంగా పరుల మందిరాల్లోకి రాదు కూడా. దుర్యోధనుడు ప్రతీకారదృష్టితో అకృత్యాలు చేయలేదు. అతడు ధర్మరాజాదుల పరాక్రమ, వైభవాలను రాజసూయ యాగంలో చూశాక తీవ్రంగా అసూయా గ్రస్తుడయ్యాడు.

పరాక్రమంతో, యజ్ఞ నిర్వహణతో సుస్థిర సామ్రాజ్యాన్ని సాధించిన యుధిష్ఠిరుని పట్ల ఈర్ష్య చెందాడు. ఆ కారణంగా, అతడు మాయాద్యూతాదులు కల్పించి, పాండవులను ఇక్కట్ల పాలుజేశాడు.

ప్ర: **కొందరు దేవతలకు కొన్ని కుసుమాలు పడవు అంటారు. దేవతలంతా ఒకటే అయిన ప్పుడు ఈ పడకపోవడాలు ఏమిటి? అంతేకాక – ఏ కుసుమాలు పూజకు వాడరాదో తెలియజేస్తారా!**

జ: దేవతలంతా ఒకటి – అనలేం. పరబ్రహ్మ ఒక్కడే, దేవతలు ఆ పరతత్త్వము యొక్క విభిన్న శక్తులు. మంత్రం–దేవత. ఈ రెండూ వేదాదుల్లో చెప్పబడ్డాయి. ఒక్కొక్క భావానికీ ప్రాధాన్యమిస్తూ, దానికి అంగాలుగా మిగిలిన భావాలుంటాయి. మానవు లకు వారివారి జీవలక్షణ, సంస్కారాలకు అనుగుణంగా ఆయా దేవతల యందు ప్రీతి కలుగుతుంది. భక్తానుగ్రహ విగ్రహమ్ – అన్నారు పరమాత్మను.

మంత్రం ద్వారా అధిదేవత చెప్పబడుతుంది. ఆ మంత్రానికీ, అధిదేవతకీ, ఉపాసనకీ సంబంధం ఉంది. ఒక్కొక్క మంత్రానికీ ఒక్కొక్క శబ్దశక్తీ, ఒక్కొక్క దేవతారూపం ఉంటుంది.

విద్యుత్తు ఒక్కటే అయినా ఫ్యాన్, దీపం, టీవీ, ఫ్రిజ్ –ఇలా వేటి ప్రత్యేకత, వేటి పద్ధతి వాటిదే కాదా!

అలాగే దేవశక్తిని ఆవిష్కరించడానికి అనువైన పదార్థాలు ఉంటాయి.

తులసితో గణపతినీ, దూర్వాలతో దుర్గని పూజించరాదు. ఆ దేవతామూర్తుల లక్షణాలవి. అయితే వినాయక చవితినాడు ప్రత్యేకంగా ఏకవింశతి పత్రాలలో ఒకటిగా తులసిని పూజించవచ్చు. దూర్వాలతో గణపతిశక్తిని సులభంగా ఆవిష్కరించవచ్చు. ఒక్కొక్క కామ్యానికీ ఒక్కొక్క దేవతాశక్తి సహకరిస్తుంది.

ఏ దేవతలకైనా పూజించే పువ్వులు ఎలా ఉండాలో ధర్మ శాస్త్రాలు చెప్తున్నాయి.

**అపర్యుషిత నిశ్ఛిద్రైః**
**ప్రోక్షితైర్జంతు వర్జితైః।**
**ఆత్మారామోద్భవైర్వాపి**
**భక్త్యాసంపూజయేత్సురాన్ ॥**
**త్యజేత్కీటావపన్నాని**
**శీర్ణపర్యుషితాని చ**
**స్వయం పతిత పుష్పాణి**
**మలాద్యుపహతాని చ ॥**
**ముకులైర్నార్చయ యేద్దేవం**
**అపక్వైః కృమియుక్ఫలైః**

ఛిద్రాలూ, పురుగులూ లేక, ఆరోజునే కోసిన పుష్పాలు తెచ్చి, నీటిని ప్రోక్షించి (శద్ధజలం జల్లి), వాటితో దేవారాధన చేయాలి. ముందురోజు కోసి తెచ్చినవీ, పురుగు కొట్టినవీ, రాలిపోయినవీ, బురద అంటినవీ అయిన పువ్వుల్ని వాడరాదు. ఇంకా మొగ్గవిడనివి వాడరాదు. ఫలాలు కూడా పక్వం కానివీ, పురుగుకొట్టినవీ వాడరాదు. ధర్మంతో ఆర్జించిన ధనంతో కొన్న కుసుమాది ద్రవ్యాలు – ముందు రోజు కోసినవి అయినా దోషము లేదని ధర్మశాస్త్రవచనం.



**ధర్మార్జిత ధనక్రీతైః**
**యఃకుర్యాత్కేశవార్చనం।**
**నపర్యుషిత దోషోస్తి**
**మాలాకార గృహేషు చ ॥**

ఒకసారి వాడినవీ, ఎడమచేతితో గ్రహించినవీ, నీటితో తడిపినవీ, వస్త్రంలో పోసినవీ అయిన పువ్వుల్నీ పూజకై వినియోగించరాదు.

అయితే తులసీ, బిల్వం (మారేడు) వంటివి ఒకసారివాడినవి మళ్ళీ వాడవచ్చు. వాటికి పర్యుషిత దోషం రాదు.

తులసిని ఆదివారం మంగళ శుక్రవారాలు, పూర్ణిమ, అమావాస్య, సంక్రాంతి, ద్వాదశి – తిథులు, అశౌచాలున్నప్పుడు కోయరాదు.

దూర్వాలు కూడా ఆదివారం కోయరాదు. బిల్వం బుధ, శనివారాలు కోయాలి. అష్టమి, చవితి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్యలు కోయరాదు. కార్తిక మాసంలో

ఉసిరికపత్రాలు కోయరాదు. తులసిని స్త్రీలు కోయరాదు. పురుషులు కోసిన తులసితో స్త్రీలు పూజించవచ్చు.

మాలతీ, కేతకీ, మల్లిక, అశోక, చంపక, పున్నాగ, వకుల, ఉత్పల (నల్లకలువ) మొదలైనవి విష్ణు ప్రియాలు. తులసి సర్వాధికం.

'అర్కస్య కరవీరస్య బిల్వస్యవ కులస్యచ'... తెల్లజిల్లేడు, గన్నేరు, మారేడు,వకుళం – శివునకు ప్రియములు. ఉమ్మెత్తకూడా శివునకు ప్రియం. బిల్వదళం సర్వాధికం. సర్వకామప్రదం బిల్వం దారిద్రస్య వినాశనం॥–అని ధర్మశాస్త్రం.

కొందరు పువ్వుల్ని తీసుకొని రెక్కలు చిదిమి పూజిస్తారు. అలా వాడరాదు.

**పత్రం పుష్పంఫలం చైవ**
**యథోత్పన్నం తథార్పయేత్॥**

పత్ర పుష్పఫలాదులు ఎలా ఉత్పన్నమయ్యాయో అలాగే అర్పించాలి. కమలాలు (పద్మాలు – తామరలు) సర్వదేవతలకు ప్రీతికరం. అమ్మవారికి వావిల పూవులు, మంకెన, అవిసె కుసుమాలు, బిల్వపత్రాలు, గన్నేరు, వకులం కూడా ప్రీతికర కుసుమాలు. బిల్వాలు, తులసి ఆకులు వేరుచేసి పూజించరాదు. దళాలుగా తీసి పూజించాలి.



ప్ర: **భగవంతుని పూజకు నియమాదులు, శౌచం ఎందుకు? ఆయనకు అవేవీ లేవు కదా! భక్త కన్నప్ప ఎంగిలి మాంసం ఇచ్చాడు. భక్త శబరి ఎంగిలి పళ్ళు ఇచ్చి పూజించింది కదా.**

**జ:** భగవంతునికి నియమాదులు లేవు. అవి మనకే. కన్నప్ప వంటి భక్తుల స్థితి వేరు. మన స్థితివేరు. అడవిలో శివలింగాన్ని చూడగానే అన్నీ మరచి, అన్నీ విడచి ఆయన కోసమే ఉండిపోయి, జీవితసర్వస్వాన్ని అర్పించినవాడు కన్నప్ప. ఆయనకు ఏ కోరికా, ఏ అపేక్షా లేవు. శివుడే తప్ప మరేమీ పట్టని పరమభక్తుడు. అతడికి ఎంగిలి మాంసం ఇవ్వకూడదనీ తెలియదు. శౌచనియమాలు ఉంటాయని తెలియదు. అతడికి తెలిసిందల్లా శివుడొక్కడే. ఆయనపై ప్రేమ మాత్రమే. ఆ మాట కొస్తే శివుడికి మాత్రం ఎంగిలి మాంసం కావాలా!

నిష్కామమైన ప్రేమతో అన్నిటినీ అధిగమించిన మహాభక్తులు వాళ్ళు. అంతేగాని వారి భక్తికీ, మనం చేసే పూజకీ సంబంధం లేదు. అలసత్వం (బద్ధకం), సోమరితనం చేత నియమాదులు వదలివేయడం దోషమే. "యధాశక్తి"పాటించడం చాలా

అవసరం. పైగా దైవపూజ విధిగా చేసేదీ, కామ్యమునకై చేసేదీ– అని రెండు విధాలు. దైవఋణం తీర్చుకోడానికి నిత్యంగా, నైమిత్తికంగా చేసే పూజలు, మన క్షేమమూ మన వారి క్షేమమూ కోరి చేసే పూజలు విధి విధానాలతో చేయాలి. భక్తి కూడా ఉంటే ఇంకా మంచిది. కామ్యమైన పూజలో శ్రద్ధ, విధానం ఎక్కువ అవసరం. నిష్కామంగా, పరమపారవశ్యంగా చేసే పూజలో భక్తుడు కావాలనో, బద్ధకం చేతనో ఏ నియమమూ ఉల్లంఘించడు. అపారమైన ప్రేమతో తాదాత్మ్యం చెంది, ఆ తన్మయీ భావనలో తన భక్తిని ప్రకటిస్తాడు. వారు ధన్యులు. మనకు ఆరాధ్యులు.

శబరి కూడా మహాత్మురాలు. కానీ ఆమె ఎంగిలిపళ్ళు ఇచ్చినట్టుగా వాల్మీకి రామాయణంలో రచించలేదు. ఔచిత్యపరంగా ఆలోచిస్తే– ఆమె మతంగాది మహర్షుల దగ్గర పరిచర్యలు చేసిన పావనురాలు. యోగిని, సిద్ధ వనిత. వారి యజ్ఞాది దీక్షలలో సహకరిం చినది. ఆమెకు శౌచాశౌచాలు తెలియవా? ఎవరో భక్తులు చక్కని ఊహతో కల్పించినదే ఎంగిలిపళ్ళ కథ.

అదలా ఉంచి– మన సోమరితనాన్ని, నిర్లక్ష్యాన్నీ సమర్థించుకోడానికి మహాభక్తులను పోల్చడం ఎందుకు? శివుడు పరీక్ష పెడితే, తడుముకోకుండా కంటినే తీసి ఇచ్చిన మహాత్ముడు కన్నప్ప. తానిచ్చినది తినేవరకు విడిచి పెట్టకుండా శివుని సాధించిన దృఢవ్రతుడు. అటువంటి భక్తి లభించాలంటే అనేక జన్మలలో అత్యంత నియమపూర్వకంగా చేసిన తపస్సులు పండాలి. పెద్దలను అడిగి తెలుసుకొని, పరంపరను వదలకుండా– తెలిసినంతవరకు, చేయగలిగినంత వరకు శక్తి వంచన లేకుండా నియమపాలన చేయవలసినదే.



**ప్ర: 'బ్రహ్మకడిగిన పాదము' అనే దానికి వివరణ ఇవ్వవలసినది. బ్రహ్మ విష్ణుపాదాన్ని కడిగిన సందర్భం ఏమిటి?**

**జ:** గంగాదేవి దేవతామూర్తిగా హిమవంతుని పెద్ద కుమార్తె. ఆమెను బ్రహ్మదేవుడు దత్తపుత్రికగా స్వీకరించి, బ్రహ్మ (సత్య) లోకంలో శివుని కిచ్చి వివాహం చేశాడు. శివుని వెంట వెళుతున్న గంగను చూసి, బ్రహ్మదేవుడు పుత్రికావాత్సల్యంతో దుఃఖించాడు. అతడిని ఓదార్చిన గంగ జలరూపంలో బ్రహ్మకమండలంలో ఉంటానని చెప్పి, వనితా రూపంతో శివుని వెంటవెళ్ళింది.

కొంతకాలానికి శ్రీమన్నారాయణుడు వామనునిగా అవతరించాడు. బలి నుండి మూడడుగుల నేలను దానమడిగి, ముల్లోకాలను ఆక్రమించుతూ ఒక పాదంతో

సత్యలోకాన్ని ఆక్రమించాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ఆ శ్రీహరి పాదాన్ని చూసి భక్తిపారవశ్యంతో, తన కమండలాంతర్గత గంగాజలంతో కడిగాడు.

పరమపావన విష్ణుపాదాన్ని చేరిన గంగ, అక్కడే సుస్థిరంగా ఉండిపోయింది. అలా విష్ణుపాదాన ఒదిగిన గంగనే భగీరథుడు తపస్సుతో రప్పించాడు. ఆ విధంగా గంగ 'విష్ణుపాదోద్భవ' అయ్యింది. 'బ్రహ్మ కడిగిన పాదము' అనే వాక్యం వెనుకనున్న పురాణ కథ ఇది.

ఈ కథను స్మరింపజేస్తూ, వామనావతార వృత్తాంతాన్ని తెలియజేస్తూ–

**"చెలగి వసుధ గొలిచిన నీ పాదము**

**బలితల మోపిన పాదము"**

అనే చరణాల మాటలతో స్పష్టపరచాడు అన్నమయ్య. పల్లవిలోని మొదటి వాక్యం– "బ్రహ్మ కడిగిన పాదము" తొలిచరణంలోని పైరెండు వాక్యాలు కలిపి త్రివిక్రముని త్రిపాదాలనీ తెలియజేస్తున్నాయి. అంతేగాక– వేంకటేశ్వరునికి తొలిసారిగా ఉత్సవాలు జరిపి పూజించినవాడు బ్రహ్మదేవుడే.



ప్ర: **లలితాదేవిని ఒక పటంలో ఒక సింహాసనం మీద శివునిపై కూర్చున్నట్లుగా ఆ ఆస నానికి నాలుగు కోళ్ళలో బ్రహ్మ, విష్ణువు, ఇంకా ఎవరో ఇద్దరు ఉన్నట్లుగా ఉంది. ఇందులో అంతరార్థం ఏమిటి?**

జ: లలితా సహస్రనామ స్తోత్రంలో ఈ పటానికి అంతరార్థం కనబడుతుంది. 'పంచ బ్రహ్మాసనాసీనా', 'పంచప్రేతమంచాధీశాయినీ', పంచకృత్యపరాయణా'– అనే నామా లలో పై చిత్రణ ఉంది. సృష్టి, స్థితి, సంహార, తిరోధాన(లయ), అనుగ్రహం అనేవి పంచకృత్యాలు. ఇవి ఒకే పరబ్రహ్మ తన శక్తివలన సాగించే పంచకృత్యాలు. వాటి నిర్వహణకై ఆయన ధరించిన ఐదు బ్రహ్మల రూపాలు...

1. బ్రహ్మ, 2. విష్ణు, 3. రుద్ర, 4. మహేశ్వర, 5. సదాశివ. వారిని అధిష్ఠించి ఉన్న శక్తి ఒక్కటే. ఆమె– పరాశక్తి లలితాంబిక. "శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభావితుం"– శక్తి లేనప్పుడు శివుడూ అశక్తుడే– అని ఆచార్యులమాట. ఇరువురూ అవిభాజ్యులు.

ఈ పంచ కృత్యాలుగా పరబ్రహ్మశక్తి వ్యక్తమవుతుంది. అయిదు బ్రహ్మలుగానున్న పరబ్రహ్మ యొక్క అధిష్ఠాతృ శక్తి– అని తెలియజేసే దేవీ నామాలకు ఇచ్చిన చిత్రరూపమే మీరు చూసిన పటం.

**ప్ర: ఇంట్లో శివలింగాన్ని పెట్టి పూజించవచ్చా? ఇంట్లో శివలింగం ఉంటే మంచిది కాదని అంటుంటారు. ఇది ఎంతవరకు నిజమో తెలుపగలరు, ఒకవేళ ఉంచాలను కుంటే ఏ పరిమాణంలో ఉండవచ్చు. ఇట్లో రోజూ నిత్యార్చన ఎలా కొనసాగించాలి?**

**జ:** ఇంట్లో శివలింగాన్ని ఉంచి పూజించవచ్చు. బాణలింగం, సాలగ్రామం (విష్ణుశిల) వంటివి ఉంచితే ఎక్కువ నియమాలు, నిష్ఠ అవసరం. వాటిలో తేడా రారాదు. కనుక వెండి, స్వర్ణం, ఇత్తడి వంటి లోహాలతో శివలింగాలు ఉంచుకోవచ్చు. శివలింగం బొటన వేలంత పరిమాణానికి మించకుండా ఉండాలి. శివలింగం ఇంట్లో ఉంటే మంచిదికాదనే మాట పూర్తిగా అసత్యం.

నిత్యం శివలింగార్చన జరిగే ఇంట ఐశ్వర్యం సుస్థిరమై వర్ధిల్లుతుంది. నిత్యార్చన పొందే శివలింగం ఉన్న ఇంటికీ, ఇంటిల్లి పాదికీ శుభపరంపరలు లభిస్తాయి. శివలింగాన పార్వతీ పరమేశ్వరుల్ని ధ్యానించి షోడశోపచార పూజ చేసుకుంటే చాలు. 'స్నానం' అనే చోట శివనామాలతో అభిషేకం చేసుకోవచ్చు లేదా శివ స్తోత్రంతో జరపాలి. అష్టోత్తరశత నామాలతో బిల్వం, తులసీ, పువ్వులతో పూజించ వచ్చు. 'శివాయనమః' అంటూ ఉపచారాలన్నీ జరిపించవచ్చు. మన శక్తి కొలదీ ఆరాధన.



**ప్ర: 'తాపత్రయాలు' అంటే ఏమిటి?**

**జ:** మూడు విధములగు దుఃఖములకే 'తాపత్రయము'లని పేరు. 'త్రయము' అంటే మూడు అని అర్థం. అవి ఆధ్యాత్మిక దుఃఖం, ఆధిభౌతిక దుఃఖం, ఆధిదైవిక దుః ఖం. అందు 'ఆధ్యాత్మిక దుఃఖం' రెండు విధాలు. అవి శారీరకం, మానసికం. శారీరక దుఃఖం మన శరీరమందలి కఫ, వాత, పిత్తమను ధాతువుల వైషమ్యము వలన ఏర్పడే అనేక రోగాలకు కారణం. కామ, క్రోధ, లోభ, మోహ, భయ, ఈర్ష్య, అసూయ మొదలగు దోషములను కలిగించే విషయాల వల్ల మానవులకు కలిగే దుఃఖం 'మానసదుఃఖం'. ఈ రెండు విధాలైన దుఃఖాలు మన శరీరంలోని మనస్సు, ధాతువుల వైషమ్యం వలన ఏర్పడుతాయి. కాబట్టి వీటికి 'ఆధ్యాత్మిక దుఃఖ'మని పేరు వచ్చినది. ఇక బాహ్యోపాయసాధ్యమగు దుఃఖములు ఆధి భౌతికము, ఆధిదైవికము అగును.

ఇతర మానవుల వలనను, పశువులు, పక్షులు, పాములు, దుష్ట, క్రూర, వన్య మృగముల వలనను పంచ భూతముల వలనను ఏర్పడేవి, శీతోష్ణాల వలన కలిగేవీ

'ఆధిభౌతిక దుఃఖాలు'. యక్ష, రాక్షస, పిశాచ, గ్రహావేశాదుల వలనను, కారణమే తెలియక దుఃఖాలను 'ఆధి దైవిక దుఃఖాలు' అంటారు.

ఈ తాపత్రయాలందు 'ఆధ్యాత్మిక దుఃఖ' నివృత్తికై వైద్యులను, మనస్తత్వవేత్తలను అర్థిస్తాం. ఆధిభౌతిక దుఃఖాలను– చలికి కప్పుకొనుట, ఎండకు నీడను చేరుట, ఉష్ణమునకు పంకాలు వాడుట మొదలైన ఉపాయములలో కొద్దిగా నివారించు కుంటాం. మరి ఆధిదైవిక దుఃఖములకు భగవంతుని ప్రార్థించుట, యంత్రతంత్రా దులు తరుణోపాయాలు.

అయితే 'ఆధ్యాత్మికం' అనే పదానికి లోకమందు 'మంచిమార్గమని' కూడా అర్థ మున్నది. ఇందులో 'ఆధ్యాత్మిక'మను పదం విశేషణం. ఆధ్యాత్మిక చింత, ఆధ్యా త్మిక మార్గము అని పూర్తి చేసుకోవాలి. ఇక్కడ ఆత్మయను పదమునకు పరమాత్మ యని అర్థం. ఆత్మ శబ్దమునకు అనేక అర్థాలున్నాయి.

**'ఆత్మా– జీవే, ధృతౌ, దేహే, స్వభావే, పరమాత్మని'** అని అమరకోశం. 'ఆత్మ అనే పదానికి జీవుడు, హృదయం, దేహం, స్వభావం, పరమాత్మ అనే అర్థాలు. వాటి సందర్భం బట్టి అర్థాన్ని గ్రహించాలి. ఆధ్యాత్మిక దుఃఖం అనే చోట ఆత్మశబ్దానికి శరీరమని అర్థం. దీనినే దేహమని అమరసింహులు తెలిపారు. శరీరంలో కలుగు తుంది. కాబట్టి ఈ దుఃఖములు ఆధ్యాత్మిక దుఃఖాలయ్యాయి. ఇక ఆధ్యాత్మిక మార్గము, ఆధ్యాత్మిక చింతన, ఆధ్యాత్మిక ప్రతిపత్తి మొదలైన స్థలాలలో 'ఆత్మ' శబ్దమునకు పరమాత్మ అని అర్థం. కాబట్టి సన్మార్గము, సచ్చింతనము, సద్భావన అనే అర్థము లేర్పడ్డాయి.



ప్ర: **కలకత్తా ప్రాంతాలలో పిల్లలు పుట్టాక 'షష్ఠీదేవి' పూజ చేస్తుంటారు. ఈ షష్ఠీదేవి ఎవరు? ఈ దేవత ప్రసక్తి ఎక్కడ ఉంది? ఈమె తాంత్రికదేవతా? లేక మన పురాణాల్లో ఉందా?**

**జ:** ఆ ప్రాంతాలలో శాక్తేయం బాగా ప్రశస్తి వహించింది కనుక, 'షష్ఠీదేవి' ఆరాధన కూడా అక్కడ ప్రాచుర్యం పొందింది. షష్ఠీదేవి మన సనాతన మతంలోని దేవత. దేవీభాగవతం, బ్రహ్మవైవర్త పురాణం– మొదలైన గ్రంథాలలో ఈ దేవత ప్రసక్తి ఉంది. ప్రకృతి (పరాశక్తి) యొక్క 'షష్ఠాంశ' (ఆరవ కళ) ఈ దేవత. అందుకే 'షష్ఠీ దేవి' అన్నారు. ఈమె పేరు 'దేవసేన'. కుమారస్వామి యొక్క శక్తి.

ఈమె సంతానప్రదాయిని. అంతేకాక శిశురక్షకి, బాలారిష్టాల నుండి శిశువుల్ని

కాపాడే శక్తి. ఈ కారణం చేతనే పిల్లలు పుట్టాక ఈ తల్లిని పూజిస్తారు. బారసాలల్లో మనం పూజించే దేవతకూడా ఈ దేవతే. స్వాయంభువ మనువు కుమారుడు ప్రియవ్రతుడు. అతడి సంతానం ఏదీ నిలవకపోయేటప్పటికి దుఃఖాక్రాంతు డౌతాడు. అప్పుడు జగదంబ యొక్క షష్ఠాంశ 'షష్ఠీదేవత'గా వచ్చి, ఈ రాజుని ఓదార్చి మృతుడైన అతడి శిశువును బ్రతికించినట్లు 'దేవీభాగవతం' చెప్తోంది. అప్పటి నుండి షష్ఠీదేవిని పూజించే ఆచారం వ్యాప్తిలో ఉంది.

శిశువు పుట్టిన ఆరవనాడు, పురుటిశుద్ధినాడు, అన్నప్రాశన సమయంలో ఈ పూజచేయడం తల్లికీ, బిడ్డకీ క్షేమకరమని పురాణవచనం. మన ధర్మశాస్త్రాలలో కూడా షష్ఠీదేవి పూజ 'విధి'గా చెప్పారు. శిశువు ఎంతకీ ఏడుపు ఆపనప్పుడు షష్ఠీ దేవి స్తోత్రం చదివితే వారి బాధ పోతుందని, బాలగ్రహపీడలు పోతాయని పురాణ వచనం. అమ్మవారివి అనంతరూపాలు. కొన్ని ప్రాంతాలవారు కొన్నిటిని మరచిపోయి వదులుకున్నారు. కొన్ని ప్రాంతాల వారు మరువకుండా పాటిస్తు న్నారు.

**ప్ర: గురుగ్రహ దోషాలు పోయేందుకు 'దక్షిణామూర్తి'ని తమిళనాడులో పూజిస్తారు. ప్రతి గురువారం దక్షిణామూర్తి పూజలు చేస్తుంటారు. గురువుకీ, దక్షిణామూర్తికీ సంబంధం ఏమిటి?**

**జ:** దక్షిణామూర్తి శివుని యొక్క ఒక రూపం. ఇది గురురూపం. సకల విద్యాప్రదాయకుడుగా, ఆదిగురువుగా వటమూలంలో సాక్షాత్కరించిన శివరూపమిది.

ఏ గ్రహాన్నైనా నేరుగా పూజించేకన్నా, వాటిని శాసించే భగవన్మూర్తిని పూజిస్తే, ఆ గ్రహదోషం పోతుంది. ఈ కారణంచేతనే గురువులకు గురువైన దక్షిణామూర్తిని ఆరాధించడం చేత గురుదోషం పోతుందని శాస్త్రవచనం. అందువల్లనే గురువారం "దక్షిణామూర్తి"ని పూజించడం, గురుగ్రహం రాశి మారినప్పుడు కూడా అర్చనలు జరిపించడం. ఇది సనాతన మతస్థులు అందరూ పాటించవలసిన ఆచారం. అయితే శైవసంప్రదాయం- నాయనార్లు వంటి మహాత్ముల వల్ల తమిళనాట బాగా పరిపుష్టమై, అక్కడ నేటికీ దేవాలయ సంస్కృతి వల్ల సరిగ్గా అనుష్ఠింప బడుతున్నాయి. దక్షిణామూర్తిని పూజించడంవల్ల, గురుగ్రహ దోషం పోవడమే కాకుండా, పరమ ప్రయోజనంగా విద్య, విజ్ఞానం, బ్రహ్మవిద్య లభించుతుంది కూడా.

**ప్ర: జంతువుల చర్మాలను ఆసనాలుగా వాడడం అనేది, హింసను ప్రోత్సహిస్తున్నట్లు అనిపిస్తోంది!**

**జ:** జంతువును హింసించి, చంపి వాటి చర్మాలను ఆసనాలుగా వాడడం శాస్త్ర విరుద్ధం. తనంతతానుగా, సహజంగా కాలధర్మం చెందిన వాటి చర్మాలను మాత్రమే (అదీ జింక, పులి) ఆసనాలుగా వాడాలి. వాటినుండి ప్రసరితమయ్యే శక్తితరంగాలు మంత్రశక్తిని కేంద్రీకరించడంలో సమర్థత కలిగి ఉంటాయి.

అయితే వేటాడి, చంపి తెచ్చిన ఆసనాన్ని వాడరాదు. ఎక్కడైనా తుపాకీ తూటు, బాణపు దెబ్బ గుర్తులుంటే ఆ చర్మాన్ని వాడరాదు. ఉదాహరణకు- కంచి పీఠానికి ఒక భక్తుడు కానుకగా సమర్పించిన చర్మాసనంలో తుపాకీ తూటు గుర్తును చూడ గానే, కంచి మహాస్వామి వెంటనే దానిని వెనక్కి పంపించి వేశారు. మన సంస్కృతిలో హింసను ఎక్కడా ప్రోత్సహించలేదు. అందునా తపోయోగసాధనల్లో హింస పనికిరాదు.

ప్ర: **'వసు- రుద్ర- ఆదిత్యులు' అంటే ఎవరు? వారిని పితృకర్మలలో ఎందుకు ఆరాధిస్తారు?**

**జ:** వారు ఎనమండుగురు వసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు.

**వసువులు:** అగ్ని, భూమి, వాయువు, అంతరిక్షం, సూర్యుడు, ద్యులోకం, చంద్రుడు, నక్షత్రాలు. **వీటికి వసురూప దేవతలు:** ధరుడు, అహుడు, ప్రత్యూషుడు, ధ్రువుడు, అనిలుడు, ప్రభాసుడు, సోముడు, అనలుడు. వీరు ప్రాణులను 'వసింపజేస్తారు' కాబట్టి వారికి వసువులని పేరు వచ్చింది. 'వసు' అంటే 'సంపద' అని అర్థం కూడా ఉంది. పై చెప్పిన 'అగ్ని' మొదలైనవి సంపదలు.

అలాగే 'ఏకాదశరుద్రులు' గురించి పురాణాల్లో చెప్పారు. వారు శరీరంలో పది ఇంద్రియాలను, జీవుని అధిష్ఠించి ఉండే దేవతలు, వీరు శరీరాన్ని వదిలిపోయే టప్పుడు ఆ శరీరానికి సంబంధించిన వారికి దుఃఖాన్ని (రోదనాన్ని) కలిగిస్తారు కనుక 'రుద్రులు' అని పేరు కలిగింది.

**ఏకాదశ రుద్రదేవతలు -** మన్యుడు, మనువు, మహీనసుడు, మహాన్, శివుడు, ఋతుధ్వజుడు, ఉగ్రరేతుడు, భవుడు, కాలుడు, వామదేవుడు, ధృతవ్రతుడు.

ఇక **పంద్రెండుగురు ఆదిత్యులు.** వీరే చైత్రం మొదలైన నెలలకు అధిపతులు. వీరి పేర్లు: వివస్వాన్, అర్యమ, పూషా, త్వష్టా, సవితా, భగుడు, ధాతా, విధాతా, వరుణుడు, మిత్రుడు, శక్రుడు, ఉరుక్రముడు. వారివల్ల మానవుల జీవనకాలం ముగుస్తుంది. కాబట్టి వీరికి 'ఆదిత్యుల'ని పేరు. 'ఆదదానాయంతి' జీవుల ఆయువునూ, కర్మ

ఫలాలను గ్రహించిపోవుదురు గాన 'ఆదిత్యులు'.

వీరికి పైన దేవతలకధిపతియగు ఇంద్రుడును, సకల ప్రపంచమును సృష్టి చేయు ప్రజాపతియు గలరు. వీరందరినీ కలిపిన ముప్పది ముగ్గురు దేవతలవుతారు. వీరంతా వేదప్రతి పాద్యమైన 'శుద్ధబ్రహ్మము' యొక్క అంశములే. ప్రపంచ సృష్టి సందర్భాన జీవులకు కర్మఫలాలనిచ్చి వారిని రక్షించడానికై చేయ బడిన వ్యవస్థయే ఇది. ఇవన్ని శుక్లయజుర్వేదమున చేరిన శతపథ బ్రాహ్మణంలో చెప్పబడినవి.

ఇక చనిపోయినవారు ఒక సంవత్సర కాలానంతరం వారి పితృకార్యాలు జరిగిన తరువాత వసురూపం పొందుతారు. వారి సంతతివారు పితృలోకానికి వచ్చిన ప్పుడు వీరికి 'రుద్ర' భావం వస్తుంది. అట్లే వసువులుగా ఉన్నవారి పుత్రాదులు పై లోకాలకు వచ్చినప్పుడు వీరికి 'ఆదిత్య' భావము వస్తుంది. కాబట్టి తర్పణ ములు, శ్రాద్ధములు చేసేటప్పుడు పితృదేవతలను వసురుద్ర ఆదిత్యరూపము గలవారుగా ప్రార్థిస్తాం. వారికి మనల్ని అనుగ్రహించే శక్తి ఆ స్థానబలమువల్ల కలుగుతుంది. ఈ దేవతలకు ఆహారం మనలాగే నోటియందుంచుకొని నమిలి మింగుట వలననే తృప్తి కలిగి స్తుందని లేదు. కానీ నువ్వులు, నీరు, అన్నము వీటిని చూడడంచేతనే తృప్తి ఏర్పడు తుంది. దీనినే వేదాలు **'నహవైదేవా అశ్నంతి, నపిబంతి కింతుదృష్ట్వా తృప్యంతి'** అని తెల్పుతాయి. కాబట్టి దేవతలకు నైవేద్యమని వాటిని వారిముందు చూపి మనం భుజిస్తాం. వాటిని చూడడం చేతనే తృప్తినొందిన దేవతలు మనలను ఆశీర్వదిస్తారు. వారి ఆశీస్సులు అమోఘాలు కాబట్టి జీవులు శుభాలు పొందుతారు.

ప్ర: **'సృష్టికర్తయగు పరమాత్మ ఇంద్రియములను బాహ్యవస్తువులపైనే ప్రసరించునట్లు సృష్టించెను.' (పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః) భగవానుడు చేసే ప్రతి పనికి ఏదో ఒక ఉద్దేశం తప్పకుండా ఉండి ఉంటుంది. కనుక, భగవానుడు ఈ విధంగా ఎందుకు సృష్టించాడు?**

**జ:** ఇంద్రియాలకు– బాహ్యవస్తువులపైనే ప్రసరించే లక్షణం అనేది స్వాభావికం, సహజం. సహజత్వమే భగవంతుని సృష్టి. ఆ లక్షణమే లేకపోతే విశ్వసృష్టి స్థితులు జరుగవు. ఇంద్రియాలకున్న ఆ లక్షణం చేతనే జగత్తును జీవుడు అనుభవి స్తున్నాడు. బాహ్య జగత్తుకీ, జీవునకీ మధ్య వారధి ఇంద్రియాలు. అంతర్దృష్టి (అంతరంగపై దృష్టి ప్రసరించడం) మనస్సు (అంతరింద్రియం) సాధించవలసిన లక్షణం. అది ఇంద్రి యాల లక్షణం కాదు. బాహ్యాన్ని మాత్రమే దర్శించే ఇంద్రియాలతో మనస్సు మైకం

చెందితే, 'బహిర్ముఖత్వ'మే మనస్సుకి అలవడుతుంది. ఎందుకంటే బహిర్ము ఖత్వం ఇంద్రియాల సహజలక్షణం. కనుక అంతర్ముఖత్వాన్ని అలవరచుకోవలసినది మనస్సు మాత్రమే.

ఈ జగత్ సృష్టి వ్యాప్తికోసం, జీవుని అనుభవం కోసం– భగవంతుడు ఈ ఇంద్రియాలను బాహ్యవస్తువులపైనే ప్రసరించునట్లు సృష్టించాడు. జీవుని గత కర్మల ఫలంగా వాటిని అనుభవించేందుకై ఆ విధంగా సృష్టించాడు పరమాత్మ. మీరు ఉటంకించిన వాక్యం 'కఠోపనిషత్తు'లోనిది. దాని తరువాతి వాక్యాలను కూడా కలిపి చూస్తే ఇది స్పష్టమవుతుంది.

**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్**
**ఆవృత్తచక్షుః అమృతత్వమిచ్ఛన్॥**

స్వాభావికమైన ఇంద్రియ దృష్టిని విడిచి, ద్వంద్వాతీతుడై, ధీరుడై, అమృతత్వాన్ని కోరినవాడై, అంతర్ముఖుడై ప్రత్యగాత్మను దర్శిస్తున్నాడని – ఈ మంత్రానికి భావం.

ప్ర: **"చేసేది చేయించేది అంతా నేనే" అని గీతలో కృష్ణపరమాత్మ చెప్పారు కదా? మరి జీవునికి పుణ్యం పాపం ఎక్కడ్నుంచి వస్తున్నాయి?**



జ: మీరు బహుశః విశ్వరూప సందర్శన యోగంలో **"మయైవైతే నిహతాః పూర్వమేవ – నిమిత్త మాత్రం భవసవ్యసాచిన్"** అన్న భగవానుని వచనములనుద్దేశించి ఈ ప్రశ్న వేసినట్లున్నారు. ఏ సందర్భంలో ఎవరు ఎవరిని ఉద్దేశించి ఈ మాటలు అన్నారనేది పరిశీలించవలసియుంది. ప్రపంచమంతా విష్ణుమయమన్న విష యాన్ని ఉత్తమాధికారి ముముక్షువు అయిన అర్జునునకు దర్శనం కావించిన తరువాత ఈ వాక్యములన్నారు శ్రీకృష్ణపరమాత్మ. చేసేదీ చేయించేదీ పరమాత్మే నన్న రూఢిజ్ఞానం అర్జునునకు ఆ సమయంలో కలిగింది. అట్టి స్థితిలోని మాటలు సామాన్యజీవుల విషయంలో అన్వయించడం కుదరదు.

ముందు సామాన్య జీవుని విషయం చెప్పుకొందాం. భగవద్గీతలో ప్రపంచంలో ఎవరికీ ఒక్కక్షణమైనా ఏ పనీ చేయకుండా కూర్చోవడం కుదరదంటాడు పరమాత్మ.

**నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్యకర్మ కృత్.** దీనికి కారణమేమిటి? అదీ ఆయనే చెబుతాడు. జీవులందరూ ప్రకృతి సంభవములైన సత్త్వరజస్తమో గుణములచే ప్రేరితులై, వ్యామోహితులై, అజ్ఞాన పరవశులై తమ కిష్టమున్ననూ లేకున్ననూ సాత్విక రాజస తామస కార్యములు చేస్తూనే ఉంటారు, జ్ఞానులు మినహా. కాబట్టి కర్మలకు

కారణం ప్రకృతి నుండి ఉద్భవించే సత్వరజస్తమో గుణములు. జీవులందరూ ప్రకృతికి తగినట్లు ప్రవర్తిస్తే ఇక పురుషకారము యొక్క ప్రయోజనమేమిటి. వేదములలో ఈ కర్మలు చేయి, ఈ కర్మలు చేయవద్దు అని చెప్పే విధినిషేధ వాక్యములకు అర్థమేమిటి? ఈ ప్రకృతి (సృష్టి విషయంలో సంస్కారము) అన్ని ఇంద్రియములకు తమకిష్టమైన విషయములందు రాగము, ఇష్టముకాని విషయములందు ద్వేషము కలిగిస్తుంది. ప్రతి జీవికి సంస్కారాన్ని బట్టి ఇష్టానిష్టాలు కలుగుతూ ఉంటాయి.

ప్రకృతికి రాగద్వేషములు కలిగించే శక్తి ఉన్నదికానీ, కర్మల యందు ప్రవర్తింపజేసే శక్తి లేదు. అలా ప్రవర్తింపజేసేవి రాగద్వేషాలు. జీవునికి ప్రకృతిని నిగ్రహించడం కుదరదు. కానీ దాని వలన జనించిన రాగద్వేషాలను పురుష కారంతో నిగ్రహించమని శాస్త్రం ఉద్బోధిస్తోంది. అది ఎలా? అగ్నికి కాల్చే శక్తి సహజము. మన ఇల్లు కాలు తోందనుకోండి అగ్ని యొక్క కాల్చేశక్తిని మనమేమీ చేయలేక పోయినా మన ఇంటిపై నీరు చిమ్మి రక్షించుకోగలం కదా! కాబట్టి రాగద్వేషములను శాస్త్రము చెప్పిన సంప్రదాయము ననుసరించి వశపరచుకోవాలి. అలా కాకపోతే, రాగద్వేషాలకు లోనైతే పాపం చుట్టుకొంటుంది.

మానవుడు చేసే కర్మలు అతనికి భావి కాలములో సుఖదుఃఖాలను కలిగిస్తాయి. అయితే ఈ కర్మలు చేయడానికి శక్తి ఇచ్చేవాడు ఈశ్వరుడే. ఆయన అనుగ్రహం లేకపోతే గడ్డిపోచ కూడా కదలదు. అతడు ప్రతిమానవుని హృదయమందు తనకు స్థానము కల్పించుకొని ఉంటాడు. ఇక్కడింకొక ప్రశ్న. మానవుడు చేసే ప్రతి పనికి ఆయన సహకరిస్తే, ప్రేరేపిస్తే దాని ఫలితమైన సుఖదుఃఖాలు పాప పుణ్యములు ఆయనకే రావాలి కదా! లోకంలో హత్య చేసినవానితో పాటు చేయించినవానికి కూడా శిక్షపడడం లేదా?

బ్రహ్మసూత్రములలో **'నసాపేక్షత్వాత్'** అనే సూత్రంలో వ్యాస భగవానులు దీనికి సమాధానమిచ్చారు. ఈ పుణ్యపాపములు ఆయనకు చేరవన్నారు. మేఘం వర్షి స్తుంది. దాని మూలానా అనంతమైన ప్రయోజనం కలుగుతోంది. కొందరికి విపరీత మైన నష్టము కలగవచ్చు. కురిసే మేఘానికి వాడికి లాభం చేయాలనీ లేదు. వీనికి నష్టం కలిగించాలనీ లేదు.

అలాగే దీపం తారతమ్యము లేకుండా అన్ని వస్తువులను ప్రకాశింపచేస్తుంది. భగ వంతుడు సైతం ప్రతిమానవుని బుద్ధిని, ఇంద్రియములను, దేహమును ప్రకాశింపచేసి

అవి వాటి కార్యము చేయడానికి సహాయపడుతున్నాడు. కానీ మానవుని శుభాశుభ కార్యములతో ఆయనకు సంబంధము లేదు. ఇక్కడ పైన వివరించిన రాగద్వేషాలను ఉపశమించుకొనడమే పురుషకారం యొక్క ప్రయో జనం. బలమైన సంస్కారములు మనలను వివిధ కర్మలకు ప్రోత్సహిస్తున్నా శాస్త్ర దృష్టితో సత్కార్యములు మాత్రమే చేయాలి.

మనుష్యుడు చేసే పాపపుణ్యాలకు ఫలితం మాత్రం పరమేశ్వరుడు అనుగ్రహిస్తాడు. అదీ ఎలా? అసంగుడై కేవలము న్యాయాధిపతివలె. మనుష్యులకు వారివారి ఆశాపాశ ములు వారిని బంధిస్తున్నాయి.

**"కామ ఏష ప్రవర్తకః", "కామ ఏష క్రోధ ఏష రజో గుణ సముద్భవః"** అన్న గీతావాక్యములు. **"కామోకార్షీత్ మన్యుర కారిషీత్"** అన్న తైత్తీరియ శ్రుతి వచనములు ఈ విషయాన్నే చెబుతున్నాయి. కామమే సర్వానర్థాలకు కారణం. కోరిక తీరకపోతే అది క్రోధరూపంలో పరిణమిస్తోంది. ఇక ఈ కామము, మహాశనము. ఎంత అను భవించినా ఇంకా కావాలనిపిస్తూనే ఉంటుంది. దీనివల్లనే అన్నీ అనర్థములు సంభ విస్తున్నాయి. ఈ కామ నిర్మూలనమే శాస్త్రచోదితమైన పురుషకారము యొక్క ప్రయోజనము.



ప్రపంచంలో ఎవ్వరూ ఏ కర్మా చేయకుండా ఖాళీగా ఒక క్షణం కూడా కూర్చోలేరు కాబట్టి, శాస్త్ర చోదితమైన కర్మలు, తన కధికారమైనవాటిని ఆ కర్మ ఫలితాల మీద ఆసక్తి లేక ఈశ్వరార్పణ దృష్టితో చేయడం ద్వారా ఈ విషవలయం నుండి తప్పించుకో గలుగుతాము. తాను జీవన్ముక్తుడే అయినప్పటికీ పరమాత్మ అయిన శ్రీకృష్ణుడు కూడా తానీ విధంగా కర్మ చేస్తున్నానని చెప్పుకొని ఉన్నాడు.

సమష్టి రూపంగా ఆలోచించినట్లయితే దుర్యోధనాదులు చేసిన కర్మలకు ఫలితం యుద్ధంలో హతమవడమనే విషయం న్యాయాధీశుడైన పరమేశ్వరుడు తీర్పు ఇచ్చేశాడు. దానిని తప్పించడానికి ఎవరివల్లా కాదు. పురుషకారంతో బహు ప్రయత్నం వల్ల అర్జునుడు ఆ పనిచేయకపోతే ఇంకొకడు చేస్తాడు. కానీ క్షత్రియు నిగా జన్మించి, శస్త్రములను చేత ధరించిన అర్జునునికి దుష్టసంహారమనే విధి ఉన్నది. ఆ ధర్మాన్ని చేయమంటున్నాడు పరమాత్మ. ఈశ్వరార్పణ బుద్ధితో, కామ క్రోధముల వంటి వానితోనో, రాగద్వేషముల వంటివానితోనో, దూషితముకాని మనస్సుతో, స్వాధి కారమైన ధర్మాన్ని నిర్లిప్తునిగా ఆచరించిన జీవికి పాపపుణ్య ములు అంటవు. నిజానికి

జ్ఞాన స్థితిలో కర్మలూ అవసరంలేదు.
**"నిస్త్రైగుణ్యే పథి విచరితే కోవిధిః కోనిషేధః".** అయితే అట్లాంటి జ్ఞానస్థితి తాత్కాలికంగా పొందిన వానిని కూడా రాగద్వేషాలు కాలుబట్టి లాగివేస్తాయనే విషయం మనకు అనేక ఋషుల చరిత్రలలో చదువుతున్నాము. అంతే కాదు, ఒకప్పుడు మన మనస్సే మనను మోసం చేస్తుంది. మనకు లేని సమసిద్ధి మనకు లభించిందనే స్ఫురణ కలగజేస్తుంది. అదీకాక, మహాపురుషులు కర్మను మానివేస్తే వారిని అనుసరించే వారూ కర్మను మాని వేస్తారు. అందువల్లనే జీవన్ముక్తునిగా ప్రఖ్యాతి గాంచిన కంచి మహాస్వామివారివంటి మహాపురుషులు తుదిక్షణం దాకా తమ ధర్మాన్ని అసిధారావ్రతంగా పాటించారు. ఇక కేవలం మెట్టవేదాంతం చెప్పేవారు దంభాచారులే అవుతున్నారు.
ఈ విషయం వివరించడానికో కథ చెబుతారు. యజ్ఞయాగాది క్రతువులు చేసిన బ్రాహ్మణుడు ఉన్నాడు. అతడికి ఏ ప్రభువులో ఇచ్చిన పొలాలున్నాయి. దాంట్లో మంచి పంటలు వేసి ఫలసాయాన్ని పొందుతూ ఉంటాడు.
ఆ చేలో ఒక ఆవు మేయడం చూశాడొక రోజు. కోపంతో కొట్టాడో ఏమో ఆవు చనిపోయింది. వెంటనే గోహత్యా పాతకం చుట్టుకొంది. పండితుడు కదా! "నాకు పాపంలేదు. ఈ చేతికి, మనస్సుకు ఇంద్రుడు అధిష్ఠాన దేవత. అతనినీ పాపం చుట్టుకొంటుంద"న్నారు వాక్శుద్ధి కలవాడు. నిజంగానే ఇంద్రునికి పాపం చుట్టుకుంది. ఇంద్రుడు మారువేషంతో వచ్చాడు.
బ్రాహ్మణుడితో "ఇంత బాగా పైరు వచ్చింది. ఇది ఎవరి ప్రభావమో"నన్నారు "సందేహం ఏమున్నదయ్యా! ఇదంతా నా ప్రతిభే"నన్నాడు బ్రాహ్మణుడు. "ఇదిమాత్రం నీ ప్రతిభ– గోహత్యమాత్రం నాదా?' అన్నాడు ఇంద్రుడు. దాంతో ఆ పాపం తిరిగి బ్రాహ్మణున్ని పట్టుకుంటుందని కథ.
చెప్పవచ్చిందేమంటే అనుభవంలోనికి తెచ్చుకోని వేదాంతం మెట్టవేదాంతమే అవుతుంది. కాబట్టి చేసేది చేయించేదీ పరమాత్మ అనడంలో సందేహం ఏమీ లేదు. కానీ ఏవిధంగా? లోకసభలో మెజారిటీ ఉన్న నాయకుని ప్రధానమంత్రిగా ఆహ్వానించే రాష్ట్రపతిలా, మెజారిటీ నిలుపుకోవడం ప్రధానమంత్రి బాధ్యత. లేకుంటే తొలగించేదీ రాష్ట్రపతే! ఇక జీవునికి రాగద్వేషాలు, కామక్రోధాలు ఉన్నంతవరకూ పాపపుణ్యాలు తప్పవు. అవిదాటితే జ్ఞానం సిద్ధిస్తుంది. తద్వారా జీవన్ముక్తి.

**ప్ర: దుర్గమ్మవారిని పులిమీద, సింహంమీద కూర్చున్నట్లు పటాలు ఉంటున్నాయి. ఇంతకూ అమ్మవారి వాహనం ఏది?**

**జ:** అమ్మవారు సింహవాహిని – అని పురాణాలు చెప్తున్నాయి. మహిషాసురుని మర్దించిన దుర్గాదేవి సింహవాహనంపైనే యుద్ధం చేసినట్లు దేవీ భాగవతం, చండీసప్తశతి వంటి గ్రంథాలు చెప్తున్నాయి.

అయితే దుర్గామూర్తులు అనేక రూపాలతో, వాహనాలతో ఉన్నవి తంత్ర, పురాణాదుల్లో చెప్పబడ్డాయి. అటువంటి రూపాలలో ఒకటి 'వ్యాఘ్రవాహని' (పెద్దపులిని వాహనంగా గల దేవికూడా ఉంది). 'వింధ్యవాసిని'గా విఖ్యాతయైన దేవి పులిపై కూర్చొని ఉంటుంది. మహిషాసురమర్దిని సింహవాహిని. ఒకేశక్తి యొక్క రెండు రూపాలివి.

**ప్ర: ఉపమన్యు మహర్షి శ్రీకృష్ణపరమాత్మకు శివదీక్షనిచ్చినట్లు చెప్తారు. శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవానుడే అయిఉండగా, ఆయన వేరొక మహర్షి ద్వారా ఉపదేశం పొందే అవసరమెందుకు?**



**జ:** 'యద్యదాచరతిశ్రేష్ఠః తత్తదేవేతరో జనః" అని శ్రీకృష్ణపరమాత్మ వచనం. లోకానికి ఆదర్శంకోసమే ఆయన సత్కర్మాచరణం చేశాడు. కర్మను ఆచరించవలసిన అవసరమే ఆయనకు లేదు. భగవంతుని ఉపాసించడం, గురువు ద్వారా దీక్షను స్వీకరించడం అనేది సత్సంప్రదాయం. ప్రతి మనిషికీ అవసరమైన ధర్మం.

ధర్మప్రతిష్ఠాపనకు అవతరించిన శ్రీకృష్ణుడు ఆ ధర్మాన్ని తాను ఆచరించి చూపించాడు. అన్ని విద్యలకీ ప్రభువైన ఆ స్వామి, స్వయంగా సాందీపని వద్ద విద్యలనభ్యసించిన విషయం విదితమే కదా!

'మహాభారతంలో' –శ్రీకృష్ణుడు ఉపమన్యువు వద్ద 'శివదీక్ష' పొందినట్లు చెప్ప బడింది.

**"రుద్రోనారాయణశ్చైవ**
**సత్యమేకం ద్విధాకృతం.**
**యత ఆత్మానమేవాహం**
**తతోరుద్రం భజామ్యహం"** "ఒకే సత్యం రుద్రుడనీ, నారాయణుడనీ రెండుగా చెప్పబడుతోంది. నా స్వరూపమైన రుద్రునే నేను సేవించాను". అని హరిహరులకు భేదంలేదని సాక్షాత్తూ శ్రీకృష్ణుడే మహాభారతం "శాంతిపర్వం"లో తెలియజేశాడు.

**శివస్యహృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః.** –అని 'వేదవాక్యం'.
శివుడు రామనామ రసికుడైనట్లే, విష్ణువు శివోపాసనారసికుడు. తనకిష్టమైన, తన హృదయమైన శివుని తాను ఆరాధించి, భగవదారాధన ఆవశ్యకతని మనకి బోధించాడు. ఆయనకు అవసరమై కాదు.

**యుగేయుగేతు కృష్ణేన**

**తోషితోవై మహేశ్వరః.** – ప్రతియుగంలోనూ, కృష్ణుని ద్వారా మహేశ్వరుడు అర్చింపబడతాడు.

**ప్ర: జపం, ధ్యానం.... ఈ రెండింటికీ గల భేదమేమిటి?**

**జ:** ఏదైనా ఒక మంత్రాన్ని మననం చేయడం జపం. బుద్ధిని ఏకాగ్రంగా ఒక దివ్య వస్తువుపై కేంద్రీకరించడం ధ్యానం. జపిస్తున్న మంత్రంపై, మంత్ర దేవతపై ఏకాగ్రంగా మనస్సుని నిలిపితే జపం, ధ్యానం ఏకకాలంలో సాగినట్లే.

**ప్ర: గౌతమ మహర్షికి అన్ని శాస్త్రాలూ, ధర్మాలూ తెలుసుకదా! పైగా తపశ్శక్తి సంపన్నుడు కూడాను. అటువంటి మహర్షి తాను చేసిన గోహత్యాపాప పరిహారం కొరకు వేరొక మునులను సలహా అడగవలసిన అవసరమేమిటి?**

**జ:** అది సంప్రదాయం. తనకు తెలిసినప్పటికీ, సమీపంలో పెద్దలెవరైనా ఉంటే వారిని అడిగి ప్రాయశ్చిత్తాదులు ఆచరించడం శాస్త్రవిధి. అందుకే– గౌతముడు స్వయంగా సర్వశాస్త్రవేత్త అయినా, మునులను ప్రాయశ్చిత్తం గురించి అడిగాడు.

**ప్ర: ఈ మధ్య ఒక ప్రముఖ ఆంగ్ల పత్రికలో ఒకవార్త చూశాను. 'తైవాన్‌కి చెందిన ఒక శాస్త్రవేత్త అక్కడి దేవాలయాలలో జరుగుతున్న హోమాల వల్ల వాతావరణం కాలుష్యమవుతుందనీ, క్యాన్సర్ వంటి రోగాలకు కారణమవుతుందనీ – కనుక యజ్ఞాదులు పర్యావరణాన్ని దెబ్బతీస్తాయ'ని వ్రాశారు. మరి యజ్ఞనిర్వహణ దేవతలనాహ్వానించే పవిత్ర క్రియకదా! అవి కాలుష్యానికి కారణమా! మనవారికి వైజ్ఞానికి స్పృహలేదా!**

**జ:** తైవాన్ దేవాలయాలలో అక్కడి వారి మత విశ్వాసాల ప్రకారం జరిగే యజ్ఞాలు వేరు. అందులో వారు వాడే హోమద్రవ్యాలు వేరు. ఆ ద్రవ్యాలు దగ్ధమవడం వల్ల కాలుష్యం కలిగే అవకాశం ఉండవచ్చు. వారి యజ్ఞాలు వేరు. మన యజ్ఞాలు వేరు.భారతీయ హైందవ సనాతన సంస్కృతిలోని ఏ హోమమైనా, ఏ యజ్ఞమైనా అందులో వాడే హోమద్రవ్యాలన్నీ ఓషధీ విలువలతో కూడినవే. వాటివల్ల వచ్చే పొగవల్ల వాతావరణ కాలుష్యం పోతుందనీ, పర్యావరణ పరిశుభ్రత సమకూరు

తుందనీ అనేకమంది శాస్త్రవేత్తలు సహేతుకంగా ఋజువు చేశారు.

పోలెండ్‌కి చెందిన శాస్త్రవేత్త ఎల్.మటేలా వంటి సైంటిస్టులు వైజ్ఞానిక పరీక్షలు జరిపి, "భారతీయుల యజ్ఞవిధానం – పర్యావరణ పరిరక్షణకు గొప్ప పరిష్కారం" అని ఋజువుచేశారు.

ఇది భౌతికమైన నిరూపణ అయితే, సూక్ష్మప్రపంచానికి చెందిన దేవతాశక్తుల్ని జాగృతం చేసే మహిమ కూడా యజ్ఞాలలో ఉంది. ఉపయోగించే మంత్రమూ, ఆహుతినిచ్చే ద్రవ్యమూ కలిపి దేవతా శక్తుల్ని ఆవిర్భవింపచేస్తాయి.

యజ్ఞం జరిగే ఏ వాతావరణంలోనైనా శరీరం, మనసు నిర్మలమైన ప్రశాంతతను అనుభవిస్తుందనేది, అనుభవమున్న అందరికీ తెలిసిన విషయమే. మన అగ్నిహోత్రగృహాలూ, దేవాలయాలలోని యాగశాలలూ కూడా శాస్త్రీయమైన నిర్మాణాలేనని – పరిశీలించిన ఎవరికైనా అవగాహన అవుతాయి.

మన యజ్ఞవిధానాలు తెలియకుండా, ఇతరుల విధానాలతో పోల్చి అవగాహనా రాహిత్యంతో అటువంటి వార్తలు ప్రచురించి, మొత్తం యజ్ఞాల వల్లనే వాతావరణం కలుషితమవుతుందని ప్రకటించడం అజ్ఞానమే.



ప్ర: **'తారక మంత్రం' అంటే ఏమిటి? రామనామాన్ని తారకమంత్రం అని ఎందుకు అంటారు?**

**జ:** 'తారం' అంటే 'తరింపజేసేది' అని అర్థం. 'కేవలం' మోక్షాన్ని ఇచ్చే మంత్రాన్ని మాత్రమే 'తారకమంత్రం' అంటారు. 'ఓంకార స్తారః' – అని వేదవచనం. మోక్షకారకమైన 'ఓంకారం' తారకం. అలాగే పంచాక్షరి (నమస్తారాయ....నమశ్శివాయ – రుద్రం) వంటి మంత్రాలను కూడా తారకమంత్రం అంటారు.

'రామ' షడక్షరీ మంత్రం కూడా మోక్షకారక మంత్రం. ఈ విషయం 'రామతాపినీయోపనిషత్తు', 'తారసారోపనిషత్తు' వంటివి పేర్కొన్నాయి. కనుక రామ మంత్రాన్ని కూడా "తారకమంత్రం" అంటారు. ఈ రహస్యం తెలిసినవాడు కనుకనే, భక్తరామదాసు "తారకమంత్రము కోరిన దొరికెను... అన్నిటికిది కడసారి జన్మము తథ్యంబిక పుట్టుట సున్న" అన్నారు.

ప్ర: **శ్రీశైలం మేము వెళ్ళినప్పుడు, అక్కడ అందరూ శివలింగాన్ని తాకి నమస్కరిస్తున్నారు. మిగిలిన క్షేత్రాలలో అలా జరగడం లేదు. ఉత్తరాదిలో కూడా అలాగే చేస్తారు. ఉజ్జయినీ, కాశీ వంటివాటిలో. కానీ మనవైపు, మిగిలిన దేవాలయాలలో ఇలా**

**అందరూ తాకరు. ఎందుచేత?**

**జ:** శివాలయాలుగానీ, ఏ ఆలయాలుగానీ ఆ బింబమందు (లింగం/విగ్రహం) యంత్ర, మంత్ర శక్తులతో దైవీకళలను ఆవహింపజేస్తారు. వాటి పవిత్రతను శౌచాదులతో కాపాడుకోవాలి. అప్పుడే, ప్రతిష్ఠించిన 'దేవతాశక్తి' చెక్కుచెదరకుండా ఉంటుంది. పైగా– అనేక మంది అనేక రకాల భావనా ప్రకంపనలతో ఉంటారు. వారంతా బింబాన్ని తాకితే, అందులో ప్రతిష్ఠితశక్తి తరుగుతుంది. అందులోనూ– కొన్ని వేల సంవత్సరాల నుండి వస్తూ, శాశ్వతంగా ఉండవలసిన శిల్పాలను కూడా తాకరాదనీ, దానివల్ల ఆ శిల్పం క్షయమౌతుందనీ 'పురాతత్త్వ శాస్త్రవేత్తలు' హెచ్చరికలు కూడా చెప్తున్నారు కదా! శిల్ప రక్షణ దృష్ట్యా కూడా అది సమర్థ నీయం. అయితే శ్రీశైలం, ఉజ్జయినీ, కాశీ– ఇవన్నీ జ్యోతిర్లింగాలు. వాటిని తాకినా, అందులోని దైవశక్తి సన్నగిల్లదని, శాస్త్రాలు చెప్తున్నాయి.

స్వయంభూలింగాలై, ప్రత్యేకించి 'జ్యోతిః' స్వరూపంగా ఉన్నవాటికి ఉన్న ఆ మహాశక్తిపై ఎటువంటి భావనా ప్రకంపనలైనా దెబ్బతిననీయవు. శివపురాణా దులు కూడా ఈ విషయం చెప్తున్నాయి. ఆ కారణం చేత ఎవరైనా జ్యోతిర్లింగాలను తాకి, అర్చించవచ్చు. అన్నిచోట్లా అలా పనికిరాదు. అయితే 'వాయుప్రతిష్ఠావిధానం' తో చేసిన ప్రతిష్ఠలలో శివలింగాన్ని స్పర్శించవచ్చు.

**ప్ర: ఈ మధ్య ఒక స్వామీజీవారు ప్రవచనం చేస్తూ– మార్కండేయుడు ప్రళయవేళ జలంలో కొట్టుకుపోతుంటే, ఎవరూ ఆదుకోలేదనీ, తనకు ఆయువిచ్చిన శివుడ్ని ప్రార్థిస్తే, అతడు వచ్చి చేయందించినా లాభంలేక పోయిందనీ, చివరకు శివుడు సైతం ఆ జలంలో కొట్టుకుపోయాడనీ చెప్పారు. ఇది ఎంతవరకు యథార్థం?**

**జ:** ఇటువంటి కథ ఎక్కడాలేదు. ఇంకా శైవవైష్ణవ భేదాలనే సంకుచిత ధోరణులు మనలో కొందరిని విడవడం లేదు. అందువల్లనే ఇలాంటి కట్టుకథలు పుట్టుకొస్తు న్నాయి. నిజానికి ప్రళయకారకుడు శివుడు. మహా ప్రళయంలోనూ నశించని తత్త్వం శివునిది. ప్రపంచమంతా ప్రళయబాధితమైనప్పుడు సాక్షిగా ఉండి, ప్రళయ తాండవం చేసేది రుద్రుడే.

**"... నశ్యత్ ప్రపంచలయం,**
**పశ్యన్ నిర్భయ ఏక ఏవ**
**విహరత్యానంద సాంద్రోభవాన్"** – అని ఆదిశంకరులు, 'శివానందలహరి'లో

ప్రవచించారు. ప్రళయవేళలో కూడా ఏకాకిగా (శక్తి సహితుడై) ఆనందసాంద్రునిగా విహరించే 'నిర్భయ' స్వరూపుడు శివుడు. జగదంబ నామాలలో "మహేశ్వర మహాకల్ప మహాతాండవ సాక్షిణీ" అనే నామం ఉంది.

'మహేశ్వరుడు ప్రళయవేళ చేసే తాండవాన్ని దర్శించే మహేశ్వరీశక్తి' జగదంబేనని సుస్పష్టం.

మృత్యుంజయుడైన శివుడు ఎందులోనూ కొట్టుకుపోడు.

**ప్ర: కరుణాస్వరూపులైన దేవతల చేతుల్లో- హింసకు సంకేతాలైన ఆయుధాలు ఎందుకుంటాయి?**

**జ:** అవి కూడా కారుణ్యానికి సంకేతాలే. సృష్టిలో ఈశ్వరకారుణ్యం- 1. రక్షారూపంగానూ, 2. శిక్షారూపంగానూ ఉంటుంది. ధర్మానికి రక్ష, అధర్మానికి శిక్ష. ఈ రెండింటినీ నిర్వహించే ఈశ్వరశక్తి విలాసాలే ఆయుధాలు. లోక విధ్వంస కారకాలైన రాక్షస శక్తుల్ని నాశనం చేయడానికి దైవశక్తి తన పరాక్రమాన్ని ప్రదర్శిస్తుంది. అహింసాస్థాపన కోసం చేసే హింస కూడా 'అహింస' క్రిందికే వస్తుంది.

ప్రార్థించే వారిలోనున్న రాక్షస ప్రవృత్తుల్నీ, అజ్ఞానాన్నీ నాశనం చేసే జ్ఞానశక్తి చిహ్నాలే పరమాత్ముని సగుణ రూపంలో కనబడే ఆయుధాలు. వాటి స్మరణవల్ల- మన సాధనలో ఆటంకంగా వచ్చే విఘ్నాలు, దుర్గుణాలు తొలగుతాయి. మనకు కానరాకుండా కలవరపెట్టే అనేక క్షుద్ర, రాక్షసశక్తుల్ని సైతం తొలగించే శక్తి ఆయుధ దైవాలకు ఉంది.

**ప్ర: కేశవ నామాదులలో సుప్రసిద్ధ రామనామం కానరాదు. 'కృష్ణ' శబ్దం కనిపిస్తోంది. కారణం ఏమిటి?**

**జ:** కేశవాది 24 నామాలు-24 తత్త్వాలకు అధిపతులైన 24 విష్ణు రూపాలకు సంబంధించినవి. అందులో ఉండే కృష్ణుడు విష్ణ్వవతారమైన శ్రీకృష్ణుని ఉద్దేశించినది కాదు. అది అవతార పూర్వమే ఉన్న ఒక విష్ణురూపం. అది చతుర్భుజాలతో, శంఖు చక్ర గదా పద్మధరుడైన విష్ణురూపం.కృష్ణ, నరసింహ, వామన నామాలు.. 'రామ' నామం కూడా విష్ణునామమే. అందుకే 'విష్ణు సహస్రం'లో "రామో విరామో విరజో" వంటి నామాలు ఆ అవతారం కన్నా ముందే ఉన్న విష్ణుని నామాలు. రామావతారాన్నే చెప్పాయి. 24 తత్త్వాలకు సంకేతాలైన విష్ణు నామాలలో రామ నామం లేదు. అంతే దానికి మరేమీ కారణం లేదు.

**ప్ర: పురాకృతమైన సంచిత, ప్రారబ్ధ, ఆగామి-కర్మల క్షయం ఎలా కలుగుతుంది?**

**జ:** అనుభవం వల్ల ప్రారబ్ధకర్మ క్షీణిస్తుంది. ఫలాపేక్ష లేకుండా ఈశ్వరార్పణంగా చేసే సత్కర్మాచరణవల్ల సంచితకర్మ క్షీణిస్తుంది. ఆగామి ఏర్పడదు. ఇలా మూడు కర్మలూ క్షయిస్తాయి. సంచిత, ప్రారబ్ధాలు మాత్రమే పురాకృతాలు. అంటే అనేక జన్మలలో ఆచరించిన పాప, పుణ్యకర్మల ఫలాలు 'సంచితాలు'. వాటిలో – ఈ జన్మానుభవానికి తెచ్చుకున్నది 'ప్రారబ్ధం'. ఇక –ఈ జన్మలో ఆచరించే కర్మలఫలం 'ఆగామి'.

**ప్ర: శివాలయంలో ప్రసాదం ఇంటికి తీసుకు రారాదని అంటారు. ఎందుకు?**

**జ:** 'ప్రసాదం' అంటే అనుగ్రహం. శివదర్శనంతో, అర్చనతో అనుగ్రహం సంప్రాప్త మవుతుంది. అయితే వస్తురూపేణ ఉండే నిర్మాల్యం మాత్రం తీసుకురారాదు. కానీ అన్నిచోట్లా ఈ నియమమే వర్తించదు. మహాశివభక్తుడైన 'చండే(డ్రే)శ్వరుడు' అనే ఒక దేవత తన తపస్సుకి ఫలంగా 'శివనిర్మాల్యం'పై అధికారాన్ని వరంగా సంపాదించుకున్నాడు. అందుకే ఆ నిర్మాల్యం అతడికే చెందాలి. ఆ కారణంచేతనే మనం ఇంటికి తీసుకురారాదు. శివలింగంపై నుండి వచ్చే తీర్థాన్ని మనం సేవించ వచ్చు. కానీ గర్భగుడి ప్రాకారం బైట 'నాళం'(తూము) ద్వారా జారే తీర్థాన్ని మాత్రం సేవించరాదు. దానిపై కూడా చండేశ్వరునిదే అధికారం. అది అతడి సొత్తు. అయితే – జ్యోతిర్లింగాలు (కాశీ, శ్రీశైలం, మొదలైనవి) ఉన్నచోట్ల మాత్రం శివనిర్మాల్యాన్ని ప్రసాదంగా స్వీకరించవచ్చు. స్ఫటిక, బాణలింగాలున్నచోట కూడా తీసుకోవచ్చు. చండేశ్వర ప్రతిష్ఠ లేని ఆలయాల లోనూ గ్రహించవచ్చు. ఇంకా స్వయంభూ (అరుణాచలం, కాళహస్తి – వంటివి) లింగములు వద్ద, సిద్ధ ప్రతిష్ఠిత లింగముల వద్ద నిర్మాల్యాన్ని స్వీకరించవచ్చు.

కొన్ని శైవాగమాల ప్రకారం నివేదనల్లో 'చండభాగం' అని ఉంటుంది. అలా ఉన్న ఆలయాల్లో శివప్రసాదాన్ని నిరభ్యంతరంగా స్వీకరించవచ్చు.

**ప్ర: 'అష్టభైరవులు' అంటే ఎవరు?**

**జ:** 'భరత్వం' (సృష్టి), 'రమణత్వం'(స్థితి),'వమనత్వం'(సంహారం) చేసే శివునికే 'భైరవుడు' అని పేరు. ఈ భైరవుడు ఎనిమిది విధాల రూపాలతో ఉన్నాడు. తంత్రశాస్త్రంలో ఆరాధ్యులైన మూర్తులు వారు. 1.అసితాంగభైరవుడు, 2. రురుభైర వుడు, 3.చండభైరవుడు, 4.క్రోధ భైరవుడు, 5. భీషణ భైరవుడు, 6.కపాల భైరవుడు, 7. ఉన్మత్త భైరవుడు, 8. సమ్మోహన భైరవుడు.

**ప్ర: 'శ్రాద్ధం' అంటే అర్థం ఏమిటి?**

**జ:** శ్రద్ధగా చేసే కర్మ అని స్థూలార్థం. అయితే – "మృతులైన పిత్రాదులను ఉద్దేశించి శాస్త్రోక్తమైన కాలమందూ, దేశమందూ పక్వాన్నంగానీ, యామాన్నంగానీ, హిరణ్యం గానీ విధి ప్రకారం దానం చేయడా"న్ని 'శ్రాద్ధం' అంటారు.

**హోమశ్చ పిండదానం చ**
**తథా బ్రాహ్మణభోజనమ్.**
**శ్రాద్ధశబ్దాభిధేయం స్యాత్**
**ఏకస్మిన్నౌపచారికం** – అని ధర్మశాస్త్రం నిర్వచనం. మొత్తానికి పితరులను ఉద్దేశించి చేసే కర్మకు 'శ్రాద్ధం' అని రూఢ్యర్థం.

**ప్ర: 'రామేశ్వరం' అనేది లేదనీ, రాముడు ఈశ్వరుని ప్రతిష్ఠించలేదనీ, ఆ విషయం రామా యణంలో చెప్పలేదని ఒక స్వామీజీ అన్నారు. మరి ప్రసిద్ధమైన 'రామేశ్వర' కథ కల్పితమా? దీనికి ఆధారం లేదా?**

**జ:** రాముడు ఈశ్వరుని ఆరాధించలేదనడానికి కూడా ఆధారం లేదు. వాల్మీకి 'రామా యణం' కావ్య సంప్రదాయంగా రచించబడింది. అందులో ఆరాధనలు, ఉపాసనల విషయాలుండవు. ఆ మాటకొస్తే రావణుని శివోపాసన కూడా వాల్మీకం 'యుద్ధ కాండ' పూర్తయ్యేవరకు కూడా కానరాదు. శ్రీరాముని ఉపాసించడం కూడా కనిపించదు. శ్రీరాముడు ఏ దైవాన్ని ఆరాధించాడో కూడా చెప్పలేదు. కారణం, వాల్మీకి రామాయణ ప్రయోజనం – ధర్మ విగ్రహునిగా రాముని దివ్య చరితను కావ్యంగా మలచడమే. అందులో అనేక ఉపాసనా రహస్యాలు గర్భితం చేశాడు తప్ప, స్పష్టీకరణ చెయ్యలేదు. ఉపాసనాపరమైన విషయాలను పురాణాలు తెలియ జేశాయి. వాటిని తోసివేయలేం కదా! అవే కాదంటే – రామారాధన, రామోపాసనలు కూడా పురాణోక్తాలే కదా! వాటినేమంటాం!

రాముడు, శివుడు అభిన్నులు. ఒకరినొకరు ఆరాధించుకుంటారు. శివుడు రామ మంత్ర జప పరాయణుడనీ వాల్మీకి చెప్పలేదు. ఆ కావ్యం మేరకు అవి అప్రస్తుతాలు. పురాణ సంప్రదాయంలో – వాటిని తెలియజేశారు వ్యాసులవారు. వాల్మీకి చెప్పనివి పురాణాల్లో చెప్పారు. అంతేగానీ అవి వాల్మీకికి విరుద్ధం కావు. ఒకచోట చెప్పనిది, ఇంకొకచోట చెప్పడమే. కూర్మ, స్కాంద, వాయు, పద్మ–మొదలైన పురాణాల్లో 'రామేశ్వర' ప్రస్తావన ఉంది. యుద్ధానికి బయలు దేరుతూ శ్రీరాముడు శివలింగ

ప్రతిష్ఠాపన చేశాడు. అవతార పురుషుడైనా -

**యద్యదాచరతి శ్రేష్ఠః**

**తత్తదేవేతరోజనా॥** - అని పరమాత్ముడే సెలవిచ్చినట్లు 'లోకసంగ్రహణార్థం' భగవదారాధనను కూడా ఆచరించాడు ఆ పరంధాముడు. 'మహాభారతం'లో శ్రీకృష్ణుని వచనం-

**మయా ప్రమాణం యదతో**
**లోకస్తదనువర్తతే।**
**నహ్యేదేయోస్తి కశ్చిన్మే**
**వరః పాండవ నందన।**
**ఇతి సంచిన్త్యమనసా**
**పురాహం విశ్వమీశ్వరం**
**పుత్రార్థం ఆరాధితవా -**
**నహమాత్మాన మాత్మనా ॥**

శ్రీకృష్ణుడు పుత్రార్థియై శివుని కోసం తపస్సు చేశాడు. అలా ఏందుకు చేశాడు? - దానికి సమాధానం తానే స్వయంగా అర్జునునితో చెప్తున్నాడు.

"పాండవనందనా! నేను ఏది ప్రమాణంగా తీసుకుంటానో లోకం దానినే అనుసరిస్తుంది. అందుకే - లోకానికి దైవారాధన ప్రధానమని చెప్పేందుకు నేను పూర్వం ఈశ్వరుని ఆరాధించాను. నాకు వరమిచ్చేవారు ఎవరూ లేరు. అయినా లోక సంగ్రహణార్థం శివార్చన చేశాను. అది నన్ను నేను ఆరాధించుకోవడమే".

ఈ వాక్యమే రాముని శివారాధనకూ వర్తిస్తుంది.

మహాభారతం పురాణ సంప్రదాయం ప్రకారం రచించారు కనుక ఉపాసనాది విషయాలు తెలియజేశారు. "రాముని చేత పూజింపబడిన ఈశ్వరుడు" అని కొందరు చెప్పారు.

ఇంకొందరు - "రాముడూ ఈశ్వరుడూ కలిపి రామేశ్వరుడు" అన్నారు. ఇందులో ఏది సరియైనది? మూడూ సరియైనవేనని సనాతన మతం ప్రకారం సమాధానం. శివుడు రామనామరసికుడు. రాముడు శివోపాసకుడు.

ప్రసిద్ధంగా మన ప్రాంతాల్లో కూడా 'రామలింగేశ్వరుడు' పేరుతో అనేక శివాలయాలున్నాయి. ఈ సంప్రదాయానికి పురాణాదుల ప్రమాణాలున్నాయి.

**యుగేయుగేతు కృష్ణేన**
**తోషితోవై మహేశ్వరః ॥** (మహాభారతం)

ప్రతి యుగంలోనూ కృష్ణునిచే మహేశ్వరుడు ఆరాధింపబడి సంతుష్టుడౌతున్నాడు. దేవతలు, రాజులు, భక్తులు, ఋషులు శివలింగ ప్రతిష్ఠలు చేయడం ప్రసిద్ధం. అది వైదిక సంప్రదాయం. విష్ణువే శివారాధన చేసిన దృష్టాంతాలున్నాయి.

రాముడు సాక్షాన్నారాయణుడే అయినా ఆదర్శ పురుషుడు కనుక పితృభక్తి, మాతృ భక్తి, దైవ భక్తి - ప్రదర్శించాడు. విష్ణువు విష్ణువును పూజించడు కనుక, తనకు అభిన్నుడైన శివుని ఆరాధించాడు. శివారాధన మాత్రం చేత విష్ణు ప్రశస్తి తగ్గదు. విష్ణుప్రీతి చేత శివుని ఆధిక్యమూ తగ్గదు.

సనాతనంగా వస్తున్న ఈ విషయాలను ఖండించి, శివ - విష్ణు భేదాల్ని తిరిగి ప్రతిష్ఠింపజేస్తున్న వారు ఎంతటి స్వామీజీ లైనప్పటికీ- అఖండ హైందవ మతానికి ద్రోహులే.

ప్ర: **శివపార్వతీనందనుడైన శ్రీ షణ్ముఖస్వామి, నాగేంద్రునిగా కొలిచే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఒకే రూపమా? కుమారస్వామికి సుబ్రహ్మణ్యేశ్వరుడనే పేరు ఎందుకు వచ్చింది?**



**జ:** కుండలినీ శక్తికి ప్రతీకగా నాగేంద్రుని ఆరాధిస్తున్నాం. యోగ- మంత్ర శాస్త్రాలను పరిశీలిస్తే- శివశక్త్యాత్మకమైనది కుండలిని. అది ఆరు చక్రాల నుండి ప్రసరించే చైతన్యం, ఇదే 'షణ్ముఖస్వామి'గా దీపించే సర్పరూప చైతన్యం. పౌరాణికంగా కుమారస్వామి కొంతకాలం, ఒక 'వల్మీకం'లో సర్పరూపంగా తపస్సు చేసిన గాథ ఉంది. తదాది ఆయనను సర్పంగా ఆరాధించడం సంప్రదాయమయ్యింది.

'సుష్ఠు బ్రహ్మణ్య'- సుబ్రహ్మణ్య. వేద మంత్రములన్నిటిచేత 'సుష్ఠు'గా (పరి పూర్ణంగా) తెలియబడే పరతత్వం - 'సుబ్రహ్మణ్యుడు'. వేద, యజ్ఞ, తపో, జ్ఞానాలకు 'బ్రహ్మము' అని పేరు. వాటిని శోభనముగా(చక్కగా) రక్షించువాడు సుబ్రహ్మణ్యుడు అని అర్థం. బ్రహ్మదేవుడు ఒకసారి సృష్టికర్తననే అహంతో కుమారస్వామిని చులకనగా చూశాడు. ఆ అహాన్ని పోగొట్టేందుకు శివతేజ స్వరూపుడైన స్వామి బ్రహ్మను బంధించాడు, తిరిగి శివుని మాటపై విడిచిపెట్టాడు. బ్రహ్మ బంధితుడైన కొద్ది కాలం-భూకాలమాన ప్రకారం కొన్ని యుగాలు కుమారస్వామియే సృష్టిని నిర్వహించాడు. తద్వారా, బ్రహ్మలోని అహంకారం శమించింది. దాంతో స్వామిని శరణువేడి గురువుగా

భావించాడు. శివాంకంపై కూర్చొని కుమార స్వామి, బ్రహ్మకు ఉపదేశం చేశాడు. ఓంకారమే సుబ్రహ్మణ్యమనీ, శివ శక్త్యాత్మక పరబ్రహ్మ స్వరూపమే తాననీ –ఈ అర్థమే 'సుబ్రహ్మణ్యనామం'లో ఉందనీ వివరించాడు. ఈ విషయాన్ని శివుడు కూడా ఉపదేశం పొందాడు. కుమారస్వామి శివునకు అభిన్నుడు.

**శివాంకం సమారుహ్య సత్ప్రీతకల్పం**
**విరించాయ మంత్రోపదేశం చ కార॥** – అని ఈ ఘట్టాన్ని వర్ణించారు.

**"ఓంకారార్థం ప్రాహస్మేత్థం**
**సుబ్రహ్మణ్యోం సుబ్రహ్మణ్యోం"** అని వేదపాదస్తవనం.

**ప్ర: గెడ్డం గీసుకోవడం రోజూ చేయవచ్చా? క్షురకర్మ ఏఏ దినాల్లో చేయాలి?**

**జ:** ఈ రోజుల్లో మీకీ సందేహం కలగడం సంతోషమే. ఆచారాల్లో అంతరార్థాలు చాలా ఉంటాయి. ఒక రోజును తిథి దేవతలు, నక్షత్ర దేవతలు, గ్రహ దేవతలు పాలి స్తుంటారు. ఆయా దేవతలకు కొన్ని ప్రీతికర కర్మలు, కొన్ని అనిష్ట కర్మలు ఉంటాయి. వాటిని గమనించిన సూక్ష్మదర్శన శక్తిగల ఋషులీ ధర్మశాస్త్రాల ద్వారా అనేక ఆచారాలను అందజేశారు.



**క్షౌరంభూతే రతం ధర్మే**
**వర్జయేచ్ఛ జిజీవిషుః.**
**క్షౌరం నకుర్యాదభక్త**
**భుక్తస్నాత విభూషితాః ॥**
**ప్రయాణ సమరారంభే**
**న రాత్రౌ నచ సంధ్యయోః ।**
**శ్రాద్ధాహే ప్రతిపద్రిక్తా**
**వ్రతాహ్ని చ నవైధృతౌ ॥** – వంటి నియమాలు ధర్మశాస్త్రాల్లో చెప్పారు. అన్నిటినీ పరిశీలిస్తే – ఇవే ఆ నియమాలు:

జన్మతిథి, చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, చవితి, షష్ఠి–తిథులలో క్షౌరం కూడదు. ప్రయాణ దినాన, యుద్ధారంభాన, రాత్రిపూట, సంధ్యాసమయాలలోనూ, శ్రాద్ధ దినాలలోనూ, పాడ్యమి, శూన్యతిథులు, వ్రత దినాలలో క్షౌరం (క్షురకర్మ) పనికి రాదు. శుక్ర, మంగళవారాలు కూడా. అయితే కొన్ని కర్మలకు క్షురకర్మ చేసు కుంటేగానీ పనికిరాదు–అప్పుడు తిథి వారాలను చూడరాదు.

యజ్ఞం, ప్రేతకర్మ-మొదలైన వేళల్లో క్షౌరం, ముండపం చేయవలసిందే. తండ్రి గలవారు తరచుగా ముండనం (గుండు గీయించుకోవడం) చేసుకోరాదు.

**రాజకార్య నియుక్తానాం**
**నరాణాం భూపజీవినాం ।**
**శ్మశ్రులోమనఖచ్ఛేదే**
**నాస్తికాల విశోధనమ్ ॥**

రాజకార్యంలో పనిచేసేవాడు, రాజు (ప్రభుత్వం) వద్ద పనిచేసి పోషింపబడేవాడు-శ్మశ్రుకర్మ (గెడ్డం గీసుకోవడం), గోళ్ళు తీసుకోవడం విషయంలో పెద్దగా కాల నియమం పాటించవలసిన పనిలేదు. ఇలా చాలా విషయాలు ఈ అంశంలో చెప్పినా, కొన్ని ప్రధానమైనవి ఇక్కడ పేర్కొనడమయ్యింది. అయితే-ఎప్పుడు క్షురకర్మ, శ్మశ్రు కర్మ చేసుకున్నా-ఈ క్రింది శ్లోకాన్ని పఠిస్తే, దానికి సంబంధించిన దోషాలు పరిహరింపబడతాయి.

**ఆనర్తో హిచ్ఛత్రః**
**ఆనర్తనో ఆహిచ్ఛత్రః**
**పాటలీపుత్రో, అదితిర్దితిః ।**
**శ్రీశః క్షౌరౌ స్మరణాదేషాం**
**దోషాన్నశ్యంతి నిశ్శేషాః ।** -"ఆనర్తదేశం, అహిచ్ఛత్రము (పాము గొడుగు), పాటలీపుత్రం, అదితి, దితి, విష్ణువు-వీరిని క్షౌర (శ్మశ్రు) కాలంలో స్మరిస్తే సమస్త దోషాలు నశిస్తాయి". వేళాపాళా చూడకుండా క్షురకర్మాదులాచరిస్తే అరిష్ట శక్తులు ఆశ్రయిస్తాయి. అనాచారాలే వాటికి ఆశ్రయస్థానాలు.

ప్ర: **శివలింగానికి ఆది, అంతం తెలుసుకోలేక బ్రహ్మ విష్ణువులే తమ అశక్తి తెలుపుకున్నారు. అలాంటిది మనం చిన్నలింగం చేసి దేనికి మీద నుంచి అభిషేకం చేస్తాం? భక్తితో లింగాన్ని చిన్నది చేసుకొని అభిషేకం చేయవచ్చు అనుకోండి. అయితే బ్రహ్మ, విష్ణువులకు భక్తి లేదంటారా? నిజమైన భక్తి కలవారు కోటికి ఒకరుంటారు. మనం చేస్తున్న అభిషేకం అపచారం అంటారా?**

**భగవంతుడు సర్వాంతర్యామి. అంతటా ఉన్నాడు. మనం పూజ చేసేటప్పుడు ఆహ్వానం, ఉద్వాసన చెబుతాం. ఎల్లవేళలా, అంతటా ఉన్నవానికి ఆహ్వానం, ఉద్వాసన-అర్థం ఏమిటి?**

**జ:** ఆద్యంతాలు లేనిది శివతత్త్వమని, దాంతో మనస్సును అనుసంధానం చేసి ఆ తత్త్వంతో తన్మయం చెందడానికే – శివలింగాన్ని చేసుకొని అభిషేకించడం. మన పూజలో ఉండే 'ఆవాహన'లోని అంతరార్థమదే. సర్వవ్యాపకుడైన సర్వాంతర్యామిని సర్వత్రా అనుభవించలేని అవిద్యాపూరితులం. సుఖాన్నీ, దుఃఖాన్నీ, మంచినీ, చెడునీ కూడా ఈశ్వరతత్త్వంగా దర్శించగలిగే ద్వంద్వాతీత జ్ఞానస్థితిలో ఉన్నవారు మాత్రమే ఆ సర్వవ్యాపక తత్త్వాన్ని అనుభవించగలుగుతారు. సర్వత్రా ఆయనను దర్శించేందుకై సాధనగా– ఒక ప్రతీకలో ఆవాహనాదులతో ఉపాసిస్తాం. భావన, శబ్దం (తంత్రం) కలసి– సర్వవ్యాపక దేవతాశక్తిని కేంద్రీకరించి ఆవహింపజేస్తాయి. అది సూక్ష్మ ప్రపంచంలో జరిగే ఒక సత్యం. పూజానంతరం–మన హృదయంలో ఆ శక్తిని ప్రతిష్ఠ చేసుకోవడమే 'ఉద్వాసన'. ఇంతేకాక– దేవతాశక్తుల స్థానం– సూక్ష్మ జగత్తులోనిది. అక్కడి నుండి మన 'శ్రద్ధ'తో ఆవహింపజేసి, వాటి అనుగ్రహాన్ని అర్థించి, తిరిగి వారిని స్వస్థానం లోకి సగౌరవంగా సాగనంపడమే 'ఉద్వాసన'.

బ్రహ్మ విష్ణువులు శివలింగపు తుది మొదళ్ళు తెలుసుకోలేకపోయారనడంలో ఉద్దేశం వారికి భక్తి లేదని కాదు. భక్తునికి కూడా పరమేశ్వరుడు అంతుపడతాడా? ఆతనితో తన్మయం చెందడమే భక్తునికి సాఫల్యం. బ్రహ్మ విష్ణుల గాథలో అనంత కాల స్వరూపాన్ని, అఖండ బ్రహ్మతత్త్వాన్ని తెలియజేయడమే ఉద్దేశం. కారణావస్థ అయిన లయంగా–అనంతంగా ఉంది. సృష్టి, స్థితులు ఒక పరిమితమైన మార్పులు మాత్రమే. ఇదే ఆ కథలో అంతరార్థం. అయితే భగవత్ శరణాగతిలో, భక్తితో ధర్మాచరణ జరగాలి. ధర్మం లేని భక్తికి బలం ఉండదు. 'యావత్‌శక్తి' ధర్మాచరణతో కూడిన భక్తి బలపడాలి. 'భక్తి' అంటే భగవంతునిపై అచంచలమైన ప్రేమ. కామ్యాలు తీరడానికి చేసే పనికాదు కదా!

ప్ర: **'యుగధర్మం' అని ఒకటుంది. జనమేజయ మహారాజు పూర్తిగా ఆపలేక, 'చెడు ఎక్కడుంటుందో అక్కడికి పొమ్మ'న్నాడు. ఈ కాలంలో మంచి, మచ్చుకయినా లేదు. అలాంటప్పుడు సహస్రహోమాలు, అభిషేకాలు ధనార్జన కోసం కాకపోతే మరే మంటారు? ధర్మదేవతే అధర్మంగా ఉన్న ఈ కాలంలో భగవంతుని మీద భక్తి తప్ప మరేమీ కాపాడలేదు. సంపూర్ణభక్తి తత్త్వం ఉన్నప్పుడు ఈ లోకమే లేదు. మీరే మంటారు?**

**జ:** మీ మాటల్లో కొంత నిజం లేకపోలేదు. యుగధర్మం అని చెప్పి చెడుని ఆహ్వా

నించడం, ఆమోదించడం చెయ్యలేం కదా. మంచి మచ్చుకైనా లేదు కనుకనే దానికోసం ప్రయత్నం. ఊరంతా ముళ్ళకంపలు పరచుకున్నాయని, తివాచీలు పరచలేం. కానీ కాలికి చెప్పులు వేసుకుంటాం కదా! అందుకే అధర్మం ప్రబలిందని ఉపేక్షించడం తగదు, అదే అయితే వ్యాసాదులు ఈ యుగంకోసమని అంత వాఙ్మయాన్ని అందించేవారే కాదు.

సంపూర్ణ భక్తితత్త్వం ఉన్న యోగులకు లోకంతో పనిలేదు. నిజమే. ఆ స్థితే అన్ని యోగాలకు ఫలం. అక్కడ ధర్మమూ ఉండదు. అధర్మమూ ఉండదు. ఆ స్థితి సాధించడానికి మాత్రం 'ధర్మం' అవసరం.

ఏ భక్తుడూ అధర్మంగా వర్తించడు. ధర్మవర్తనతో కూడిన నిర్మల చిత్తాన్ని ఈశ్వ రార్పణం చెయ్యడమే ప్రధానం. మంచి 'మచ్చు'కైనా లేకపోలేదు. ఈ సృష్టిలో కావ లసినంత 'మంచి' ఇప్పటికీ ఉంది. వెతికితే కనిపిస్తుంది. ఎవడికి వాడు 'తాను తప్ప' మిగిలినదంతా చెడిపోతోందనుకోవడమూ సర్వసాధారణమే.

కలిలో స్వల్ప ధర్మాచరణ చేసినా శ్రేష్ఠమే. కానీ ఆ స్వల్పాచరణ కోసం ఎంతో ధర్మాన్ని చెప్పాల్సి వస్తుంది. ధర్మం ఆచరించలేకపోయినా, 'అయ్యో- చేయలేక పోతున్నామే' అని వేదనపడినా గొప్పదే. సాధారణంగా ఈ రోజుల్లో సహస్ర హోమాలు, అభిషేకాలు-క్షేమంకోసం, అరిష్ట నివారణ కోసం చేస్తున్నారు. ధర్మం కోసం కాదు, వాటిని ధర్మం కోసం చేసినా మంచిదే. వానపడడం కాలధర్మ మయినా, గొడుగు వేసుకోవడం మన ధర్మం. అలాగే కలియుగంలో కూడా.



**ప్ర: మనం ప్రతిరోజూ చేసే పూజలలో సూర్యోదయ సమయంలో ఉన్న తిథిని సంకల్పం లో చెప్పుకొనే పద్ధతి ఉంది. ఇదే పద్ధతిని ఆయా తిథుల్లో వచ్చే పండుగలకు అను సరిస్తారా?అంటే సూర్యోదయ సమయాన తిథి ఉన్నరోజునే పండుగ జరుపుకోవాలా?**

**జ:** సూర్యోదయ సమయంలో ఉన్న తిథినే నిత్యం సంకల్పంలో చెప్పుకోవాలి. అందులో సందేహం లేదు. పండుగలలో కూడా అలాగే చెప్పుకున్నా- కొన్ని పండుగలకు మాత్రం విభిన్న కాలాలు వర్తిస్తాయి. ఉదాహరణకు - మధ్యాహ్నం శుక్ల చవితి ఉన్న రోజునే (భాద్రపదంలో) వినాయక చవితి జరుపుకుంటాం. చంద్రోదయంతో కృష్ణ చవితి ఉన్న రోజున సంకష్టహర చతుర్థి చేస్తాం. మధ్యాహ్న వ్యాపిని అయిన చైత్రశుద్ధనవమి శ్రీరామనవమిగానూ, రాత్రి అష్టమి ఉన్న రోజున కృష్ణాష్టమినీ, అమావాస్య రాత్రి ఉన్న రోజున దీపావళినీ, అర్ధరాత్రి చతుర్దశి ఉన్న రోజున శివ

రాత్రిని – ఇలా నిర్వహిస్తాం. వాటికి సంబంధించిన రోజున ఆ పర్వాన్ని పేర్కొని అర్చనాదులు చేయాలి.

ప్ర: **విష్ణుసహస్రనామ స్తోత్రము-88వ శ్లోకం చివర-'చాణూరాంధ్ర నిషూదన' అని ఉంది. బహుశా 'చాణూరాది నిషూదన' అనే పదం ముద్రణ పొరపాటయి 'చాణూ రాంధ్ర...' అని వచ్చిందేమో అనుకున్నాను. కానీ అనేక గ్రంథాలలోనూ, శ్రీమతి ఎం.ఎస్. సుబ్బలక్ష్మిగారి కేసెట్‌లోనూ అదే విధంగా ఉంది. ఏది సరియైన పదం?**

**జ:** 'చాణూర నామానమాన్ధ్రం నిషూదిత వానితి చాణూరాన్ధ్ర నిషూదనః' అని భాష్యం చెప్పారు. ఆన్ధ్ర జాతికి చెందిన 'చాణూరుడు' అనే మల్లుని సంహరించిన శ్రీకృష్ణుని ఆ విధంగా అన్నారు.

ప్ర: **శ్రీలలితా సహస్రనామమును ఎవరు వ్రాసారు? వేదవ్యాసులు అని నేనూ, హయగ్రీవ స్వామి అని నా మిత్రులూ అనుకున్నాం. ఆ సహస్రనామాల్లో 'కామాక్షి కామదాయినీ' అనీ, 'విశాలాక్షీ విరాగిణీ' అనీ ఉన్నాయి. కానీ 'మీనాక్షి' అనే పేరు గానీ, అదే అర్థ మిచ్చే మరో పేరుగానీ ఉందా? తెలియజేయగలరు.**

**జ:** శ్రీలలితా సహస్రనామ స్తోత్రాన్ని హయగ్రీవస్వామి, అగస్త్య మహర్షికి ఉపదేశించారు. ఈ స్తోత్రం పలికినవారు వశిన్యాది వాగ్దేవతలు. ఈ విషయమంతా తెలియజేస్తూ 'బ్రహ్మాండపురాణం' ద్వారా మనకు అందించినది శ్రీవేదవ్యాసులవారు.

ఆ నామాలలోనే **'వక్త్రలక్ష్మీ పరీవాహ చలన్మీనాభలోచనా'** అనే నామం ఉంది. **"ముఖసౌందర్య ప్రవాహంలో కదలాడుతున్న చేపలవంటి కన్నులు గల తల్లి'** అని అర్థం. ఈ నామం 'మీనాక్షి' నామమే కదా!

ప్ర: **నేను రామాయణాన్ని నిత్యపారాయణ చేయదల్చుకున్నాను. అందుకోసం శ్రీ వావిల కొలను సుబ్బారావుగారు వ్రాసిన రామాయణమును ఎంపిక చేసుకున్నాను. ఒకవేళ ఆ గ్రంథం దొరకని ఎడల ప్రత్యామ్నాయంగా, పారాయణ యోగ్యమైన పద్య రచన గలిగిన రామాయనాన్ని సూచించవలసిందిగా కోరుతున్నాను.**

**జ:** తెలుగు రామాయణాలలో వాల్మీకి రామాయణాన్ని అక్షరశః అనుసరించిన ప్రసిద్ధ గ్రంథం- 'ఆంధ్రవాల్మీకి' శ్రీ వావిలకొలను సుబ్బారావుగారి రామాయణమే. అది నిత్యం చదువుకోదగ్గది. రామకథ ఏ భాషలో వచ్చినా నిత్యం మనన యోగ్యమే. సందేహం లేదు. అది మహిమాన్వితమైన సత్ఫలాలను ఇస్తుంది కూడా. కాని నిత్య పారాయణకి మాత్రం సంస్కృతంలోని వాల్మీకి రామాయణం శ్రేష్ఠం. అందులో

ప్రతి శ్లోకంలో మంత్రశక్తి, దేవతాశక్తి నిబద్ధమై ఉంది. రామకథతోపాటు అక్షరోచ్చారణ మనలో దివ్య స్పందనల్ని కలిగించి ఇహపర శ్రేయస్సునిస్తుంది. అయితే-ముందే చెప్పినట్లుగా రామకథను తెలుసుకొని ఆనందించి, రామకథాస్మరణ ప్రభావాన్ని పొందాలంటే వావిలకొలనువారి గ్రంథం చదువవచ్చు. దాని పారాయణం కూడా కొంత వరకు ఫలదాయకమే.

ప్ర: **'కౌసల్యాసుప్రజారామా! పూర్వాసంధ్యా ప్రవర్తతే' అని శ్రీవేంకటేశ్వరస్వామి సుప్రభాతంలో ఉంది. యుగాలు, తల్లి రూపాలు వేరుకదా! దీని అంతరార్థమేమి?**

జ: శ్రీవేంకటేశ్వరుడు శ్రీమహావిష్ణు స్వరూపుడు. ఆ నారాయణుడే రాముడు. ఇద్దరికీ భేదం లేదు. శ్రీవేంకటేశ్వరుడు సనాతన దైవం. సాక్షాద్విష్ణువే. ఆయనకు తల్లి లేదు. 'వకుళ' పెంచినతల్లి మాత్రమే. పైగా వేదసమమైన ఆదికావ్యం వాల్మీకి రామాయణంలోని శ్లోకమిది. గాయత్రీ మంత్రద్రష్ట అయిన విశ్వామిత్ర మహర్షి - పరాత్పరుడై అవతారపురుషుడైన శ్రీరామచంద్రమూర్తికి కర్తవ్య ప్రబోధం చేసే ఈ శ్లోకం-'లోకకల్యాణానికి సమాయత్తమవమ'ని దేవదేవుని వేడు కోవడమే. మహర్షి నుండి ఆ శ్లోకంలో దివ్యార్థాలు దాగి ఉండి వేదసమాన మయ్యింది. ఆ రాముడే ఈ వేంకటేశుడు. ఆర్షమైన (ఋషిప్రోక్తమైన) ప్రబోధ శ్లోకంతో ప్రారంభించడం వల్ల లౌకిక వాఙ్మయమైన సుప్రభాతానికి ఋషిశక్తి సమకూరుతుంది.



ప్ర: **ఆడవారు ఋతుక్రమంలో ఉన్నపుడు వేరుగా, అంటే ఏమీ ముట్టుకోకుండా ఉండా లంటారు. ఎందుచేత? అది ఆడవారిలో సహజంగా జరుగు శరీరమార్పేకదా! మరి అలా వేరుగా ఉంచటమనేది ఆరోగ్యపరంగా మన పెద్దలు పెట్టిన ఆచారమా, లేక దైవసంబంధంగా దోషమని పెట్టినారా? ఆ సమయంలో దేవాలయాలకు కూడా వెళ్ళకూడదు, దైవసంబంధ కార్యక్రమాలలో పాల్గొనకూడదు అంటారు ఎందువలన? నిజంగా అది చాలా దోషమా? ఈ స్పీడు యుగంలో ఆ విధంగా ఇంట్లోకి రాకుండా వేరుగా ఉండటం అనేది కష్టసాధ్యం కదా? కనుక దయచేసి నా సందేహము నివృత్తి చేయవలసినదిగా కోరుచున్నాను. దేవుడు అంతటా ఉన్నాడు కదా! మరి- 'వేరుగా' ఉండడం వంటి అశౌచాలు ఎందుకు పాటించాలి? అసలు వేదాల్లో వీటికి ఆధారముందా? ఇది అనాగరికం కాదా? వివరంగా సమాధానమివ్వండి.**

జ: ఈ విషయంలో అనేకమంది అనేక విధాలుగా ప్రశ్నిస్తున్నారు. కొందరు వీటికి వేదాధారం ఉందా? కల్పితమా? అని కూడా అడుగుతున్నారు. అన్నిటికీ కలిపి -

మీ ప్రశ్నను ఆధారంగా సమాధానమిచ్చేందుకు ప్రయత్నిస్తాం.

మానవుల ఇహపర సౌఖ్యం కోసం సూక్ష్మ విషయ దర్శనం చేసిన శాస్త్రాలు అవతరించాయి. అవి వేదాలను ఆధారం చేసుకుని ఉన్నాయి. వేదాలు అపౌరుషేయాలు. దోష శంకా కళంకాలు లేనివి. అవి మానవ సుఖ జీవనం కోసం కొన్ని ఆచారాలనీ, నియమాలనీ ఉపదేశించాయి. వాటిని పాటించడం ప్రతి వైదికుని కర్తవ్యం. మడి, మైల అనే పదాలను మనం వింటుంటాం. అవి శుభ్రతను మటుకే తెలుపుతాయని అనుకోవడం పొరపాటు. వాటి వెనుక మనకు గోచరించని, కానీ మన జీవనంపై ప్రభావం చూపించే సూక్ష్మశక్తుల గురించిన పరిజ్ఞానం ఉంది. జాత, మృత అశౌచాదులలో మనం శారీరకంగా, మానసికంగా శుద్ధంగా ఉన్నా 'మైల' అనే పరిపాటి లోకంలో ఉంది. కాబట్టి వేదం ఎలా చెప్పిందో అదే ఆచరణలో ఉండాలి. మన యుక్తులూ, మార్చుకోవడాలు వైదిక ఆచారం కానేరదు.

స్త్రీలు ప్రతిమాసం ఋతుకాలంలో విడిగా ఉండడం మన పూర్వీకుల ఆచారం. దీనికి ఆధారం యజుర్వేదంలో రెండవకాండలోని ఐదవ ప్రపాఠకం. అందులో విశ్వరూపవధ, రజస్వలా వ్రతాలు ముఖ్యంగా చెప్పబడి ఉన్నాయి. అది ఇలా ఉంది. – పూర్వం బృహస్పతి తపస్సుకు పోగా, ఇంద్రుడు త్వష్ట కుమారుడైన విశ్వరూపుని గురువుగా చేసుకున్నాడు. ఆయనకు మూడు తలలు. వాటితో అతడు సోమపానం, సురాపానం, అన్నభోజనం చేసేవాడు.

ఒకప్పుడు తనకు లభించిన యజ్ఞభాగాన్ని రాక్షసులకి ఇవ్వడంతో కోపం చెందిన ఇంద్రుడు వజ్రాయుధంతో అతని శిరస్సుని ఖండించాడు. అవి పక్షులై బ్రహ్మ హత్యాదోషాన్ని ధరించి ఇంద్రునికి ఆ దోషాన్ని ఇవ్వసాగాయి. దాంతో ఇంద్రుని ఇంద్రత్వానికే ఆపద వచ్చింది.

యజ్ఞం ద్వార కొంతమేరకు తొలగించి, మిగిలిన ఆ దోషాన్ని మూడు భాగాలు చేసి, పుచ్చుకున్న వారికి కోరిన వరమిస్తానన్నాడు. ఒక భాగాన్ని పృథివి తీసుకుంది. వరంగా – భూమిపై ఎక్కడైనా తవ్వితే కొన్ని రోజులకు ఆ భూమి సమమయ్యేలా కోరింది. అలాగేనని వరమిచ్చాడు ఇంద్రుడు.

వృక్షాలు ఒక భాగాన్ని పుచ్చుకున్నాయి. కొన్ని కొమ్మలు నరికినా వృక్షం మృతి చెందక మళ్ళీ వేరే శాఖలు మొలిచేలా వరాన్ని పొందింది. అలాగే స్త్రీలు చివరిభాగం తీసుకొని, దానికి బదులుగా పుత్రోత్పత్తి సామర్థ్యాన్ని వరంగా పొందారు. అందువల్ల

ఆ రజస్వలాకాలంలో వారికి బ్రహ్మహత్యాదోషం ఉంటుంది. ఆ దోషం ఉండడం వల్ల, ఆ రోజుల్లో వారితో సల్లాపాలు చేయరాదు, సమానంగా కూర్చోరాదు. ఒకటిగా భోజనం చేయరాదు. వారిని తాకరాదు. వారు వండినవి తినరాదు. అలా నియమాలు పాటించని పక్షంలో కొన్ని కష్టాలు వస్తాయని కూడా వేదమంత్రాలు చెప్తున్నాయి. ఇది వేదం చెప్పిన గాథ. పైగా – ఇందులో ఎన్నో సంకేతాలు ఉంటాయి. శరీర నిర్మాణంలో దేవతాశక్తులే ఇంద్రియా ధిదేవతలు. మన శరీరంలో మనకు తెలియని మార్పులు జరుగుతున్నట్లే, మనపై ప్రభావం చూపే సూక్ష్మప్రపంచంలోనూ జరుగుతాయి. ఇంద్రుడు ప్రధాన దేవతాశక్తి. ఆశ్చర్యంగా, కాలగమనాన్ని ఆధారం చేసుకొని మారే శరీరనియ మంలో అంతు తెలియని దైవిక రహస్యాలను వేదం వివరిస్తుంది. ఇంద్రియాతీత సత్య దర్శనమే కదా వేద విజ్ఞానం.

కొన్ని ధర్మాలని పాటించలేకపోవచ్చు. కానీ మన అశక్తత వల్ల వదలి, వాటిని ధర్మాలేకావనీ, మనం చేసిందే ధర్మమనీ ఋషి విజ్ఞానాన్ని తూలనాడడం ఎందుకు? ఆధునిక కాలంలో వాటిని పాటించడం శ్రమమనీ, అవి మూఢ నమ్మకాలనీ స్త్రీలను తక్కువ చేయడమేనన్న భావాలున్నాయి. కానీ అవి సరికావు. ఇది వైదిక ఆచారమే. మన పూర్వీకులు పాటిస్తూ వచ్చిన ధర్మమే. మనకు పట్ట లేదని అవి మూఢనమ్మకాలనడం సబబు కాదు. స్త్రీలు ఇంద్రునికి సహాయం చేసి, దోషాన్ని తాము తీసుకొని అనుభవిస్తున్నారని వారి గొప్పదనాన్ని తెలుపు తోంది కనుక, వారిని తక్కువ చేయడం ఏ మాత్రమూ కాదు.

పైగా ఇది శరీ రజ దోషం. వ్యక్తిత్వ దోషం కాదు. ఇది అవమానకరమూ కాదు.

దేశ, కాలపరిస్థితులను బట్టి కొన్ని అనుకూలించకపోయినా, శక్తివంచన లేకుండా యథాశక్తి వాటిని ఆచరించవచ్చు. ఇంట్లో ఇతరుల్ని తాకకుండా, వండకుండా విశ్రాంతిగా ఒకే చోట ఉండడం ఎప్పుడైనా కుదురుతుంది. శ్రద్ధ ఉన్నప్పుడు తప్పకుండా ఆచరించగలం. నెలలో కేవలం ఆ కొద్దిరోజులు జాగ్రత్తపడడం, కొంచెం శ్రమ అయినా, అసాధ్యం కాదు. బైట ప్రపంచం గురించి విడిచిపెట్టండి, మన ఇంట్లో మనం జాగ్రత్తగా ఉండగలం.

నాలుగవ రోజున స్నానం చేశాక, నీళ్ళలో పసుపు కలిపి ఆ దోషాలన్నీ పోయేలా భగవత్ సమర్పణ చేసి స్నానం చేస్తారు. ఇంట్లో ఆ మూడు నాళ్ళు మసలిన చోటంతా పసుపు నీళ్ళు జల్లి ఇల్లు కడుగుతారు. పైగా – మంత్రం జపించేవాళ్ళు ఉన్న

ఇంట, దీపారాధన, దేవతాపూజలు జరిగే ఇంటా ఇటువంటి 'మైల'లు కలిస్తే ఆ మంత్రశక్తీ, దైవశక్తి నశిస్తాయి. దీనికి ఎన్నో నిదర్శనాలున్నాయి. తాయెత్తులు, యంత్రాలు వంటివి కూడా రజస్వలాస్త్రీ స్పర్శతో శక్తిహీనమవుతాయి. మళ్ళీ సంప్రోక్షణ చేస్తేగానీ వాటిలో శక్తిచేరదు.

'అంతటా దేవుడున్నాడు కదండీ' అనే వేదాంత వచనాన్ని దీనికి అన్వయించడం తప్పు. అంతటా దేవుడున్నాడనిపిస్తే – ఒకే చోట దేవతాపూజ చేయడం ఎందుకు? దేహ స్పృహ ఉన్నంతకాలం ఆచారం పాటించవలసిందే.

ఈ విధమైన అశౌచంలోనున్న స్త్రీ శరీరం నుండి ప్రసరించే సూక్ష్మ విద్యుదయస్కాంత తరంగాల ఆవరణ (ఆరా) దివ్యంగా ఉండదు. విపరీత శక్తులతో ఉంటుంది. ఇది సూక్ష్మప్రపంచాన్ని దర్శించగలిగిన వాళ్ళకి తెలుస్తుంది.

నిత్యం దీక్షగా ఉన్న స్త్రీలు ఆ నాలుగు రోజులు మంత్ర జపం, స్తోత్ర పారాయణ, దీపారాధన వంటివి చేయరాదు. (మానసికంగా నామస్మరణ చేస్తే తప్పులేదు). తిరిగి స్నానాదులు చేశాక (అయిదవరోజు నుండి) వాటిని కొనసాగించవచ్చు. అప్పుడు, మధ్యలో ఆపిన దోషం ఉండదు. అలా కాకుండా ఆ నాలుగు రోజుల్లోనూ వాటిని కొనసాగిస్తే, పాపం సంక్రమిస్తుంది. ఆ సమయంలో దైవ సంబంధ కార్యక్రమాలలో పాల్గొన్నా దోషమే. మామూలుగా నిత్యం సహజంగా మలినాలు విసర్జించాక, స్నానం చేస్తేనే గానీ పూజాదులకు పనికిరాదంటారు. మరి ఈ విషయంలో నియమాలుంచడం ఎంత అవసరమో ఆలోచించండి!

దేవాలయాదుల వాతావరణమంతా మంత్ర శక్తిచేత, నిత్యానుష్ఠానాలచేత పునీతమై ఉంటుంది. అందులో ఇటువంటి అశౌచమున్నవాళ్ళు ప్రవేశిస్తే, ఆ వాతావరణంలోని సూక్ష్మంగా ఉన్న పవిత్రత దెబ్బతింటుంది.

మన దేవతల గురించి, మంత్రాల గురించి చెప్పిన వేదపురాణాలే ఈ విషయాలూ చెప్పాయి. దేవతపై నమ్మకం ఉంటే వీటిని నమ్మవలసిందే. 'శుచి' అనేది అభివృద్ధి చెందిన నాగరికతకి చిహ్నం. అయితే –మనకో సందేహం రావచ్చు – బైట ఎందరో అలా ఉంటున్నారు కదా! అని. బైటవిషయం మనకు జ్ఞాతం కాదు. మన మటుకు మనం జాగ్రత్తపడితే చాలు. అందుకే దైవమందిరాన్ని ప్రత్యేకంగా ఉంచుతాం. బైటకి వెళ్ళివచ్చిన బట్టలతో ముట్టుకోం. స్నానం చేసి, శుద్ధజలాన్ని పట్టుకొని, శుద్ధవస్త్రాల్ని కట్టుకొని 'పుండరీకాక్ష' (భగవంతుని) నామం స్మరించుతాం. అప్పుడు

శుచి వస్తుంది. తెలిసి అటువంటి వాటిని కలుపుకోకూ దదు. అటువంటి స్థితిలో ఉన్నప్పుడు ఆ ఆవరణలో ఉన్న ప్రాంతమంతా అశుచి అవుతుంది.

ఆరోగ్యరీత్యా కూడా – ఆ నాలుగు రోజులూ స్త్రీకి విశ్రాంతి అవసరం. అప్పుడు కూడా ఆమెకు విశ్రాంతినివ్వకుండా, ఇంటి పనులు చేయించడం మగవాడి దౌర్జన్యమే. అప్పటి 'ఇన్‌ఫెక్షన్' ప్రభావం గురించి విజ్ఞాన శాస్త్రమూ చెప్పింది. భారతీయ విజ్ఞానంలో భౌతికవిజ్ఞానం, సూక్ష్మ ప్రపంచ విజ్ఞానం కలిసి ఉంటుంది. భౌతిక విజ్ఞానం ఇంకా ఎదుగుతోంది. ఇప్పటికే మన ఆచారాల్లో కొన్నింటి ఆరోగ్యరహస్యాలు అంగీకరిస్తున్నారు. ఇంకా ఈ సైన్స్ ఎదిగితే, అన్నిటినీ అంగీకరిస్తారు. కానీ ఈ లోపలే మనం వీటిని పోగొట్టుకోకూడదు. ఈ నాలుగు రోజులూ ఆమె ఇంట్లో కలవకూడదు. ఇంటి యజమానిగానీ, ఇంకెవరైనాగానీ దీపారాధన పూజ చేయవచ్చు.

మన చుట్టూ జగత్తులో దైవీశక్తులూ, విపరీత శక్తులూ ఉంటాయి. విపరీత శక్తుల ప్రభావం పడకుండా ఉండేందుకే శౌచాన్ని పాటించాలి.

'ఇవి కుదరవు' అని తప్పించుకుంటే నష్టపోయేది మనమే. ఆ నష్టానికి సిద్ధపడితే వదలవచ్చు. శాస్త్రాన్ని పాటించడం వల్ల పాటించిన వారికే ప్రయోజనం కానీ ఇంకెవరికోకాదు. మన శ్రేయస్సు కోసమే సూక్ష్మదర్శనం కలిగిన ఋషులు సదాచార నియమాలను పేర్కొన్నారు. అవి పాటించడం కొందరికి సాధ్యంకాక పోవచ్చు. అంతమాత్రం చేత వాటిని తీసిపారేయడం తగదు కదా! నిప్పునీ, నీటినీ సమానంగా చూడగలిగే ద్వంద్వాతీత అవధూతస్థితిలో ఉన్నవారికే విధినిషేధాలు ఉండవుగానీ, నిప్పు నీరూ, మంచీ చెడూ, శీతోష్ణాలూ, సుఖదుఃఖాలూ తెలిసిన 'దేహస్పృహ' కలిగిన మనందరికీ విధినిషేధాలున్నాయి.



**ప్ర: భారతంలో శకుని తన సోదరుల మరణానికి కారకుడైన దుర్యోధనుడిని నాశనం చేయాలని, వాళ్ళతో ప్రియంగా ఉన్నట్లు నటించి కౌరవ నాశనానికి కారకుడైనాడని మేము ఒక సినిమాలో చూశాం. అది ఏ గ్రంథంలోది?**

**జ:** ఆ కథ కేవలం ఎవరో అల్లిన కథ. ప్రామాణిక గ్రంథాధారం లేదు. ముఖ్యంగా శకుని గురించి చెప్పబడిన మహాభారతంలో ఆ కథ లేనే లేదు. శకుని పూర్తిగా కౌరవపక్షం. దుర్యోధనునికి శ్రేయోభిలాషి, దుష్టచతుష్టయంలో ఒకడు. అంతే గానీ అతడి సోదరుల మరణానికి దుర్యోధనుడు కారణం కాడు. గాంధారికి సోదరుడు శకుని. ఇదే భారతంలో ఉంది.

**ప్ర: 'కొన్ని దేవాలయాలలో దేవుని విగ్రహం ఎదురుగా 'కూర్మం' ఉంచుతారు. దాని అర్థం ఏమిటి?' అని అక్కడ వాళ్లనడిగినా చెప్పలేదు. వివరించండి. ఆంజనేయస్వామి గుళ్ళో 'ఒంటె' ఉండడంలో ఆంతర్యం ఏమిటి?**

**జ:** ప్రతి దేవాలయం విశ్వానికి ప్రతీక. ఈ పృథ్వి ఆధారంగా ఉన్నది కూర్మమని పురాణ విజ్ఞానం. అంతేకాక మంధర పర్వతానికి కూడా కూర్మమే ఆధారం అని క్షీరసాగర మథనం కథా సందర్భంలో చెప్పబడింది.

మొత్తానికి ఆధరాశక్తికి ప్రతీక కూర్మం. జగత్తుకి ఆధారమైన విష్ణుశక్తిని కూర్మ రూపంలో ప్రతిష్ఠించడం కొన్ని దేవాలయాగమాలలో చెప్పబడింది. ఇక– మంత్ర శాస్త్రంలో గంధమాదనవాసిగా ఆంజనేయుడు 'ఉష్ట్రవాహనుడు' (ఒంటెను వాహనంగా గలవాడు) అని చెప్పబడింది. ఉపాసనలో దేవతకి శక్తి, పరివారం, వాహనాదులుంటాయి. హనుమదుపాసనలో స్వామి వాహనం ఒంటె అని చెప్పబడింది. దేవాలయాల్లో ఆ దేవత వాహనాన్ని కూడా శిల్పించుతారు. అందుకే హనుమంతుని ఆలయంలో ఒంటె ఉంటుంది.

**ప్ర: బంధువులలోని సగోత్రీకులలో ఎవరైనా చనిపోయినప్పుడు గానీ, లేదా ఎవరికైనా సంతానం కలిగినా గానీ దేవుని పూజలు, నోములు, పండుగలు జరుపుకోకూడదనే ఆంక్షలను నేటికీ కొన్ని కుటుంబాలలో పాటిస్తున్నారు. ఇది ఎంతవరకు సమంజసం? ఇవిగాక ఇంకా ఏ నిమయాలున్నాయి?**



**జ:** అలా ఆంక్షలను పాటించడం మన సంప్రదాయంలో భాగం. ఎవరైనా చనిపోయినప్పుడు పాటించేది 'మృతాశౌచం'. అది ప్రధానంగా వారి వారి ఇంటి ఆనవాయితీ ప్రకారం పదిరోజులపై వరకు ఉంటుంది. తరువాత ఏడాదిపాటు కర్తలు(పుత్రులు) పండుగలు వగైరా చేయరు. కొండపై నున్న దేవాలయాలకు వెళ్ళరాదు. అప్పుడు పితృ ఆరాధనే ప్రధానం. అయితే పండెండవరోజు జరిగే సపిండీకరణ పిదప నిత్య పూజలు మాత్రం ఆచరించాలి.

జాతాశౌచంలో గృహయజమాని శుద్ధి తరువాత (పదకొండో రోజు నుండి) నిత్య పూజలు, పండగలు వగైరాలు జరపవచ్చు. పుట్టిన, లేదా పోయిన జీవునితో బంధువులకున్న బాంధవ్యం సూక్ష్మమైన కర్మానుబంధంలో ఉంటుంది. ఆ సూక్ష్మవిజ్ఞానం తెలిసిన మహర్షులు ఏర్పరచిన ధర్మమిది. పూజలు, నోములు, పండగలు గురించి ఏ ధర్మశాస్త్రాలు చెప్తున్నాయో వాటిలోనే ఈ ఆంక్షల్ని విధించారు. కనుక వాటిని పాటించడమే అన్ని విధాలా సమంజసం.

**ప్ర: సృష్టిలో శక్తి స్వరూపిణి ద్వారా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వచ్చారు. అందులో మహేశ్వరుని కుమారుడు వినాయకుడు. మరి అటువంటప్పుడు విఘ్నేశ్వరుని ముందుగా ఎందుకు పూజిస్తున్నారు?**

**జ:** సృష్టికి కారణం పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మ యొక్క శక్తి పరాశక్తి. ఆ పరబ్రహ్మయే తన శక్తి ద్వారా బ్రహ్మ విష్ణు మహేశ్వరాది రూపాలు ధరించి సృష్టి శక్తులను కొనసాగిస్తున్నాడు. విఘ్నేశ్వరుడు కూడా పరబ్రహ్మ యొక్క స్వరూపమే. మహేశ్వరుని కుమారునిగా అవతరించాడంటే – ఆతని మరో రూపం అని అర్థం. సృష్టితోపాటు ఉన్న మూలాధారశక్తియే సృష్టి తరువాత జరిగిన ఉమామహేశ్వరకల్యాణా నంతరం మళ్ళీ ఆవిర్భవించింది.

అంతేకాక ఏ పనికైనా విఘ్నాలు పొంచి ఉంటాయి. కొన్ని పనులకు విఘ్నాలు కలగడం మంచిది. కొన్నిటిని విఘ్నాలు తొలగాలి. ఉదాహరణకు దుష్టశక్తుల పనులకు విఘ్నాలు కలిగితేనే లోకానికి క్షేమం. ఉత్తమ కార్యాలకు, పూజాదులకు విఘ్నాలు వాటిల్లరాదు. 'విఘ్నాలు' అనే దైవీశక్తులకు అధిపతిగా నియమింపబడిన పరబ్రహ్మశక్తి గణపతి 'విఘ్నేశ్వరుడు'. మన పూజాదికాలు, తలపెట్టిన సత్కార్యాలు నిర్విఘ్నంగా జరగడానికి గాను విఘ్నేశ్వరుని ముందుగా పూజించాలి. అప్పుడు ఏ విఘ్నాలూ కలుగకుండా ఆ అధిపతి గమనిస్తాడు.

**ప్ర: గాయత్రీ మంత్రం ద్వారా ఉపాసింపబడే దేవత ఎవరు? సూర్యుడు ఈ మంత్రం ద్వారా ఉపాసింపబడే దైవం అని ఒకరు చెప్పారు. 'గాయత్రి' – అంటే అర్థం ఏమిటి – క్లుప్తంగా వివరించండి. గాయత్రిని పాటగా పాడవచ్చా?**

**జ:** గాయత్రీ మంత్రం సర్వదేవతాత్మకం. త్రయీమూర్తి అయిన సూర్యునిలో దీపించే పరబ్రహ్మశక్తి గాయత్రి. సవితా – అంటే జగత్కారణమైనశక్తి. సూర్యునికి ఈ పేరు ఉంది. సర్వ దేవతాశక్తులను మనం సూర్యమండలం నుండే పొందుతున్నాం. కనుక సూర్యమండలాంతర్గతమైన పరబ్రహ్మ చైతన్యమే గాయత్రి ద్వారా ఉపాసించబడే దైవం. "సవిత యొక్క అనిర్వచనీయమైన, సర్వశ్రేష్ఠమైన తేజస్సును ఉపాసిస్తున్నాం. అది మా బుద్ధులను ప్రేరేపించుగాక" అని మంత్రం యొక్క ప్రధానభావార్థం.

అయితే మంత్రదేవతగా దీపించే 'శక్తి' వేదమాత – గాయత్రీ దేవిగా సగుణ రూపాన్ని ధరించినప్పుడు – 'ముక్తావిద్రుమ....' అని వర్ణించిన పంచముఖ స్వరూపంతో ఉంటుంది. ఇది సవితృ చైతన్యానికి సాకారం. సర్వ దేవతాత్మక శక్తిస్వరూపం.

'గాయత్రి' అనే శబ్దానికి అనేక అర్థాలున్నాయి. ముఖ్యంగా 'గయాన్ త్రాయతే' ప్రాణశక్తుల్ని రక్షించే శక్తి – కనుక 'గాయత్రి' ఇంకొక అర్థం – 'గాయంతం త్రాయతే ఇతి గాయత్రీ' గానము చేయువానిని రక్షించేది గాయత్రి.

ఇక్కడ 'గానం' అంటే 'పాడడం' అనే లౌకికార్థం కాదు. 'త్రికరణశుద్ధిగా మననం చేయడం' అని అర్థం. గాయత్రికి నిర్దిష్టమైన వేద స్వరూపాలున్నాయి. వాటితో మౌనంగా మననం చేయాలి. గాయత్రిని గానీ, ఏ మంత్రాన్ని గానీ పాటలుగా పాడడం పాతకం అవుతుంది. అలా ధర్మాన్ని అతిక్రమించి మంత్రాలను పాటలుగా పాడడం వల్ల అరిష్టాలుకలుగుతాయి. మననం చేయబడేది మంత్రం. పాడుకోవడానికి అనేక నామసంకీర్తనలు మనకు ఉన్నాయి. 'గయానేత్రయతే ఇది' అనే అర్థంలో 'ప్రాణరక్షణ శక్తి' అని నిర్వచనం.

**ప్ర: 'ఋషియజ్ఞం' అంటే ఏమి? ఋషి ఋణం తీర్చుకోవడం ఎలాగ?**

**జ:** ఋషిఋణం తీర్చుకోవడానికి చేసే సాధనను 'ఋషియజ్ఞం' అంటారు. మనకున్న సంస్కారాలన్నీ ఋషులు ప్రసాదించిన వేద, పురాణాది విద్యల వల్లన లభించాయి. అందుకే వారి ఋణం తీర్చుకోవలసిన బాధ్యత ప్రతి మానవునికీ ఉంది. అందుకు చేసే యజ్ఞం వారు ప్రసాదించిన విద్యను నిరంతరం అధ్యయనం చేయడమే. దానిని 'స్వాధ్యాయం' అంటారు. ఋషులకు కావలసినది ఏమీలేదు. వారు దర్శించి ప్రబోధించిన ధర్మాలను అధ్యయనం చేసి ఆచరించడమే మనం చూపే కృతజ్ఞత. నిజానికి అది మన జీవవితాన్ని సార్థకం చేసే సాధన మాత్రమే. శ్రోతియులు బ్రహ్మయజ్ఞం ద్వారా ఋషిఋణం తీర్చుకుంటారు.



**ప్ర: ఈ మధ్య ఒక గ్రంథంలో – 'రోదిస్తూ పుట్టాడు గనుక రుద్రుడు' అని అర్థం చెప్పి, విష్ణువును పొగడుతూ, శివుని తక్కువగా చేస్తూ ఓ పెద్దాయన రాశారు. దాంతో చాలా బాధ కలిగింది. రుద్ర శబ్దానికి, అసలు అర్థం ఏమిటి?**

**జ:** రుద్ర–శబ్దానికి అనేక అర్థాలున్నాయి. కాని ఆ పెద్దాయన చెప్పిన అర్థం వేరు. ఒకసారి బ్రహ్మదేవుని భ్రూమధ్యంలో జన్మించిన రుద్రుని విషయం ఒక పురాణంలో ఉంది. అది భ్రూమధ్య స్థానమైన జ్ఞానస్థానం (ఆజ్ఞాచక్రం) నుంచి నాదశక్తితో ఆవిర్భవించిన ఒక రుద్రావతారం మాత్రమే.

'రుద్ర' అనేది పరబ్రహ్మవాచకం.

**'ఏకోరుద్రః నద్వితీయాయతస్థేః'** – అని ఉపనిషత్తు రుద్ర పారమ్యాన్ని చెప్తోంది.

ప్రళయకాలంలో లయకర్తగా సర్వజీవులను క్షోభింపచేసే పరబ్రహ్మశక్తి రుద్రుడు – 'ప్రళయ కాలంలో జీవుల్ని రోదింపజేసేవాడు' అంతేకాదు దైవదూషణ, దుష్కృత్యాలు చేసే దుష్టుల్ని శిక్షించి రోదింపజేసే ధర్మరక్షకుడు – 'రుద్రుడు' అని ఒక అర్థం.

**రుద్దుఃఖం దుఃఖహేతుర్వా**
**తద్ ద్రావయతినః ప్రభుః**
**రుద్ర ఇత్యుచ్యతే సద్భిః**
**శివః పరమకారణమ్.** –'రుత్' – అంటే దుఃఖం, దుఃఖ కారణం (పాపం). వాటిని ద్రవింపజేసేవాడు (నశింపజేసేవాడు) అంటే సమస్త దుఃఖాలను నశింప జేసే ఆనందస్వరూపుడైన పరబ్రహ్మ – 'రుద్రుడు' అని నిరుక్తం చెప్తున్న అర్థం.

**'రుత్యా వేదనాదేన ప్రాప్యః'** – వేదం ద్వారా ప్రతిపాదింపబడే పరతత్త్వమే రుద్రుడు అని వేద భాష్యకర్తలు నిర్వచించారు. వేదమంత్రాలు సుస్పష్టంగా రుద్రుని పర బ్రహ్మగా పేర్కొన్నాయి. శివుని నామాలలో ఇది ఒకటి. వైదిక మత ప్రకారం శివ కేశవులకు భేదం లేదు. ఎవరికి ఏది ఇష్టమైతే దానిని ఆరాధిస్తారు. అంతేకానీ మరో దైవాన్ని ద్వేషించరాదు. విష్ణు సహస్రనామాలలోనే 'రుద్ర' నామం ఉంది.



**ఉపాసకానాం కార్యార్థం**
**బ్రహ్మణో రూపకల్పనా** –ఉపాసకులకు అనుగ్రహించడానికై పరబ్రహ్మ వివిధరూపాలతో, వివిధ నామాలతో వ్యక్తమవుతాడు. అవన్నీ 'ఒకే' పరబ్రహ్మ యొక్క నామరూపాలు – అని గుర్తుంచుకొని, మన అభీష్టదైవాన్ని ఉపాసించాలి.

'అనన్యభక్తి'లో మన ఉపాస్యదైవాన్ని మాత్రమే ఆరాధించినా, ఇతర దేవతల్ని నిందించరాదు. ఎవరి ఉపాస్యదైవం వారికి పరమారాధ్యం. విష్ణువును పరదైవంగా ప్రతిపాదించడానికి ఎన్ని ప్రమాణాలున్నాయో, శివునీ, శక్తినీ, గణపతినీ, సూర్యుడినీ – ఇలా ఆయా దేవతలను కూడా పరదైవాలుగా నిరూపించే ప్రమాణా లున్నాయి. అవన్నీ వేదప్రమాణాలే. వాటన్నిటినీ కలిపి చూడాలి. తద్వారా సమన్వయం బోధపడుతుంది.

**ప్ర: కన్యాపూజార్థం పూజించే కుమారీల వయస్సు ఎంత ఉండాలి?**

**జ:** ఒక సంవత్సరం వయస్సు గల కన్యను తప్ప రెండు సంవత్సరాలు మొదలుకొని, పది సంవత్సరాలలోపు వయస్సు కలిగిన కుమారీలను పూజించాలి. ఆయా వయస్సుల బట్టి – రెండేళ్ళ నుండి పదేళ్ళ లోపు కన్యల పేర్లు వరుసగా కుమారి, త్రిమూర్తి,

కల్యాణి, రోహిణి, కాళి చండిక, శాంభవి, దుర్గ, భద్ర అని తొమ్మిది విధాలు.

ప్ర: **ఈ రోజుల్లో అన్ని ధర్మాలు ఆచరించడం కుదరదు గనుకే 'యః స్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః' అన్నారు. నారాయణస్మరణ ఒక్కటే అన్ని శౌచాలనూ ఇస్తుంది కదా! మళ్ళీ ఆచారాలు పాటించడం దేనికి?**

జ: నారాయణ స్మరణ లేనిదే ఏ ఆచారమూ శుచిమంతం కాదు గనుక, నారాయణుని స్మరించి ధర్మాచరణ చేయమన్నారు. అంతేకానీ, నారాయణుని స్మరించి, ధర్మాన్ని వదిలేస్తే నారాయణుడే సంతోషించడు. ఈ రోజుల్లో–మనం శ్రద్ధగా, శక్తివంచన లేకుండా చేయగలిగినంత సదాచారం చేసి, నారాయణుని స్మరిస్తే ఆ స్మరణవల్ల, మన శక్తికి చాలని ఆచరణలోని లోపం తొలగుతుంది. పూర్ణ ధర్మాచరణ ఫలం లభిస్తుంది. ఏ కర్మ చేసినా మనం శ్రద్ధ, ఆచారాలకు లోపం కల్పించకూడదు. తెలియక ఏదైనా లోపం ఉంటే అది నారాయణ స్మరణవల్ల తొలగుతుంది. అంతేగానీ అలసత్వం చేత, అశ్రద్ధ చేత ధర్మాన్నీ, ఆచారాన్నీ వదలి నారాయణుని స్మరించి తప్పించుకుందామనుకోడం నారాయణ ప్రీతికాదు.

ప్ర: **అంగదుడు వాలికీ, మండోదరికి పుట్టిన వాడని ఒక చోట చదివాను. ఇది నిజమేనా?**

జ: ఒక చోట చదివినంత (వ్రాసినంత) మాత్రాన అది ప్రమాణమైపోదు. మన సంస్కృతిపై ద్వేషబుద్ధి కలిగిన రాక్షస ప్రవృత్తి కలవారు ఇప్పటికీ మన రామాయణ భారతాల్ని వికృత ధోరణిలో చూస్తూ నీచంగా చిత్రీకరిస్తున్నారు. వారిపై నిరసన ప్రకటించవలసిన అవసరం ప్రతి భారతీయునిపై ఉంది.

మన సంస్కృతిపై నీచంగా వ్రాసిన వారి మాటల్ని విశ్వసించకుండా, తెలిసిన వారిని అడిగి తెలుసుకోవడం మన బాధ్యత. ఇలా ప్రశ్నించిన మిమ్మల్ని అభినందిస్తున్నాం. ఏ రామాయణంలోనూ, ఏ పురాణంలోనూ మీరడిగిన విధంగా (మీరు చదివిన విధంగా) లేదు. ఏ రాక్షస బుద్ధికో పుట్టిన దురాలోచన ఇది. అంగదుడు వాలీ తారల పుత్రుడు.

ప్ర: **'ప్రాతఃస్మరణీయులు' అంటే ఏమిటి? వారెవరు?**

జ: ప్రాతఃకాలాన్నే నిద్ర లేస్తూ పవిత్రమైన, దివ్యమైన వస్తువుల్నీ, మహాపురుషుల్ని స్మరించుకోవడం భారతీయ సనాతన ధర్మం. ఉదయానికి పూర్వకాలం ఆ రోజు ఆరంభం. ఆ సమయంలో 'మంచి'ని తలచుకుంటే దినమంతా మంచే జరుగుతుందని భావన.

ప్రాతఃకాలాన ముందుగా, శయ్యమీదే కూర్చొని అరచేతిలో ముగ్గురమ్మలనీ భావనచేసి నమస్కరించి, ఆ తరువాత ఇష్టదైవాన్నీ, దేవతలనీ స్మరించాలి. అటు పిమ్మట వసిష్ఠాది మహర్షులనీ పృథు మాంధాత రఘు మొదలైన మహాచక్రవర్తులనీ ప్రహ్లాదాది పరమ భాగవతులనీ, హిమవత్పర్వతాది పుణ్యగిరులనీ, గంగాది పావన నదులనీ తలంచు కొని నమస్కరించాలి. అటుతరువాత భూమాతకి నమస్కరించి శయ్య నుండి దిగాలి. ఇలా ప్రాతఃకాలంలో స్మరించదగినవారిని 'ప్రాతఃస్మరణీయులు' అంటారు. అలాంటి పుణ్యచరిత్ర గలవారిని కూడా ఆ పేరుతో గౌరవించడం సంప్రదాయం.

ప్ర: **మా బంధువుల్లో కొందరు ఏదో ధ్యానకేంద్రంలో చేరారు. ఆ కేంద్రం వారు 'ధ్యాన ముంటే చాలు – పూజాదికాలు అక్కర్లేదు' అని పట్టుబట్టడంతో వారి ఇంట్లో దేవుడి పటాలు కూడా పెట్టుకోవడం లేదు. పూజలూ, పురస్కారాలు లేవు. వారి పద్ధతి సరియైనదేనా?**

**జ:** ధ్యానం అవసరమే. కానీ 'పూజలు అనవసరం' అని చెప్పరాదు. దేని ప్రయోజనం దానిదే. అసలు 'ధ్యానం' లేకుండా పూజ అనేదే లేదు. దేవుడి పటాలు పెట్టి ఒక నమస్కారం, ఒక పువ్వు పెడితే చాలు. ఆ పటం నుండి వెలువడే శక్తి తరంగాలు ఇంటినిండా వ్యాపించి దైవీ శక్తిని వ్యాపింపజేస్తాయి. అందుకే సరియైన, శాస్త్రీయమైన మంగళాకృతులతో చిత్రీకరించిన పటాలను ఉపయోగిస్తాం.



దైవీశక్తిని భావన, దృశ్యం, శబ్దం – అనే మూడింటి ద్వారా ప్రతిష్ఠిస్తారు. ఏ శబ్దాలు, ఏ ఆకృతులు ఏ భావనతో చిత్రిస్తే ఎలాంటి శక్తిని ఆవిర్భవింప జేస్తాయో సూక్ష్మసృష్టి విశేషాలను దర్శించగలిగే అతీంద్రియ దృష్టితో గ్రహించగల ధ్యానం గొప్పదనాన్ని చెప్పడానికి, పూజల గొప్పదనాన్ని తిరస్కరించవలసినపనిలేదు.

దేవతాకృతిని యంత్ర, శిల, లేపన, లోహ, రేఖ అనే విభేదాలతో ప్రతిష్ఠించగలం. ఒక భావనతో ఒక గీత గీసినా ఆ గీతకి కొంత శక్తి వస్తుంది. అది దేవతాశక్తి కావచ్చు. లేదా వ్యతిరేక శక్తి కావచ్చు.

ఆ గీతలను కొన్ని నిర్దిష్ట శాస్త్రీయ విధానాలలో వృత్త, రేఖ, కోణ విభాగాలుగా చిత్రీ కరిస్తే యంత్రం ఆవిర్భవిస్తుంది. ఒక్కొక్క యంత్రం ఒక్కొక్క మంత్రాన్నీ, ఆ మంత్రాధి దేవతనీ ప్రతిష్ఠించుకుంటుంది. ఒకే దేవతాశక్తి వివిధ రూపాలుగా ఆవిష్కృతమై ఉంది గనుక, ఆ వివిధ నామరూపాలతో, లక్షణాలతో కూడిన దైవీ శక్తి విశేషం ఒక్కో యంత్రం ద్వారా వ్యక్తీకరించబడుతుంది. అదే విధంగా 'శిల'. ఒక్కొక్క శిలకీ

ఒక్కో లక్షణం ఉంది. ఒక్కొక్క దేవతాకృతికి ఒక్కొక్క ప్రత్యేకమైన శిల ఉంటుంది. చూడడానికి శిలలన్నీ ఒకేలా ఉన్నా వాటి లక్షణాలు అనేక రకాలు. ఆ శిల్పశాస్త్రం చాలా ఉంది మనకి. దాని ఆధారంగా శిల్పంలో దేవతని ప్రతిష్ఠిస్తాం. అలాగే లోహాలు (వీటి విషయం, మరోసారి వివరంగా ముచ్చటించుకుందాం). ఆ విధంగానే 'లేపన', 'రేఖ' –అనే వాటితో చిత్రీకరించేవే పటాలు. ఒకసారి ఒక గొప్ప చిత్రకారుడు 'అగ్ని'దేవుని బొమ్మను చిత్రీకరిస్తే, అది ఉన్న చోటు తప్ప, మిగిలిన గృహాన్నంతటినీ దగ్ధం చేసిందిట. అంటే – అగ్నిదేవుని చిత్రీకరించడంలో కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. అవి ఆ చిత్రంలో లేకపోవడంతో అది దగ్ధకారణం అయ్యింది.

ఒకపటం నుండి ప్రసరించే శక్తి తరంగాలను ప్రత్యక్షం చేసి చూపించగలిగే విజ్ఞాన శాస్త్రవేత్తలు ఇప్పుడు చాలామంది ఉన్నారు. అలాగే ఒక పటాన్ని చూడగానే మనలో కొన్ని భావస్పందనలు కలుగుతాయి. మరి ఇళ్ళల్లో ప్రకృతి దృశ్యాలను, పళ్ళ ఫోటోలను, వివిధ సౌందర్యాలను చిత్రీకరించడం ఎందుకు?

అలాగే దైవసంబంధమైన పటాలను చూడగానే మన హృదయంలో తత్సంబంధ మైన భావన జాగృతమవుతుంది. దైవభావనతో కూడిన హృదయ స్పందన తప్పకుండా మంచిని కలిగిస్తుంది కదా! ఇది ఒక భౌతిక దృష్టితో చేసే సమర్థన. అదికాక సూక్ష్మదృష్టికి మాత్రమే గోచరించే సత్యాలు చాలా ఉన్నాయి. ఆ దృష్టి మనకి లేక పోయినా, వాటి ప్రభావం సోకకతప్పదు.

అలాగే ఇంట్లో ఒక క్రమంగా శుచి చేసి, దీపం, ధూపం, దైవానికి సమర్పించితే ఆ ప్రభావంతో ఇంట్లోనే దైవీశక్తుల కళ విస్తరిస్తుంది. దానినే 'లక్ష్మీకళ' అంటాం. ఒక ఇంటిని ఆధారం చేసుకున్న కులదేవతలు, గృహదేవతలు – ఆ దీపారాధన వంటి వాటికి సంతోషిస్తారు. వారి అనుగ్రహం చేత ఇంట్లో సుఖశాంతులు వెల్లివిరుస్తాయి. ధ్యానం గొప్పదే. ఈ పూజలూ గొప్పవే. వీటిలో ఒకదానికొకటి ప్రత్యామ్నాయం కాదు. పరస్పర పరిపూరకాలు మాత్రమే.

అందుకే సాంప్రదాయకంగా వస్తున్న మన ఆచార పరంపరను దేనినీ నిరసించడం తగదు. ఒక్కొక్క అంశంలో దాగిన వైజ్ఞానిక, ఉపాసనా రహస్యాలు క్రమంగా చాలా మంది శాస్త్రవేత్తలు ఇప్పటికే ఋజువు చేస్తున్నారు. అన్ని రహస్యాలు ఒకే తరంలో వ్యాఖ్యానించబడవు. అందుకే భవిష్యత్తరాలు శోధించడానికైనా, ఇవి మిగిలి ఉండాలి. ధూపదీపనైవేద్యాలు, దేవతారాధన చాలా ప్రధానమైనవి. వాటివల్ల, ఇంటిల్లిపాదికీ

ఆయురారోగ్య ఐశ్వర్యాలు లభిస్తాయి. వాటిని ఏకాగ్రంగా, భక్తిగా, ధ్యానంతో ఆచరించవచ్చు.

**ప్ర: కామేశ్వరి, కామేశ్వరుడు - అంటే ఏమిటి?**

**జ:** శక్తినీ, శివునీ, పరబ్రహ్మశక్తినీ, పరబ్రహ్మనీ ఈ పేర్లతో పిలుస్తారు. సృష్టికి పూర్వం నిరాకార, నిర్వికారంగా ఉండే పరబ్రహ్మ - సృష్టిచేయాలని సంకల్పించు కుని - త్రిగుణాత్మకుడై (సత్త్వరజసతమోగుణాత్మకుడై) సృష్టి స్థితిలయలను నిర్వహిస్తున్నాడు. అలా సృష్టి స్థితిలయలు చేయాలనే 'కోరిక' కలిగినప్పుడు ఆ పరబ్రహ్మను 'ఈశ్వరుడు' అంటారు. ఆ 'కోరిక' చేతనే ఆ స్థితిలో 'కామేశ్వరుడు' అని పేరు. అప్పటి పర బ్రహ్మశక్తిని 'కామేశ్వరి' అంటారు. సృష్టి స్థితి లయాత్మక భగవత్ శక్తి- అని దీనికి ప్రధానార్థం. క+అ+మ=కామ, 'క' అనేది బ్రహ్మ వాచకం(సృష్టికారకశక్తి). 'అ' కారం విష్ణువాచకం (స్థితికారకశక్తి), 'మ' కారం రుద్రవాచకం (లయకారశక్తి). ఈ మూడూ కలిసి ఒకే పరబ్రహ్మస్వరూపం కనుక, ఆ పరమ్వేరుని 'కామేశ్వరుడు' అన్నారు.



**ప్ర: జనకమహారాజు భార్యపేరేమిటి? సీత ఎవరికి పుట్టింది? ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి - ఎవరి కుమార్తెలు?**

**జ:** జనకమహారాజుకి సుమేధ, సునయన-అని ఇరువురు భార్యలున్నట్లు పురాణ వాఙ్మయం చెప్తోంది. సీత ఎవరికీ పుట్టలేదు. ఆమె అయోనిజ. భూమి నుండి స్వయంగా ఉద్భవించి, యజ్ఞార్థం భూమిని దున్నుతున్న జనకునికి దొరికింది. ఆమెను సుమేధకు అందించి పెంచసాగాడు. ఊర్మిళ సునయనకు జన్మించింది.

'జనక' అనే పేరు విదేహ రాజులందరికీ సాధారణం. సీతను పెంచిన తండ్రీ, ఊర్మిళ తండ్రీ అయిన జనకుని పేరు సీరధ్వజుడు. అతని తమ్ముడు పేరు- కుశ ధ్వజుడు. ఈ కుశధ్వజుని భార్యపేరు ఇందిర. ఆ దంపతులకు పుట్టినవారే మాండవి, శ్రుతకీర్తి. సీతరామునీ, ఊర్మిళ లక్ష్మణునీ, మాండవి భరతునీ, శత్రుఘ్నుడు శ్రుతకీర్తినీ వివాహమాడారు.

**ప్ర: ఈమధ్య ఒక టి.వి. ప్రోగ్రాంలో - ఒక సాహితీ చరిత్రవేత్త మాట్లాడుతూ 'నరసింహ స్వామి ద్రావిడ ఆర్య సంస్కృతుల సమ్మేళానికి గుర్తు' అని చెప్పారు. ఎంతవరకు సబబు?**

**జ:** మన సంస్కృతిపై అవగాహనలేని సాహితీ చారిత్రకవేత్తలు ఎక్కువవడం మన

దురదృష్టం. తమకు తెలియని, తమకు ప్రవేశంలేని రంగాలపై కూడా వ్యాఖ్యానించడం దుస్సాహసం. వాటిని ఖండించాలి. అసలు ఆర్య-ద్రావిడ విభజనే అసం బద్ధం, అసంగతం,అసత్యం-అని ప్రామాణిక చరిత్రకారులందరూ ముక్త కంఠంతో ఘోషిస్తు న్నారు. నరసింహంలో జంతు భాగం ద్రవిడులదా? మానవ భాగం ఆర్యులదా? లేక అది ఆర్యులదీ, ఇది ద్రవిడులదీనా? అంటే జంతు ప్రాయంగా ఎవరో ఒకరిని అవమానించడం కాదా? దేవతారాధన, ఉపాసనా సంప్రదాయాలు తెలియకుండా మాట్లాడడం అవివేకం.

హిరణ్యకశిపుని వివరాలను అనుసరించి, సంధ్యాస్వరూపుడిగా ఆవిర్భవించిన నారాయణ పరమాత్ముని ఉపాస్య రూపమిది. ఎందరో నారసింహ ఉపాసకులు నేటికీ ఉన్నారు. వారి సాధనా బలం బట్టి ఎన్నో సాక్షాత్కారాలను, సత్ఫలితాలను పొందుతున్నారు. ఇప్పుడీ చెప్పిన సాహితీ చరిత్రవేత్తలుంగారు ఏ ఉపాసనా, ఏ సాధనా, ఏ పురాణ పరిశోధన చేశారని? కనుక అటువంటి అసంబద్ధ విషయా లతో మనస్సు అయోమయం చేసుకోవద్దు.

**ప్ర: భాగవతంలో కృష్ణుడు, భారతంలో కృష్ణుడు ఒకటికాదని కొంతమంది వ్రాయగా చదివాను. సరిగ్గా వివరించగోరిక. అసలీ అభిప్రాయాలు ఎలా ఏర్పడుతున్నాయి?**



**జ:** కొంతమంది అలా వ్రాసిన మాట వాస్తవమే. కేవలం దైవద్వేషంతో, పరిశీలనా రాహిత్యంతో చేసినవే. కానీ భారత యుద్ధానంతరం జరిగిన ఘట్టాలతోనే ప్రారంభ మవుతుంది భాగవతం. భీష్ముడు శ్రీకృష్ణుని ధ్యానించి ముక్తిపొందడం వగైరా అంశాలు భాగవతంలోనూ, భారతంలోనూ ఉన్నాయి. పాండవసఖ్యం, ధర్మరాజుతో నారదుని సంభాషణ (ప్రహ్లాద చరిత్ర) మొదలైనవన్నీ భాగవతంలో ప్రస్తావించారు. ఇలా భారత ఘట్టాలు భాగవతంలో దర్శనమిస్తాయి.

మహాభారతంలో సభాపర్వంలో ద్రౌపదీ వస్త్రాపహరణ సమయంలో ఆమె చేసిన ప్రార్థనలోని "గోవింద! ద్వారకావాసిన్! కృష్ణ! గోపీజనప్రియ!" అనే వాక్యాలలో భాగవతంలోని కృష్ణ స్వరూపమే ప్రత్యక్షమౌతోంది.

మహాభారతంలోని ఇతర ఘట్టాలలో కూడా శ్రీకృష్ణుని నిందించేటప్పుడు, భీష్ముడు దుర్యోధనునకు శ్రీకృష్ణ మహిమను వివరించినప్పుడు బాలకృష్ణలీలలన్నీ వర్ణించారు. ఇవేవీ పరిశీలించకుండా విమర్శించినవారి దృష్టిలో-చారిత్రక పురుషుడుగా శ్రీకృష్ణుడు వేరనీ, అవతారపురుషుడిగా వర్ణించినవన్నీ కల్పితాలనీ చెప్పాలని వారి ఉద్దేశం.

అందుకు వారు భాగవతాన్ని అంగీకరించరు. అవతార పురుషుడు చరిత్రలోనివాడే. భారతంలో కూడా శ్రీకృష్ణుడు అవతార పురుషుడుగానే సహస్రాధికంగా ప్రస్తుతులందాడు. కృష్ణభక్తి–అనే దివ్యవరం లభిస్తే స్వామి అవతార మాధుర్యం అర్థమౌతుంది. కాసింత పరిశీలన ఉంటే భారతభాగవతాలలోని కృష్ణుడు ఒక్కడేనని అర్థమౌతుంది. కేవలం నాస్తికత్వం, మన గ్రంథాలపైన అగౌరవభావం వల్లనే ఇటువంటి అభిప్రాయాలు ఏర్పడుతున్నాయి.

ప్ర: **కాళికామాత చిత్రంలో – ఆమె పాదాలక్రింద ఈశ్వరుడున్నట్లు కొన్ని చోట్ల కనిపిస్తుంది. దయచేసి ఆ కథను కాస్త తెలుపగలరు.**

జ: 'కాళిక' అంటే కాలస్వరూపిణి. **'కలయతీతి కాలః'** – సర్వజగత్తును ఏర్పరచి పోషించి, లయంచేసే శక్తి కాలం. ఈ కాలం పరమేశ్వరుని శక్తి. పరమేశ్వరునిపై ఆధారితమై నడుస్తుంది. అందుకు సంకేతమే శివుని అధిష్ఠించిన ఈ శక్తి రూపం.

పురాణ కథలు, ఉపాసనారూపాలు దివ్య శక్తుల తత్త్వానికి సంకేతాలు.

ఒకసారి దక్ష యజ్ఞానికి వెళ్ళాలని పట్టుబడుతుంది సతీదేవి (ఆదిశక్తి). పిలువని పేరంటానికి వెళ్ళరాదంటాడు శివుడు. శివనింద చేసే దక్షునికి ఇంక పుత్రికగా ఉండరాదనీ, ఆ దక్షునికి బుద్ధి చెప్పాలని అమ్మవారి సంకల్పం. శివుడెంత చెప్పినా అమ్మవారు తన పట్టువీడదు. దానితో 'నీవు దక్షపుత్రికవు కనుక, నామాట వినడం లేదు' అంటాడు. భార్యాభిమానం చేతనో, లేక 'దక్షపుత్రికాభావాన్ని' త్యజించమని సూచించాలనో శివుడు ఆ మాట అన్నాడు. అది విన్న జగదంబ సతీదేవి, 'ఈ స్వామి నేను పరాశక్తిననే అంశాన్ని విస్మరిస్తున్నాడు' అని భావించి, తానేమిటో స్పష్టపరచాలని సంకల్పించుకుంటుంది. ఆ సంకల్పంచేత– మహాకాళీ స్వరూపంగా మారుతుంది. ఆమె నుండి మరో తొమ్మిది శక్తులు ఆవిర్భవిస్తాయి. అవే 'దశమహావిద్యలు'. ఆ రూపాలను చూశాకా శివుడు తిరిగి స్వస్థితికి చేరుకుంటాడు. ఆ రూపాలకు సంబంధించిన మంత్ర, తంత్ర, యంత్రాది ఆగమ విధులను ఏర్పరచమని శివునితో చెప్తుంది. శక్తితత్వం గురించి చెప్పగలిగేది శివుడొక్కడే కదా!

ఆ తరువాత మిగిలిన రూపాలను ఉపసంహరించుకుని దక్షయజ్ఞానికి వెళ్ళిన సతీదేవి, అక్కడ యోగాగ్నితో తన శరీరాన్ని త్యజించుతుంది. పిమ్మట గౌరిగా హిమవంతుని పుత్రికగా ఆవిర్భవిస్తుంది. ఆ రూపంలో శివుని తపస్సుకి సహకరిస్తూ అర్చించిన గౌరమ్మను, మన్మథ దహనానంతరం చూసిన శివుడు.

"నువ్వు దక్షయజ్ఞానికి వెళ్ళేముందు చూపించిన కాళీరూపాన్ని ఇప్పుడు చూడాలని ఉంది" అంటాడు. వెంటనే ఆదిశక్తి కాళీరూపాన్ని చూపిస్తుంది. అది చూసి పరవశించి పరమశివుడు, భూమిపై శయనించి తన హృదయంపై అధిష్ఠించమని ప్రార్థిస్తాడు. శక్తి శివునిపై అధిష్ఠించి ప్రకాశిస్తుంది. మరో రూపంలో శివుడు కాళీదేవికి ఎదురుగా నిలచి, 'కాళీసహస్రనామస్తోత్రాన్ని' పఠిస్తాడు. ఇది దేవీ భాగవత ఉపపురాణంలోని కథ. ఇందులో సంకేతం–పరబ్రహ్మనిర్గుణంగా, నిరంజనంగా ఉంటే ఆయన శక్తి ఆయనను అధిష్ఠించి ఈ జగత్తును నిర్వహి స్తోంది... అని తెలియజేయడమే. ఉపాసనకి సంబంధించిన ఈ దివ్యమూర్తిలో శివశక్తుల సామరస్యమే స్ఫూరిస్తుంది.

**ప్ర: యజ్ఞం, క్రతువు, యాగం, సత్రం, మఖం అంటే ఏమిటి? వాటి భేదాలు తెలియజేయ గోరుతున్నాము?**

**జ:** యజ్ఞం అంటే దేవతకు సమర్పణంగా చేసే ఆరాధన. వివిధ ఆహుతులను దేవతార్పణంగా చేసే క్రియ. ఇలా ఆహుతులు సమర్పించే క్రియనే 'యాగం' అంటారు. 'మఖం' కూడా దీనికి పర్యాయమే. యూపస్తంభం ఉంచి చేసే యజ్ఞాన్ని 'క్రతువు' అంటారు. 'సత్రం' అంటే 12 రాత్రులకు పైగా జరిగే యజ్ఞం. ఇందులో అందరూ యజమానులే, అందరూ ఋత్విజులే. యజ్ఞంచేసే వాడు యజమాని. యజ్ఞంలో యజమాని దంపతులకే ఫలం. మిగిలిన ఋత్వి జాదులకి దక్షిణతోనే చెల్లు. కానీ 'సత్రం'లో అందరూ యజమానులే. అందరికీ ఫలం ఉంటుంది.

**ప్ర: ఋషిపీఠంలో పితృతర్పణం, శ్రాద్ధ కర్మల గురించి చదివాను. కానీ ఓ కవి "పెంట తినెడు కాకి పితరుడెట్లాయెరా?" అని విమర్శించారు. మరి సమన్వయం ఎలా?**

**జ:** కవిత్వం వేరు, శాస్త్రం వేరు. కవి లౌకికుడు. శాస్త్రం అలౌకిక విజ్ఞానం. దానికి సూక్ష్మ దృష్టి అవసరం. కవికి విజ్ఞానం ఉండవలసిన అవసరం లేదు. ఏ జీవి ఏ శక్తికి వాహికగా పనిచేస్తోందో కవిత్వంతో చెప్పలేం. ఋషులకు ఆ కవిగారికున్న పాటి తెలివి ఉండదా! పైగా కాకిని తక్కువ దృష్టితో చూడడం తగినదేనా? దేని ప్రాధాన్యత దానికుంటుంది. పితృదేవతల శక్తిని గ్రహించగలిగే లక్షణం కాకి ఉపాధిలో ఉంది. ఒక జీవి చుట్టూ ఉన్న చైతన్యావరణాన్ని గమ నించగలిగితే ఒక్కో ఆవరణలో ఒక్కొక్క శక్తీ ప్రసరించడాన్ని గ్రహించగలం.

పిండప్రదాన సమయంలో కాకిలో ఆ శక్తి ప్రసరణ జరుగుతుంది. దర్శించగలిగే

సూక్ష్మదృష్టి ఉంటే దానినే చూడగలం. కానీ మనం తపస్వులం కాదుకదా! అవన్నీ అటుంచి – తన పూర్వీకులను స్మరించుకోవడం, దానిని ఉద్దేశించి ఒక ప్రాణిని తృప్తి పరచడంలో తప్పేముంది! కృతజ్ఞతాభావానికి, ప్రాణికోటి ఆదరణకీ ఇదీ ఒక సాధన – అని అవగాహన చేసుకొంటే విమర్శించవలసిన అవసరమేముంది! అయినా ఒక ప్రాణిని కించపరచడం మాత్రం మానవత్వం ఒప్పుకుంటుందా! లౌకిక దృష్టితో చూసినా ఒక పక్షికి అంత ఉత్తమ స్థానం ఇవ్వడం, జీవకోటి పట్ల మనిషికున్న బంధాన్ని తెలియజేయదా! వేమనగారి పద్యాలుగా చెలామణి అయ్యేవన్నీ ఆయనవి కావని సాహితీవేత్తలు చెప్తున్నారు.

కర్మభ్రష్టుల్ని, ధర్మ భ్రష్టుల్నీ చేసే కవిత్వాన్ని కవిత్వంగా చూస్తే ఫరవాలేదు. ప్రమాణంగా అంగీకరించలేం.

మీరు చెప్పిన ఆ కవిగారే–పుట్టినప్పుడు బట్టలేదు. పోయేటప్పుడూ వెంట రాదనీ, నడుమ వస్త్రాలెందుకనీ–అన్నారు. కానీ మనం ఆ పని చేయలేం కదా!

అయినా, పితృతర్పణం, శ్రాద్ధకర్మలలో ఒక్కభాగం 'కాకి'కి భుక్తి పెట్టడం. అదొక్కటి చూపి పితృయజ్ఞాన్ని మొత్తం తూలనాడడం తగదు కదా!



**ప్ర: జగద్గురు శ్రీఆదిశంకరుల విరచితమైన 'సౌందర్యలహరి'లో శక్తిలేనిచో శివుడు ఒక్క అడుగు కూడా వెయ్యలేడనే అర్థంతో శ్లోకముంది. మరి శక్తి శివుడు అంటే ద్వైతభావం వచ్చేటట్లుంది కదా! దీనికి అద్వైత సమన్వయం ఎలా?**

**జ:** అది రెండు కాదు, రెండుగా కనబడుతోంది ద్వైత దృష్టికి. అందుకే 'ఏకం' అనకుండా 'అద్వైతం' (రెండుకాదు) అన్నారు. పరబ్రహ్మ యొక్క స్పందనమే శక్తి. అగ్నీ దాని వేడిమీ, సూర్యుడూ, అతడి కాంతీ, నీరూ, చలువదనమూ వేరు కానట్లే అవి వేరు కావు. రెండు కావు. దీప జ్యోతి నుండి అంతా ప్రసరించే వెలుగు జ్యోతికి భిన్న మైనదా! వెలుగే మనకి ముందు కనబడుతుంది. ఆ తరువాత జ్యోతి వెలుగు ద్వారానే జ్యోతిని పోల్చుకుంటున్నాం. శక్తి ద్వారానే శివుడు వ్యక్తమౌతున్నాడు. ఇదే రెండుగా కనబడే ఒకతత్వం. ఇదే శివశక్తుల సమన్వయం.

**ప్ర: 'నవవ్యాకరణ పండితుడు' అంటారు కదా? ఆ నవవ్యాకరణాలు ఏమిటి?**

**జ:** ఇంద్రః చంద్రః కాశకృత్స్నః ఆపిశలీ శాకటాయనమ్ । పాణిన్యమరజైనేంద్రాః జయాదిత్యాది శాబ్దికః ॥ –అని నవవ్యాకరణాలు. అంటే – 1.ఇంద్రవ్యాకరణం, 2.చంద్రవ్యాకరణం, 3.కాశకృత్స్న వ్యాకరణం, 4.ఆపిశలీవ్యాకరణం, 5. శాకటాయన

వ్యాకరణం, 6. పాణిని వ్యాకరణం, 7. అమరవ్యాకరణం, 8. జైనేంద్ర వ్యాకరణం, 9. జయాదిత్య వ్యాకరణం.

ప్ర: **మంత్రజపం వలన నాడీ వ్యవస్థలో మార్పు కలుగుతుందంటారు కదా! మరి మంత్రం జపించే ముందు మంత్ర సిద్ధాదిశోధనం, సిద్ధాది చక్రం, కులాకుల చక్రం, ఋణ, ధన శోధనం ఎందుకు? సాధన వలన (కొన్నింటికి మాత్రమే) వంశానికి, సాధకునికి ఎందువలన అపకారం జరుగుతుంది? తెలుపగలరు.**

జ: ఒక్కొక్క మంత్రం ఒక్కొక్క దేవతా శక్తికి కేంద్రం. దానిని జీవచైతన్యంతో అనుసంధానించే ముందు, ఆ చైతన్యాన్ని ఆవరించి ఉన్న జన్మాంతరగతమైన దుష్ట సంస్కారాలు తొలగించాలి.

గంగను ఒక పాత్రలో ఉంచాలంటే ముందు ఆ పాత్రను శుద్ధి చేయాలి కదా! గంగ శుద్ధికారిణి అయినా. అంతే కాదు విద్యుచ్ఛక్తి ఒకటి అయినా 'వోల్టేజీ' భేదాలుంటాయి. ఎంత వోల్టేజిని ఏ పరిమాణంలో ఉన్న తీగలు తట్టుకోగలవో చూసి దాని ప్రకారం విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తారు. అలాగే కొన్ని సాధనలను సరియైన ప్రకారం సాగించక పోతే అధిక 'వోల్టేజి', చిన్న పరిమాణపు తీగలో ప్రసరిస్తే జరిగినట్లుగానే – కొన్ని ప్రమాదాలుంటాయి.



అందుకే మంత్రము యొక్క స్వరూప స్వభావాలపై అవగాహన ఉన్న మంత్ర సిద్ధుడైన గురువు. సాధకుని దేశకాల పరిస్థితులను జీవసంస్కారాన్నీ గమనించి, తగిన శోధన చేసి అనుగుణమైన మంత్రాన్ని ఇస్తాడు.

ఒక జీవుడు ఏ ఉపాధిలో, ఎటువంటి జీవన విధానంలో, ఎలాంటి అలవాట్లతో ఉంటున్నాడో గమనించి కొన్ని మంత్రాలు సాధన చేయాలి. అన్ని మంత్రాలకీ సాధారణ నియమాలుంటాయి. కానీ వాటితో పాటు కొన్నిటికి విశేష నియమాలుంటాయి. వాటిననుసరించి మంత్రజపం ఉంటుంది.

ప్ర: **విష్ణుపాదంలో ఉద్భవించిన గంగను శివుడు శిరస్సున ధరించాడు. కనుక, శివుని కంటె విష్ణువు అధికుడు కాదా!**

జ: విష్ణు పాదోద్భవ గంగను ధరించినంత మాత్రాన శివునికి తక్కువదనం కాదు. శివుడు, విష్ణువు పరస్పర ఆరాధకులు. లోకానుగ్రహం కోసం వారు చేసిన కృత్యాలివి. విష్ణుపాదం–అంటే 'విష్ణుపదం'. ఈ శబ్దానికి వేదం చెప్పినది–'వియత్ విష్ణు పదం'– అంటే 'అంతరిక్షమే విష్ణుపదం'. ఆ అంతరిక్షాలలోనున్న ఆకాశగంగ భగీరథుని

కోసం భూమిపైకి దిగినప్పుడు శివుడు అంతరిక్షపు తరువాతి పదమైన 'వ్యోమము' ద్వారా ఆ జలాన్ని ధరించి, భూమికి ప్రమాదం కలగకుండా, 'నియంత్రించి' కొంత భాగాన్ని భువికి అనుగ్రహించాడు. ఇది లోకోద్ధరణ కోసం శివకేశవులు చేసినవి. దీనిని మనలోక వ్యవహారాల మాదిరి భావించి, ఆ పరతత్త్వమూర్తుల మధ్య లేని ఎక్కువ తక్కువ గొడవలు తెచ్చిపెట్టుకోవడం ఎందుకు?

**ప్ర: నిర్గుణ నిరాకారుడైన పరమాత్మ గురించి బోధించిన అద్వైత మతస్థాపకులు శ్రీఆది శంకరాచార్యులు "శ్రీమత్ పయోనిధినికేతన చక్రపాణే" అంటూ సాకారలక్ష్మీ నృసింహ స్వామిని స్తుతించడంలో గల రహస్యం ఏమిటి?**

**జ:** పరమాత్మ నిర్గుణ నిరాకారుడైనప్పటికీ భక్తానుగ్రహార్థం సగుణసాకారుడు అవుతాడు. అందుకే ఆయన వివిధ రూపాలు ధరించాడు. ఆ రూపాలన్నీ ఉపా సించవలసినవేనని ఆది శంకరుల బోధ. ఆ సాకారాలన్నీ నిరాకార నిర్గుణ పర మాత్మకు భిన్నం కావు. పంచదారతో అనేక బొమ్మలు చేసినా వాటినిండా ఉన్నది పంచదారే. పరమాత్మ సగుణ సాకార రూపాలన్నీ నిర్గుణతత్త్వాన్ని తెలియజేసేవే. వాటి ద్వారా లభించేది అద్వైతమే. అనేక గ్రంథాలలో ఆచార్యులు సగుణ నిర్గుణాలకు ఐక్యతను ప్రతి పాదించారు. అందువల్ల లక్ష్మీనృసింహస్వామిని స్తుతించడంలో తన హృదయానికి విరుద్ధం ఏమీ లేదు. నిర్గుణ తత్త్వంతో సకల సుగుణాలనీ సమన్వయించిన వేద స్వరూపులు శంకరులు.



**ప్ర: దశావతారాలలో 'బౌద్ధావతారం' అంటే చరిత్రలోని గౌతమ బుద్ధుడేనా? నమో బౌద్ధావతారాయ దైత్యస్త్రీ మానభంజినే, అచింత్యాశ్వత్థ రూపాయ రామాయాపన్ని వారిణే" అని 'శ్రీమదాపన్నారకరామస్తోత్రం'లో ఉంది. దీని గురించి తెలుప ప్రార్థన.**

**జ:** దశావతారాలలో పేర్కొన్న బుద్ధుడు గౌతమ బుద్ధుడు కాదనే చెప్పాలి. ప్రాచీన పురాణ వాఙ్మయాన్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది. త్రిపురాసురుల భార్యలు మహా పతివ్రతలు. వారి పాతివ్రత్యశక్తి వల్ల త్రిపురులను ఎవరూ జయించలేకపోతారు. అప్పుడు ఆ శక్తిని ఉపసంహరింపజేయడానికి లోకరక్షణ, ధర్మరక్షణ కోసం విష్ణువు బుద్ధరూపాన్ని ధరించాడు. సమ్మోహనకరమైన రూపంతో, ఒక అశ్వత్థవృక్షమూలాన సాక్షాత్కరించిన అతనిని జూచి, మోహితులై, ధర్మాన్ని తప్పారు ఆ స్త్రీలు. దానితో త్రిపురుల బలం క్షీణించింది. శివునిచేత హతులయ్యారు. ఇదే మీరు చెప్పిన 'ఆపన్ని వారక స్తోత్రం'లో ఉంది. 'దైత్యస్త్రీమానభంజినే' అంటే 'రాక్షస స్త్రీల పాతివృత్యాన్ని

భంగం చేసినవాడు' అని అర్థం. ఇది కాక–దివోదాసుడనే రాజును ఆ కాలానికి అవసరంగా రాజ్యచ్యుతి కల్పించవలసి వచ్చింది. అందుకు ధర్మ బలాన్ని తొలగించి రాజును తప్పించడానికి విష్ణువు బుద్ధావతారమెత్తాడు. ఆ సమయంలో అవైదిక, అధార్మిక బోధలతో ఆ రాజ్యానికి బలహీనపరిస్థితి చేకూర్చాడు.

–ఇవే పురాణ బుద్ధుని అవతారాలు. పైమొదటి వృత్తాంతాన్నే అన్నమయ్య దశావతార వర్ణనలలో పేర్కొన్నాడు. **"పురసతుల మానములు పొల్లచేసినచేయి"** **"ఆకసాన బారే వూరి అతివలమానములుకాకుసేయువాడు"**

ఆకసాన విహరించే ఊరులు–త్రిపురాలు. వారి మగువల ధర్మాన్ని తప్పించిన వాడు. అప్పటి పరిస్థితుల బట్టి లోకరక్షణ కోసం స్వామి ధరించిన లీలావతార మిది. ఆ బుద్ధునికీ గౌతమ బుద్ధునికీ సంబంధం లేదు.

**ప్ర: మహాభారతం 'శాంతిపర్వం'లో తిక్కనగారు వ్యాసుని గురించి వ్రాస్తు, వ్యాసునికి "అపాంతరతముడు" అనే పేరు ఉన్నట్లు వ్రాశారు. ఆ మాటకి అర్థం ఏమిటి?**

**జ:** 'అంతరతమము' అంటే 'లోపలి చీకటి' (అజ్ఞానం) అని అర్థం. దానిని తొలగించే వాడు 'అపాంతరతముడు'. అంటే అజ్ఞానాన్ని నిర్మూలనం చేసేవాడు. వేద వ్యాసుడు మనకు గురువు. వేదాలను, పురాణాలను, మహాభారతాన్నీ, బ్రహ్మ సూత్రాలను మనకు ప్రసాదించి, అజ్ఞాన నాశనానికి కావలసిన జ్ఞానసంపదను అందజేశాడు. అందుకే ఆయనను 'అపాంతరతముడు' అన్నారు.



**ప్ర: 'హరేరామ హరేరామ.....హరే కృష్ణ....' మంత్రంలో రాముడు బలరాముడా? లేక దశరథరాముడా? ఎందుచేత?**

**జ:** ఈ మంత్రం 'కలిసంతరణోపనిషత్తు' లోనిది. నారద మహర్షి ఉపదేశించిన మంత్రమిది. ఇందులో రాముడు దశరథరాముడేనని స్పష్టం. 'రామ' నామం తారక మంత్రం. 'హరి' అనేది గొప్ప విష్ణునామం. 'కృష్ణ' నామం కూడా మోక్ష కారకం. రామ తారకమంత్రం ద్వారా ఉపాస్యమయ్యే దైవం దాశరథి శ్రీరాముడు.

ఈ రామకృష్ణావతారాలు రెండే మానవులుగా వచ్చిన పరిపూర్ణ విష్ణు అవతారాలు. తారక మంత్రమైన రామనామం, దివ్యమైన కృష్ణనామం 'హరి' నామంతో కలిసి ఉండడం చేత ఇది మహామంత్రమయ్యింది. బలరాముడు అంశావతారం. దశరథ రాముడు పూర్ణావతారం. అన్ని కారణాలచేత ఈ మంత్రంలో రాముడు దశరథ రాముడేనని శాస్త్రవేత్తలు చెప్పారు.

**ప్ర: కొన్ని రోజుల్లో వేదాన్ని అధ్యయనం చేయరాదు. అంటారు కదా! ఆ రోజులు ఏమిటి? అవి వేదానికేనా? లేక రామాయణ భారతాలకు, ఇతర పురాణాదులకు కూడానా? ఆ రోజుల్లో జపాలు, పారాయణలు చేయవచ్చా?**

**జ:** "చతుర్దశ్యష్టమీ పర్వప్రతిపత్స్వేవ సర్వదా". పాడ్యమి, చతుర్దశి, అష్టమి, పూర్ణిమ, అమావాస్య, సంక్రాంతి ఈ తిథులలో వేదాధ్యయనం చేయరాదు. అలాగే చవితి, సప్తమి మొదలైన తిథులలో ప్రదోషమందు (సాయంత్రం) అధ్యయనం చేయరాదు. అయితే వేదాంగాలైన పురాణాలు, నిరుక్తాదులు, ఇతిహాసాదులు– వీటికి అనధ్యాయం విధించలేదు. వాటిని నిత్యం అధ్యయనం చేయవచ్చు.

**అనధ్యాయస్తు నాంగేషు**
**నేతిహాసపురాణయోః**
**నధర్మశాస్త్రేష్వన్యేషు**
**వర్ణ్యతేతో నవర్జయేత్"** –అని ధర్మశాస్త్ర వచన ప్రకారం పురాణాదులు, రామాయణ భారతాదులు నిత్యం పారాయణం చేయవచ్చు. అలాగే జపాలకు, నిత్య కర్మలకు, పారాయణలకు నిషేధ (అనధ్యయన) దినాలంటూ లేవు.



**నిత్యే జపే చకామ్యేచ**
**క్రతౌ పారాయణేపి చ**
**నానధ్యాయోస్తివేదానాం...** వంటి 'ధర్మశాస్త్రశ్లోకాల ఆధారంగా, నిత్య కర్మాదుల్లో, పారాయణల్లో వేదాన్ని ఉచ్చరించవచ్చు.

**ప్ర: ఆది శంకరులు అద్వైత మతస్థులు కదా! మరి ఆయన శైవమత చిహ్నాలైన విబూది ధరించారు. ఎందుకు? వారి సంప్రదాయం వారు శైవులా?**

**జ:** అద్వైతానికి శివకేశవుల మధ్య భేదం ఉండదు. భస్మధారణం సనాతన వైదిక సంప్ర దాయం. సనాతన వేదమతంలో శివకేశవ భేదాలు లేవు. మనది యజ్ఞ సంస్కృతి. నిత్యం అగ్నిహోత్రారాధన, యజ్ఞం, సమస్త దేవతలనూ అగ్ని ద్వారా ఉపాసించడం వేదపద్ధతి. ఆ విధంగా అగ్ని ఆరాధనాదులు చేశాక, మిగిలేది – భస్మం. దానిని యజ్ఞప్రసాదంగా నిత్యం ధరిస్తారు. త్రిపుండ్రాలు (భస్మంతో ధరించే) త్రేతాగ్నులకు (గార్హపత్య, ఆహవనీయ, దక్షిణా గ్నులు), ఓంకారంలోని మూడు వర్ణాలకు, త్రిమూర్తులకు, త్రిశక్తులకు సంకేతం. వేదంలో భస్మధారణ మంత్రాలున్నాయి. 'అగ్నిరితిభస్మ జలమితిభస్మ' – మొదలైన మంత్రాలు చెప్పబడ్డాయి.

**జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం**

**తమాహుః పండితం బుధాః** – అని 'గీత'లో శ్రీకృష్ణపరమాత్మ వచనం, జ్ఞానాగ్నిలో కర్మసంచయం దగ్ధమవడం – అనే సంకేతమే భస్మధారణలో ఉంది. 'అగ్నిసారం భస్మం' అని శాస్త్రోక్తి. శివుడు మహాగ్ని. పరంజ్యోతి. సాకారంగా జ్ఞాన మూర్తి. ఆ జ్ఞాన, యోగలక్షణాలను తెలియజేసేది భస్మధారణ. అందుకే శివుడు భస్మాన్ని ధరిస్తాడు. భస్మానికి 'విభూతి' అని కూడా పేరుంది. విభూతి– అంటే ఐశ్వర్యం. అగ్ని కూడా ఐశ్వర్యకారకుడు. అందుకే అగ్నిసారమైన భస్మం వర్చస్సునీ, ఐశ్వర్యాన్నీ ప్రసాదిస్తుంది.

విభూతిలో మంత్రశక్తిని నిక్షిప్తం చేయవచ్చు. అందుకే విభూది ద్వారా రక్షణని కల్పించుతారు. దుష్టశక్తుల దృష్టిపడకుండా విబూది రక్షిస్తుంది. ఇది హిందూమత చిహ్నం. విబూదితోపాటు చందనం, కుంకుమ ధరించడం మన సంప్రదాయం.

మన శరీరంలోని యోగ కేంద్రాలలో లలాటం (నుదురు), భ్రూమధ్యం (కనుబొమల నడుమ) చాలా ప్రధానమైనవి. దేవతా శక్తులను ధ్యానించడానికి, కేంద్రీకరణకి ప్రధానకేంద్రాలవి. అందుకే వాటికి భస్మధారణ.



అగ్నిసారమైన భస్మం వల్ల శరీరం శుద్ధమవుతుంది. ఇది ఏదో ఒక శాఖకి చెందినది కాదు. మన భారతీయ సనాతన ధర్మం. శివుడు, కేశవుడు ఇద్దరూ మనవారే.

ప్ర: **కొందరు తీర్థయాత్రలకు రాలేకపోతారు. అలా రాలేని వారికి మంచి కలగడం కోసం, తీర్థయాత్రలు చేసేవారు ఏంచేయాలి?**

జ: ***మాతరం పితరం జాయాం***
***భ్రాతరం సుహృదం గురుమ్।***
***తీర్థేస్నాయాద్యముద్దిశ్య***
***సోష్టమాంశం లభేన్నరః ॥***

తల్లి, తండ్రి, భార్య, సోదరుడు, మిత్రుడు, గురువు వీరిని ఉద్దేశించి తీర్థంలో స్నానం చేస్తే, ఆ స్నానఫలంలో ఎనిమిదవ భాగం వారికి లభిస్తుంది.

**యద్వా ప్రతికృతిం దర్భ**
**మయీం సత్తీర్థ వారిషు ।**
**మజ్జయేచ్చయ ముద్దిశ్య**
**సోష్ఠమాంశం ఫలంలభేత్ ॥**

లేదా– వారికి బదులుగా వారిని స్మరిస్తూ ఒక దర్భను ముంచినా, వారికి స్నాన ఫలంలో ఎనిమిదవ భాగం లభిస్తుందని ధర్మశాస్త్ర వచనం.

**ప్ర: భారతంలో ఏకలవ్యుని విషయంలో ద్రోణుడు అన్యాయం చేసినట్లు తోస్తోంది. కేవలం తనను పోషిస్తున్నందుకు పాండవులకు మేలు చేయాలని ఏకలవ్యునకు విద్యను ఇవ్వకపోవడం, పైగా బొటన వ్రేలు అడగడం సమంజసమా! ఇందులో వర్గవివక్ష లేదా! వసిష్ఠాదులవలె గురుకుల ధర్మాన్నీ, అరణ్యవాసాన్ని అతడు ఎందుకు పాటించలేదు?**

**జ:** ఇటువంటి ఘట్టాలవద్ద ఏకాగ్రంగా పరిశీలించాలి. బుద్ధిని ఉపయోగించాలి.

పాండవులు రాజ్యపరిపాలన బాధ్యతగల కుటుంబంలోని వారు – అంటే క్షత్రియులు. నాటి సాంఘిక వ్యవస్థను అనుసరించి రాజ్యరక్షణ బాధ్యత వారి ధర్మం. అటువంటి క్షత్రియులకు –రాజ్య రక్షణార్థం అవసరమైన విద్య 'ధనుర్వేదం'. ఇది సమంత్రకమైన విద్య. దీనికొక తపశ్శక్తి, సంస్కార విశేషం అవసరం. అవి కలిగిన వారు పాండవులు, విశేషించి అర్జునుడు.



ఏకలవ్యుడు ప్రజ్ఞాశాలి. ఏకాగ్రమైన చిత్తంతో సాధనచేసి కొంతమేరకు విద్యను సాధించిన ప్రతిభావంతుడు. అందులో సందేహం లేదు. కానీ అతడు ద్రోణుని గురువుగా భావించాడు. కనుక అతడు తన విద్యతో సాధించే ప్రతిపనికీ ద్రోణుని 'గురుముద్ర' ఉండితీరుతుంది. తద్వారా ద్రోణుడూ బాధ్యుడవుతాడు. ఆ బాధ్యత కలిగియున్నవాడు కనుక ద్రోణుడు ధర్మాన్నీ, దేశక్షేమాన్నీ దృష్టిలో ఉంచుకొని ఏకలవ్యుని బొటనవ్రేలిని దక్షిణగా అడిగాడు.

ఇందులో రాజకులానికి అమ్ముడుపోవడం లేదు. దేశపాలకులకు గురువైనవాడు, దేశరక్షణకు అవసరమైన యుద్ధవిద్యను, ఆ రక్షణ ధర్మం కలిగిన రాజులకు అంది స్తున్నాడు. దేశరక్షణకు ప్రధానమైన యుద్ధ విద్య సామాన్యులకు నేర్పుతారా! ఇప్పటి కైనా రక్షణశాఖారహస్యాలను ప్రభుత్వం ప్రజలకు బట్టబయలు చేస్తుందా? దానిలో సుశిక్షితులై, అంకితభావంతో నియమితులైన వారికి మాత్రమే కదా అవి తెలిసేవి! అలా కాదని ప్రజలందరికీ వాటిని తెలియజేస్తే ప్రమాదం కాదా!

ఒకవేళ పొరపాటున ఒక సామాన్యునికి తెలిస్తే అతడి నుండి సమాజానికి ప్రమాదం వస్తుందే మోననే ఊహతోనైనా ప్రభుత్వం శిక్షిస్తుంది కదా! ఇందులో 'వర్గవివక్ష' లేదు కదా. 'డిఫెన్స్' (రక్షణశాఖ) వారి వద్దకు వెళ్ళి "మిస్సైల్స్' ఎలా చేయాలో

నేర్పండి”– అని ఎవరైనా వెళ్ళి అడిగితే నేర్పుతారా? అవి చేసే పరికరాలను ఏర్పాటు చేయమంటే చేస్తారా? అంతేకాక మరో రహస్యవిషయమే మిటంటే, ఆటవికుడైన ఏకలవ్యుడు, శబరులు వంటివారికి అలవాటైన ఒక విధమైన ఉపాసనతో ద్రోణుని ప్రతిమ ద్వారా విద్యను గ్రహించాడు. అది కపటోపాసన. దానికి శిక్ష కూడా ధర్మ పరంగా విధించాడు ద్రోణుడు.

అదే విధంగా రహస్యమైన ధనుర్వేదం పాండవాదులకే నేర్పుతున్నాడు. ఆ విద్య ఏకలవ్యుని వద్ద ఉంటే – భవిష్యత్తులో సమాజానికి హాని కలుగవచ్చు. ఎందుకంటే విద్యకు ప్రయోజనమనేది ముఖ్యం. ఆ ప్రయోజనం తెలియని విద్య ఏకలవ్యునిది. అతడు వృత్తిపరంగా నిషాదుడు. హింసాప్రధాన ప్రవృత్తి గల విద్య అతనిది. క్షాత్రమైన ధనుర్వేద విద్య హింసాప్రధానమో, పోషణ ప్రధానమో కాదు. ధర్మ దేశ పరిరక్షణార్థ మైనది. సంస్కారాన్ని అనుసరించి విద్యను ఉపదేశిస్తేనే, విద్యాప్రయోజనం నెరవేరు తుంది. ఇక్కడ వర్గ ప్రస్తావనకన్నా, వారి వారి స్థానాల ప్రస్తావనను గమనించాలి. విద్యా స్వరూపమూ, ప్రయోజనమూ తెలియక పోవడం చేతనే వేటకుక్కపై విద్యా కౌశల్యాన్ని ప్రయోగించి ఏడు బాణాలను వేశాడు ఏకలవ్యుడు. ఇందులోనూ వృథా హింసాత్మకమైన రాక్షస వృత్తిని గోచరిస్తుంది. విద్యాదుర్వినియోగం కనబడుతుంది. ఉత్తముడైన గురువు శిష్యుడి చిత్త సంస్కారాన్ని, లక్షణాలనీ కూడా గ్రహించగలడు. ద్రోణుడు అటువంటి ఉత్తమ గురువు. అందుకే ఏకలవ్యునిలోనూ ప్రమాదకర ప్రవృత్తిని గమనించాడు. ధనుర్వేదం కేవలం ‘విలువిద్య’ కాదు. అస్త్రవిద్య వేరు– శస్త్రవిద్య వేరు. మంత్రపూరితమైనది అస్త్రవిద్య.ఈ రెండూ కలిసి ధనుర్విద్య. దేశక్షేమంకరమైన ధనుర్వేదం రక్షణ బాధ్యతగల వారివద్ద మాత్రమే ఉండవలసిన విద్య. అందుకే మొదటే ఆ విద్యను ఏకలవ్యునికి నేర్పడానికి నిరాకరించాడు. అది రాజగురు ధర్మం. పైగా అడవిలో ఏకలవ్యుడు తారసపడడం, ద్రోణుడు బొటనవ్రేలిని అడగడం–వెనుక దైవసంకల్పం కూడా ఉంది. ఈ విషయం కర్ణపర్వంలో ఘటోత్కచ వధానంతరం శ్రీకృష్ణ పరమాత్మ స్వయంగా చెప్పారు. రాక్షసాంశతో ఉద్భవించిన పాత్రలలో కంస, జరాసంధ, ఘటోత్కచ, ఏకలవ్యుల పేర్లు చెప్పబడ్డాయి. అందుకే వారు వివిధ విధాలుగా దెబ్బతీయబడ్డారు. రాక్షస భావాలున్న వారి చేతిలో విజ్ఞాన శాస్త్రాలుంటే రణమూ, లోకవినాశనము కలుగుతాయి. పైగా గురు ముఖతః ప్రత్యక్షంగా నేర్వని విద్యలు ప్రమాదకరాలు అని శాస్త్రవచనం. అందుకే పరమాత్మ

ప్రేరణ వల్లనే ఉత్తమ చిత్తవృత్తి కలిగిన ద్రోణునకు ఆ సంకల్పం కలిగింది.

ధర్మ రక్షణ కోసం సుక్షత్రియులకు శిక్షణ నిస్తున్న ఆచార్యుడు తనను ఆరాధిస్తున్నాడనే మోహంతో ఒక నిషాదుని (హింసయే వృత్తిగా జీవించే వేటగాడిని) క్షమిస్తే – విపత్కర పరిణామాలు ఎదురుకావా!

పాండవాదులను శిష్యులుగా అంగీకరించి విద్యనేర్పుతున్న గురువు ద్రోణుడు. తాను విద్యను నేర్పకపోయినా తనను గురువుగా అంగీకరించిన శిష్యుడు ఏకలవ్యుడు. కేవలం అంగీకరించిన మాత్రం చేతనే ఆ కళంకం ద్రోణునికి వచ్చే ప్రమాదముంది. తరువాత ఏవైనా విపరీత పరిణామాలొస్తే దానికి అతడు బాధ్యుడౌతాడు.

పాండవాదులు తనను పోషిస్తున్నారనే భావంతో ప్రవర్తించలేదు ద్రోణుడు. ఒక ధార్మిక మూర్తిగా వ్యవహరించాడు. ఒక సమష్టిగతమైన శాశ్వత, ఉన్నత ధార్మిక ప్రయోజనం కోసం ఒక వ్యక్తికి అన్యాయం 'జరిగినట్లు' ప్రవర్తించడం అధర్మంకాదు. నిజానికి అది అన్యాయమూ కాదు. అదే న్యాయం కూడా.

ఇలా ఎన్నో కోణాలతో కూడుకున్నది ఈ ఘట్టం.

ధర్మ సూక్ష్మాలమయమైన భారత ఇతివృత్తాలను సూక్ష్మదృష్టితో పరిశీలించాలి. ద్రోణుడు వశిష్ఠాదుల వంటి ముని (ఋషి) జీవనం గలవాడు కాదు. కేవలం ఆచార్యుడు. వసిష్ఠుడు ఋషి, ఆచార్యుడు కూడా. ఇరువురికీ భేదముంది. ఏనాడూ గురుధర్మాన్ని అతిక్రమించలేదు ద్రోణుడు.



**ప్ర: ఏ సమయాల్లో నిద్రించాలి? ఏ వేళల్లో నిద్రించకూడదు?**

**జ:** రాత్రివేళల్లో మాత్రమే నిద్రించాలి. సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాల్లో నిద్రపోరాదు. అలా నిద్రపోతే పుణ్యాలు క్షయమై పోతాయి. మన పెద్దలు రాత్రిని ఎలా గడపాలో స్పష్టంగా చెప్పారు.

**చతుర్థ ప్రథమౌ యమౌ విద్యాభ్యాసైర్నయేన్నిశి ।**
**ప్రహరద్వయ శాయీతుబ్రహ్మ భూయాయ కల్పతే ॥**

–"రాత్రి మొదటి జామును (ఎనిమిది గంటల వరకు), నాల్గవ జామును, (తెల్లవారు ఝాము 4 గంటల నుండి) విద్యాభ్యాసంతో గడపాలి. మధ్యలో రెండు జాములు నిద్రలోగడపాలి'. ఇది విద్యార్థులకు అలవాటు చేస్తే చక్కని ఆరోగ్యం, మేధస్సు పెరుగుతాయి. అందరూ అవలంబించవలసిన పద్ధతి ఇది. విద్యార్థులు కానివారు – తెల్లవారు జామున ధ్యానాది అనుష్ఠానాలతో గడపాలి. తూర్పు, దక్షిణ, పశ్చిమా

లవైపు తలపెట్టుకోవచ్చు. కానీ ఉత్తర శిరస్సుగా ఎప్పుడూ నిద్రించకూడదు. పడుకొనే ముందు **'అగస్తిర్మాధవశ్చైవ ముచికుందో మహామునిః । కపిలోముని రాస్తీకః పంచైతే సుఖాశాయినః ॥** - అనే శ్లోకాన్ని చదివి, విష్ణువునకు నమస్కరించాలి.

"అగస్త్యుడు, మాధవుడు, ముచికుందుడు, కపిల మహర్షి, ఆస్తీకుడు" - వీళ్ళను సుఖశాయులంటారు. వీరిని స్మరించేవారికి మంచి నిద్రపడుతుంది.

సంధ్యాకాలాలలోనూ, గోశాలలోనూ, ధాన్యంవద్ద, దేవతల వద్ద, పెద్దవారికన్నా ఉన్నత ప్రదేశంలోనూ, ఎంగిలి ఉన్నచోటులోనూ నిద్రపోరాదు. పగటి నిద్ర పనికి రాదని కూడా శాస్త్రం చెప్తోంది.

ఈ విధమైన శాస్త్ర నియమాలను పాటిస్తూ నిద్రను అవలంబిస్తే ఆరోగ్యానికీ, ఆధ్యాత్మకతకు శ్రేయస్కరం.

ప్ర: **ప్రతిస్తోత్ర పారాయణకీ ఫలశ్రుతిలో 'సకల పాపహరం' అని ఉంటుంది. కర్మఫలం అనుభవంలో గాని క్షయంకాదని కర్మసిద్ధాంతం చెబుతోంది. ఇందులో ఏది నిజం? వివరించవలసినది.**

**జ:** ఈ జన్మకి ఉన్న కర్మ 'ప్రారబ్ధం'. ఇప్పుడు చేసుకుంటున్నది 'అగామి'. ఇంకా గత జన్మలది తరువాతి జన్మలలో అనుభవించవలసిన 'సంచితం'. స్తోత్రపారాయణా దులు 'సంచితం' లోని పాపాలను హరించవచ్చు. అలాగే అవశ్యం అనుభవించ వలసిన 'ప్రారబ్ధం'లో సాధారణ కర్మలను (పాపాలను) తొలగించవచ్చు. అసాధారణ మైన పాపాలు అనుభవంలో క్షయం అయినా, వాటి పరిణామం సత్ఫలితానికి దారితీయడం, అనుభవ స్థితిలో జ్ఞానం కలిగి ఉండడం స్తోత్రపారాయణాది సత్కర్మల వల్ల లభించే 'పాపహరం' అనే సిద్ధి. అలాగే ఆగామిలో పాపకర్మవైపు బుద్ధిని పోనీయకుండా చేస్తుంది. ఇదంతా ఆ పారాయణాదులను అనుష్ఠించే శ్రద్ధా విధులపై ఆధారపడి ఉంటుంది.'పాపం' అంటే దోషం- దుఃఖం వంటి అర్థాలూ ఉన్నాయి. అర్థాన్ని అనుసంధానించి అనుష్ఠిస్తే చిత్తాన్ని శుద్ధి చేసే శక్తి - స్తోత్ర శబ్దాలలోనూ, భావాలలోనూ దాగి ఉంది.



ప్ర: **ఈమధ్య ఒకచోట చాలా మంది సామూహికంగా ఏవో పూజలు చేస్తున్నారు. అవన్నీ శాస్త్రవిధానాలకు వ్యతిరేకంగా ఉన్నాయి. అవిచూసి, నాతోపాటూ వచ్చిన పెద్ద మనిషితో "వీటిని కూడదని చెప్పవచ్చు కదా" అన్నాను. ఆయన గొప్ప ఉపాసకుడు - శాస్త్రవేత్త. ఆయన నా మాటకు సమాధానంగా। "గీతలో కృష్ణుడు-'న బుద్ధిం**

**భేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగిణాం' అని అన్నాడు కదా. అంటే కర్మచేసుకొనే అజ్ఞుల బుద్ధిని అయోమయం చేయకూడదు. అన్నీ మానేయకుండా ఏదో చేసుకుంటు న్నారు కదా! కానీయి" అన్నాడు. మరి అటువంటప్పుడు అశాస్త్రీయం అనే మాటే లేదు కదా. కృష్ణవాక్యానికి అర్థం సరియైనదేనా?**

**జః** ***'న బుద్ధి భేదం జనయేత్, అజ్ఞానాం కర్మసంగిణాం'*** – అనే మాట చాలా లోతైనది. ఏదో చేసుకోవడం 'కర్మ' కాదు. విధింపబడ్డ విహితకర్మనే ఆచరించాలి. నిషేధ కర్మను ఆచరించరాదు.

పైశ్లోకపాదానికి వివరణ:

జ్ఞానియైనవానికి కావలసినదేదీ ఉండదు. అందుకతడు కర్మతో 'సంగం' పెట్టు కోడు. ఫలాన్ని ఆశించడు. కానీ ఆ స్థితికి చేరనివాడు ఫలాసక్తితో కర్మను ఆచరించ వచ్చు. అతడిని –'కర్మలు బంధనకరాలు, విడిచిపెట్టు' వంటి మాటలు చెప్పి అయో మయపరచి, కర్మభ్రష్టుని చేయవద్దు– అని దీని అర్థం.



శాస్త్రసిద్ధమైన కర్మనే ఫలాసక్తితో చేసేవారు 'కర్మసంగులు'. బ్రహ్మజ్ఞానం లేనివారు 'అజ్ఞులు'. లోకంలో వాడబడే "మూర్ఖులు" అనే అర్థంలో ఈ పదాన్ని భావించరాదు. వేదాంతులు ఆడే మాటల్ని సరిగ్గా అర్థం చేసుకోక కర్మల్ని విడిచిపెట్టడం తగదు– అని దీని సారం.

అంతేకానీ నిషేధకర్మలనాచరించేవారు 'కర్మసంగులూ', 'అజ్ఞులూ' కారు. భ్రష్టు లౌతారు. శాస్త్రం తెలిసినవారు నిషేధ కర్మలను చేసేవారిని నిరోధించాలి. లేకపోతే సమాజానికే ప్రమాదం.

**తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే**
**కార్యాకార్య వ్యవస్థితౌ**

'ఏది చేయాలీ, ఏది చేయకూడదు?–అనే సందర్భంలో శాస్త్రమే ప్రమాణం.

**యత్ శాస్త్రవిధి ముత్సృజ్య**
**వర్తతే కామ కారతః ।**
**న చ సిద్ధి మవాప్నోతి**
**న సుఖం నపరాగతిమ్ ॥**

'శాస్త్ర విధిని అతిక్రమించి, ఇష్టానుసారం ప్రవర్తించేవానికి సిద్ధి కలుగదు. వానికి ఇహంలో సుఖం ఉండదు. పరంలో సద్గతి ఉండదు. – ఇవీ శ్రీకృష్ణుని గీతావచనాలే. ఏదీ చేయకుండా ఉండేకన్నా ఏదో ఒకటి చేస్తున్నారు కదా! – అని తృప్తిపడడం గొప్ప కాదు. ఏదీ తినకుండా ఉండేకన్నా ఏదో ఒకటి తినాలి– అని ప్రమాదకరమైన ఆహారాన్ని తినకూడదు కదా! అలాగని ఏదీ తినకుండా ఉండరాదు కదా! ఏది యోగ్యమో దానిని తినాలి. దానిని ఆసక్తిగా తినేవారి వద్దకు వెళ్ళి – 'దానిపై ఆసక్తి వద్దనీ, ఈ శరీరాన్ని పోషించుకోడానికి అంత మోహం పనికి రాద'నీ బోధించి వారిని తిండి తిననివ్వకుండా చేయవద్దు అన్నదే గ్రహించాలి. నిషేధాన్ని చేయకుండా నిషేధించాలి. లేకపోతే అది ఆచరించేవానికి క్షేమం కాదు. వేద, ధర్మశాస్త్రాలు చెప్పేవాటికి వ్యతిరేకంగా నడవరాదు.

**ప్ర: శ్రీకృష్ణుడూ, బలరాముడూ సమకాలీన అన్నదమ్ములు. బలరాముడు చేసిన విశేష కార్యాలు శ్రీకృష్ణుడే చేసి ఉండవచ్చు కదా. మరి యిద్దరినీ అవతార పురుషులుగా ఎందుకు పరిగణిస్తున్నామో వివరించగలరు.**

**జ:** ఇద్దరూ అన్నదమ్ములైనా శ్రీకృష్ణుడు పూర్ణావతారం. విష్ణ్వంశయైన శేషుని అవతారం బలరాముడు. రామకృష్ణావతారాలలో శేషుడు వెన్నంటే ఉంటాడు. అది ఒక అనివార్యమైన అంశం. అంశావతారమైన బలరాముడు మాత్రమే చేయవలసిన కార్యాలున్నాయి. వాటినతడు ఆచరించాడు. ఎవరు ఏది చేయాలో అది చేయాలి. అంశావతారంతో కొన్ని పనులు, పూర్ణావతారంతో కొన్ని కార్యాలు చేస్తాడు భగవంతుడు. అందుకే ఇద్దరూ అవతారపురుషులే. కానీ ఒకరిని పూర్ణావతారంగా, ఇంకొకరిని అంశావతారంగా పరిగణిస్తున్నాం.



**ప్ర: శివునకు భక్ష్యం, భోజ్యం, పులిహోరా, పొంగలి, గుగ్గిళ్ళు భక్తులు తమ ఇళ్లల్లో వండి శివాలయంలో నైవేద్యం పెట్టవచ్చునా లేక ఆలయార్చకులే వండి వడ్డించాలా? వారి ఇంటిలో వండిన అన్నం నైవేద్యంగా పెట్టవచ్చా?**

**జ:** దేవాలయంలో శుచి ప్రధానం. అది కాపాడబడినప్పుడే దేవాలయంలో శక్తి స్థిరంగా ఉంటుంది. వేరేచోట వండి తెచ్చిన ఆహారం నివేదనకు పనికిరాదు. ఎంత శుచిగా వండినా, ప్రాంతం మార్చి తెచ్చిన వంట నివేదించరాదు.

దేవసన్నిధానంలో శుచిగా వండినది, అన్యదృష్టి సోకకుండా దైవానికి నివేదించాలి. అర్చకుల ఇళ్ళలో వండినా సన్నిధిలో నున్న గృహంలోనైతే ఫరవాలేదు. వారైనా

సరే శుచిగా వండవలసిందే. లేకపోతే నివేదించడం కుదరదు.

**ప్ర: ఉపవాసం, ఏకభుక్తం, నక్తం-ఈ మూడింటికీ తేడా ఏమిటి? ఉపవాస వ్రతాలలో ఏ నియమాలు పాటించాలి?**

**జ:** అహోరాత్రాలలో, (పగలు, రాత్రి) భుజింపకపోవడం 'ఉపవాసం'. కేవలం మధ్యాహ్నం ఒక్కమారే భుజించుట 'ఏకభు(భ)క్తం'. పగలంతా ఉపవాసముండి రాత్రి ప్రదోష కాలంలో భుజించడం 'నక్తం'. ఉపవాసంలో తాంబూలం, గంధం, అభ్యంగస్నానం, పగటి నిద్ర, స్త్రీ స్మరణాదులు వర్జించాలి. వ్రతాచరణలో ముత్తయిదు వులకు (వరలక్ష్మీ వ్రతాది సౌభాగ్య వ్రతాలలో) గంధ తాంబూలాలు గ్రహించవచ్చు. వ్రతాలలో గురు వాక్యం, ఔషధసేవ, జలం మొదలైనవి నిషేధం కాదు. కంటనీరు కార్చుట, క్రోధము వెంటనే వ్రతభంగాన్ని కలిగిస్తాయి. పరాన్న భోజనం (ఉపవాసం కాని వ్రతాలలో) పనికిరాదు. ఏ దేవతనుద్దేశించి ఉపవాస వ్రతం చేయబడుతుందో ఆ దేవతను ధ్యానించడం, ఆ మంత్రం జపించడం, ఆ దేవతా కథాశ్రవణం, పూజ, నామ శ్రవణ కీర్తనాదికం చేయాలి.

**ప్ర: కార్తిక మాసంలో ఎలాంటి వ్రతం చేస్తే మంచిది? ఏ ఏ నియమాలు పాటించాలి?**



**జ:** కార్తికంలో స్నానం, జపం, దానం, పారాయణ ఏదైనా మహోన్నత ఫలాన్నిస్తుంది. ఎవరికి వీలైన వ్రతాన్ని వారు పాటించవచ్చు. ముఖ్యంగా దీపదానానికి సమానమైన దానం లేదు.

**అవ్రతః కార్తికో యేషాం**
**గతో మూఢధియా మిహ ।**
**తేషాం పుణ్యస్యలేశోపి**
**న భవేత్ .... ...** -"కార్తికమాసంలో ఏ వ్రతమూ చేయకుండా గడిపే మూఢు లకు పుణ్యం లేశమైనా లభించదు. అట్టివారి జన్మ నీచజన్తు జన్మకి సమానమ"ని ధర్మశాస్త్రం కొంచెం గట్టిగానే ఘాటుగానే చెప్పింది.

కార్తికమాసంలో రామాయణ, సుందరకాండాది పురాణాలను పారాయణం ప్రారంభించి, మాసాంతంలోగా పూర్తిచేయడం కూడా ధర్మశాస్త్రాలు విధించాయి.

ఉత్తముడైన పండితుని ద్వారా ఈ మాసం దివ్య పురాణాలను శ్రవణం చేయడం గొప్ప ఫలితాన్నిస్తుందని పురాణవచనం. తాంబూలం, కేశఖండనం వంటివి విసర్జించడం ఉత్తమం.

ఆకాశదీపాన్ని విష్ణుప్రీతికై ఏర్పాటుచేస్తారు కొందరు. కార్తికంలో ఉల్లి, ఇంగువ, పుట్టుకొక్కు, గంజాయి, ముల్లంగి, ఆనపకాయ, మునగకాడలు, వంగకాయ, గుమ్మడి కాయ, వాకుడు, పుచ్చకాయ, వెలగపండు, నూనె, లవణశాకం, చద్ది మొదలైనవీ రెండుమార్లు వండిన అన్నం, మాడిన అన్నం, మినుములు, పెసలు, సెనగలు, ఉలవలు, కందులు మొదలైన ద్విదళ ధాన్యాలు వాడరాదు.

సప్తమినాడు ఉసిరిక, తిలలు; అష్టమినాడు కొబ్బరి, ఆదివారం ఉసిరికపప్పు కార్తికంలోనే కాక ఏ మాసమందూ ఉపయోగించరాదు.

ప్ర: **ఉపవాసం, ఏకభుక్తాల ఆవశ్యకత ఏమిటి?**

**జ:** అవి పాపక్షయం చేస్తాయి. భౌతికంగా చూస్తే ఆరోగ్యకరం. సూక్ష్మంగా దర్శిస్తే అన్నం వల్ల, అన్నం కోసం చేసే పాపాలు, ఇతరత్రా చేసిన దోషాలు పోయేందుకు ఉపవాసం వంటివి చేయాలని శాస్త్రం శాసించింది.

ప్ర: **ఈ రోజుల్లో ఏ అనుష్ఠానం, కర్మ చేసినా సమగ్రంగా చేయలేం.స్నాన, భోజనాది నియమాలు కూడా సరిగ్గా సాగడం కష్టం. చేయించేవారు, చెప్పేవారు కూడా సరిగ్గా దొరకడం లేదు. మరి సంపూర్ణ ఫలం లభించాలంటే ఏం చేయాలి?**



**జ:** మనం ఏది చేసినా శాస్త్రప్రకారం తెలిసినంత మేరకు యథాశక్తి చేయాలి. శక్తివంచన ఉండకూడదు. ఎంతచేసినా ఎంతో కొంత లోపం ఉండక తప్పదు. అందునా, మీరన్నట్లు ప్రస్తుత కాలమాన పరిస్థితులలో ఎన్నో లోపాలు కలుగుతాయి.

వాటన్నిటి దోషం పోయేందుకు, సంపూర్ణ ఫలం లభించేందుకు భగవత్ స్మరణ చేయాలి.

**ప్రాయశ్చిత్యాన్యశేషాణి**
**తపః కర్మాత్మకాని చ।**
**యాని తేషా మశేషాణాం**
**కృష్ణానుస్మరణం పరం॥**
**యస్యస్మృత్యా చనామోక్త్యా**
**తపః పూజాక్రియాదిషు**
**న్యూన సంపుర్ణతాం యాతి**
**సద్యోవందే తమచ్యుతమ్ ॥** –"తపఃకర్మలలో లోపాలకు ప్రాయశ్చిత్తం కృష్ణ స్మరణమే. అచ్యుతుని స్మరించిన వెంటనే తపఃపూజా క్రియాదులలో లోటుపాట్లు

లేకుండా, సంపూర్ణ ఫలం లభించుతుంది” అని శాస్త్రవచనం. ఈ శ్లోకాలు చదువుకుని ‘కృష్ణార్పణమో’ ‘శివార్పణమో’ చేస్తే పూర్ణత, సమగ్రత లభిస్తాయి. అయితే శక్తివంచన లేకుండా, తెలిసినంత మేరకు నిజాయితీగా శాస్త్రానుసారం కర్మ చేస్తేనే ఈ ‘అర్పణలు’ ఫలిస్తాయి.

**ప్ర: ఈ మధ్య ఒక ప్రముఖ పండిత వంశీకులొకరు వేదాల్లో క్రీస్తు గురించి ఉందని చెప్పారు. ఏ శాఖలో ఉంది. యెహోవా నామం కూడా ఉందా? ఆ పండితుడు క్రైస్తవ మతంలోకి మారిన వ్యక్తికూడా.**

**జ:** కోడిగ్రుడ్డు మీద కేశాలు ఏరడంలా ఏవో కొన్ని మంత్రాల్ని తీసుకొని దానిని క్రీస్తు పరంగా అర్థం చెబితే సరిపోతుందా? అటువంటి ప్రస్తావనలేవీ వేదాల్లో లేవు. ఇది కూడా వారి ప్రచారంలో, ఘోరమైన మత మార్పిడులలో భాగమే.

‘వేదాలలో ఉంది’ అని చెప్పుకుంటే గానీ ఆమోదించబడనంత పరాధీనమైన మతమా అది? అంతే కాదు–వారి గ్రంథాలకు కూడా ‘వేదం’ వంటి నామాలు పెట్టుకొని చెలామణీ చేసుకోవడం ఎందుకు? వేదమే గొప్పదని వారి అభిప్రాయమైతే, ఆ వేద మతంలోనే ఉన్న మనం, దీనినీ దీని సంప్రదాయాలనీ వదలి అటువైపు వెళ్ళడం ఎందుకు? ఆ మతం ఆ దేశం వారి ప్రయోజనాల కోసం, ఆనాటి కాలమాన పరిస్థితులనుద్దేశించి ఒక ప్రవక్త ద్వారా ప్రారంభమైనది. దాని ప్రత్యేకత దానిది, దాని ప్రయోజనం దానిది. వేదం అటువంటిది కాదు కదా! ఎంత లౌకికంగా మాట్లాడినా, అత్యంత ప్రాచీనమైన సనాతన ధర్మం ఇదేకదా! కేవలం రెండు సహస్రాబ్దాల క్రితం పుట్టిన ఒక మతం – కాలానికందని మన మహావిజ్ఞానంలో చోటుచేసుకుందని చెప్పడం ఎంత హాస్యాస్పదం! మీరు ఆ వ్యక్తి పేరు ప్రస్తావించినా, వ్యక్తిగత వివరాలను స్పృశించడం ఇష్టం లేక, ఆ పేరు ప్రకటించడం లేదు. ఏదేమైనా ‘పర వస్తు’ వ్యామోహం ప్రమాదకరం. స్వధర్మాన్ని విడిచిపెట్టి పరధర్మాన్ని అనుసరించేవాడు – వేదమతం దృష్టిలో భ్రష్టుడు. సంఘద్రోహి.

**ప్ర: అసురులకు లభించిన మృత సంజీవని విద్య దేవతలైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు స్వకీయులైన దేవతలకు ఎందుకు ప్రసాదించలేక పోయారు? మృతసంజీవనీ విద్యకు, సంజీవనీ మూలికకు సంబంధాలున్నాయా?**

**జ:** మృతసంజీవనీ విద్య అసురులకు లభించలేదు. ఇది బ్రహ్మర్షి శుక్రాచార్యుల వారికే లభించింది. దానిద్వారా అసురుల్ని బ్రతికించాడు తప్ప, విద్యను ఇవ్వలేదు. అది

అతడు తపస్సు ద్వారా సాధించినది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు స్వకీయు లెవరూ లేరు. వారికి మృతీ ఉండదు. మంత్ర విద్య ఋషుల వద్ద ఉంటుంది. అది త్రిమూర్తులు ప్రసాదించేది కాదు. అందుకే దేవతలు సైతం, ఆ విద్యను గ్రహించడానికి గురు పుత్రుని (కచుని) పంపారు. ఆ విద్య ద్వారా కచుడు వారిని బ్రతికించగలడు కానీ, విద్యను ఇవ్వడు. మృతసంజీవని విద్య – కేవలం మంత్ర విద్య, సంజీవని మూలిక– ఒక ఓషధి. దానికీ దీనికీ సంబంధం లేదు. మనిషి మరణించి, రూపు మాపినా తిరిగి బ్రతికించగలిగేది ఆ మంత్రవిద్య. ఈ ఓషధి అటువంటిది కాదు.

ప్ర: **మన ఇళ్ళల్లో ఉన్న దేవతల కేలండర్లు, చిత్రపటాలు జీర్ణించినపుడు లేదా ఉపయోగించనప్పుడు వాటిని ఎలా విసర్జించాలి?**

**జ:** మనం ఉపయోగించనప్పుడు ఉపయోగించేవారికి ఇవ్వవచ్చు. జీర్ణించినప్పుడు వాటిని నదులలోగానీ, సముద్రాలలో గానీ వదిలేయాలి. అవి ఆ జలాల లోపలికి వెళ్ళిపోయేలా చూసుకొని కదలాలి. మళ్ళీ ఒడ్డుకి వచ్చి చెత్తలో కలవకుండా జాగ్రత్తపడాలి.

ప్ర: **పూజల, అనుష్ఠానాలు చేసుకొనేటప్పుడు గోత్రనామాలు చెప్పుకోవాలా? అవి అశాశ్వతాలు కదా? గోత్రనామాలు ఆత్మకి లేవు కదా?**

**జ:** వేదాంతం అక్కడక్కడా విని, ఎలా అన్వయించుకోవాలో తెలియక అడ్డదిడ్డంగా భావించితే ఇలాంటి ప్రమాదకరమైన వ్యాఖ్యలు వస్తాయి. ఆత్మకి గోత్రనామాలు లేవు. పూజలూ లేవు. కానీ దేహానికి గోత్రనామాలున్నాయి. మనకు దేహస్పృహ ఉన్నంతకాలం, 'నేను ఫలానావాడ్ని, నాకు ఆకలివేస్తోంది, ఇది నాది' అనే భావాలున్నంతకాలం ఇవన్నీ అవసరమే. వాటిని విడిచిపెట్టి కేవలం 'ఆత్మ'గా ఉన్నప్పుడు వేరే సంగతి. శరీరం ఉన్నంతకాలం, దానికి పేరు, గోత్రం వ్యవహారంలో ఉంటాయి. శరీరంతో ఏ కర్మచేసినా వాటి ప్రస్తావన అవసరమే.

ప్ర: **రెండు మూడు రోజులు రైలు ప్రయాణంలో గడపవలసిన పరిస్థితిలో నిత్యకర్మ (సంధ్యా వందనం వంటివి) చేయడం కుదరదు. అటువంటప్పుడు ప్రత్యామ్నాయం ఏమిటి?**

**జ:** భస్మధారణ చేసి, భగవన్నామాన్ని స్మరించి, గంగాదినదులను తలచి మానసికంగా నిత్యకర్మ సాగించాలి. దానితో నిత్యకర్మ చేయని దోషం పోతుంది. భస్మం లేని పక్షంలో, కేవల భగవన్నామస్మరణ, పుణ్యనదుల భావన చేసి మానసికంగా కర్మను జరుపవచ్చు.

**ప్ర: ఏదైనా జ్యోతిని వెలిగించడమే కదా, దీపమంటే! అది నేయి, నూనె, వత్తులతోనే వెలిగించాలా? కొవ్వొత్తులో (మైనపువత్తులో), ఎలక్ట్రిక్‌లైట్‌లో వెలిగిస్తే దీపాలు కావా?**

**జ:** అన్ని జ్యోతులూ పవిత్రమైన దీపాలు కావు. దీపమంటే కేవలం వెలుగే కాదు. ఇంధనం బట్టి వెలుగులో తేడాలుంటాయి. ఒక్కొక్క వెలుగులో ఒక్కో రకమైన శక్తి ఉంటుంది. ఆవునేతితో వెలిగించిన దీపపు వెలుగుకి సాత్త్వికత ఉంటుంది. అలాగే ఒక్కొక్క తైలంలో ఒక్కొక్క దేవతా శక్తిని ఆవిష్కరించే గుణం ఉంటుంది. ఒక్కొక్క రకమైన చమురు ఒక్కో విధమైన భావాన్ని కలిగిస్తుంది. వివిధ ఇంధనాలతో, వెలిగే దీపాలు వివిధ ప్రయోజనాలను నెరవేరుస్తాయి.

ఈ రహస్యాన్ని సూక్ష్మదృష్టితో గ్రహించిన ఋషులు వివిధ దీపారాధనలను తెలియ జేశారు. సంప్రదాయ పద్ధతిలో వెలిగే దీపం తన వెలుగు పరచుకున్నంతమేర దేవతాశక్తుల్ని ఆవహింపజేస్తుంది, దుష్టశక్తుల్ని నశింపజేస్తుంది. దానివల్ల ఐశ్వ ర్యమూ, ఉల్లాసమూ, ఉత్తమ భావాలు–మొదలైన భగవద్విభూతులు (ఐశ్వర్యాలు) లభిస్తాయి. దీనినే 'లక్ష్మీప్రదం' అని వర్ణించాయి శాస్త్రాలు.



**ప్ర: దేవతలు కూడా దుర్బల ప్రాణుల బలినే కోరుతున్నారని ఈ శ్లోకం ఉదహరించినట్లు ఒక సుభాషితం చదివాను. (అశ్వం నైవ గజంనైవ వ్యాఘ్రంనైవ చనైవ చ, అజాపుత్రం బలిందద్యాద్దేవోదుర్బల ఘాతుకః). ప్రాణులను కాపాడే దేవతలే 'బలిని' కోరుతారా?**

**జ:** మీరు చదివిన సుభాషితం చాలా బాగుంది. బలహీనుల పట్ల బలవంతులు అలా ప్రవర్తిస్తారని చక్కగా ఉదాహరణతో చెప్పారు. కానీ బలులివ్వడం కొన్ని పూజా విధానాలలో ఉంది. దానిని సాత్త్విక దృష్టితో మాత్రం నిషేధించవలసిందే. దేవతా రాధన మూడు విధాలు– 1.సాత్త్విక, 2.రాజసిక, 3. తామసిక.

సాత్త్వికారాధనలో డాంబికమూ, హింస ఉండదు. కేవలం ఆత్మార్పణమైన భక్తి ఉంటుంది. రాజసికారాధనలో డాంబికం, ఆర్భాటం, ఆవేశం ఉంటాయి. పదిమందీ తన పూజలు చూసి మెచ్చుకోవాలనే కోరికా ఉంటుంది.

తామసికారాధనలో హింస, క్షుద్ర ప్రయోజనాలుంటాయి. ఆరాధనా విధానాలలోనూ హింస ఉంటుంది. అందులో భాగమే ఈ జంతుబలులు. వీటిని ప్రోత్సహించరాదు. ఇందులో ఉత్కృష్టమూ, ఉన్నతమూ సాత్త్వికారాధనే. దేవతల ఆకృతులు ఈ మూడు ప్రకృతులకీ అనుగుణంగా ఉంటాయి.

ఇక్కడ దేవతలు కోరుకోవడం కన్నా, ఆ ప్రకృతులకు అనుగుణమైన తత్త్వాలకీ,

ఈ ఆరాధనా విధానాలకీ అనుబంధముందని గ్రహించాలి. మన ఆహారాన్నే మనం దైవానికి నివేదిస్తాం.

**యదన్నావై మానవాః**

**తదన్నావై దేవాః...** అని శాస్త్రవచనం. తాము తినే మేకల్ని, కోళ్లనీ దేవతలకి బలినిస్తారు గానీ, తాము తినని పులుల్నీ, సింహాల్నీ బలినివ్వరు కదా! తమ ఆహారాన్ని దేవునికి నివేదించుతారు. వాటిని తినే ఆటవికులు, వాటినీ బలి యిస్తారు.

ఆ దేవతా భావం కూడా తమ ప్రకృతికి అనుగుణంగానే ఉంటుంది. త్రిగుణాతీతమైన పరతత్త్వం వేరు. త్రిగుణాత్మకమైన దేవతలు వేరు.

ఒక వ్యక్తి వినియోగించే ఆహారాది పదార్థాలు, భావాలు, దేవతారాధన, దేవత ఒకే శ్రేణికి చెంది ఉంటాయి. దేవతలు దుర్బల ప్రాణుల బలిని కోరడం కాదు.

ఆ బలి ఇచ్చే వారు తమకంటే దుర్బలమైన వాటినే తింటారు కనుక వాటినే బలినిస్తారు.

ప్ర: **భగవద్గీతలో 'శ్రద్ధాత్రయ విభాగం' అనే 17వ అధ్యాయంలో తెలుపబడ్డట్లు "భూత ప్రేతాలను పూజించేవారు తమోగుణంలో నిలిచినవారుగా పరిగణించాలి". మరి మర ణించిన వారికి ఆబ్దికాల రోజు, సంక్రాంతి పండుగకు పెద్దల పూజలు జరిపించి, సంతృప్తిపరచడం, వారి పేరు తమ వంశంలో వారికి పెట్టుకోవడం తమోగుణం కిందకి వస్తుందా?**

**జ:** పితృదేవతలు భూతప్రేతాలు కారు. పితృదేవతారాధన భూతప్రేతారాధన కాదు. తన పూర్వీకులను ఆరాధించడం, ఆబ్దికాలు జరిపించడం, సంక్రాంతి పండుగకు పెద్దల్ని పూజించడం, వారిపేర్లను తమ వంశంలో వారికి పెట్టుకోవడం ఇవి పూర్వీ కులతో తమకున్న అనుబంధాన్ని తెలిపే కృతజ్ఞతాపూర్వక భావన. పితృ దేవతారాధన పితౄణం తీర్చుకొనే యజ్ఞం. ఇది సాత్త్వికారాధనే. ఇది అందరూ చేయవలసిన విధి. ఇలా కాక వాయుమండలంలో ఉన్న భూత ప్రేతాది క్షుద్ర శక్తుల్ని, క్షుద్ర ప్రయోజనాల కోసం ఉపాసించి ఐహిక సుఖాలను పొందడం- తామసికారాధన. ఇదీ శ్రీకృష్ణుని వివరణ. మరణించిన వారంతా భూతప్రేతాలు కారు. పెద్దలను స్మరించడం, శాస్త్రోక్తంగా పితృకర్మలు చేయడం ఎట్టి పరిస్థితులలోనూ తామసికారాధన కాదు. భూతప్రేతాల ఆరాధన కాదు. గీతాశ్లోకాలకు అపార్థపు వ్యాఖ్యానాలు చేయడం ఒక తమోగుణ లక్షణం.

**ప్ర: దేవీ భాగవతంలో బ్రహ్మకూతురు సరస్వతి అని, ఆమెనే వివాహం చేసుకున్నాడని ఒక చోట, ఆ దేవియే బ్రహ్మకు ఒక శక్తిని (సరస్వతిని) ఇస్తే వివాహమాడానని మరొకచోట చెప్తున్నాయి. దీనిలో ఏది నిజం?**

**జ:** రెండూ సబబైనవే. దేవతల బాంధవ్యాలకు 'కూతురు–కొడుకు–భార్య' అనే మానవీయ బాంధవ్యాల అర్థాలుండవు. వారి దేహాలు వేరు. మన దేహాలు వేరు. వారు తేజోమయ శరీరులు. పరమాత్మ యొక్క శక్తికి సాకారాలు. వారి బాంధవ్యాలు ఒక తత్త్వాన్ని తెలియజేయడానికి వాడబడే పదాలు.

బ్రహ్మదేవుని తపస్సు ఫలంగా ఆయనలో ఉద్భవించిన శక్తి పరాశక్తి అనుగ్రహంగా ఆవిర్భవించింది. ఆ ఉద్భవశక్తే ఆయనకు సృష్టి రచనా నైపుణ్యంలో సహకరించింది. ఉద్భవించినప్పుడు ఆ శక్తిని కూతురుగా వ్యవహరించి, సహకరించి నప్పుడు భార్యగా వ్యవహరించారు. ఇది శక్తి యొక్క వివిధ స్థాయిల వ్యవహారమే గానీ ఇది బాంధవ్యం కాదు.

**ప్ర: విశ్వామిత్రుడు ముందు జన్మించాడా? లేదా యమధర్మరాజు ముందు జన్మించాడా? విశ్వామిత్రుడు ప్రతిసృష్టిలో మహిషాలను, మిరపకాయలను సృష్టించాడంటారు. మరి మహిషవాహనుడైన యముడు ఎప్పటివాడు?**



**జ:** విశ్వామిత్రుని సృష్టి మహిషాలు, మిరపకాయలు–అనడానికి ఏ పురాణ, శాస్త్ర ప్రమాణమూ లేదు. యమధర్మరాజు ఆది దేవతా కోటికి చెందిన దేవత. విశ్వామిత్రుడు మహర్షి. విశ్వామిత్రునికి ముందు యముడు. ఆయన మహిష వాహనుడు. ఆ మహిషం భూసృష్టికి చెందినది కాదు. ఆ మహిషం వేరు. అవి దైవీయ శక్తులు.

**ప్ర: వేదాల్లో దేవాలయాలు, విగ్రహారాధన, హింసావాదం లేవని చాలాకాలం క్రితం ఒక మహర్షిస్వామి చెప్పారని ఈ మధ్య ఒక వార్తా పత్రికలో చదివాను. మరి విగ్రహారాధన అవసరమేనా?**

**జ:** మన సంస్కృతికి వేదం మూలం. దానిలోని భావనలనీ, పరమార్థాన్నీ దృష్టిలో నుంచుకొని, వేదానికి విరుద్ధం కాని విధంగా మహర్షులు తపశ్శక్తితో ఆవిష్కరించి నవే విగ్రహారాధనలు. వేదాలలో దేవతా స్వరూపాలను వర్ణించారు. గణేశ, విష్ణు, శివ, శక్తి, సూర్యాది రూపాలు, వర్ణాలు ఋగ్వేదం మొదలు ఆథర్వణ వేదం వరకు వివిధ సందర్భాలలో పలుమంత్రాలలో వర్ణించారు. ఆయా దేవతలను అగ్నియందు ఆవాహన చేసి యజనం (ఆరాధన) చేసే ప్రక్రియలు వేదాలలోనే ఉన్నాయి. ఆ

యజ్ఞక్రియలలోని వివిధ అంశాలను ఆధారం చేసుకొని, ఆ మంత్రాలలో దాగిన సంకేతాలను తపశ్శక్తితో గ్రహించి వివిధ ఆగమాలుగా నిర్మించారు. దానితో 'విగ్రహారాధన' అనే పద్ధతి రూపుదిద్దుకుంది.

శబ్ద ప్రపంచంలోని మంత్రశక్తిని, రూపప్రపంచంలోని దేవతా శక్తిని క్రోడీ కరించి కల్పించేదే విగ్రహం. విగ్రహంలో దైవశక్తి ప్రతిష్ఠితమవుతుంది. అంతేగానీ దేవత విగ్రహం కాదు. ఒక విగ్రహంలో దేవత ఆహూత, సన్నిహిత, వ్యాపక– (ఆహ్వానింప బడి, అక్కడ చేరి, అంతా వ్యాపించి) అనే మూడు లక్షణాలతో ప్రతిష్ఠింపబడుతుంది. దానితో విగ్రహానికి, బింబానికి శక్తి వస్తుంది. విగ్రహ కల్పనలో మంత్రశక్తి, యంత్ర శక్తి, యోగశక్తి సమకూరేలా ఒక ప్రత్యేకశాస్త్రం అభివృద్ధి చెందింది. దానికి మూలం వేదమే. ఒక విగ్రహంలో (ఆది లోహంతో చేసినదైనా, వర్ణాలతో రేఖలతో చిత్రించి నదైనా) దాగిన శక్తిని సూక్ష్మదృష్టితో చూడగలిగితే ఎంత పరిధి మేరకు విస్తరిస్తుందో గ్రహించగలం. ఆ దృష్టి సాధించలేనప్పుడు, ఆ శక్తి అక్కడ ఉందని విశ్వసించడం మార్గం.

'ఇది వేదంలో లేదు–అది వేదంలో లేదు' అంటూ తొలగించుకుంటూపోతే ఇంత గొప్ప భారతీయ విజ్ఞానంలో ఏ భాగమూ మిగలదు. ఈ దేశంలో ప్రతి శాస్త్రానికి వేదం మూలం. నాట్యం, సంగీతం, వైద్యం, యోగం, ప్రతిమాకల్పన, దేవాలయ సృష్టి– వీటన్నిటికీ మూలాలు వేదాలలో ఉన్నాయి. వాటి ఆధారంగా అభివృద్ధి చెందినవే ఈ శాస్త్రాలన్నీ. ఇవన్నీ ఎంత శక్తిమంతంగా, ప్రభావవంతంగా పని చేస్తున్నాయో చాలా మందికి అనుభవైక వైద్యం.



మూలం ఎలా ఉందో, వృక్షమంతా అలా ఉండదు. చెట్టు కొమ్మ, రెమ్మ, పువ్వు, కాయ, ఫలం–వీటి స్వరూపాలు వేరు. ఇవేవీ మూలం (వేరు)లా లేవని అన్ని నరుక్కుంటూ పోతే ఇంక ఆ మూలంతో అవసరమేముంది? మూలశక్తిని కనుక్కొని సమన్వయించుకోవాలి. లేదా వాటిని గౌరవించి, వీలైనంతవరకు ఆచరించాలి. ఈ విషయమే, మీరు ప్రశ్నలో ప్రస్తావించిన మహర్షి స్వామి వారికి (వ్యక్తిగత విమర్శలు కూడదని–మీరు వ్రాసిన స్వామివారి పేరు ఇక్కడ ప్రస్తావించడం లేదు. మనకు విషయమే ప్రధానం). శ్రీత్రైలింగస్వామి అనే అవధూతగారు సమాధానంగా చెప్పారు. "నువ్వు మూలాన్ని కాపాడాలని పూలనీ, పళ్లనీ, కొమ్మల్నీ నరికిపారేస్తున్నావు" అని అవధూత అయిన దివ్యజ్ఞాని మహానుభావులు త్రైలింగ స్వామివారు కాశీక్షేత్రంలో,

మీరు చెప్పిన మహర్షి స్వామిని మందలించారు.

హిందూమతంలోని ప్రతి అంశమూ ఎంతో విజ్ఞానంతో, శాస్త్రపు పునాదితో కూడి ఉంది. మానవ స్వభావాన్నీ, యోగవిజ్ఞానాన్నీ, మంత్ర, యంత్ర, తంత్ర రహస్యాలనీ అవగాహన చేసుకున్న పరిపూర్ణ జ్ఞానంతో ఏర్పరచిన విధానాలివి.

ఒక దేవాలయ రూపకల్పనలో ఏ ద్వారం, ఏ పరివార దేవత, ఏ స్తంభం, ఏ శిల్పం ఎలా ఉండాలో అనేదానికి ఒక చక్కని శాస్త్రం ఉంది. అదే ఆగమశాస్త్రం. ఆధునిక వైజ్ఞానికులు సైతం అబ్బురపడే దేవాలయ సంపద మనకు ఉంది. ప్రాచీన ఆలయాల నిర్మాణ వైఖరి, శిల్ప సౌందర్యం, చాతుర్యం, వాటిని నిర్మించిన మేధస్సును చూస్తే కళ్లు మిరుమిట్లు గొలిపే ఆ విజ్ఞానానికి జోహారులర్పించాల్సిందే. ఒక హంపీ, ఒక కోణార్క్, ఒక మీనాక్షీ దేవాలయం, చిదంబర నటరాజ మందిరం, బృహదీశ్వరాలయం, ఖజురహో-ఇలాంటి ఆలయాల వైశిష్ట్యాన్ని, విగ్రహ శోభనీ-కనీసం భౌతిక దృష్టితో చూసినా కొనియాడ వలసిందే కదా! 'ఇవన్నీ వేదాల్లో లేవ'ని తీసి పారేస్తే మన భారతీయతకి విలువేముంది! అపౌరుషేయమైన వేద విజ్ఞాన భూమిక దీనికి ఉందని ఈ శాస్త్రాలన్నీ పేర్కొన్నాయి. వైదిక దేవతలనే విగ్రహాలుగా ఆరా ధిస్తున్నాం. వేదమంత్రాలనే వాటి ఆరాధనలో వినియోగిస్తున్నాం కదా!



పైగా-అనంత వేదరాశిలో మనకు మిగిలింది ఎంత? మనం కోల్పోయిన వేద భాగాలలో వాటి ప్రస్తావన ఉండవచ్చు కదా! 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' (ఇతిహాస పురాణాల ద్వారా వేద ధర్మం విస్తృతంగా చెప్పబడింది) - అని ఆర్షవచనం. మనం కోల్పోయిన వేదాల భాగాలు కూడా పురాణాల్లో ప్రస్తావించి ఉండవచ్చు కదా! ఇక-హింసావాదం అనేది భారతీయ శాస్త్రాలలో లేదు. 'హింస-అహింసల' యొక్క అసలు స్వరూపాన్నీ, స్వభావాన్నీ విశదీకరించిన అంశాలు మన గ్రంథాలలో ఉన్నాయి.

**ప్ర: ధర్మశాస్త్రాల ప్రకారం- గర్భవతి పాటించవలసిన ధర్మాలు, అలాగే ఆమె భర్త అనుసరించవలసిన నియమాలను తెలుసుకోవాలనుకుంటున్నాను. కాస్త వివరించగలరా? అసలు ఆ నియమాలను ఎందుకు పెట్టారు?**

**జ:** మహర్షుల విజ్ఞానం స్థూల, సూక్ష్మప్రపంచాలను దర్శించి ఏర్పరచినది. ఆ రెండింటి ప్రభావం వ్యక్తిపై ఉంటుంది. సూక్ష్మ ప్రపంచంలో ఉండే దైవీశక్తులు సత్ ప్రభావం కలిగేలా, విపరీత శక్తుల దుష్ప్రభావం తొలగేలా కొన్ని నియమాలను ఏర్పరచారు.

మరికొన్ని భౌతిక ఆరోగ్యాన్ని, మానసిక స్వస్థతను చేకూ ర్చేలా స్థిరపరచారు. ఈ విధంగా సమగ్రమైన స్వస్థత నియమాలను సమకూర్చిన సమగ్ర విజ్ఞానం ఆ నియమాలలో ఉంది. ధర్మశాస్త్రాలు చెప్పిన నియమాలు ఇవి:

**గర్భిణీ కుంజరాశ్వాది శైలహర్మ్యాధిరోహణం।**
**వ్యాయామం శీఘ్ర గమనం శకటారోహణం త్యజేత్ ॥**
**న భస్మాదా వుపవిశేత్ ముసలోలూఖలాదిషు ।**
**త్యజేజ్జలావగాహంచ శూన్యం సద్మతరోస్తలమ్ ॥**
**కలహం గాత్ర భగ్నంచ తీక్ష్ణాత్యుష్ణాది భక్షణం ।**
**సంధ్యాయామతి శీతామ్లం గుర్వాహారం పరిత్యజేత్ ॥**
**వ్యవాయశోకా సృఙ్మోక్షం దివాస్వాపం నిశిస్థితిమ్ ।**
**భస్మాంగారనఖైర్భూమి లేఖనం శయనం సదా॥**
**త్యజేదమంగలం వాక్యం నచహ స్యాధికాభవేత్ ।**
**నముక్తకేశానోద్విగ్నా కుక్కుటాసన గాన చ ॥**
**గర్భరక్షాసదా కార్యా నిత్యం శౌచనిషేవణాత్**
**ప్రశస్తమంత్ర విఖనాచ్చః తమాల్యాను లేపనాత్।**
**విశుద్ధ గేహవనినాత్ దానైశ్చ్వశ్వాది పూజనైః ॥**
**హరిద్రాం కుంకుమం చైవ సింధూరం కజ్జలంతథా।**
**కేశసంస్కార తాంబూలం మాంగల్యా భరణం శుభమ్ ॥**
**చతుర్థేమాసి షష్ఠేవా పృష్టమే గర్భిణీ వధూః ।**
**యాత్రాం వివర్జయేన్నిత్యం ఆషష్మాత్తు విశేషతః ॥**



- ✦ గర్భవతియైన స్త్రీ ఏనుగు, గుఱ్ఱం, బండి మొదలైనవి ఎక్కి ప్రయాణించ కూడదు. పర్వతం, మేడ మొదలైన ఉన్నత ప్రదేశాన్ని ఎక్కకూడదు.
- ✦ వ్యాయామం (ఎక్కువ శ్రమ), వేగంగా నడవడం, పరుగు పెట్టడం కూడదు.
- ✦ బూడిదలోనూ, మలిన వస్తువులందు, రోకలి, రోలు మొదలైన పనిముట్లపై కూర్చోరాదు.
- ✦ నీటిలో మునగడం, శూన్య గృహమందుగానీ, చెట్ల క్రిందగానీ నిలబడటం పనికిరాదు.
- ✦ కలహించడం, ఒళ్ళు విరుచుకోవడం, కారపు వస్తువులు, వేడి వస్తువులు తినడం,

సంధ్యలలో భుజించడం మంచిదికాదు.

✦ అతిశీతలమైన పదార్థాలను, గాఢమైన పులుపు పదార్థాలను తినరాదు. సులభంగా జీర్ణమయ్యే పదార్థాలను తినాలి.

✦ మైథునం, శోకం పనికిరావు. రక్తం తగ్గించుకోరాదు. అంటే రక్త సమృద్ధి కలిగించే పళ్ళు, కూరలు తినాలి.

✦ పగలు నిద్రించడం, రాత్రి ఒంటరిగా మేల్కొనడం తగదు. బూడిదతోను, బొగ్గుతోనూ, గోళ్ళు మొదలైన వాటితోనూ గీతలు గీయరాదు.

✦ ఎప్పుడూ నిద్రపోవడం (అతినిద్ర) తగదు. అమంగళపు వాక్కులను ఏ మాత్రమూ పలకరాదు. అధికంగా నవ్వడం, కొప్పు విప్పుకొని ఉండడం తగదు.

✦ హఠాత్తుగా జడియడం, ఒంటిగ కూర్చోవడం కూడదు.

✦ శుచిని వీడరాదు. మంచి సాత్త్విక మంత్రాలతో కూర్చిన రక్షరేకులను ధరించాలి. మంచి మాలికలు, చందనం ధరించాలి.



✦ పవిత్రత, దేవారాధన ఉన్న గృహంలో ఉండాలి. దానాలను చేయాలి. అత్తమామల ఎడ గౌరవ భావంతో ప్రవర్తించాలి. పసుపు, కుంకుమ, సింధూరం, కాటుక మొదలైన వాటితో అలంకరించుకొని, దువ్విన కొప్పుతో మంగళాభరణాలు ధరించాలి.

✦ నాలుగు, ఆరు, ఎనిమిది మాసాలలో ప్రయాణమెప్పుడూ కూడదు. అందులో ఆరవ మాసం బొత్తిగా కూడదు. ....ఇలా వైద్య, సూక్ష్మ విజ్ఞాన రహస్యాలలో మన శాస్త్రాలు గర్భిణికి నియమాలను విధించాయి.

**గర్భిణీ వాంఛితం ధర్మం తస్యై దద్యాద్యథోచితం ।**
**సూతే చిరాయుషం పుత్ర మన్యథాదోషమర్హతి ॥**
**సింధుస్నానం ద్రుమచ్ఛేదం వపనం ప్రేత వాహనం ।**
**విదేశ గమనం చైవ నకుర్యాద్గర్భిణీ పతిః ॥**

గర్భవతియైన భార్య కోరిన ఉచితమైన వస్తువును తెచ్చి ఇవ్వడం ముఖ్యం. తద్వారా చిరాయువు కలిగిన పుత్రుడు కలుగుతాడు. లేకపోతే దోషం కలుగుతుంది. (మన శాస్త్రాల ప్రకారం–గర్భవతికి 'దౌహృది' అని పేరు. అంటే 'రెండు హృదయాలు కలది' అని అర్థం. తన హృదయంతోపాటు, లోనున్న శిశువు హృదయం కూడా

ఆమె ద్వారా వ్యక్తమౌతుంది. పరస్పరం ఒకరి భావాల ప్రభావం మరొకరిపై ఉంటుంది.

అందుకే భర్త వ్యక్తపరచే ఆప్యాయత శిశువు కూడా గ్రహిస్తుంది. తండ్రిగా అతడి శ్రద్ధ, జాగ్రత్త శిశువు గమనిస్తుంటాడు. అది శిశువు ఆయుష్షుకి బలాన్ని స్తుంది. అంతేకాక తల్లి చరించే పరిసరాలు, గ్రహించే విషయాలు శిశువు గమనిస్తుంటాడు. వాటి ప్రభావం ఉంటుందని గమనించి సవ్యమైన వాతావరణంలో, చక్కని నియమాలతో తల్లి ప్రవర్తించాలి).

సముద్రస్నానం, చెట్టు నరకడం, క్షౌరం, శవం మోయడం, విదేశప్రయాణం చేయరాదు. (ఇందులో తప్పని పరిస్థితుల్లో క్షౌరం చేసుకోవచ్చు అని కూడా శాస్త్రముంది. క్షౌరం నైమిత్తికం కుర్యాత్ నిషేధౌ సత్యపిధ్రువం).

**వపనం మైథునం తీర్థం శ్రాద్ధ భోజన మేవచ।**
**వర్జయేత్సప్తమాన్మాసాన్నావారోహరణం తథా ॥**
**యద్ధాది వాస్తుకరణం నఖకేశవికర్తనం ।**
**చౌలం శవానుగమనం.....**
**ముండనం పిండదానంచ ప్రేతకర్మ చ సర్వశః ।**
**జీవత్పితృకఃయ కుర్యాద్గర్భిణీ పతి రేవచ ॥**

– ఏడవమాసము నుండి క్షౌరం, మైథునం, తీర్థయాత్ర, శ్రాద్ధ భోజనం, నావ నెక్కడం పనికిరాదు. యుద్ధాదులు, గృహాది నిర్మాణం, నఖ (గోళ్ళు) కేశములు కత్తిరించడం, తల గొరిగించుకొనడం, శవాన్ని అనుసరించి వెళ్ళడం, పిండదానం, పితృకర్మలు చేయడం పనికిరాదు.

అయితే మరణించిన తల్లిదండ్రుల విషయంలో శ్రాద్ధాదులు (ఆబ్ధికాలు) చేయవలసినదే. మహాలయ శ్రాద్ధాదులు చేయనక్కఱలేదు.

–ఇలా మన శాస్త్రాలు సూక్ష్మవిషయ దర్శనాలలో నియమాలను ఏర్పరచాయి. వీటి పాలన వల్ల శిశువు జీవితం సుఖ సౌభాగ్యాలతో వర్ధిల్లుతుంది.

**ప్ర: 'పంచగంగలు' అనే మాట ఒక చోట చదివాను? ఆ పంచ గంగలు అంటే ఏమిటి?**

**జ:** పవిత్రతనిచ్చే నదులలో 'గంగ' ప్రధానం. ఆ తరువాత మరికొన్ని పవిత్ర నదులను గంగతో సమానంగా భావించి అర్చించుతారు. ఆ నదులను, గంగను కలిపి 'పంచ గంగలు' అంటారు.

అవి – **కావేరీ, తుంగభద్రా చ కృష్ణవేణీ చ గౌతమీ,**
**భాగీరథీతి విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః ॥**

కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గోదావరి, భాగీరథి (గంగానది) ఇవే పంచగంగలు. వీటిని స్మరించి స్నానం చేస్తే పాపహరణమవుతుందని శాస్త్రం చెప్తోంది.

ప్ర: **జపం, ధ్యానం చేసేటప్పుడు ఎలాంటి ఆసనాల మీద కూర్చోవాలో తెలియజేస్తారా?**

జ: వెదురుతో చేసినవి, ఱాయి, నేలకొయ్య, చిగురాకులు...వీటిని ఆసనాలకు వాడ కూడదు. దర్భాసనం, కంబళి, చిత్రాసనం శ్రేష్ఠం. చంపకుండా, హింసించకుండా గ్రహించిన జింక చర్మం, పులిచర్మం కూడా ఆసనాలకు పనికి వస్తాయి. దర్భాసనం పుష్టినీ, కంబళి దుఃఖవిమోచనాన్నీ, చిత్రాసనం అభీష్టసిద్ధినీ, జింక చర్మం జ్ఞానాన్నీ, పులిచర్మం మోక్షాన్నీ ప్రసాదిస్తాయని శాస్త్ర వచనం.

ప్ర: **దైవభక్తి ఉన్నచోట మంచితనం ఉంటుందంటారు. మరి నేడు చాలా దేవాలయాల్లో మోసాలు జరుగుతున్నాయి. దైవభక్తులమని చెప్పుకొనేవారూ పాపాలు చేస్తున్నారు. భక్తి ఉంటే పాపాలు చేసినా ఫరవాలేదా? ఈ సందేహం తీర్చగలరు.**



జ: దేవుడికి పూజలు చేసే వారంతా దైవభక్తులైపోరు, నిజంగా దేవుడి మీద ప్రేమ ఉన్నవారే – దైవభక్తులు, భక్తి ఉన్నవాడు పాపం చేయడు. చేయలేడు. ఎందుకంటే దైవం ధర్మ ప్రియుడు. ధర్మాన్ని తప్పితే భక్తి అనిపించుకోదు. భక్తికి ధర్మం ప్రాణం. గుళ్ళూ గోపురాలు తిరిగే వారు, దేవుడి పూజలు చేసేవారు అందరూ భక్తులేనని చెప్పడానికి లేదు. తమ కోరికలను తీర్చుకోడానికి ఎవరికి వీలైన మార్గాన్ని వారు ఆశ్రయిస్తారు, అలా కొందరు దేవుడ్ని కొలుచుకుంటారు. వారికి దేవుడి పట్ల అసలైన శ్రద్ధ ఉండదు. వారందరినీ "భక్తులు" అనే వర్గం క్రింద జమకట్టకూడదు. అలాగే ప్రజల్లో తమ కోరికల కోసం దేవుడి పట్ల చూపించే ఆసక్తిని వాడుకొని సొమ్ముచేసుకొనే వ్యాపారులు ఉంటారు. వారినే భక్తులను కోవడం పొరపాటు.

పాపం ఉన్న చోట భక్తి పండదు. దైవశక్తి జాగృతం కాదు. దేవాలయాల దగ్గర చేరే గుంపులందరికీ దైవతత్త్వం పట్ల ఆసక్తి ఉండదు. భక్తుడు భగవంతుని నామ, గుణ మహిమల పట్ల ప్రేమ కలిగి, నిరంతరం ఆ చింతనలోనే కాలం గడుపుతూ సత్యం, అహింస, శుచి, దయ – వంటి సద్గుణాలను అల వరచుకుంటాడు. నిజంగా భగ వంతుని అనుగ్రహం ధర్మపరునికే లభిస్తుంది. ధర్మం, ప్రేమ.... ఈ రెండూ కలిస్తేనే భక్తి, 'మంది' చేరే చోట సొమ్ము చేరుతుంది. ఆ సొమ్మును స్వాహా చేయడానికి

అక్రమార్జనపరులూ చేరతారు. అదే విధంగా దేవుడి సొమ్మును స్వాహా చేసే మహా పాపాత్ములూ బయలుదేరుతారు. అలాంటి కొంతమంది దేవాలయాల్లో ఉన్నంత మాత్రాన వారు భక్తులైపోరు. వారి పాపాలూ పరిహారింపబడవు. సరి కదా– బైట చేసే మోసాలకన్నా దైవత్వాన్ని మోసగించి స్వీకరించడం అనే పాతకం మరీ బలవత్తర మైనది గనుక భవిష్యత్తులో వారూ, వారి తర్వాత తరాల వారూ బాధాకరమైన జీవి తాన్ని అనుభవించి తీరుతారు. తాత్కాలికంగా వారు లబ్ధిపొందినట్లు కనబడినా, భవితవ్యంలో వారు నరక సమీపమైన వేదనను అనుభవిస్తారనడంలో సందేహంలేదు. అటువంటి వారిని చూసి అదే భక్తి అనే, అదే ఆధ్యాత్మిక అనే పొరపడవద్దు, పాపం ఉన్నచోట పరమాత్మ ఉండదు.

**ప్ర: దుస్వప్నాలు, సుస్వప్నాలు – కూడా ఉన్నాయంటారు. నిజమేనా? వాటికి ధర్మశాస్త్ర ప్రమాణాలున్నాయా? మన ప్రాచీన గ్రంథాలలో అలాంటి గాథలేవైనా ఉన్నాయా?**

**జ:** స్వప్నాలను సంబంధించి భారతదేశంలో అత్యంతప్రాచీన కాలంలోనే ఎంతో పరి శోధన జరిగింది. ఆత్రేయుడనే మహర్షి స్వప్న శాస్త్రాన్ని రచించాడని తెలుస్తోంది. ఇంకా వైద్యశాస్త్ర గ్రంథాలలో, పురాణాలలో కూడా స్వప్నాల విషయమై చాలా సమాచార ముంది. వాటిలో శాస్త్రీయమైన పరిశీలన ఉందనడంలో ఎలాంటి సందేహం లేదు.



**మన శాస్త్రాలు చెప్పిన ప్రకారం –**

- ✦ కొన్ని స్వప్నాలు ఆరోగ్య పరిస్థితులను సూచిస్తాయి, శరీరం వాత, పిత్త, కఫ తత్త్వాలతో కూడినది. వాత తత్త్వం ప్రకోపించినప్పుడు ఒక విధమైన స్వప్నాలు, పిత్త తత్త్వపు లోపం వల్ల మరొక రకమైన కలలు, కఫపు లోపం వల్ల ఇంకో తరహా స్వప్నాలు వస్తాయని వాటి వివరాలను కూడా 'ఆత్రేయసంహిత' పేర్కొంది. రోగికి వచ్చే కలలను గురించి అడిగి, వాటి ఆధారంగా అతడిలో ఏ తత్త్వం ప్రకోపించి ఉందో తెలుసుకోవచ్చు. తద్వారా సరియైన చికిత్స చేయవచ్చు. అజీర్తి వంటి వ్యాధుల్లో ఎటువంటి కలలు వస్తాయో కూడా వర్ణించారు.
- ✦ కొన్ని స్వప్నాలు మనస్సులో దాగిన విషయాలను ప్రతిఫలిస్తాయి, మన ప్రవృత్తుల్ని బైట పెడతాయి.
- ✦ మరికొన్ని రానున్న ఫలాలను సూచిస్తాయి. అందులో మంచి చెడూ రెండూ ఉండవచ్చు.
- ✦ అతి పసితనంలో వచ్చే కలలు గత జన్మలకి సంబంధించిన అనుభవాలతో

ఉంటాయనీ, అతి వృద్ధాప్యంలో (జీవిత చరమదశలో) వచ్చే కలల్లో రానున్న జన్మలకి సంబంధించిన విషయాలు కనిపిస్తాయనీ, నడిమ కాలంలో ఈ జన్మ విషయాలే గోచరిస్తాయనీ పద్మపురాణం చెబుతోంది.

రామాయణంలోనాటి స్వప్నాల శాస్త్ర విషయాలను చూడవచ్చు, 'సుందర కాండ'లో త్రిజటాస్వప్న వృత్తాంతం ప్రసిద్ధి పొందింది. అందులోనే అరిష్ట సూచకాలు, ఐశ్వర్య సూచకాలు కలల్లో ఎలా గోచరిస్తాయో చాలాభాగం వివరించారు. అలాగే సీతకు హనుమంతుడు చెట్టుపై కనబడగానే– కలయేమోనని అనుమానించి, కలలో కోతి కనబడరాదని అనుకోవడం వర్ణించారు.

నదినిగానీ సముద్రాన్ని గానీ ఈదినట్లు, ఆకాశంపై ఎగిరినట్లు, గ్రహ నక్షత్ర సూర్యచంద్రుల్ని చూసినట్లు, ఎక్కినట్లు, దేవాలయమెక్కినట్లు, రత్నాభరణాల దర్శనం, శ్వేతవస్త్రం చందనం ధరించినట్లు, దేవతల్నీ, బ్రాహ్మణుల్నీ, రాజుల్నీ చూసినట్లు, అలంకరించుకున్న స్త్రీలను చూసినట్లు, వృషభాన్ని ఎక్కినట్లు పర్వతాలనీ వృక్షాలనీ ఎక్కినట్లు కలగంటే– ధనలాభం, ఆరోగ్యం ప్రాప్తిస్తాయని ధర్మశాస్త్రాలు చెప్తున్నాయి.

142

మోదుగు, వేపచెట్లు, పుట్ట – వంటి వాటిని ఎక్కినట్లు, నూనె, ప్రత్తి, తెలక పిండి, లోహం–దొరకడం... ఇవి విపత్తుల్ని సూచిస్తాయి, వివాహమైనట్లు, ఎఱ్ఱని వస్త్రాలు, అలంకారాలు ధరించినట్లు, ప్రవాహంలో కొట్టుకుపోతున్నట్లు, వండిన మాంసాన్ని తింటున్నట్లు, గ్రహణాన్ని చూసి నట్లు, నక్షత్రాలు రాలడం వంటివి కలల్లో కనిపిస్తే అవి దుఃస్వప్నాలే.

గాడిద, ఒంటె, పోతూ – వీటి నెక్కి నట్లు, బురదలో మునుగునట్లు, నూనె పూసుకున్నట్లు, శవాన్ని కౌగిలించుకున్నట్లు, నల్లని పురుషుని చూసినట్లు కలలు రాకూడదు.

పైన చెప్పిన దుఃస్వప్నాలు వస్తే – వెంటనే 'గోవింద' నామాన్ని అధికంగా స్మరించు కోవాలి. అసలు నిద్రకు ముందే 'గోవింద' స్మరణ చేస్తే దుఃస్వప్నాలు రాకుండా ఉండే అవకాశముంటుంది.

విష్ణు సహస్రనామ పారాయణ, గజేంద్రమోక్ష ఘట్టం వివరించినా, విన్నా దుస్వప్నాలు రావు. దాదులలో కూడా దుఃస్వప్న హరణ మంత్రాలు కనిపిస్తున్నాయి.

దుఃస్వప్నాలు వచ్చినట్లయితే వాటి ఫలితాలు రాకుండా నివారించే శక్తి విష్ణు సహస్ర నామ పారాయణ లేదా గజేంద్ర మోక్ష ఘట్టాలలో ఉంది.

**ప్ర: ఏవైనా స్తోత్రాలు పారాయణ చేసినప్పుడు ఉచ్చారణ దోషాలు వస్తుంటాయి కదా! వాటికి ప్రాయశ్చిత్తం ఏం చేయాలి?**

**జ:** పారాయణ చేయకముందే సరియైన పండితుల వద్దకు (భాష తెలిసిన వారి వద్దకు) వెళ్ళి ఎలా ఉచ్చరించాలో తెలుసుకొని పారాయణ చేయాలి. "శ్రద్ధ"గా పారాయణ చేయాలి – అనే మాటలో అంతరార్థమదే. పెద్దల ద్వారా సరియైన పద్ధతిని తెలుసు కొని, జాగ్రత్తగా, తప్పులు లేకుండా చదవడం శ్రద్ధలో భాగం. చదువు తున్నంతసేపు ఏకాగ్రత వీడరాదు. అయితే– ఇన్ని శ్రద్ధలు తీసుకున్నా కొన్ని చోట్ల పొరపాట్లు రావచ్చు. అప్పుడీ క్రింది శ్లోకాలు చదివి, భగవదర్పణం చేస్తే, ఆ దోషాలు పోతాయి. (ఎలాగూ క్షమాపణ శ్లోకం చదువుతాము కదా అని, శ్రద్ధాలోపం చేయరాదు).

***యస్య స్మృత్యాచ నామోక్త్యా***
***తపః పూజా క్రియాదిషు।***
***న్యూనం సంపూర్ణతాం యాతి***
***సద్యోవన్దే తమచ్యుతమ్॥***
***మంత్రహీనం క్రియాహీనం***
***భక్తిహీనం మహేశ్వర। (మహేశ్వరి)***
***యత్పూజితం మయాదేవ! (దేవి!)***
***పరిపూర్ణం తదస్తుతే॥***
***అజ్ఞానాత్ విస్మృతేః భ్రాంత్యా***
***యన్న్యూన మధికం కృతమ్।***
***తత్సర్వం క్షమ్యతాం దేవ! (దేవి!)***
***పరమేశ్వర (రి)నమోస్తుతే॥*** – ఈ శ్లోకాలను పూజలు, వ్రతాలు చేసిన తరువాత కూడా చదువుతారు.

"తపస్సులలో, (అనుష్ఠానాలు), పూజాది క్రియలలో లోపాలుంటే– 'అచ్యుతు'ని స్మరించడం, నామాన్ని పలుకడం, నమస్కరించడం చేత ఆ లోపాలు తొలగి సంపూర్ణ సత్ఫలం కలుగుతుంది. మంత్రము, క్రియ, భక్తి – ఏవి లోపం జరిగినా, దేవా, నేను చేసిన పూజలను మన్నించి పరిపూర్ణ ఫలాన్ని ప్రసాదించుమా.

(పారాయణం కూడా పూజవంటిదే) అజ్ఞానం (తెలియకపోవడం) చేతగానీ, మరపు చేతగానీ, భ్రాంతి (ఒక దానికి ఒకటి అనుకోవడం) చేతగానీ ఏవైనా ఎక్కువ తక్కు

వలు చేసివుంటే, ఓ స్వామి! వాటన్నింటినీ క్షమించుమా. నీకు భక్తితో నమస్కరి స్తున్నాను" – అని పై శ్లోకాల భావం.

**ప్ర: శ్రీ కృష్ణునిజయన్తి, శ్రీరామజయన్తి, అందరికీ తెలుసు. మరి మిగిలిన అవతారాలు ఏ తిథులలో జరిగాయి? వాటి వివరాలు తెలుపగోరిక?**

**జ:** చైత్ర శుద్ధ తదియనాడు (మధ్యాహ్నం) మత్స్యావతారం జరిగింది. వైశాఖ పూర్ణిమ సాయంకాలం కూర్మావతారం. భాద్రపదశుద్ధ తదియ అపరాహ్ణంలో వరాహావతారం, వైశాఖ శుద్ధ చతుర్దశి సాయంకాలం నరసింహావతారం, భాద్రపద శుద్ధ ద్వాదశి మధ్యాహ్నం వామనావతారం, వైశాఖ శుద్ధ తదియ మధ్యాహ్నం పరశు రామావతారం. (కొందరు ప్రదోషకాలం అంటారు). చైత్ర శుద్ధ నవమి శ్రీరామావతారం. శ్రావణ బహుళాష్టమి అర్ధరాత్రి శ్రీ కృష్ణావతారం. ఆశ్వీయుజ శుద్ధ దశమి సాయంకాలం బుద్ధావతారం. శ్రావణ శుద్ధ షష్ఠి సాయంకాలం కల్క్యవతారం. అయితే – కొన్ని చోట్ల మత్స్య, కూర్మ, వరాహ, బుద్ధ, కల్కి అవతారాలు వేరే తిథులలో చెప్పబడ్డాయి. అంటే అవి వేరే కల్పాలలో జరిగినవిగా భావించాలి.



ఎవరెవరు ఏ అవతారాలు అభీష్టంగా ఉపాసన చేస్తారో వారు, ఆ అవతారం జరిగిన తిథినాడో ఉపవాసం చేసి ఆరాధన చేయాలి. ధర్మశాస్త్రాలు చెప్తున్న ప్రకారం శ్రీరామ, కృష్ణ, నృసింహజయంతులు నిత్యములు కనుక అందరూ, ఈ తిథులను ( చైత్ర, శుద్ధనవమి, శ్రీకృష్ణజన్మాష్టమి, వైశాఖ శుద్ధ చతుర్దశి) పాటిస్తారు. వీటిలో భిన్నాభి ప్రాయాలు లేవు.

**ప్ర: రాధాదేవి' ప్రసక్తి భాగవతంలో గానీ, భారతంలో గానీ లేదంటారు. మరి ఎక్కడ ఉంది? రాధానామం బృందావనంలో వినబడుతుంటుంది. ఇది కల్పిత పాత్రయా? లేక, దేవతామూర్తియా?**

**జ:** 'రాధ ' పరాశక్తి స్వరూపిణి. వేద ఉపనిషత్తులలో, వేద భాగాలలో రాధా ప్రస్తావన ఉంది. పురాణాలలో – దేవీ భాగవతం, బ్రహ్మవైవర్త పురాణం – వంటివి రాధా శక్తిని వర్ణించాయి. పరాశక్తి ప్రధానంగా ఐదు పూర్ణ శక్తులుగా భాసిస్తోంది. అవి – 1. దుర్గ, 2. లక్ష్మి., 3. సరస్వతి 4. గాయత్రి 5. రాధ.

ఇందులో 'రాధ' అనుగ్రహం అత్యంత దుర్లభం. పరమాత్మ యొక్క హ్లాదినీ శక్తి, ప్రేమా నందశక్తి – రాధాదేవి.

మంత్ర శాస్త్ర విషయాల్లో రాధామంత్రాలు చాలా ఉన్నాయి. ఇప్పటికీ ఆ ఉపాసకులు

అనేక మంది ఉన్నారు. రాధాకృష్ణ సాక్షాత్కారం పొందిన మహాత్ములు చాలా మంది సనాతన కాలం నుండి ఉన్నారు. నారాయణతత్వం గోలోకంలో కృష్ణరూపంగా నిత్యం ఉన్నది. పరమ పురుషుడు శ్రీకృష్ణుడయితే, పరాశక్తి రాధ అయ్యింది. రాసమండలానికి అధిష్ఠాన దేవత – రాసేశ్వరి అయిన రాధ.

వ్యాసదేవుడు ఒక చోట చెప్పనిది మరోచోట వివరిస్తారు. ఒక చోట క్లుప్తంగా చెప్పినదానిని మరోచోట విస్తృతంగా అందిస్తారు. అలాగే ఒక చోట గూఢంగా చెప్పిన విషయం మరో తావున ప్రకటంగా చెప్పబడుతుంది. ఏది ఎందుకు? అనే దానిని సంప్రదాయ ధోరణిలో పరిశీలించాలి. ఋషుల రచనలను మాములు రచనలుగా, మాములు సాహితీ పరిశోధనలుగా పరిశీలించడం తగదు. ఉపాసనా సంప్రదాయం, యోగ సంప్రదాయం, ధార్మికరీతి, తాత్విక రహస్యం దాగి ఉన్నవే ఋషి రచనలు.

భాగవతంలో 'రాధ' చెప్పబడింది. కాని అందులో 'గూఢ' నాయిక. గోపికలలో ఒకతెగా అవతరించి, మొత్తం గోపిక లందరినీ రాసలీలలో ప్రవేశింపజేసిన కృష్ణుని ప్రేమశక్తి రాధ. ఆ మాటకొస్తే భాగవతంలో ఏ గోపిక పేరూ ప్రస్తావించ లేదు. కనుక రాధ ప్రస్తావన లేదని అనడమూ సబబుకాదు. కృష్ణ ప్రేమలో వారికంటూ భిన్నమైన వ్యక్తిత్వం లేదు. అంతా గోపికా శక్తే. రాధను కల్పిత పాత్ర అనడం నాస్తికత్వమే. కృష్ణ, రామాదులను కూడా కల్పిత పాత్రలనే వారున్నారు కదా! రాధ నిస్సందేహంగా దేవతామూర్తి, ఇంకా చెప్పాలంటే పరిపూర్ణ పరాశక్తి.



ప్ర: ***సత్యహరిశ్చంద్రుడు 'సత్యవ్రత పాలకుడు' అంటారు? ఆయనలోనే ఆ ప్రత్యేకత ఏమిటి? భార్యను అలా అమ్మడం తగునా? "ప్రాణవిత్తమాన భంగమందు బొంక వచ్చు" అంటారు కదా? మరి హరిశ్చంద్రుడు ఆ ధర్మాన్ని ఎందుకు పాటించలేదు?***

**జ:** ఒక ధర్మాన్ని 'వ్రతంగా' పాటించడం వేరు. ధర్మంగా అనుసరించడం వేరు. హరిశ్చంద్రుడు సత్యాన్ని వ్రతంగా పాటించినవాడు. వ్రతపాలనలో ప్రధానంగా ఎంచుకొన్న వ్రత ధర్మం కోసం ఇతర ధర్మాలను త్యాగం చేయవచ్చు. 'వ్రతంగా' పాటించనప్పుడు ప్రాణ, విత్త, మాన, భంగాలలో బొంకవచ్చు. ప్రాణ విత్తాదుల హానికైనా వెఱవకుండా పాటించేది వ్రతం.

ఒకరు ఉపవాస వ్రతాన్ని పాటిస్తారు. దానికోసం కఠినంగా నియమపాలన చేస్తారు. అలాగని అన్నం తినడం పాపం కాదు కదా! అన్నం తినని నియమ పాలనలో

ఉన్నవారికి అన్నం తినడం పాపం.

అయితే అన్నం తినవచ్చు కదా, అని ఏది పడితే అది, ఎలా పడితే అలా, ఎక్కడ పడితే అక్కడ తినరుకదా! అన్నం తినడానికి నియమాలున్నాయి. నాటి మహాత్ము లందరూ సత్యవంతులే. కాని సత్యాన్నే వ్రతంగా ఎంచుకున్న ప్రత్యేకత హరిశ్చంద్రు నిది. అలాగే మిగిలిన వారు సత్యాన్ని పలకలేదని కాదు.

ధర్మాన్ని స్థూలంగా చెప్పలేం. అందులోనూ సత్పురుషుల ధర్మాన్ని శంకించడం తగదు. వారి ధర్మం సూక్ష్మంగా ఉంటుంది. అది గ్రహించాలంటే వివేకం, శాస్త్ర పరిజ్ఞానం అవసరం, కొన్ని పరిస్థితుల్లో బొంకవచ్చును– అనేది ధర్మం కాదు, అధర్మమూ కాదు. అది ఆపదలోనే అనుసరించవచ్చు– అనే సడలింపు. దానివల్ల పాపం అంటదు, అని అర్థం. "బొంకవచ్చు, అఘము చెందదధిప" అని తరువాతి వాక్యం. నియమ(వ్రత) పాలనలో సడలింపుల జోలికి వెళ్ళక అత్యంత కఠినంగా ఉండటం అవసరం. అందుకే హరిశ్చంద్రుడు కఠినంగా వ్యవహరించాడు. భార్యను అమ్మినది తన సుఖాలకోసం కాదు కదా! అదీ ధర్మం కోసమే. ధర్మపత్ని అయిన చంద్రమతి తానే స్వయంగా పతి ధర్మానికి సహకరించింది. ఆమె చేయని ఆక్షేపణ మనం చేయగలమా! ఆ సతీమతల్లికి మాత్రం తెలియదా?



**ప్ర: "కలియుగ ధర్మాలు" గురించి చెప్తూ – అన్నీ అధర్మాలే జరుగుతాయనీ, ఘోరంగా ఉంటుందనీ వర్ణించారు. యుగధర్మమే అలా ఉన్నప్పుడు మనం బాగుచేయాలని ప్రయత్నించడం సమంజసమా? కాలంతో పాటు మనమూ వెళ్ళిపోతే సరిపోతుంది కదా?**

**జ:** ధర్మాలు – అనే శబ్దానికి 'లక్షణాలు' అని కూడా మరొక అర్థం ఉంది. 'కలియుగ ధర్మాలు' – అంటే 'కలియుగ లక్షణాలు' అని అర్థం. అయితే కలి యుగంలో అన్నీ అధర్మాలే జరగడం సహజం– అని ఉపేక్షించడం తగదు. వర్షాకాలంలో వానపడడం సహజం గనుక మనం వానలో తడుస్తూ వెళ్ళం కదా? గొడుగో, రెయిన్‌కోటో వేసు కుంటాం. ఒక కప్పు ఉన్న ఇంట్లో తలదాచుకుంటాం. అలాగే ఎండాకాలం వేడి సహజమేనని చల్లదనం కోసం ప్రయత్నించడం మానుకుంటామా? అలా సహజమైన వాటితో పాటు మనమూ తిరిగితే దెబ్బతినడం సహజం. అందుకే కలియుగంలో అధర్మం సహజమని ఉపేక్షిస్తే మనకే ప్రమాదం. బాగుచేయాలని ప్రయత్నించడం లోక రక్షణే. ఊరంతా ముళ్లు పరుచుకొని ఉన్నాయని మనం అంతా తివాచీ

పరుచుకోలేక పోవచ్చు. కనీసం మనకాళ్లకి చెప్పులు వేసుకుంటే సరిపోతుంది. అదే విధంగా – ఎంత కలియుగమైనా మనం బాగుచేయడానికి ప్రయత్నించవచ్చు. వరదలు వచ్చినప్పుడు, తుఫానులు వచ్చినప్పుడు ప్రకృతి సహజమేనని ఉపేక్షించ కుండా మన వంతు సహాయ సహకారాలు, రక్షణ కార్యక్రమాలు చేపడతాం కదా! అలాగే మనం ఏ యుగంలోనైనా ధర్మప్రవర్తనకే శక్తివంచన లేకుండా ప్రయత్నించాలి.

ప్ర: **నాకు మా తల్లిదండ్రులు 'కనకదుర్గ' అని పేరు పెట్టారు. అయితే నాకు విష్ణుసహస్ర నామస్తోత్ర పారాయణమంటే చాలా ఇష్టం. ఇక్కడ కొందరు (ఒక పెద్ద ఆచార్యుల శిష్యులు) కలిసి ఆలయంలో విష్ణుసహస్రనామ పారాయణ చేస్తూంటే నేను కూడా వారితో పాటు చదువుతున్నాను. అయితే వారు నెమ్మదిగా నాపేరు అడిగి తెలుసుకొని, వెంటనే నా పేరు మార్చుకొమ్మని, బొట్టు మార్చుకోవాలని, కుంకుమ పెట్టు కోవడం 'సుడి' లో పడేస్తుందని హెచ్చరించారు. 'దుర్గ, శివుడు' పేర్లు విష్ణు భక్తులు ఉచ్చరించ రాదని కూడా చెప్పారు. అంతేకాక, తరచూ ఫోన్ చేసి 'పేరు మార్చుకున్నారా?' అని కూడా అడుగుతుంటారు. విష్ణు గ్రంథాలలో దుర్గానామాలున్నాయా?**

జ: భేదదృష్టి తొలగాలని ఆ విష్ణువునే ప్రార్థిద్దాం. తల్లిదండ్రులు పెట్టిన పేరు, సంప్రదాయ సిద్ధంగా వస్తున్న బొట్టూ అలంకారాలని మార్చుకోవడం పాపకరం. ఎవరి సంప్ర దాయం ప్రకారం వారు కట్టూ బొట్టూ అలంకరించు కోవచ్చు. కానీ స్వధర్మాన్ని, స్వసంప్రదాయాన్ని మార్చుకుంటే అది పాపం! విష్ణువు మనందరి దైవం. విష్ణు సహస్రనామ పారాయణకు అందరికీ హక్కు ఉంది. దానిని ఉపదేశించిన భీష్ముడు ఇలాంటి అభ్యంతరాలూ, అవాంతరాలేవీ చెప్పలేదే? శ్రీమత్ భాగవతంలో యోగ మాయాదేవి కృష్ణ సహోదరిగా అవతరించిన ఘట్టం ఉంది. సాక్షాత్తు శ్రీమన్నారాయ ణుడే అమ్మవారితో చెప్పిన మాటలివి.

*గచ్ఛదేవి వ్రజం భద్రే*
*గోపగోభిరలంకృతమ్॥*
*అర్చిష్యంతి మనుష్యాస్త్వాం*
*సర్వకామవరేశ్వరీం*
*ధూపోపహారబలిభిః*
*సర్వకామవరప్రదామ్॥*
*నామధేయాని కుర్వంతి*

*స్థానానిచ నరాభువి*
*దుర్గేతి భద్రకాళీతి*
*విజయా వైష్ణవీతిచ,*
*కుముదా చండికా కృష్ణా మాధవీ*
*కన్యకేతిచ,*
*మాయా నారాయణీశానీ*
*శారదేత్యంబికేతిచ॥*

"ఓ యోగమాయా దేవీ! నీవు నందవ్రజంలో జన్మించు. మానవులందరూ ధూపాది పూజలద్వారా ఆరాధించే దేవతవు నీవు. వారి ఆరాధనలకు ఫలంగా అన్ని కోరికలను, వరాలను నెరవేర్చే శక్తివి నీవు. దుర్గ, భద్రకాళి, విజయా, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయా, నారాయణి, ఈశానీ, శారద, అంబిక– అనే నామాలతో నిన్ను అర్చించేవారు అన్ని శుభాలను పొందుతారు."

నారాయణుడే స్వయంగా భాగవతంలో పలికిన మాటలివి– వీటిని పోతనగారు కూడా అనువదించారు.



అదే విధంగా కృష్ణారాధకురాలైన మహాలక్ష్మి స్వరూపిణి – **"నమ్మితి నా మనమ్మున సనాతనులైన ఉమా మహేశులన్"** అని గౌరిని పూజించింది– అదే భాగవతంలో.

భారతంలో అర్జునుడు శివుని కోసం తపస్సు చేశాడు. భాగవతంలో గోపికలు కాత్యాయనీ వ్రతం చేశారు. భారతంలో శ్రీకృష్ణుడే శివసహస్రాన్ని ఉపదేశించాడు. ధర్మరాజుకీ, అర్జునునికీ శ్రీ కృష్ణుడు దుర్గాదేవిని పూజించమని ఉపదేశించినట్లు భారతాది గ్రంథాలు చెప్తున్నాయి. ఇవన్నీ విష్ణు గ్రంథాలే కదా!

ఒక దైవాన్ని ఆరాధించినప్పుడు మిగిలిన దైవాలను స్మరించడం తగదని చెప్పడం, నిరసించడం మహాపాపం. దానికి విష్ణువు కూడా సంతోషించడు.

**'సర్వః శర్వః శివః స్థాణుః'** అనే నామాలు విష్ణుసహస్రంలోనే ఉన్నాయి. **'దుర్లభో దుర్గమో దుర్గః'** అనే నామాలు కూడా అందులోనివే. అక్కడ పుంలింగంలోని శబ్దాలు ఇక్కడ స్త్రీ లింగంలో చెప్పారు. దుర్గా, కృష్ణా, మాధవి, నారాయణీ – ఈ నామాలన్నీ విష్ణుశక్తి నామాలే. ఈ నామాలు, ఆనామాలు –అన్నీ ఒకే పర తత్త్వాన్ని చెప్తున్నాయి. అజ్ఞానంవల్లనే దేవతల పట్ల భేదదృష్టిని చూపుతాం. మీ పేరును మార్చుకోవద్దు. మీ బొట్టునూ మార్చనవసరం లేదు.

ప్ర: ***భారతం ఉద్యోగపర్వంలో "అంగనలు, అంగనాపూర్వులు, అంగనాభిధానులతో యుద్ధం చేయను" – అన్న భీష్ములవారు, ఊర్వశీ శాపంతో పేడిగా నడయాడిన బృహన్నల తిరిగి అర్జునుడై వచ్చాక మరి ఎలా తలపడ్డాడు? అది వ్రతభంగం కాదా?***

జ: అర్జునుడు బృహన్నలగా మారినది శాపవశాత్తు. అది అజ్ఞాతవాసంలో ఆయనకు సహకరించింది. జన్మతః స్త్రీగా పుట్టినవారు తిరిగి పురుషుడిగా మారితే 'అంగనా పూర్వుడు' అంటారు. అలా మారినది 'శిఖండి'.అర్జునుడు అలా అంగనాపూర్వుడు కాదు. జన్మతః పురుషుడు. అంగన ఎలాగూ కాదు, ఇంక అంగనాభిధానుడు అన డానికి, ఆయన పేడివానివేషంలో ఉండగా యుద్ధసన్నద్ధుడు కాలేదు. ఒక ఏడాది కాలం ఉన్న శాపం పూర్తిగా తొలగి, తిరిగి పూర్ణపురుషుడై యుద్ధానికి వెళ్ళాడు. అందుకే అర్జునుడు అంగన కాదు. అంగనా పూర్వుడు కాదు, అంగనాభిధానుడు కాదు. అందుకే అతనితో తలపడడంలో భీష్మునకు వ్రతభంగమేమీ లేదు.

ప్ర: ***భారతంలో సంజయుడు ఎవరు? ఆయన వివరాలేమిటి?***

జ: సంజయుడు ధృతరాష్ట్రునికి మంత్రి, మిత్రుడు. ఇంతకు మించి పుట్టుపూర్వో త్తరాలు మహాభారతంలో ఇవ్వలేదు. ఏ పాత్రను ఎంత మేరకు పరిచయం చేయాలో, ఎంత మేరకు వివరణ ఇవ్వాలో అంతమేరకే ప్రస్తావిస్తారు శ్రీవ్యాసమహర్షి. వ్యాసదేవుని అనుగ్రహంతో దివ్యదర్శన శక్తిని పొంది కురుక్షేత్ర యుద్ధాన్ని ధృతరాష్ట్రునికి వర్ణించి చెప్పినవాడు సంజయుడు. రాజహితాన్ని కోరి, రాజునే అంటి పెట్టుకుని ఉన్న నిజమైన మంత్రి అతడు.



ప్ర: **ఋషిపీఠం ఒక సంచికలో డాక్టరు ప్రసాదరాయ కులపతిగారు వ్రాసిన 'ప్రేతలోక విశేషాలు' అనే వ్యాసం చదివాను. పురాణాలలో ఏదో చెప్పబడినట్లు తానే వ్రాసారు. ఇటువంటి వ్యాసాలు అవసరమా?**

**'మరణించిన తరువాత స్థితి ఏమిటి? అనే దాన్ని గురించి అన్ని మతాలు, అందరు యోగులు ఆలోచించారు. ఎవరికి తోచిన జవాబులువారు చెప్పుకుని సంతృప్తి చెందారు' అని మొదట్లో చెప్పి తర్వాత ఒక కథలా జీవుడికి చనిపోయిన తర్వాత ఏవిధంగా మార్పు వస్తుందో –పుణ్యాత్ములంటే ఎవరో, పాపాత్ములంటే ఎవరో కూడ వివరిస్తే, ఈ వ్యాసం చదివిన తర్వాత అందరు పుణ్యాత్ములవటానికి ప్రయత్నించి కులపతిగారు చెప్పిన నరకలోక బాధలను తప్పించుకోటానికి వీలు కలిగి ఉండేది.**

**'మృతి చెందిన జీవుడికి పిశాచత్వం రాకుండా ఉండటం కోసం సంతానం కర్మ చేయాలి. పది రోజుల పాటు చేసే పిండోదక దానాల వల్ల ఇంకో శరీరం పుట్టి జీవుడు దాంట్లో ప్రవేశిస్తాడు' అని ఏదో పురాణాన్ని సాక్ష్యంగా ప్రతీకరించారు. అందరూ పిండ ప్రదానం చేస్తూన్నారా? చేయకపోయినందువలన అందరూ పిశాచులుగానే ఉంటున్నారా? హిందూ మతస్థులు – మన పురాణేతి హాసాలలో చెప్పబడిన దేవర దేవతలను భక్తిశ్రద్ధలతో కొలిచేవారు– అంతా ఇట్టి కర్మలు చేస్తు న్నారా? చేయగలుగుతున్నారా? చేయలేనంత మాత్రాన చనిపోయిన వారి పెద్ద లందరూ పిశాచాలై పోతున్నారా? ఇతర మతస్థుల సంగతి అలా ఉంచినా, మన హిందూ మతంలోని వారినే ఈ విధంగా వేరుచేయడం మంచిదా? అందరూ వేదాలు చదవలేరు, వర్ణించలేరు. వేదాలు వల్లించినంత మాత్రాన పుణ్యవంతులవుతారని, అట్టి వారి పెద్దలు పుణ్యలోకాలకి చేరుకుంటారని, లేనివారు పిశాచాలుగా మారి ఉంటారని అర్థం వచ్చేలా వ్యాసాలు వ్రాయడం అంత మంచిది కాదేమో?**

**మన పురాణేతిహాసాల్లో చెప్పబడిన విలువైన, విజ్ఞానవంతమైన మానవ సౌభాగ్యాన్ని కలిగించే మన సంప్రదాయ సమాచారాన్ని రూపొందించటంలో ముందంజ వేస్తున్న మీ పత్రిక ఇటువంటి ఊహాజనితమైన పురాణాలను సాక్ష్యంగా ప్రతీకరించినా ఇవి ఊహాజనితాలే అవుతాయి. వ్యాసాల్ని ప్రచురించి సంఘంలో విభేదాల్ని కలిగించేలా చేయడం మంచిది కాదేమో?**

**కులపతిగారు "కొందరు అస్తిత్వాన్ని నమ్ముతారు. దయ్యం భూతాలను నమ్మరు. మరి కొందరు వాటిని విశ్వసిస్తారు." అన్నారు. సర్వశక్తిమంతుడైన సర్వేశ్వరుని, ఆయన సృష్టి, స్థితి, లయ రూపాలను వర్ణించి ప్రజలకు మన సంప్రదాయాలను, ధర్మాలను, గొప్పతనాన్ని అందించే పత్రికగా పేరొందిన ఋషిపీఠం ఇట్టి వ్యాసాలకు చోటివ్వకూడదని నేను కోరుకుంటున్నాను.**

**జ:** మీరు ప్రశ్నించిన విధానం చాలా బాగుంది. 'ఎవరికి తోచిన జవాబులు' అంటే, అందుకు 'యోగులు' అనే ముందు పదాన్ని మరువకూడదు కదా. 'తోచడం' అంటే 'స్ఫురించడం', అటువంటి వారికి స్ఫురించేవి 'సత్యాలే' గానీ ఊహలు కావు. పురాణాలు 'ఊహాజనితాలు' అని తీసి పారేస్తే, సర్వేశ్వరుని కూడా ఊహాజనితంగానే భావించవచ్చు. బ్రహ్మాండ పురాణంలోని అమ్మవారి కథలు, శివపురాణంలోని శివచరిత్ర, విష్ణు పురాణంలోని విష్ణుగాథలు, పురాణాల ఆధారంగా జరుపుకుంటున్న

పర్వదినాలూ... అన్నీ కూడా ఊహాజనితాలే కావాలి. అప్పుడు వాటిని ఆచరించవలసిన పనీ లేదు. మనకు నచ్చినవీ, 'ప్రియం' అనిపించినవీ మాత్రమే తీసుకుంటామంటే ఎలా?

'ఋషిపీఠం' వేదపురాణాల్ని గౌరవించే వేదిక. పురాణాల్లో చెప్పిన విషయాలు మనం చేయలేకపోయినంత మాత్రాన వాటిని తీసి పారేయాల్సిన అవసరం లేదు. పాటించగలిగే వాళ్ళు పాటిస్తూనే ఉన్నారు. ఇకపోతే – 'ఒక కథలా' చెప్పిన విషయాలు శ్రీ కులపతి గారి కల్పితాలు కావు. భగవద్గీతలో 'తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే' అన్నట్లు – శాస్త్రప్రమాణం ముఖ్యం. ఆ సనాతన శాస్త్రాల ఆధారంతోనే చెప్పిన మాటలివి. ఆ శాస్త్రాలను వెల్లడించడం తప్పేముంది?

ఏ మతం వారికి ఆ మతం ప్రకారం మరణానంతర సంస్కారం ఉంటుంది. అవే ఆ జీవులకు పిండ శరీరాలనిస్తాయి. ఆ సంస్కారం లేనప్పుడు ప్రేతత్వ విముక్తి కలగదు. మన పద్ధతి ప్రకారం మనకు కొన్ని రోజులు పిండోదక ప్రదానాలు ఉన్నాయి. అవి చేయకపోతే, ప్రేతలుగా మిగలడం సంభవమేనని శాస్త్ర విషయమే అక్కడ చెప్పడమయ్యింది.

'పురాణేతిహాసాలలో చెప్పబడిన విలువైన, విజ్ఞానవంతమైన మానవ సౌభాగ్యాన్ని కలిగించే మన సంప్రదాయ సమాచారం'లో – ఈ "దేహాంతర స్థితి" కూడా ఒక భాగమే. రామాయణ భారతాది ఇతిహాసాల్లో ఇవి స్పష్టంగా చెప్పబడిన విషయాలే. అంతేకాదు, వేదాలలోనూ ఈ విజ్ఞానం విస్తారంగా ఉంది.

ఈ పైతృకసంస్కారం చేయడానికి –అందరూ వేదాలు చదివి, వల్లించి, కర్మకాండలు తెలిసినవాళ్ళే అవసరం లేదు. ఇది మన మతస్థులందరికీ సనాతనంగా వస్తున్న సంప్రదాయమే.

పుణ్యాత్ముల, పాపాత్ముల లిస్టు ఇవ్వడానికి ఆ వ్యాసం సందర్భం కాదు. అది మరో వ్యాసమవుతుంది. మరణించిన తరువాతి స్థితి గురించి తెలుసుకొని, తగిన జాగ్రత్తలు తీసుకుంటాం అనే ఉద్దేశ్యంతో పెద్దలు ఈ పురాణాల ద్వారా తెలియజేశారు. అదంతా సూక్ష్మ ప్రపంచానికి చెందిన విషయం. దాని గురించి స్థూలంగా ఋజువు చేయడం ఎలా సాధ్యం? భగవంతుడూ, దైవీ శక్తులూ వలెనే, ఇవీ సూక్ష్మప్రపంచ విషయాలు. పరలోక విశ్వాసమే లేనప్పుడు, పాప పుణ్యాల ప్రసక్తే లేదు. లౌకికంగా చార్వాకాది నాస్తికమతాల వాదన ఇదే కదా! మనం నమ్మినా నమ్మకపోయినా అన్నీ ఉన్నవే.

మన నమ్మకంతో పని లేకుండా వాటి ప్రభావం మనపై ఉండి తీరుతుంది. లోకంలో రెండు రకాలూ ఉంటారని చెప్తూ– "కొందరు దైవాన్ని నమ్ముతారు, వీటిని నమ్మరు"– అని వ్రాయడమయింది. సర్వేశ్వరునిపై నమ్మిక – అంటే "ఆయనను ఆశ్రయించడం". ఈ విపరీత శక్తులపై నమ్మిక –అంటే, "వీటిని గురించి తెలుసుకొని జాగ్రత్త పడడం". రెండు 'నమ్మిక'లూ వేరు వేరు.

ధ్యానం, యోగసాధన, నిత్య అనుష్ఠానం ఉన్నవాళ్లకి – దైవరక్షణ ఉండడమేకాక, సూక్ష్మప్రపంచ దర్శనమూ ఉంటుంది. ఎవరు ఆ సాధన చేస్తారో వారు దానిని దర్శించగలరు. అందరూ అన్నీ సాధించలేరు కదా! అలా సాధించలేనివారు, సాధించిన వారి జ్ఞానాన్ని తెలుసుకొని, నమ్మికగా వెళతారు. అంతే. డా.ప్రసాద రాయకులపతి గారు విజ్ఞులైన మహాపండితులూ, కవులే కాదు. కఠోర దీక్షతో, తపస్సాధనతో అనేక ఏళ్ళ నిష్ఠతో సూక్ష్మప్రపంచ దర్శనం చేసిన మహోపాస కులు. వారి అనుభవ విజ్ఞానాలు ఇప్పటికే చాలా మంది మంత్ర శాస్త్రాభిమానులకు విదితం. కాబట్టి వారి విజ్ఞానం అందరికీ అందుబాటు చేయాలని మా ప్రయత్నం.



ఈ విధమైన విషయాలు పాఠకుల మనస్సులో ఆందోళన కలిగించవు. ఆలోచనలు రేకెత్తిస్తాయి. రోగాలు, నివారణలకు సంబంధించిన వైద్యగ్రంథం చదివితే కొంద రికి ఆందోళనగానే ఉండవచ్చు. అంత మాత్రాన ఆ గ్రంథాలు ముద్రించరాదని అనడం ఉచితం కాదు కదా! ఇటువంటి జాగ్రత్త పడదగ్గ, ఉపయోగకరమైన రచనలు ప్రచురించమని చాలా మంది మాకు ఎన్నో ఉత్తరాలు వ్రాశారు.

ఇందాక చెప్పినట్లుగా , పితృకర్మలు చేయడానికి పండితులో, నైష్ఠికులో, వేదం తెలిసిన వాళ్ళో కానక్కర్లేదు. ఇప్పటికి ఎందరో అతి సామాన్యులు, అన్ని వర్గాల వారు వారి వారి సంప్రదాయానుగుణంగా చేస్తూనే ఉన్నారు. ఈ రోజుకీ తమిళ నాడులో ప్రతీ అమావాస్య నాడు తమ పితరులకు తర్పణ చేసిగాని భోజనం చేయరు. అన్ని వర్గాలవారూ ఇలా చేస్తున్నారు. మన ప్రాంతాలలోనూ చాలా మంది, ప్రధాన కర్మలతో పాటూ – సంక్రాంతినాడు, దీపావళినాడు, పెద్దల ఆరాధనలు చేస్తున్నారు. ఎవరో ఏ కొద్ది ధర్మభ్రష్టులో వీటిని విడిచి పెట్టి, తమ బద్ధకాన్నీ, నిర్లక్ష్యాన్నీ సమర్థించు కుంటుంటారు. అంతే.

'ఏదో పురాణం' అని పురాణ విద్యను హేళన చేయవలసిన పనిలేదు. ఏ పురాణాన్ని మనం 'మూలం' అధ్యయనం చేశామని –ఒక నిర్ణయానికి రావడం? అష్టాదశ

పురాణాలూ వ్యాసమహర్షి ప్రోక్తాలే, 'వేదాలని'చ్చిన ఆ మహాత్ముడే పురాణ విద్యను ఏర్పరచాడు. అందులోని 'గరుడ పురాణా'న్నే ఆ రచనలో ఉటంకించడం జరిగింది. ఆ గ్రంథం 'సంస్కృత మూలం' అతి విస్తృతమైనది. సంప్రదాయ పద్ధతిలో అధ్యయనం చేస్తే అందులో రహస్యాలు తెలుస్తాయి. వైద్య, జ్యోతిష, మంత్ర, దేవతా రహస్యాలెన్నో ఇందులో ఉన్నాయి.

ఇటీవల వృద్ధి చెందిన 'రేకీ' వంటి విద్యల్లోనూ ఇవి ఋజువయ్యాయి. ఎంతో అభి వృద్ధి చెందిన పాశ్చాత్యులూ వీటిని నమ్మి, వైజ్ఞానికంగా ఋజువు చేస్తూ అనేక గ్రంథాలు వ్రాస్తున్నారు. ఏది ఉన్నదో దానినే చెప్పారు మహర్షులు. వారు 'ఊహలు' చేసే రచయితలు కారు. ఇంద్రియాతీతమైన వాటిని దర్శించిన సత్యద్రష్టలు. ఆ ఋషులు చెప్పిన మాటల్ని, అందులోని విజ్ఞానాన్ని అందించడమే 'ఋషిపీఠం' పని. ఇందులో ఎవరినీ వేరు చేయడంలేదు. 'శ్రాద్ధాది పితృకర్మలు మన సంప్రదాయం లోని భాగాలే. అన్ని వర్గాలకూ ఉన్నవే'.

**జీవతో వాక్యకరణం**
**ప్రత్యబ్దం భూరి భోజనం.**
**గయాయాం పిండదానం చ**
**త్రిభిఃపుత్రస్య పుత్రతా.....** – అని 'ధర్మశాస్త్ర వచనం'. జీవించి ఉండగా తల్లి దండ్రుల మాటను గౌరవించడం, అనంతరం ప్రతి ఏటా శ్రాద్ధాదులు చేయడం, గయలో పిండదానం. ఈ మూడూ పుత్రత్వానికి సార్థకత.

దైవఋణం, పితృఋణం, ఋషిఋణం, భూత (ప్రాణి) ఋణం, సాటి మనుష్యుల ఋణం – ప్రతి వ్యక్తీ తీర్చుకోవాలన్నదే సనాతన ధర్మంలోని ప్రధాన సూత్రం. ఈ అయిదుగురినీ తృప్తిపరచి, ఋణవిమోచనం పొందడమే పుణ్యం. ఆ పని చేసేవాడే పుణ్యాత్ముడు. లేని వాడు పాపాత్ముడు. ఈ విభజన చాలు –స్థూలంగా .అందుకే 'లలితాసహస్రనామస్తోత్రం' లో 'పంచయజ్ఞ ప్రియ' అనే నామంతో అమ్మ వారిని పిలిచారు. పంచయజ్ఞాలలో (దేవ యజ్ఞ, పితృయజ్ఞ, ఋషి యజ్ఞ, మనుష్య యజ్ఞ, భూత యజ్ఞాలు) 'పితృ యజ్ఞం' చెప్పబడింది.

'యజ్ఞం' – అనగానే మళ్ళీ అదేదో వైదిక కర్మకాండ అనో, హోమాలు చేయడమనో అనుకోవద్దు. సామాన్యునికి కూడా సనాతన సంప్రదాయంగా వస్తున్న విధానాలే – 'యజ్ఞం' అంటే 'కృతజ్ఞతా పూర్వకం'గా చేసే భావనామయమైన ఆరాధన మాత్రమే.

దానికి తగ్గ క్రియనే ధర్మశాస్త్రాలు చెప్పాయి. అవి అన్ని వర్గాల వారికి, విభేద రహితంగా ఉన్నాయి. మనం తీర్చుకోవాల్సిన అయిదు ఋణాలూ ఇవే. ఈ పంచ యజ్ఞాలపై ప్రజలకు అవగాహన, ఆసక్తి కలిగించడమే– ధర్మాచరణకు ప్రేరణ. ఆ ప్రేరణ కోసమే, ఉన్న విషయాలు చెప్పడం.

మనకు నచ్చినవి మాత్రమే సత్యాలు కావు. మనకు నచ్చకపోయినా, చేదుగా అనిపించినా సత్యాలు సత్యాలే. మీరు చెప్పినట్లు – సర్వేశ్వరుని సృష్టి స్థితి లయలో భాగాలే అవి. జీవి పుట్టుక, మరణాలే కాక అతడి నిరంతర ప్రయాణాలలో వివిధ శరీరాలు, వివిధ లోకాల వాసాలూ ఉన్నాయి. అది ఏ పురాణం, ఏ వేదభాగం, ఏ ఇతిహాసం తిరగవేసినా కనిపిస్తాయి. శ్రీరామాదులు, ధర్మరాజాదులు కూడా ఆ కర్మలు చేసినవాళ్లే. భీష్ముడంతటి కారణజన్మునికే కర్మ చేశాడు ధర్మ రాజు. అంటే భీష్మునికి ప్రేతత్వ ముక్తి కాదనా? అది ధర్మరాజుకి విధ్యుక్త ధర్మం కనుక. చనిపోయినవారికి పుత్రులు లేని పక్షంలో, వాటికీ ప్రత్యామ్నాయాలు చెప్పారు.

సాధారణంగా–దినకర్మలు పూర్తయ్యే వరకూ ప్రతి జీవుడూ ప్రేతంగానే ఉంటాడు. ఆ తరువాతనే ప్రేతత్వ విముక్తి. సరియైన కర్మలేనప్పుడు పిశాచత్వానికి 'అవకాశం' ఉంది. అయితే – ముఖ్య విషయమేమంటే చనిపోయిన వారందరూ పిశాచాలై పోరు, ఆ జీవికి సంస్కార బలం, యోగబలం–వీటి వల్ల అతడు పిశాచత్వం పొంద కుండా ఊర్ధ్వలోకాలకు వెళ్ళడమో, తరించడమో జరుగుతుంది. భక్తులూ, జీవ న్ముక్తులు, యోగులు అటువంటివారే. మరణించిన వారు ధన్యాత్ములై, పిశాచాలు కాకపోయినా, అతడి పుత్రులు మాత్రం తమ ఆచారపరంగా కర్మలు చేసి తీరాలి. ఈ కర్మలు మృతుడైన జీవుని ఊర్ధ్వ గమనాన్ని శీఘ్రతరం చేస్తాయి.

మృతులు ప్రేతత్వం పొందకుండా తరించినా, అతడి పుత్రుడు మాత్రం ఆ కర్మలు చేయకపోతే ఆ పుత్రులకే పితృ ఋణ విముక్తి ఉండదు. తిరిగి ప్రాయశ్చి త్తాదులు చేసుకుని, ఇతర కర్మలకి అర్హత పొందవచ్చు. అంతేకాక తరించిన దివ్యాత్మల ఆశీస్సులు, తమను స్మరించి శ్రద్ధగా కర్మచేసేవారలకు లభించి తీరతాయి. పితృ కర్మలు చేయని వారు ఇతర దేవ కర్మాదులకి అర్హత కోల్పోతారు.

సంప్రదాయం తెలిసిన ఆచార్యులు, పితృకర్మ చేయని వారింట భోజనం కూడా చేయరు. అందువల్ల పితృఋణ విముక్తికై 'అందరూ' ఆ కర్మలు చేయవలసినదే. ఇందులో ఏ విభేదాలూ లేవు.

కష్టపడి శ్రమిస్తే కాని ధనం సముపార్జించలేం – అన్నది లోకనీతి. కానీ ఏ కొద్ది మందో ఏ శ్రమా లేకుండా హఠాత్తుగా ధనికులవుతారు. అంతమాత్రాన లోకనీతిని మార్చలేం కదా! కష్టపడి, ధనసముపార్జనకు శ్రమించమనే ఉపదేశం చాలి కదా! అలాగే ఏ కొందరు యోగులకో ప్రేతత్వ విముక్తికి ఔర్ధ్వ దైహిక కర్మలు అవసరం లేకపోవచ్చు. అంతమాత్రాన దానిని సర్వ సాధారణం చేయలేం కదా! జీవుడి రాక పోకలు, అనేక లోకాల వాసాలు గురించి స్వానుభవంతో యోగ, ధ్యానాది సాధనాల ద్వారా దర్శించిన వాళ్ళు నేటికీ ఉన్నారు.

పరమహంస యోగానంద తన "ఒక యోగి ఆత్మకథ"లోనూ వీటి గురించి వివరించారు. అనీబిసెంట్ వంటి వారు పరిశోధించి రచించిన గ్రంథాలు ఉన్నాయి. అవన్నీ ఆందోళన కలిగించడానికి అనలేం కదా! స్థూల దృష్టితో ఇవన్నీ 'వ్యర్థం' అని అనవచ్చు. పరిశీలనాత్మక 'సూక్ష్మ' దృష్టికి వీటి సార్థక్యం గోచరిస్తుంది.

కొసమెరుపుగా ఒక మాట –

షాజహాన్‌ని అతని కుమారుడే బంధించాడు. అప్పుడు, యమునా తీరాన ఒక భారతీయుడు తన తల్లిదండ్రులకు కర్మకాండ జరుపుతుండడాన్ని దూరం నుంచి చూశాడు షాజహాన్. అక్కడేం జరుగుతోందో తెలుసుకొని, దుఃఖించాడు. 

'ఎన్నడో చనిపోయిన తల్లి దండ్రుల్ని గుర్తుతెచ్చుకుని, కర్మ చేస్తున్నాడతడు. బ్రతి కుండగానే తండ్రిని ఇలా బంధించాడు నా తనయుడు!' అని విచారించాట్ట!

ఆ దుఃస్థితి ఏ భారతీయుడికీ రాకూడదని ఆశిద్దాం.

ప్ర: **ఎంత పాపాత్ములకైనా చివరి క్షణంలో దైవపూజ, దైవనామ స్మరణ చేస్తే అతడికి మోక్షం లభిస్తుంది– అని అంటారు. అజామిళుడు, గుణనిధి, వంటివారి కథలుకూడా అందుకు సాక్ష్యాలుగా చెప్తారు. అంటే చివరిలో భగవంతుని స్మరిస్తే పాపాలన్నీ పోతాయి గనుక, 'ఇంక ఎన్నిపాపాలైనా చేసి, ఆఖర్న దైవస్మరణ చేద్దామనుకొంటే' చాలు కదా! ఏమిటి ఈ వైపరీత్యం? ఇది మరీ అన్యాయమే కదా!**

**జ:** ఈ 'చాలు కదా' అనే ఊహే వైపరీత్యం, అన్యాయం. అసలు ఆ కథలను పరిశీలించి చూస్తే ఈ సందేహమే కలగదు. చివరిలో భగవన్నామ స్మరణ చేసే వానికి మోక్షానికి కావలసిన అవకాశం లభిస్తుంది. అంతేకానీ, వెంటనే, నేరుగా మోక్షం కాదు. ప్రభావవంతమైన భగవత్స్మరణ కారణంగా తరువాతి జన్మలలో వివేకం ఏర్పడి, మరి పాపాచరణ జోలికి పోకుండా, క్రమంగా సత్కర్మాచరణతో ఉత్తమజ్ఞానాన్ని

సంపాదించి క్రమంగా కైవల్యం పొందుతాడు. ఆ జన్మలలో గతజన్మ పాపాలను కష్టాల రూపంలో అనుభవించక తప్పదు. లేదా– తపస్సుతో ఆ పాపాలను క్షయం చేసుకుంటాడు.

అజామిళుడి కథలో అది మరణం కాదు. మరణానికి ముందరి సంధి అవస్థ వంటిది. ఆ క్షణంలో– సూక్ష్మ ప్రపంచంలో జరిగిన యమదూతల, విష్ణుదూతల సంభాషణ సన్నివేశం అతడికి గోచరించింది.

ఎంతటి పాపాత్ముడికైనా, ఆఖరి నిముషంలో భగవన్నామం స్ఫురించడమనే యోగం లభించాలంటే ఏదో గొప్ప పుణ్య విశేషం అతడి ప్రారబ్ధంలో ఉండి ఉండాలి. అందుకే ఎన్ని పాపాలు చేసినా, వాటిని తొలగించుకొనే అవకాశం దొరికే పుణ్యం ఉండాలి. ఆ పుణ్యం అజామిళుడికి ఉంది. అందులోనూ, మొదట్లో అతడూ యోగ్యుడే. తరువాత పతితుడయ్యాడు.

చివరి అవస్థలో జరిగే మానసిక ఉద్రేకాలకు బలం ఎక్కువ. ఆ బలంతో కూడిన నామస్మరణ తప్పక ప్రభావం చూపుతుంది. ఆ ప్రభావంచేత అతడికి విష్ణు దూతల దర్శనం లభించింది. వారి సంభాషణని గ్రహించాక, తిరిగి అతడు యథాప్రకారం జీవితంలోనే ఉన్నాడు. వెంటనే మరణించలేదు.

సూక్ష్మప్రపంచ దర్శనం తరువాత అతడిలో మార్పు కలిగి మళ్ళీ శుద్ధుడై, భగవన్మయ చిత్తంతో సాధనచేసి మోక్షం పొందాడు.

ఆ విధంగా భగవన్నామస్మరణ అతనికి సహకరించింది.

అదే విధంగా గుణనిధి కథ. అతడు కూడా చివరి క్షణంలో శివరాత్రినాడు అనుకోకుండా చేసిన ఉపవాస, జాగరణల ఫలంగా, శివసన్నిధిని దీపం వెలిగించిన కారణంగా– తరువాత ఉత్తమ జన్మలు పొందాడు. నేరుగా, వెంటనే శివసన్నిధి రాలేదు. ఆ జన్మలలో గత జన్మల కర్మక్షయం జరిగి, అంత్యకాల శివపూజా ఫలంగా లభించిన పుణ్య సంస్కారంతో పాపాచరణ జోలికి పోకుండా– క్రమంగా చివరకు తపస్వియై శివసాక్షాత్కారాన్ని లభింపజేసుకున్నాడు.

ఇవి గమనించాలి. ఎంత పాపాత్మునికైనా భగవత్స్మరణ పాపనాశనానికి ఉపయోగిస్తుంది– అనేది మనకు లభించిన ఒక అభయం. ఒక భరోసా. మనం బాగుపడడానికి పరమాత్మ ఎప్పటికీ అవకాశాన్నిస్తాడు అని దాని అంతరార్థం. ఇది గ్రహించక, "ఎప్పుడో చివర్లో భగవంతుణ్ణి స్మరిస్తే సరి– అందుకే ఇప్పుడంతా పాపాలు చేద్దాం"

అనుకొనే వారికి, చివర్లో భగవత్ స్మరణ లభించదు.

పురాణ కథల పూర్వాపరాలను పరిశీలి స్తే, సమస్యలకు అక్కడే పరిష్కారం లభిస్తుంది. అయితే అందుకు తగిన శ్రద్ధ, వివేకం ఉండాలి.

ప్ర: ***కొన్ని దేవతల స్తోత్రాలలో, సహస్ర నామాలలో 'ఇంతకన్నా గొప్పదిలేదు', 'ఈదైవం కన్నా గొప్పవాడు లేడు' అని చెప్తారు. అటువంటప్పుడు ఏది గొప్ప? ఏస్తోత్రం చేయాలి? అనే సందేహం, సందిగ్ధం కలుగుతుంటాయి. ఇంతకీ ఏది గొప్పది?***

**జ:** ఏదైనా గొప్పదే. అగ్నిజ్వాలలో ఏ చిన్న రవ్వలోనైనా మొత్తం అగ్ని శక్తి ఉంటుంది. ఉపాసనాసంప్రదాయంలో– ఒకే పరబ్రహ్మను అభీష్ట దేవతా రూపంగా ఆరాధి స్తారు. అలా ఆరాధించేటప్పుడు ఆ దైవతమే సర్వశ్రేష్టమనే భావన ఉండాలి. అంతకుమించి పరం లేదని అనుకున్నపుడే శ్రద్ధ నిలుస్తుంది. ఆ శ్రద్ధ కలగడానికే పురాణకర్తలు, స్తోత్రకర్తలు అటువంటి వాక్యాలు చెబుతారు. అయితే ఆ శ్రద్ధతో పాటు, ఇతర దేవతలు కూడా తమ అభీష్ట దేవతయొక్క రూపాలేననే గౌరవ భావం, ఆదరభావం ఉండాలి. ఎవరి అభీష్టదేవతను వారు ఉపాసిస్తూనే, ఇతర దేవతలు తమ దేవతకు భిన్నులు కారని తెలిసిన వానికే ఉపాసన ఫలిస్తుంది.

ఒక్కొక్క దేవతోపాసన ఒక్కొక్క ప్రత్యేక ఫలితాన్నిస్తుంది. వారి వారి ప్రయోజనాల ననుసరించి ఆయా దేవతల్ని ఆరాధించాలి. అభీష్టంగా ఎవరినైనా ఉపాసించినా, వివిధ సందర్భాలలో ఇతర దేవతలనూ అర్చించాలి. భిన్న భిన్న దేవతలు– ఒకే శక్తి యొక్క విభిన్న స్వరూపాలు. దేవతాస్వరూపాల ఉపాసనల వెనుక ఎంతో లోతైన విజ్ఞానం ఉంది. ఒకవైపు మంత్రశాస్త్రం, మరోవైపు జ్యోతిష విజ్ఞానం వంటివి ఎన్నో విజ్ఞాన విషయాలున్నాయి.

ప్ర: ***భారతీయ సంస్కృతిపై అభిమాన మున్నవాడ్ని – అంటూనే ఒక మహాపండితుడు "రామాయణం కాల్పనిక కావ్యం. అందులోని బాలకాండ– ఉత్తరకాండ వాల్మీకి ప్రోక్తాలు కావు. వాస్తవంగా సీతారాములు వాల్మీకి మనసులో ఆవిర్భవించారు" అని వ్రాశారు. దానితో నా మనసు కలత పడింది. ఆయన గతంలో కమ్యూనిష్టుగా ఉన్న వ్యక్తి కూడా అని గమనించ కోరిక.***

**జ:** పూర్వ వాసనాబలంతో ఆయన అటువంటి మాటలు వ్రాసి ఉంటారు. పాశ్చాత్య భావనల కళ్లద్దాలతో ఆర్షవాఙ్మయాన్ని పరిశీలించి చెప్పేవారి మాటలివి. ముఖ్యంగా ఆ వాదం లేవదీసింది పాశ్చాత్యులు. వారికి ఋషిప్రోక్తమైన కావ్యాల సంప్రదాయం

తెలియదు. వారి గ్రంథాలను ఒంటబట్టించుకుని ఇటువంటి అభిప్రాయాలు ఏర్పరచు కొన్న మహా పండితులు ఎందరో ఉన్నారు. బాలకాండలో, ఉత్తరకాండలో స్పష్టంగా 'రాముడు విష్ణ్వతారమ'ని ఉంది. అది జీర్ణించుకోలేక పాశ్చాత్యులు 'అయోధ్యకాండ నుండే రామాయణం' అనే వాదనను లేవదీసారు.

కానీ సరిగ్గా ఒళ్ళు దగ్గర పెట్టుకు చదివితే- రాముడు విష్ణువని పలుచోట్ల వాల్మీకి ప్రస్తావించారు. అయోధ్య కాండలోనే

***'సహి దేవై రుదీర్ణస్య***
***రావణస్య వధార్థిభిః।***
***అర్థితో మానుషేలోకే***
***జజ్ఞే విష్ణుః సనాతనః॥'*** -'రావణ వధకోసమై దేవతలచేత అర్థింపబడి సనాతనుడైన విష్ణువు మనుషలోకంలో ఆవిర్భవించాడ'ని స్పష్టంగా ఉంది. ఇలాంటి భావాలు చాలాచోట్ల ధ్వనిప్రాయంగా ఉన్నాయి. తరతరాలుగా బాలకాండ నుండి రామా యణాన్ని ఆరాధిస్తూ వస్తున్న భారతీయులకు ఈ అశాస్త్రీయ అంశాలను పుట్టించి ప్రచారం చేయడంవల్ల ప్రయోజనం ఏమిటి? ఆసేతు హిమాచలం రామ కథను ఎలా ఆరాధిస్తోందో గమనించలేదో? పైగా 'బాలకాండ' లేనిదే రామజననం, సీతా రామకళ్యాణం వంటి ఘట్టాలు ఎలా చెప్పగలం?

రాముడు ఈ యుగం నాటివాడు కాదు. త్రేతాయుగం నాటి వాడు. అప్పుడు జరిగిన కథకు ఇప్పటివరకు సాక్ష్యం ఎవరుంటారు? కనుక జరగలేదని చెప్పడం భావ్యమా? సరే- అరణ్యకాండలోనే రామునికి వాల్మీకి ఆతిథ్యం ఇచ్చినట్లు ఉంది. అది కల్పిత కథే అయితే, ఈ విషయం వాల్మీకి వ్రాస్తాడా? వాల్మీకి ఏ సందర్భంలో వ్రాశారనేది బాలకాండలో స్పష్టంగా ఉంది. ఇప్పటికీ రాముని ఆనవాళ్ళు దేశంలో చాలా ఉన్నాయి. అంతేకాదు రామాయణ గాథకు తార్కాణాలు చాలా లభిస్తున్నాయి. అవన్నీ కల్పితాలనే మాటలకి చలించనవసరం లేదు. రామా యణాన్ని ఏడు కాండలతో సహా అనూ చానంగా పఠిస్తున్న జాతి మనది. ఇప్పుడీ పనికిమాలిన వాదాలు తీసి వీళ్ళు సాధించేది ఏమిటీ?

మీ సుదీర్ఘ లేఖలో పేర్కొన్న వ్యక్తి భారత భాగవతాలు కూడా రచించారన్నారు. మరి అందులో రాముడు విష్ణు అవతారమని స్పష్టంగా ఉంది.

మరి ఈ కల్పితం మాటేమిటి? ఈ విమర్శకులు రామాయణాన్ని ఒక కథగా,

వాల్మీకిని తమలాంటి రచయిత గా భావించారు. 'మహర్షి' అని గ్రహించలేకపోయారు. రామాయణం 24000 శ్లోకాల గ్రంథమని అందరికీ తెలుసు. బాలకాండ, ఉత్తర కాండలలో కలిపితేనే అది ఇరవై నాలుగు వేల శ్లోకాల గ్రంథం అవుతుంది. లేకపోతే అసమగ్రం అవుతుంది. అసలు బాలకాండను తీసేస్తే అయోధ్య కాండ ప్రథమ సర్గ ప్రారంభ శ్లోకం నుండే రామాయణం ప్రారంభమనుకొంటే– ఆ ప్రారంభం ఎంత అసంబద్ధంగా ఉంటుందో చిత్తగించండి.

*గచ్ఛతా మాతుల కులం*
*భరతేన తదానఘః*
*శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నో*
*నీతః ప్రీతి పురస్కృతః॥* –"భరతుడు తన మేనమామ ఇంటికి వెళుతూ పాపరహితుడూ, నిత్యశత్రు సంహారకుడైన శత్రుఘ్నుని కూడా ప్రీతితో తనవెంట తీసుకువెళ్ళాడు"

ఇదే రామాయణానికి ప్రారంభశ్లోకం అంటే ఎంత హాస్యాస్పదం! ఇంత పేలవంగా వాల్మీకి ఆ మహాకావ్యాన్ని ప్రారంభిస్తాడా? 'బాలకాండ' నుండి పరిశీలిస్తేనే– అద్భుత మైన ప్రారంభం కనిపిస్తుంది. బాలకాండకు కొనసాగింపుగానే అయోధ్య కాండ ప్రారంభమయ్యింది. సాహిత్యపరంగా గానీ, సంప్రదాయపరంగాగానీ ఏరకంగా చూసినా 'బాలకాండ'తోనే రామాయణం ప్రారంభం.



దేశవ్యాప్తంగా మహాపండితులంతా అలా అంగీకరించే రామాయణాన్ని వ్యాఖ్యానించారు. ఎన్నో రామాయణాలను రచించారు. అభారతీయ ధోరణులను జీర్ణించుకొని భారతీయ ఆర్ష సాహిత్యాన్ని మామూలు రచయితల నవలలవలె పరిశీలించేవారు భారతీయ సంస్కృతిని అభిమానించేవారనడం విచారకరం.

**ప్ర: *పూజలు, వ్రతాలు పాటించేటప్పుడు కొన్ని నియమాలు తప్పనిసరి అంటారు. అవి తప్పితే పాపం అనికూడా చెబుతుంటారు. అలా నియమాలు తప్పి పాపం తెచ్చుకొనే ప్రమాదమున్న ఆచారాలను పాటించడం కన్నా మానివేస్తేనే సుఖంగా ఉంటుంది కదా!***

**జ:** అన్నం తినేటప్పుడు కొన్ని తినకూడనివి, అపథ్యాలు, నియమాలు ఉంటాయి. అవి తప్పితే ఆరోగ్యానికి ప్రమాదకరం. అలా జాగ్రత్తలు తీసుకోకపోతే ప్రమాదమని అన్నం తినడమే మానేస్తామా? జాగ్రత్తలతో భోజనం చేస్తున్నాం కదా!

అలాగే మందులు వాడే వ్యాధిగ్రస్తుడు కొన్ని జాగ్రత్తలు తీసుకుంటూ మందులు వాడతాడు. ఆ జాగ్రత్తలకి భయపడి ఔషధాలు పుచ్చుకోకపోతే సుఖంగా ఉండ గలడా! అదే విధంగా దైవబలం పొందాలంటే కొన్ని నియమాలు పాటించవల సిందే! యోగాభ్యాసంతో ఆరోగ్యాన్ని బాగు చేసుకోవాలనుకొనేవాడికి కూడా నియ మాలుంటాయి కదా! నియమం లేనిదే ఏ పని కూడా ఫలవంతం కాదు.

ప్ర: ***కుండలినీ అనీ, షట్చక్రాలనీ- అంటుంటారు. నిజంగా అవి ఉన్నాయా? శరీరం లోపల అవి ఉంటే మరి కనిపించవేమిటి? ఇవన్నీ శాక్తేయంలో కల్పించిన భయంకర విధానాలని ఒకచోట చదివాను.***

జ: కుండలినీ శక్తి యోగాశాస్త్రానికి సంబంధించినది. షట్చక్రాలు భౌతికమైనవి కావు. సూక్ష్మమైనవి. ఈ సూక్ష్మమైన చక్రాలు మన వెన్నుదండాన్ని ఆధారం కొనిఉంటాయి. ఆధార స్థానంలో- మూలాధారం, దానికిపైన స్వాధిష్ఠానం, నాభివద్ద- మణిపూరం, హృదయ సమీపాన అనాహతం, కంఠం దగ్గర- విశుద్ధం, కనుబొమల నడుమ- ఆజ్ఞాచక్రం, బ్రహ్మరంధ్రం వద్ద- సహస్రారం. ఆయా చక్రాలను ఆయా స్థానాల్లో ధ్యానిస్తూ ప్రాణవాయువును నియంత్రిస్తూ సాధన చేస్తారు. అవి కంటికి కనబడవు. కానీ మన శరీరంలో ఆయా స్థానాలను పాలించే శక్తులివి. మన శరీరం, లోపలి భాగాలు కంటికి కనబడవచ్చు గానీ, శరీరమంతా ప్రసరించే ప్రాణశక్తి, చైతన్య శక్తి గోచరించదు కదా! అంత మాత్రాన ప్రాణం లేదనడం సబబు కాదు.



ఒక రాగితీగలో విద్యుత్తు ప్రసరిస్తుంటుంది. తీగని ఎంత ముక్కలు చేసినా విద్యుత్తు కనబడదు. అలాగే షట్చక్రాలు స్థూల నేత్రాలకు కనబడవు. భారతీయ మహర్షులు అద్భుత తప శ్శక్తితో సాధించిన గొప్ప విద్య- ఈ కుండలిని. అటువంటి దానిని మనమే అర్థం చేసుకోక 'భయంకర విధానం' అని తోసి పుచ్చితే మన సంపదను మనమే కోల్పోయినట్టు. అయితే విద్యుత్తు ఎంత ఉపయోగకరమో, అంత ప్రమాద కరం కూడా. దానిని వాడే పద్ధతులు ఉన్నట్లే కుండలినీ విద్యను సాధించే విధానాలు ఉన్నాయి. ఈ అద్భుతమైన విద్యను పాశ్చాత్య మేధావులు సైతం గ్రహించి, శోధించి, సాధిస్తున్నారు. అలాంటిది మనం గ్రహించక పోవడం హాస్యాస్పదం కాదా!

మరొక విషయం-భక్తి సాధనాలద్వారా ఏ దేవతను చక్కగా, సమగ్రంగా ఉపాసించినా మనలోని కుండలిని జాగృతమై షట్చక్రాలను చేరుకుంటుంది. ఆ భక్తునికి అది కుండలిని అని తెలియకపోవచ్చు. కానీ జరిగే సిద్ధి అదే.

ఉపాసన–యోగం–ధ్యానం...... అన్నీ కలిసే ఉంటాయి. ఏది చేసినా మిగిలిన రెండూ అందులోనే అంత ర్లీనమై ఉంటాయి.

ప్ర: ***స్వస్తిక్ చిహ్నం, ఓంకారం ఒకటేనా? గణపతికి, స్వస్తిక్ చిహ్నానికీ సంబంధం ఏమిటి?***

జ: మన దేశంలో శుభానికి సంకేతంగా ఈ(卐) స్వస్తిక్ చిహ్నాన్ని ఉపయోగిస్తారు. ఉత్తర భారతీయులు తమ వ్యాపారాది శుభారంభాలలో స్వస్తిక పద్మాన్ని రచించి, 'సిద్ధి', 'బుద్ధి' అని కూడా లిఖించడం కనబడుతుంది. ఇళ్ళల్లోనూ, వ్యాపార సంస్థ ల్లోనూ కూడా చూస్తుంటాం. అయితే గణపతి హోమాలు చేసేటప్పుడు, ముఖ్యంగా కేరళ వంటి దక్షిణ ప్రాంతాలలో, స్వస్తిక్ పద్మాన్ని లిఖించి రంగులు దిద్ది ఆ యంత్రం లో గణపతిని ఆవాహన చేసి అర్చిం చడం సంప్రదాయం.

తంత్రశాస్త్రాలలో ఓంకారానికి సంకేతంగా స్వస్తిక్ పద్మాన్ని వాడడం ఆచారం. ఇది అత్యంత ప్రాచీనమైన దనడంలో సందేహం లేదు, సింధులో య నాగరికతలో దొరికిన నాటి సం స్కృతికి చెందిన లిపిని చూస్తే 'ఓం' కారమే స్వస్తిక్ అని ఋజువౌతుంది.



ᒧ ఈ రేఖకు ఉచ్చారణ 'ఒ'.

ᒧᒧ ఈ రేఖలకు ఉచ్చారణ 'ఓ'.

\+ ఇది 'మ' కార చిహ్నం.

వాటిని కలిపితే ఓం= 卐 –స్వస్తిక్ చిహ్నంగా రూపొందింది.

అంతేకాక రేఖలలో దేవతాశక్తుల్ని ఆహ్వానించే పటిమ ఉంటుంది. అందుకే మంత్రాక్షరాలకు యంత్రరేఖలు ఆవాస స్థానాలు. అక్షరాలలోని దేవతాశక్తి యంత్ర రేఖల్లో నిబద్ధమై ఉంటుంది. అలాగే స్వస్తిక చిహ్నంలో ఓంకార స్వరూపుడైన గణపతి కొలువుంటాడు. కనుక ఇది గణపతి స్వరూపమే. "ప్రణవ స్వరూప వక్రతుండం" అని గణపతిని ఓంకార స్వరూపంగా వేదం వర్ణించింది. ఈ కారణంచేతనే హోమ ప్రక్రియలలో 'గణపతి' ని స్వస్తిక చిహ్నంతో ఆరా ధించడం, గణపతికి సంకేతంగా దీనిని చిత్రించి–'సిద్ధి', 'బుద్ధి', (ఋద్ధి) 'శుభ', 'లాభ' అంటూ వ్రాయడం. ఈ చిహ్నం ఇతర దేశ నాగరికతల్లో కూడా కనిపిస్తుంది. అయితే అత్యంత ప్రాచీనమైన మన విధానం నుండే వారికిది లభించిందనడంలో సందేహం లేదు.(ఆధారం: డా॥ పి. వీరభద్ర మహాదేవ్‌గారి "శ్రీ మహాగణపతి సపర్యా పద్ధతి")

**ప్ర: ఎంతో మంది వక్తలు తమ ఉపన్యాసాల్లో "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని మనుధర్మ శాస్త్రంలో ఉందని చెప్పడం విన్నాను. అలా మనువు నిర్దేశించాడని నమ్మడానికి మనసు ఒప్పడం లేదు. ఈ దేశంలో అనాదిగా స్త్రీకి గౌరవం ఉంది కదా! ఈ సందేహాన్ని నివృత్తి చేయండి.**

**జ:** ఇది మను ధర్మశాస్త్రంలోని వాక్య మే గానీ, దీని అర్థం, సందర్భం వేరు. 'స్వాతంత్ర్యం' అనే మాట నేటి వ్యవహారంలోని అర్థంలో గ్రహించరాదు. మనువు చెప్పిన ప్రకారం గృహానికి సామ్రాజ్ఞి స్త్రీ. పురుషుడి సర్వసంపదలకు 'అధికారిణి' ఆమె. అతడి ఆదాయ వ్యయాలకు ఆమెయే హక్కుదారు.

అయితే తన బ్రతుకు కోసం తాను ప్రయాసపడేలా చేయరాదని చెబుతూ– బాల్యంలో తండ్రి, యౌవనంలో భర్త, వృద్ధాప్యంలో తనయులు ఆమెయే రక్షణకు, భద్రతకు, గౌరవానికి బాధ్యత వహించాలనీ, అంతేగానీ తన ఉపాధి కోసం తాను స్వతంత్రించ వలసిన అసహాయత, ఒంటరితనం ఆమెకు రానీయరాదు... అని హెచ్చరిస్తూ చెప్పిన మాట ఇది. స్త్రీకి సమాజంలో ఉండవలసిన గౌరవ స్థానాన్ని పదిలపరచ వలసిన బాధ్యత మూడు దశలలో పురుషుడు స్వీకరించాలని పురుష జాతికి చేసిన బోధ అది.



**ప్ర: ప్రత్యవాయ దోషమంటే ఏమిటి? దానిని నివారించడం ఎలా?**

**జ:** ఏదైనా శాస్త్రోక్త కర్మ చేసేటప్పుడు దానికి విధించిన నియమాలను ఉల్లంఘిస్తే వచ్చే దోషానికి 'ప్రత్యవాయ దోషమ'ని పేరు. ఇవి అనేక రకాలు. ఆ దోషాలను బట్టి ప్రాయశ్చిత్తాలు ఉంటాయి. అందుకే ఏ కర్మ చేసినా వాటి నియమాలను బాగా తెలుసుకోవాలి. అంతేకాక– కర్మానంతరం భగవన్నామ స్మరణ ప్రత్యవాయ దోషాన్ని పోగొడుతుంది. మంత్ర జపాదులు చేసినప్పుడు కూడా గురూపదేశం, శుచిగా, ఒకే స్థలంలో ఆసీనుడై జపించడం వంటి నియమాలున్నాయి. వాటిని తప్పినా ప్రత్యవాయ దోషాలున్నాయి.

కానీ భగవన్నామ స్మరణకు నియమాలు లేవు. స్మరణను మధ్యలో ఆపి, ఎప్పుడు కొనసాగించినా ప్రత్యవాయ దోషం అంటదు.

**ప్ర: లక్ష్మీ అష్టోత్తర శతనామావళి'లో "భృగువారే శతం ధీమాన్" అని ఉంది. 'భృగువారే' అంటే ఏ వారమో తెలియజేయండి. నిరంతరం భగవంతుని స్మరించాలి అంటారు? కులదైవస్మరణ ముఖ్యమా? ఇష్టదైవమా?**

**జ:** 'భృగువారం' అంటే 'శుక్రవారం' అని అర్థం. నిరంతరం స్మరించవలసినది ఇష్ట దైవాన్నే. అయితే కులదైవాలను ఆయా సందర్భాలలో స్మరించి, ఆరాధించ వలసిన అవసరం ఉంది. అది బాధ్యత.

**ప్ర:** ***మహాభారతంలో అరణ్యపర్వం చదవకూడదని, చెప్పకూడదని ఒకాయన నాతో అన్నారు? అదే చదివితే ముందు, వెనక శాంతి జరపాలన్నారు. నిజమేనా?***

**జ:** 'అరణ్యపర్వం'తోసహా భారతమంతా చదవదగ్గదే. భారతంలో చదవకూడనిదీ, చెప్పకూడనిదీ ఏదీ లేదు. అంతా మనం చదివి బాగుపడాలనే మహర్షి వ్యాసదేవులు ఆ పంచమ వేదాన్ని నిర్మించారు.

ఆంధ్ర భారత నిర్మాణ సమయంలో నన్నయగారు 'అరణ్య పర్వం' సగంలో ఆపివేశారు. ఆ సమయంలో ఆయన దివంగతులయ్యారు. మిగిలిన భారతాన్ని తిక్కన, ఎఱ్ఱనలు పూర్తి చేశారు. ఇది మామూలుగా జరిగిన సంఘటన. ఇది తెలుగు భారత రచనలో జరిగిన ఒక చారిత్రక ఘట్టం. కాక తాళీయం. దీనికీ– భారతంలో 'అరణ్యపర్వం' చదవడానికీ సంబంధం లేదు.

ఏ శాస్త్రమూ 'అరణ్యపర్వం' చదవరాదని శాసించలేదు. పైగా– అరణ్య పర్వం అత్యంత ప్రాముఖ్యమున్న పర్వం. మహిమాన్వితమైన పర్వం. పాండవులు తపోబలాన్ని సంపాదించుకొని, విజయం సాధించడానికి ఉద్యమించిన పర్వమిది.

ఇందులో సూర్యోపాసన, శివోపాసన, నారాయణ మహిమ, యక్ష ప్రశ్నలు వంటి చక్కని అంశాలున్నాయి. కలిదోషాన్ని పోగొట్టే నలచరిత్ర, శ్రీరామకథ, సావిత్రి చరిత్ర వంటి అద్భుత ఘట్టాలు ఆ పర్వంలోనే ఉన్నాయి. చదివితే అన్ని దోషాలు తొలగించే మహిమగల ఘట్టాలివి.

ఇంత చక్కని పర్వాన్ని చదవకూడదనడం మూర్ఖత్వం. చదవరాదనడానికి ఏ శాస్త్రాధారమూ లేదు.

**ప్ర: శ్రీకృష్ణ పరమాత్మ గోపబాలకుడిగా ఉన్న 'వ్రేపల్లె' ఏ రాష్ట్రంలో ఉంది? ఆ ఊరు పేరు ఏమిటి?**

**జ:** 'వ్రేపల్లె' అని తెలుగులో అంటాం. 'వ్రేతలు' అంటే గొల్లవారు. వారుండే పల్లె 'వ్రేతలపల్లె'– దానినే 'వ్రేపల్లె' అంటారు. అది సంస్కృతంలో 'వ్రజభూమి'– గోకులం, బృందావనం ఆ పరిసర ప్రాంతాలు. ఇది ఉత్తరప్రదేశ్‌లో ఉంది. మధురకు సమీపంలో.

**ప్ర: జీవితమంతా భగవదారాధన చేస్తూ, స్మరణచేస్తూ మంచి పనులు చేస్తూ ఉండి, అవసాన దశలో పక్షవాతం, హృద్రోగం వంటి వ్యాధులకు లోనవడంవల్ల బాహ్య స్పృహ కోల్పోవడం జరుగుతుంది. అట్టివారు నామస్మరణ చేసేందుకు శరీరం, మనస్సు సహకరించని స్థితిలో వారి గతి ఏమిటి?**

జ: **"అన్తకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరం।**
**యః ప్రయాతి సమద్భావం యాతి నాన్యత్ర సంశయః॥** –చివరి దశలో భగవత్ స్మరణ చేస్తూ శరీరాన్ని విడిచిపెట్టేవారు భగవత్ భావాన్ని పొందుతారని శ్రీకృష్ణ వచనం. ఇది నిజమే. కానీ బాహ్యస్పృహలో లేనివారి విషయం వేరు. జీవితమంతా భగవ చ్చింతన చేసేవారు– స్పృహ ఉన్నంతవరకు చేస్తున్న కారణంగా వారికి తప్పక సద్గతి కలుగుతుంది. "స్పృహకు అంతము కలిగే వరకు" అనే అర్థాన్నే తీసుకోవాలి. "అన్తకాలే చ"– అనడంలో "అన్తకాల మునందు కూడా" అని అర్థం. నిత్యం స్మరించేవానికే అవసాన కాలంలో స్ఫురణకు వస్తుంది. నిత్యస్మరణం వల్ల భగవద్భావం వ్యక్తివ్యవస్థగా మారి పోతుంది. భావన భగవన్మయమైనవాడు, బాహ్యస్పృహ లేకున్నా సద్గతి పొందుతాడు. దీనిలో సందేహం లేదు.



**ప్ర: మన దేశంలో చాలా ప్రాంతాల్లో అనేక వింతలు అర్థరహితంగా ఉంటాయి. అయోధ్యకి వెళితే 'ఇక్కడే రాముడు ఆడుకున్నాడు' 'ఇది దశరథుని కోట', 'ఇది సీతమ్మ స్నానం చేసిన చోటు' అంటారు. బృందావనం వెళితే 'ఇక్కడే కృష్ణుడు ఆడుకున్నాడు', 'ఇక్కడే మద్ది చెట్లను కూల్చాడు' అంటారు. యుగాలనాటి అంశాలు ఇప్పటికీ ఉంటాయా? ఇవన్నీ నమ్మదగ్గవేనా?**

జ: రాముడు ఆడుకున్న స్థలం, సంచరించినచోటు, కృష్ణుని లీలలు జరిగిన చోట్లు– ఇది అయోధ్యలో, బృందావనంలో ఉన్నమాట వాస్తవమే కదా! రామాయణ, భాగవ తాల ఆధారంగా అయోధ్య రాముని నివాసం. బృందావనం కృష్ణనివాసం, ఇందులో సందేహం లేదు కదా! అయితే ఆ చోట్లలో ఆ కట్టడాలు యధాతథంగా ఇప్పటిదాకా ఉండవు అనడంలో సందేహంలేదు. కానీ భక్తి కలిగిన హృదయాలు ఆ లీలలను స్మరించే సంకేతాలుగా ఆ పవిత్ర ప్రాంతాలలోని స్థలాలను భావన చేయడంలో తప్పులేదు కదా! జరిగిందనడానికి ఆధారాలు ఎలా లేవో, జరగలేదనడానికీ ఆధారాలు లేవు. ఆ ప్రాంతాలలో ఎక్కడైనా ఆ లీలలు జరగవచ్చు.

యుగాలనాటి మహోన్నత స్వర్ణ మందిరాలు కాలగర్భంలో కలసినా, ఆ నేలపై, ఆ

గాలితరగలపై రామ, కృష్ణ భావనా వీచికలు నశించవు. ఆ అవతార పురుషుల దైవీ శక్తి ఆ పుణ్యక్షేత్రాలను వీడదు. అది భక్తుల, ఉపాసకుల హృదయాలను స్పర్శిస్తుంది. ఆ హృదయం కలవారికి అయోధ్యలో ప్రతి అణువూ రామనిలయమే. బృందావన మధురలలో ప్రతి కణమూ కృష్ణమందిరమే. నాటి లీలలను ఆ చోట్లలో ఎక్కడైనా భావన చేయవచ్చు. ఇందులో తప్పేమీ లేదు.

నమ్మే లక్షణం లేనివానికి ఎదురుగా భగవంతుడు సాక్షాత్కరించినా గుర్తించలేడు. వారు అయోధ్య, బృందావనాలకు వెళ్లినా, అక్కడ సత్యంగా ఉన్న నాటి చారిత్రక స్మృతినీ, దైవ విభూతినీ స్ఫురణలోనికి తెచ్చుకోలేరు.

ప్ర: **శివ అష్టోత్తరాలలో శివుని "విష్ణువల్లభా" అని ఉంది. దీని అర్థమేమి?**

జ: 'వల్లభ' అంటే "ప్రియమైనవాడు" అని అర్థం. "విష్ణువునకు ప్రియమైనవాడు" అని దీని భావం. శివకేశవులు ఏకతత్త్వం. ఏకహృదయం. ఒకరికొకరు పరస్పర స్నేహభావం కలిగిన సమన్వయాన్ని ఈ నామం చెబుతుంది.

ప్ర: **'అన్నపూర్ణాష్టకం'లో "నిర్ధూతాఖిల ఘోరపావనకరీ" అనే వాక్యం ఉంది. దీనికి అర్థం ఏమిటి?**



జ: అది అసలైన వాక్యం కాదు. "నిర్ధూతాఖిల ఘోరపాపనికరీ" అని వ్రాయాలి. సమస్తములైన ఘోరపాప సమూహాన్ని నశింపజేసే తల్లి అని ఈ వాక్యానికి అర్థం. అంతేకానీ 'పావన కరీ' అని వ్రాయడం తప్పు.ఇది అనర్థానికి కూడా హేతువౌతుంది. ఈ శ్లోకం పూర్తిపాఠం

*నిత్యానన్దకరీ వరాభయకరీ సౌన్దర్య రత్నాకరీ*
*నిర్ధూతాఖిలఘోరపాపనికరీ ప్రత్యక్ష మాహేశ్వరీ।*
*ప్రాలేయాచల వంశపావనకరీ కాశీపురాధీశ్వరీ*
*భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరి॥*

ప్ర: **కాకాసుర వృత్తాంతం తులసీ రామాయణంలో ఉంది! దీనికి ఆధారం వాల్మీకంలో ఉందా?ఇందులో ఔచిత్యం ఎంతమేరకు?**

జ: కాకాసురవృత్తాంతం (శ్రీరాముడు కాకిపై, బ్రహ్మాస్త్రాన్ని మంత్రించిన గరికపోచను ప్రయోగించిన ఘట్టం) వాల్మీకంలోనూ ఉంది. అయితే అది సుందరకాండలో సీతాదేవి హనుమంతునికి చెప్పిన ఘట్టంగా వాల్మీకంలో కనిపిస్తుంది.

ఇందులో అనౌచిత్యానికి అవకాశమే లేదు. శ్రీరామునికి ఉన్న అస్త్రశక్తి ఎంతటిదో

ఋజువుచేసే ఘట్టమిది. సీతను గాయపరచిన జయంతుడు (ఇంద్రుని పుత్రుడు శాపవశాత్తు కాకి అయ్యాడు) రామునిచేత పరాభూతుడైనట్లే, సీతను అపహరించిన రావణుడు నశిస్తాడనే ధైర్యంతో సీత చెప్పిన ఇతివృత్తమిది. తనకీ,రామునికీ ఉన్న అనుబంధం హనుమంతునితో చెప్పడం ద్వారా, ఒక ఆత్మీయతా భావాన్నీ వాత్సల్య భావాన్నీ ప్రదర్శించి హనుమంతునికి ఆశ్వాసన కలిగించింది సీతమ్మ. రాముడు గడ్డిపోచతోనే ఘనకార్యాలు చేయగలవాడు. అటువంటివాని సంకల్పం ప్రకారం రావణుడు తప్పక మరణిస్తాడు. కనుక రాముని ఉద్దేశం తెలియనిదే మనం తొందర పడరాదు అని కూడా హనుమంతునికి తెలియ జేయడం ఇందులో ఉద్దేశం. సీత మంచి రాజనీతిజ్ఞురాలు కూడా.

తాను స్వయంగా రావణుని శపించ గలిగినప్పటికీ, హనుమంతుడు రావణుని చంపగలిగినప్పటికీ అది రాముని వల్లనే జరగాలని గ్రహించింది. రాముడు సర్వ సమర్థుడనీ, ఆయన ఉద్దేశం ప్రకారం జరగాలనీ హనుమంతునికి సోదాహరణంగా చెప్పడమే ఈ కథను గుర్తుతెచ్చు కోవడంలోని అంతరార్థం. ఇది తనకు ఊరట – హనుమంతునికి అవగాహన. రాజనీతి, దేవకార్యం (అవతార పరమార్థం) రెండూ కలిసిన హృదయం సీతమ్మది.



**ప్ర: వాల్మీకి రామాయణాన్ని రామావతార పరిసమాప్తి తరువాత రచించారా? రచించిన కాలం ఏది?**

**జ:** శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన తరువాత కొంతకాలానికి, తపఃఫలంగా, పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీరామునితత్త్వాన్ని నారదుని ద్వారా విన్నాడు. అంటే అది ఉపదేశం. దానిని మననం చేయడంవల్ల, సిద్ధి కలిగింది. బ్రహ్మదేవుడు వర మిచ్చాడు. దానిని ఫలంగా అంత వరకు జరిగిన రామకథ, అటుపై జరిగిన రామకథ ఆయన మనో నేత్రానికి యథాతథంగా గోచరిం చింది. అదే "ఋష్యత్వం". మహర్షి వాల్మీకి ఆ దర్శనశక్తితో, దివ్యశబ్దాలతో కావ్య రచన చేశాడు. అదే రామాయణం. ఇదీ వాల్మీకి రామాయణ రచనా నేపథ్యం. ఈ విషయం వాల్మీకంలోనే స్పష్టంగా ఉంది.

**ప్ర: మనం ఆనవాయితీగా సత్య నారాయణవ్రతం చేసుకుంటుంటాం. కానీ ఈ మధ్య కొందరు, 'అన్నవర క్షేత్రం' కొన్ని వందల ఏళ్లనాటిది కనుక, ఈ వ్రతం కూడా ప్రాచీనం కాదనీ, అందుకు బదులుగా లక్ష్మీనారాయణ వ్రతాన్ని ఆచరించమని బోధిస్తున్నారు. ఇది ఎంతవరకు సముచితం? అంతేకాక సత్యనారాయణ వ్రతకథ**

**అంతా అసంగతంగా ఉందనీ, స్వామికి కోపం రావడమేమిటనీ ప్రశ్నిస్తున్నారు. సరియైన స్పష్టమైన వివరణనివ్వ ప్రార్థన.**

**జ:** అన్నవర క్షేత్రం కొన్ని వందల ఏళ్ళనాటిదే కావచ్చు. కానీ సత్యనారాయణ వ్రతం ఈ క్షేత్రంతో మొదలు కాలేదు. ఇది అత్యంత ప్రాచీనం, స్కాందపురాణ రేవాఖండంలో ఉంది. ప్రతి ఇంటా ఇది సంప్రదాయం. ఏ శుభకార్యం జరిగినా సత్యనారాయణ వ్రతం ఆచరించడం మన ఆనవాయితీ. ఇది దేశమంతటా ఉంది. దక్షిణాదిలోనే కాదు – ఉత్తరాదిలో కూడా ఇది ప్రసిద్ధి. ఇంత ప్రసిద్ధమైన స్వామి అన్నవర క్షేత్రంలో తరువాత వెలశారు. క్షేత్రానికి పూర్వమే స్వామి అర్చన ఉంది.

సత్యనారాయణస్వామికీ లక్ష్మీనారాయణునికీ భేదం లేదు. రమా(లక్ష్మీ) సహిత సత్యనారాయణుడు అంటేనే లక్ష్మీవిష్ణులు. సత్యమే నారాయణ స్వరూపం. 'సత్యం' అంటే త్రికాలాలలోనూ నశించని పరబ్రహ్మ. ఆ బ్రహ్మమే నారాయణుడు.

అందుకే పనికట్టుకొని ఈ పరంపరాగత వ్రతాన్ని కాదన్నా ప్రయోజనం లేదు. అతి సామాన్య జనులు కూడా స్వామిని ఆరాధించాలని పురాణాలు ఈ వ్రతాన్ని అందించాయి. 'లక్ష్మీనారాయణ వ్రతం' అని 'క్రొత్త'గా ప్రవేశపెట్టవలసిన పని లేదు. పురాణమహర్షి తపోదృష్టితో ఈ వ్రతాన్ని (సత్య నారాయణ వ్రతాన్ని) కలియుగ మానవులకోసం ఆవిష్కరించారు. అనాదిగా మన ప్రాంతాలలో సత్య నారాయణ నామం కలిగినవారు ఎందరో సత్యబాబు, సత్యరాజు, సత్యం, సత్తిబాబు, సత్తిపండు... అనే పేర్లతో ఉన్నారు. ఇలా పల్లెపల్లెల్లో ప్రతిష్ఠితమైన ఈ సంప్రదాయాన్ని నిరసించడం నిష్ప్రయోజనం–ఒకవిధంగా సంప్రదాయం పట్ల ద్రోహమే. ఉత్తరాదిలో 'సత్యనారాయణు'నికి హారతులు హిందీభాషలో గానం చేస్తుంటారు. అక్కడ ఈ వ్రతం చాలా ప్రముఖంగా ఆచరిస్తున్నారు.



ఇప్పుడు మనం గమనించవలసినది ఈ వ్రతాన్ని కాదనడంలో ఆ 'కొందరి' ఉద్దేశం ఏమిటనేది? సత్యనారాయణ వ్రతం సర్వదేవతా సమన్వయాన్ని సూచించేది. ఆ సమన్వయాన్ని అంగీకరించలేక, ఇతర దేవతా ద్వేషం కలిగిన వారు కేవలం లక్ష్మీ నారాయణుల్ని ఆరాధించాలని ఈ పథకం వేశారు.

కానీ సత్యనారాయణ వ్రతం వైదిక పరంపరను అనుసరిస్తోంది. సకల జగత్కారణమైన సచ్చిదానందపరబ్రహ్మగా అభీష్టదేవతను ఆరాధిస్తూ, ఇతర దేవతలు కూడా ఆ ఇష్టదేవతకు భిన్నులు (వేరు)కారని భావించి అర్చించడం సనాతన వైదిక పరంపర.

అలా ఆ పరబ్రహ్మను లక్ష్మీనారాయణ స్వరూపంగా భావిస్తూ, ఆయన కేంద్రంగా ఈ విశ్వచక్రం నిర్వహించబడుతోందని ఆరాధించే వ్రత విశేషం ఈ సత్యనారాయణ వ్రతం. సర్వదేవతలూ ఆయన శక్తి విశేషాలే.

సూర్యుని కిరణాలకూ, సూర్యునికీ భేదం లేనట్లే – పరబ్రహ్మ, సృష్టి స్థితి లయాది విశ్వ వ్యవహారాలకై దాల్చిన పలు రూపాలు (దేవతలు) ఆయనకు భిన్నాలు కావు. అన్నీ ఆయన శక్తి విశేషాలే కనుక వాటిని నమస్కరించాలి.

ఆ పరబ్రహ్మయే త్రిమూర్తులుగా, అష్ట దిక్పాలకులుగా, నవగ్రహాలుగా, వాటి అధి దేవతా ప్రత్యధిదేవతా స్వరూపాలుగా వ్యక్తమై ఈ విశ్వనిర్వహణ చేస్తున్నాడు. ఈ విశ్వచక్ర విజ్ఞానమంతా ఈ సత్యనారాయణ వ్రతంలో నిక్షిప్తం చేశారు.

తద్వారా మన సనాతన ధర్మ స్వరూపం, వైదిక విశ్వవిజ్ఞానం సామాన్యునికి కూడా అవగతం కావాలని పెద్దల ఉద్దేశం. మనం ఒక్కసారి ఈ వ్రతాన్ని గమనించితే, పురాణకర్త అయిన వేదవ్యాసుడు అతి సామాన్యునికి కూడా మన దేవతా విజ్ఞానాన్ని, ప్రపంచ స్వరూపాన్ని అవగాహనలోకి అందించడంలో ఎంతటి చక్కని విధానాన్ని కల్పించాడో అర్థమౌతుంది.



సత్యనారాయణ వ్రతంలో 'మండపారాధన' చాలా విశిష్టం. మధ్యలో 'కలశ' స్థాపన. ఇది మన అచ్చమైన సంప్రదాయం. పాత్ర, జలం, పల్లవాలు, పూర్ణకలశం దేవతా విష్కరణకు, పంచభూతమయప్రకృతికి కేంద్రంగా ఉన్న పరమాత్మశక్తికి సంకేతం. కేంద్రం నుంచి విస్తరించిన శక్తి వృత్తంగా (చక్రంగా) మారుతుంది. అలాగే పరబ్రహ్మ శక్తి విశ్వచక్రంగా విస్తరించింది. ఆ శక్తి శక్తులుగా బహువిధాలయ్యింది. ఆ శక్తులే దిక్పాలక, గ్రహాది శక్తులుగా మనల్ని నడుపుతున్నాయి. విశ్వాన్ని నడిపే ఈ దేవతల వల్లనే మన జీవితచక్రం ప్రభావితమౌతోంది. వారందరినీ విడిగా చూడడం కాకుండా, ఏక పరతత్త్వము యొక్క అభివ్యక్తులుగా (Manifestations) దర్శించాలని మహర్షి ఉద్దేశం.

పరతత్త్వాన్ని 'సత్య నారాయణు'నిగా (నారాయణ పరంబ్రహ్మ–తత్త్వం నారాయణః పరః) ప్రతిష్ఠిస్తారు. కలశరూపంలో, ఒక తుండు గుడ్డపరచి, దానిపై మంగళకర మైన బియ్యం, తమలపాకులు, పసుపు కుంకుమలు ఏర్పరచి విశ్వచక్రభావనని మన ముందు ప్రదర్శించే అద్భుత విజ్ఞాన ప్రక్రియ ఇది. దీని ద్వారా భావింపబడిన గ్రహదేవతలు, దిగ్దేవతలు వ్రతాచరణ చేసిన వారిని అనుగ్రహిస్తారు.

ఇక కథా విషయానికి వస్తే –

ప్రపంచమంతా మేధావులే ఉండరు. సామాన్య జనులలో శ్రద్ధను పుట్టించడానికే కథ. అంతేకాక కథా సన్నివేశాలలో మనకు తెలియని యజ్ఞసంకేతాలు చాలా ఉన్నాయి. నోముల కథల్లో కూడా యజ్ఞరహస్యాలుంటాయి. ఈ యుగంలో యజ్ఞాచరణకు కావలసిన దేశకాల పరిస్థితులు లేవుకనుక, సులభంగా యజ్ఞ ఫలం రావడానికి, సాధారణ మానవులు కూడా దేవతానుగ్రహం పొందడానికి పురాణాలలో ఆ సంకేతాలను నిక్షిప్తం చేశారు. పురాణ కథలు కొన్ని యథాతథాలు. కొన్ని సంకేతాలు, కొన్ని గుణపాఠాల కోసం కల్పించిన ఉదాహరణలు. వాటి తేడాలను వివేకంతో, విచక్షణతో, పూర్వ పర సంబంధజ్ఞానంతో గమనించి సమన్వయించడం బదులు ఎవరికివారు మన పరంపరలను తొలగించుతూపోతే ఇంక మనకేం మిగులుతుంది!

'పురాణంలో ఉంది' అంటే 'అది ప్రక్షిప్తం, ప్రమాణం కాదు' అని తోసిపుచ్చితే, మనం సమన్వయం చేయలేనివన్నీ ప్రక్షిప్తాలంటే మనవంటూ ఏమి మిగలవు. రామాయణాదుల్నే కల్పనలనే నాస్తికులకీ, వీళ్లకీ తేడా ఉందా? కేవలం ఇతర దేవతలతో అభేద భావం, సమన్వయాలే – ఇలా ఈ వ్రతాన్ని కాదన్నవారి అభ్యంతరాలు. ఈ కథలో నాలుగువర్ణాల వారూ ఉన్నారు. అందులో శ్రద్ధాలోపం ఉంటే భగవంతుడు క్షమించడన్నది గుణపాఠం. 'సత్యం' నారాయణ స్వరూపం, సంకల్పించుకున్న దానికి 'నిబద్ధత' (కమిట్‌మెంట్) ఉండాలి. దైవానుగ్రహం కోసం ఒక సంకల్పం చేసుకున్నాక, దానిని ఆచరించకపోతే సృష్టిలో నున్న విశ్వనియమం ప్రకారం విపరీత ఫలితాలు ఏర్పడడం సహజం. అది సత్యానికి ఏర్పడిన విఘాతానికి ఫలం, అదే స్వామి కోపంగా ప్రతీకగా చెప్పారు. ఇది ఏ వ్రతంలోనైనా తప్పదు. మొక్కు తీర్చకపోతే శిక్షించేది ఆ దేవుడుకాదు – మనం నిర్లక్ష్యం చేసిన 'సత్యం' లోని శక్తి మనల్ని శిక్షిస్తుంది. ఆ సత్యమే భగవత్ స్వరూపం.

ఆ విధమైన అవగాహనతో అంతరార్థాన్ని చెప్పి వ్రతాచరణలో శ్రద్ధ కలిగించడమే పండితులు, సంప్రదాయజ్ఞులు చేయవలసిన పని. దానికి విరుద్ధంగా, మన పరంపరను మనమే హేళన చేయడం సమంజసమా!

అట్టడుగువర్గాల వారు వ్రతం ఆచరించి ఇచ్చిన ప్రసాదాన్ని నిర్లక్ష్య పరచిన మహారాజు కూడా – భగవదాగ్రహానికి గురయ్యాడనడంలో... "భగవంతుడు సర్వసముడనీ,

ఇతరుల్ని తక్కువ దృష్టితో చూడరాద”నీ అతి మామూలు వాని మనసులో సైతం నాటుకోవాలని ఆ కథ ఉద్దేశం, ఇది స్పష్టంగా కనిపిస్తుంది.

కాస్త వివేకాన్ని వినియోగిస్తే అవగతమయ్యే విషయాల్ని సైతం మనకు అందనివ్వకుండా–పరంపరలను విమర్శించడం తగదు. ఇది క్రమంగా విద్వేషాలకు హేతువౌతుంది.

**ప్ర: ‘విదురనీతి’ అని వింటూ ఉంటాం. అది ఎక్కడ ఉంది? అందులో విషయాలేమిటి?**

**జ:** ‘విదురనీతి’ మహాభారతంలో చెప్పబడిన అంశం, ‘ఉద్యోగపర్వం’లో ఎనిమిది అధ్యాయాల విషయమిది. విదురుడు ధృతరాష్ట్రునకు బోధించిన రాజనీతి, లోక ధర్మాలు,శాస్త్రవిషయాలు ఇందులో ఉంటాయి. మన ప్రాచీన మహాత్ముల అద్భుత విజ్ఞానానికి ఇదొక మచ్చుతునక.

చిన్నచిన్న మాటలతో ధర్మసూక్ష్మాలను మహానుభావుడైన విదురుడు వివరించాడు.

**ప్ర: తపోరక్షణకు శ్రీరాముని పంపమనగానే, దశరథుడు నిరాకరించినందుకు విశ్వామిత్రుడు శపించబోవడం, ఋషులు కూడా కోపతాపాలకు గురికావడం సమంజసమా? వసిష్ఠుడే వచ్చి తనను బ్రహ్మర్షిని అని అంగీకరించాలని షరతుపెట్టడం అహంకార సూచనకాదా?**



**జ:** రామాయణాన్ని సరిగ్గా పరిశీలించి చూస్తే విశ్వామిత్రుడు అర్థమవుతాడు. శ్రీరాముని కోసం విశ్వామిత్రుడు అయోధ్యకు వచ్చేనాటికే అతడు బ్రహ్మర్షి. ఏనాడో వసిష్ఠునితో స్పర్ధ వహించి బ్రహ్మర్షిత్వం కోసం దీక్ష వహించిన విశ్వామిత్రుడు మొదట కామవిషయంలో మేనక వలన ఓడిపోయాడు. తరువాత కామాన్ని జయించి తపోదీక్షకు కూర్చున్నాక, రంభరాకతో కోపించి శపించాడు. అలా కోపం వద్ద ఓడిపోయాడు. కానీ అటు తరువాత కోపాన్ని కూడా జయించాడు. అటుపై క్రమంగా మద మాత్సర్యాలను కూడా ఓడించి ఇంద్రియనిగ్రహ సంపన్నుడై ఋషిగా, రాజర్షిగా సఫలుడై క్రమంగా అకుంఠిత దీక్షతో బ్రహ్మను సాక్షాత్కరింపజేసుకున్నాడు.

“నువ్వు బ్రహ్మర్షివి” అని బ్రహ్మ ఆమోదించాడు. కానీ వసిష్ఠుని పట్ల గౌరవంతో, ఆ మహాత్ముని అంగీకారమే తనకు శిరోధార్యమని భావించి వసిష్ఠుని ఆమోదాన్ని అర్థించాడు విశ్వామిత్రుడు. ఇది అహంకార సూచనకాదు. వినయానికి సంకేతం. కామక్రోధాది వికారాలని జయించి, అనంతాకాశంలోని వేదమంత్రరాశిని తపోదృష్టి ద్వారా దర్శించిన వారిని “బ్రహ్మర్షి” అంటారు. అది కేవలం ఒక గుర్తింపు కార్డు వంటి

బిరుదుకాదు. అది తపస్సు ద్వారా సాధించిన ఉన్నత స్థితి.

బ్రహ్మర్షి, క్రోధాది దుర్గుణాలకు అతీతుడు. విశ్వామిత్రుడు రాముని వద్దకు వచ్చేనాటికి బ్రహ్మర్షిగా ఎదిగినాడు కనుక, ఆయన శపించడానికి సిద్ధపడలేదు.

ఋషి, రాజర్షి, బ్రహ్మర్షి, ముని, తపస్వి ఇవన్నీ పర్యాయపదాలు కావు. వేటిస్థితి వాటికి ఉంది. విశ్వామిత్రుని వంటి బ్రహ్మర్షులు లోకకల్యాణార్థం ఎవరినైనా వాగగ్నితో శిక్షించదలచుకుంటే శపిస్తారు. అది శిక్షారూప అనుగ్రహం. కోపంతో తిట్టడం కాదు. కానీ యజ్ఞదీక్షలో శపించడం తపస్సును నశింపజేస్తుంది. అందుకే యజ్ఞ భంగకారులైన రాక్షసుల్ని శపించకుండా, విశ్వామిత్రుడు రాముని ద్వారా రాక్షస నాశనానికి సంకల్పించారు.

దశరథుడుని శపించబోయినట్లు రామాయణంలో లేదు. ఆ బ్రహ్మర్షి గొప్పదనం తెలిసిన వసిష్ఠుడే దశరథుని అంగీకరింపజేశాడు.

అన్నిటికీ మించి, పరమాత్ముని సంకల్పాన్ని గ్రహించి దానిని అమలుపరచేవారే మహర్షులు. నారాయణుని అవతారమైన శ్రీరాముని అసలు తత్త్వం తెలిసిన వాడు కనుక, నారాయణ సంకల్పానుగుణంగా వచ్చి యాగరక్షణ మిషతో, సీతాకల్యాణం జరిపించి అవతార ప్రయోజనాన్ని నెరవేర్చడంలో ప్రధాన పాత్రధారిగా వ్యవహరించాడు విశ్వామిత్రుడు. మన ప్రాచీన గ్రంథాలను పరిశీలించేటప్పుడు ఋషి, దేవత, మనిషి వీటి తత్త్వాలు, తీరులు గ్రహించి గమనించాలి. ఒక్కొక్కరిదీ ఒక్కొక్క స్థితి. ఆ స్థితికి అనుగుణంగా వారు ప్రవర్తిస్తారు. వారి వ్యవహార సరళిని మన స్థాయిలో దర్శించి, వ్యాఖ్యానించకూడదు.

**ప్ర: శివపార్వతులు నిరంతరం 'శ్రీరామ' నామ మంత్రాన్ని జపించారని అంటుంటారు కదా! వారు నిజానికి అత్యంత ప్రాచీనులు. త్రేతాయుగంనాటి వాడు శ్రీరాముడు. మరి శివుడు రామజపం సదా జపిస్తుంటాడనడంలో ఔచిత్యం ఉందా?**

**జ:** మనకు ఒక సంఘటన జరిగిన తరువాతనే తెలుస్తుంది. అందుకే శ్రీరాముడు అవతరించాక మనం శ్రీరాముని స్మరిస్తున్నాం. శివుడు పరమేశ్వరుడు. అనంత కాల స్వరూపుడు. ఆయన జరిగిన రామకథనే కాదు, జరగనున్న రామకథను సైతం తెలిసినవాడు. అందుకే జరగకముందే రామనామాన్ని జపించగలడు.

మరొక విషయం రాముడు అవతరించక ముందే రామనామం ఉంది. రామమంత్రం, ఉపాస్యరామమూర్తి ఉన్నాయి. అది పరమాత్మకు సంబంధించిన పేరు. ఆ పర

మాత్మయే అవతరించినప్పుడు, ఆ పేరుతో కీర్తించబడ్డాడు. రాముడు శాశ్వతుడు. రామనామం శాశ్వతం. ఆయన విష్ణువు. ఆ విష్ణువే శివహృదయం. అందుకే శివుడు రామనామ రసికుడు.

ప్ర: **ఇటీవల ఒక ఆధ్యాత్మిక పత్రికవారు 'అర్జునుడు శివుని ఉపాసించి, పాశుపతాస్త్రాన్ని పొందాడు. కృష్ణుడు తానే పరమాత్మయై కూడా శివుని పూజించమని ఎందుకు చెప్పాడు?" అనే ప్రశ్నకు సమాధానంగా, "యుద్ధం క్షుద్రవిద్య కనుక, క్షుద్ర దైవాన్ని ఆరాధించాలని శివుని పూజించమన్నాడు కృష్ణుడు" అని వివరించాడు. ఇది చదివి చాలా బాధపడ్డాను. ఇది నిజమేనా?**

**జ:** ఇది శివద్వేషంతో కూడిన అవైదికులిచ్చిన సమాధానం. యుద్ధంలో విజయాన్ని శ్రీకృష్ణుడు ఇవ్వలేడా? పాశుపతాస్త్రం శివుని వద్ద ఉంటే, వైష్ణవాస్త్రం విష్ణునిది. ఇరువురూ యుద్ధ విద్యాస్వరూపులు. సర్వాభీష్ట ప్రదాయకులు.

శ్రీకృష్ణుడు అవతార లక్షణంలో భాగంగా 'యద్యదాచరతి శ్రేష్ఠః' అన్నట్లు తనకు అవ సరం లేకున్నా, తాను చేయగలిగినా ధర్మాలు ఆచరించాడు. ఆచరింపజేశాడు. తాను సర్వవిద్యలకు మూలకారకుడైనా సాందీపని వద్ద విద్యలను అభ్యసించాడు. లోకానికి గురుశిష్య ధర్మాన్ని బోధించడానికి తాను ఆచరించిన ధర్మమిది.



అలాగే ఈశ్వరోపాసన మనిషికి అవశ్యకర్తవ్యమని తెలుపడానికి తానే స్వయంగా ఉపాసించాడు. ఇతరులచే ఆచరింపజేశాడు. దేవదేవుడైన శ్రీకృష్ణుడే శివస్వరూ పుడు. "శివరూపాయ విష్ణవే" అన్నది వేదమంత్రం. అందుకే తన హృదయాన్ని తాను ఆరాధించాడు. పుత్రార్థియై శ్రీకృష్ణుడు స్వయంగా శివుని ఉపాసించినట్లు మహాభారతం చెబుతోంది. నిరంతరం కృష్ణుడు శివలింగారాధన చేసినట్లు భారతంలోని ద్రోణ పర్వమే ప్రమాణం. రుక్మిణీదేవి కూడా పార్వతీ పరమేశ్వరులను పూజించి, "నమ్మితి నా మనమ్మున సనాతనులైన ఉమామహేశులన్" అని కీర్తించి హరిని భర్తగా పొంది నది. సంతానం పొందడం, వివాహం వంటివి కూడా క్షుద్ర విద్యలేనంటారా? సర్వ మంత్ర స్వరూపుడు, ప్రణవాకారుడు రుద్రుడు మంత్రమయమైన అస్త్రవిద్యను సైతం అనుగ్రహిస్తాడు.

శ్రీకృష్ణుడు సూర్యోపాసన, దేవీఉపాసన, శివోపాసన ఇలా అన్ని వైదిక ధర్మాలను సముద్ధరించిన జగద్గురువు. సమన్వయమే కృష్ణమతం.

శివకేశవులు సర్వైశ్వర్యప్రదాయకులు. వివేకరహితులై శివనిందను చేసేవారు శ్రీకృష్ణుని ఆగ్రహానికి గురౌతారని శాస్త్రాలే చెబుతున్నాయి.

**ప్ర: మా ఇంట్లో బోర్‌వెల్ సదుపాయంగానీ, నుయ్యిగానీ లేదు. మున్సిపల్ పంపుల మీదనే ఆధారపడవలసి వస్తోంది. ఆ నీరునే పట్టి సంపులలో దాచుకోవాలి. మరి పూజలకి నీళ్లు వాడుకోవాల్సినప్పుడు, శుచిగాఎలా సాధ్యం? నిత్యకర్మలు చేయడం ఎలా కుదురుతుంది?**

**జ:** మనకి దొరికే నీటినే పూజలకు వినియోగించుకోవాలి. 'సాధ్యమైనంత వరకు' శక్తివంచన లేకుండా నియమాలను పాటించాలి. సాధ్యం కానిది ఎలాగూ చేయలేం. సాధ్యమైన మేరకు శుచిగల జలాన్ని సేకరించి, ఆ దొరికిన దానిలోనే 'గంగ, యమునా, గోదావరి' లాంటి పుణ్యనదుల్ని భావనచేసి, ఇష్టదేవతా స్మరణ చేసి వినియోగించాలి. అంతేగానీ నిత్యకర్మానుష్ఠానం మానరాదు.

**ప్ర: దేవతా పూజలు జరిగే యింట కుక్కలుండరాదని కొందరు ఛాందసులంటారు. అది తప్పుకదా! అలా ఒక జంతువును అవమానించడం తగునా? 'విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని। శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః' అని గీతలో చెప్పారు కదా! (విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని, గోవునూ, ఏనుగునూ, కుక్కను, కుక్కను వండితినే వానిని పండితులు సమదృష్టితో చూస్తారు)?**



**జ:** అవమానించడం, ద్వేషించడం ఎప్పుడూ తగని పని. దేనినీ అవమానించరాదు. "నమశ్శ్వభ్యశ్చ"... (కుక్కలకు నమస్కారం) అన్న వైదిక సంస్కృతి మనది. ప్రతి దానిలోనూ పరమేశ్వర చైతన్య మున్నదన్న స్పృహ మనకి ఉండాలి.

అయితే ఏ ఉపాధి మర్యాద దానికి ఉండాలి. ఆ మర్యాదలతో ప్రతివారినీ గౌర వించాలి. విధినిషేధాలు సూక్ష్మ విజ్ఞానంతో వైదిక సంస్కృతి ఏర్పరచినదే. నీటి లోనూ, నిప్పులోనూ ఉన్నది ఒకే పరమేశ్వర విభూతియే. కానీ నీటి వాడకంలోనూ, నిప్పు వాడకంలోనూ దేని స్థానం, దేని పద్ధతి దానిదేకదా! అది భౌతికంగా స్పష్టమే. అలాగే సూక్ష్మప్రపంచంలో ఉన్న రహస్యాలను పరిశీలిస్తే ఈ మర్యాదలకూ, ఆచా రాలకూ అర్థం అవగతమవుతుంది.

జీవుల ఉపాధులు ప్రకృతిలోని వివిధ శక్తుల్ని అందుకుంటాయి. కొన్ని జంతువులు, కొన్ని వృక్షాలు దైవీ శక్తుల్ని ఆకర్షించి, తిరిగి బయటకి ప్రసరించగలుగుతాయి. కొన్ని విపరీత శక్తుల్ని వెదజల్లుతాయి. విద్యుత్తును కొన్ని ధాతువులు అందుకోగలవు – కొన్ని ప్రసరించగలవు. కొన్ని గ్రహించలేవు. వాటి ధర్మం వాటిదే. పువ్వూ అవసరమే – ముల్లూ అవసరమే. కానీ వాటి వాడకాలు వేరు.

మీరు గీతలో శ్లోకాన్ని ఉటంకించారు. దానిని పరిశీలిస్తే మీకే అర్థం అవుతుంది. గోవు–ఏనుగు–శునకం... మూడింటిలోనూ భగవత్ శక్తి అంతర్యామిగా ఉంది. అందుకే మూడింటినీ హింసించరాదు. అది అంతర్యామి దృష్ట్యా సమత్వం. కానీ గోవు పట్ల ప్రేమనీ, శునకం పట్ల ప్రేమనీ ఒకేలా వ్యక్తం చేయలేంకదా. ఏనుగుకు పెట్టే తిండి శునకానికీ, శునకానికి పెట్టే తిండి ఏనుగుకీ పెట్టలేం. అలాగే రెండింటికీ ఒకేలాంటి ఆశ్రయాన్ని (శాలని) ఏర్పరచలేం. దేని ఉపాధికి తగ్గ మర్యాద దానికి ఇస్తూ మన ప్రేమను వ్యక్తం చేస్తాం. అలా ఉపాధికి తగిన విధంగా స్థానాన్నిచ్చి, లోపలి అంతర్యామిని దర్శించాలి.

గోవు దేవతా శక్తుల్ని ఆకర్షించగలదు. శునకాన్ని రక్షణకోసం, లాలన కోసం పెంచినా, ఇంట్లో తిరుగకుండా బయట వేరే ఆశ్రయాన్ని ఏర్పరచాలి. ఎక్కువగా స్పర్శ, వెంట అంటిపెట్టుకొని ఉండడాలు కూడదు.

ఆశ్రయించిన శునకాన్ని సైతం ఆదరించాలి. కానీ హద్దులు తెలుసుకోవాలి. ఈ 'గీత' ఏ భారతంలోనిదో, అదే భారతంలోని అనుశాసనిక పర్వంలోని ఈ శ్లోకాలను గమనించండి.



**భిన్న భాండంచ ఖట్వాంచ**
**కుక్కుటం శునకం తథా ।**
**అప్రశస్తాని సర్వాణి యశ్చ**
**వృక్షో గృహేరుహః ॥**
**భిన్నభాండే కలిం ప్రాహుః**
**ఖట్వాయాం తు ధనక్షయః ।**
**కుక్కుటే శునకే చైవ**
**హవిర్నాశ్నంతి దేవతాః ॥**
**వృక్షమూలే ధ్రువం సత్త్వం**
**తస్మాత్ వృక్షం న రోపయేత్ ॥**

పగిలిన పాత్ర, విరిగిన మంచం, కోడి, కుక్క, రావి మొదలైన మహావృక్షాలు ఇంటిలో ఉండడం మంచిది కాదు. పగిలిన పాత్రలో కలి ఉంటాడు. విరిగిన మంచం వల్ల ధనహాని. కోడి, కుక్క, వరాహం, పిల్లి ఉన్న ఇళ్లల్లో దేవతలు హవిస్సులను (పూజలను, నివేదనలను) స్వీకరించరు.

నిత్యం దేవతారాధన సాగే ఇళ్లల్లోనే ఈ నియమం. మహావృక్షాల వల్ల పాములు, తేళ్లు వంటి విష జంతువులు చేరే ప్రమాదముంది.

గోమూత్రం, గోమయం వంటివి ఆరోగ్యకరం, కానీ కుక్క మలినాలకు ఆ స్థితిలేదు. కుక్కల వల్ల అనారోగ్యాలు పెరిగే అవకాశముంది. మనతో పాటు తిప్పడం, మర్యాదలు లేకుండా ఒళ్లో పెట్టుకోవడం, మంచంపై ఉంచడం మొదలైనవి భౌతికంగా కూడా అనారోగ్యకరం. పైగా వాటిపై ఆసక్తి, వ్యామోహం వంటివి పెంచుకుంటే ప్రమాదముంది. అవసాన వేళలో ఆ కుక్క స్మరణ సంభవిస్తే, ఆ వ్యామోహాల వల్ల పునర్జన్మ శునకంగా కలుగవచ్చు. ఈ విషయానికీ గీతయే ప్రమాణం.

**యం యం వాపి స్మరన్ భావం**
**త్యజత్యన్తే కలేబరమ్ ।**
**తంతమేవైత కౌంతేయ**
**సదా తద్భావ భావితః ॥** –"అంత్యకాలంలో ఏ భావాన్ని స్మరిస్తూ దేహత్యాగం చేస్తారో, తరువాతి జన్మలో ఆయా భావాన్ని పొందుతున్నారు."

అలాగని కుక్కని పోషించరాదని కాదు. వ్యామోహం లేని దయతో, తగిన హద్దులలో ఉంచి కుక్కకు ఆహారాదుల్ని ఇవ్వడం భూతసేవలో భాగమే.

ఏ జీవిని తక్కువ దృష్టితో చూసినా, జుగుప్సా భావాన్ని వహించినా పాపహేతువౌతుంది.

ప్ర: **శ్రీకృష్ణుడు రథం నడుపుతుండగా, అర్జునుడు రథమందు కూర్చున్న విగ్రహంగానీ, పటంగానీ ఇంట్లో ఉండరాదని ఒక స్వామిజీ ఈ మధ్య తన ప్రసంగంలో చెప్పారు. ఇది ఎంతవరకు సమంజసం?**

జ: మీరు వర్ణించిన శ్రీకృష్ణమూర్తి పార్థసారథి స్వరూపం. భగవద్గీతను బోధించి, అర్జునుని విజయునిగా చేసిన పరమాత్మరూపం. ఈ విగ్రహంగానీ, పటంగానీ ఉండరాదన డానికి ఏ శాస్త్రప్రమాణమూ లేదు. మనలో భక్తిభావం కలిగించి, స్ఫూర్తినిచ్చే ఈ పటాన్ని నిరభ్యంతరంగా ఉంచవచ్చు. మన జీవన (శరీర) రథాన్ని నడిపించే పరమేశ్వరుడే శ్రీకృష్ణుడు. ఆయనే ఆచార్యుడు, విజయప్రదాయకుడు. ఈ అభయాన్ని ప్రసాదించే చక్కని చిత్రమది.

ప్ర: **ఆదిశంకరులు శైవులు కదా! మరి ఆయన భజగోవిందం, విష్ణుసహస్ర నామభాష్యం లాంటివి ఎందుకు రచించారు?**

**జ:** మనకి రానురాను మన మతం పట్ల అవగాహన లేకుండా పోతోందనడానికి ఈ ప్రశ్నే ఉదాహరణ. ఆదిశంకరులు శైవులూ కారు, వైష్ణవులూకారు. సర్వమూ ఒకే పరమాత్మ అనీ, శివుడన్నా విష్ణువన్నా శక్తి అన్నా ఉపాసకులు కొలిచే అసలుతత్త్వం ఆ పరమాత్మయేనని ఆది శంకర హృదయం, వారి దృష్టిలో శివకేశవ భేదం లేదు. అభీష్టదేవతా సిద్ధాంతం వేరు – దేవతల మధ్య భిన్నత్వాన్ని చూడడం వేరు. మన అభీష్ట దేవతను ప్రధానంగా కొలిచినా, ఇతర దేవతలను నిరసించరాదు. ఈ సిద్ధాం తమే మన సమగ్ర హిందూ (వైదిక, సనాతన) మతాన్ని కలిపి, క్షేమంగా ఉంచుతుంది. వేద ప్రతిపాదితమైన మతమిది. సర్వదేవతలను ఒకే పరతత్త్వం యొక్క స్వరూపాలుగా దర్శించారు కనుక, విష్ణువుపై, శివునిపై, శక్తిపై, గణపతిపై, స్కందునిపై అద్భుతమైన స్తోత్రాలు రచించారు. సమగ్ర హిందూమత సమన్వయానికి జగద్గురువై భాసించారు. సిద్ధాంతరీత్యా – ఆదిశంకరులది అద్వైతం. ఈ సిద్ధాంతంలో దేవతా భేదాలు కూడా ఉండవు. శైవం, వైష్ణవం... ఈ రెండూ కూడా ద్వైత సిద్ధాంతంలోనూ, విశిష్టాద్వైత సిద్ధాంతంలోనూ చేరతాయి. ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత సిద్దాంతాలు... మూడూ వేదానికి సంబంధించినవే.



తత్త్వ దృష్టితో వాటిని సమన్వయించి, విభిన్న బౌద్ధిక స్థాయిలకి చెందినవిగా గౌరవించడమే అసలైన వివేకం. ఇసుమంత కూడా పరస్పర విభేదం పనికిరాదు.

**ప్ర: కేసెట్స్,సీడీలు పెట్టి రుద్రమంత్రాలతో అభిషేకం, పూజలు చేయవచ్చా?**

**జ:** గత్యంతరం లేనప్పుడు చేసుకుంటున్నారు. కానీ వాటిలో ప్రవీణుడై, అనుష్ఠాన పరుడైన విప్రుని బ్రహ్మ స్థానంలో ఉంచి అభిషేక, అర్చనాదులను ఆచరించడం సంప్రదాయం.

ఒక చెట్టును ఫోటోతీసి ఇంట్లో ఉంచుకొని, అందులోంచి చెట్టు ప్రయోజనాల్ని పొందడం ఎలాంటిదో – రికార్డు చేసిన మంత్రాల ద్వారా అనుష్ఠానం, అర్చ నాదులు చేయడం అలాంటిదే. అందులోంచి ప్రాణశక్తిని పొందలేం.

నేర్చుకోడానికి, లేదా విని అనుభూతిని పొందడానికి ఈ కేసెట్స్ పనికి రావచ్చు. అంతేగానీ వ్రతాలు, అభిషేకాలు చేయడానికి మాత్రం పనికిరావనే చెప్పాలి.

వ్రతాది యజ్ఞ (ఆరాధనా) కార్యాలలో బ్రహ్మను (విప్రుని) ఉచితస్థానంలో ఆసీనుని చేయాలి. యజ్ఞాలలో 'ఋత్విగ్వరణం' ఇదే. అలాగే పూజాదులను స్వయంగా అను ష్ఠించలేనప్పుడు, బ్రహ్మస్థానంలో ఒకరిని నియమితుని చేసి వారు మంత్రోచ్చారణ

చేస్తుంటే వీరు ఆచరిస్తుంటారు. రికార్డులో ప్రాణశక్తి ఉండదు. కేవలం శబ్దం మాత్రమే ఉంటుంది.

ప్ర: **శివపరివారమూర్తి పటం ఇంట్లో ఉండడం మంచిదని ఒకటి సంపాదించి పెట్టుకున్నాను. అయితే అందులో అన్నీ ఉన్నాయి కానీ, అమ్మవారి వాహనమైన సింహం లేదు. అందుకే ఆ పటం ఇంట ఉండరాదని ఒకరు హెచ్చరిస్తున్నారు. వృషభం, నెమలి, ఎలుక – అన్నీ ఉన్నాయి గానీ, సింహం లేదు కదా! మరొక చిన్న సందేహం –అయ్యవారి వృషభ వాహనానికి 'నంది' అనిపేరు. మరి అమ్మవారి సింహానికి పేరేమిటి?**

జ: అమ్మవారు సింహవాహిని. అందులో సందేహం లేదు, కానీ ఆమె శివునితో కలసి వృషభంపై కూర్చొని ఉంటుందని కూడా ఆగమశాస్త్రాలు చెబుతున్నాయి. ప్రదోషార్చనలో వృషభ వాహనంపై ఉన్న పార్వతీ పరమేశ్వరులనే ఆరాధిస్తారు.

**"నమశ్శివాభ్యాం వృషవాహనాభ్యాం...**

**... నమో నమశ్శంకర పార్వతీ భ్యాం'** అని పార్వతీ పరమేశ్వరులుభయులూ వృషభ వాహనులని ఆదిశంకరులు స్తోత్రించారు.

అమ్మవారు విడిగా రాక్షస సంహారాదులు చేసేటప్పుడు సింహవాహినిగా ప్రకాశించిన ఘట్టాలను పురాణాలు వర్ణించాయి. కానీ శివునితో ఉన్నపుడు వృషభ వాహినిగానే ప్రసిద్ధి. దక్షిణ భారతంలో కొన్ని దేవీ ఆలయాలలో అమ్మవారి ఎదురుగా వృషభ వాహనమే (శివాలయంలో వలె) ఉన్నది. కనుక పరివారమూర్తిలో మాత్రం ఒక్క వృషభము (నందీశ్వరుడు) ఉన్నా సరిపోతుంది.

ఇక అమ్మవారి వాహనమైన సింహం పేరు – 'సోమనంది'. ఈ నందికీ, ఆ నందీశునికీ అవినాభావ సంబంధం కూడా ఉంది. రెండింటిలో 'నంది' నామ సామ్యమే దీనికి తార్కాణం, రెండింటి 'నంద' తత్త్వాలు ఒక్కటే.

ప్ర: **కైకేయి కారణంగా శ్రీరాముడు అడవులకు వెళ్లాడు. భరతుడు తిరిగి శ్రీరాముని అయోధ్యకు రమ్మన్నా రాముడు రాలేదు. అప్పుడు భరతుడు శ్రీరాముని పాదుకలను తీసుకు వచ్చేశాడు కదా! అలా అడవిలో ఉన్న రాముని పాదుకలను తెచ్చేయడం సమంజసమా?**

జ: రామాయణాన్ని జాగ్రత్తగా గమనించి చదివితే ఇలాంటి సందేహాలు రావు.

భరతుడు శ్రీరాముని తిరిగి అయోధ్యకు తీసుకువచ్చి రాజ్యాభిషేకం చేయించాలని

అన్ని ఏర్పాట్లతో అరణ్యాలకు వెళ్లాడు. అన్ని రాజలాంఛనాలతో రామచంద్రుని తీసుకురావాలని బంగారుతో అలంకరించిన పాదుకలను కూడా తనతో తీసుకెళ్లాడు. ఆ పాదుకలు రామునకు సమర్పించి, వాటిని ధరించి రాముడు అయోధ్యకు రావాలని భరతుని కోరిక. కానీ రాముడు సత్యనిష్ఠ, ధర్మపరత్వం వలన అయోధ్యకు రానని దృఢనిశ్చయంతో చెప్పాడు. దానితో భరతుడు చేసేదేమీ లేక, తాను తెచ్చిన పాదుకలను శ్రీరామునిచే ధరింపజేసి, రామపాదాల ముద్రదాల్చిన ఆ పాదుకలనే తిరిగి అయోధ్యకు తీసుకువచ్చాడు. (అంతేగానీ అడవిలో రాముడు వేసుకు తిరిగే పాదుకల్ని తీసుకువచ్చేయలేదు).

రాముడు లేని అయోధ్యలో ఉండలేక, నందిగ్రామ రాజ్యంలో శ్రీరామపాదుకలకే పట్టాభిషేకం చేసి, తాను ప్రతినిధిగా మాత్రమే పాలిస్తూ, ప్రతి రాచకార్యాన్నీ ఆ పాదుకల వద్ద నివేదిస్తూ పధ్నాలుగేళ్ళ కాలాన్ని గడిపాడు.

ఇదీ అసలైన కథ.

ప్ర: **లక్ష్మీ అష్టోత్తర శతనామాలలో "కామాక్షీం క్రోధసంభవాం" అని నామాలున్నాయి. కొన్నిచోట్ల "కామాం క్షీరోదసంభవాం" అనీ, ఇంకొన్ని గ్రంథాలలో "క్షమాం క్షీరోద సంభవాం" అనీ ఉన్నాయి. ఈ మూడింటిలో ఏది సరియైనది? "క్రోధ సంభవాం" మాటలో పరమార్థం ఏమిటి?**



జ: "కామాక్షీం క్రోధసంభవాం" అనేది ప్రాచీన పాఠం. లక్ష్మీ అష్టోత్తరశత నామ స్తోత్రం సర్వదేవీ స్వరూపిణియైన జగదంబికను ఉద్దేశించినది. శ్రీ సూక్తాది దేవీసూక్తాలలో ఉన్న తత్త్వం అందులో ఉంది.

అయితే కొన్ని చోట్ల కనిపించే 'కామాం','క్షమాం','క్షీరోద సంభవాం' అనే మాటలు కూడా దోషాలు కావు. సృష్టి స్థితి లయలకు హేతువైన కామేశ్వర స్వరూపిణి కనుక "కామాం" అన్నారు. సహనం అనే దివ్యగుణం, భూమి – ఈ రెండూ లక్ష్మీ స్వరూపాలు కనుక "క్షమా" నామం కూడా సమంజసమే. "క్షీరోద సంభవాం" అంటే 'క్షీరసాగరము నుండి ఉద్భవించినది' అని అర్థం.

కానీ ప్రాచీన పాఠమైన "కామాక్షీం క్రోధ సంభవాం" చాలా అర్థవంతమైనదే. కామాక్షీ దేవత పరాశక్తి.క్రోధము వల్ల ఉద్భవించినది 'క్రోధ సంభవ'.

దీనికి ప్రమాణం మార్కండేయ పురాణంలోని 'దేవీమహాత్మ్యం'లో, దేవీ భాగవతంలో చెప్పిన గాథలే. మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ స్వరూపిణియైన దుర్గ –

మహిషాసుర మర్దినిగా మహాలక్ష్మి. మహిషాసురుని దురాగతాలను సహించని మహేశ్వర విష్ణు బ్రహ్మాదు లకు కలిగిన కోపోద్రేకంలోంచి వారి నుండి ఉద్భవించిన పరాక్రమ తేజమంతా కలసి దేవీరూపం ధరించిందని పురాణకథ. ఆ దేవతే అష్టాదశ (18) భుజాలతో, సర్వదేవతాశక్తి స్వరూపిణిగా వెలిగి మహిషాసురుని సంహరించింది. దేవతల కోపం నుండి జనించిన శక్తి కనుక "క్రోధ సంభవా" అని కీర్తించారు.

**ప్ర: శ్రీ శివునికి, విఘ్నేశ్వరునికి, పార్వతీ అన్నపూర్ణలకు తులసిదళాలతో పూజ చేయడం లో తప్పు ఏమైనా ఉన్నదా? (పువ్వులు దొరకనప్పుడు)**

**జ:** ఎట్టి పరిస్థితులలోనైనా తులసి దళాలతో శివుని, పార్వతిని, అన్నపూర్ణను పూజించ వచ్చు. కేవలం గణపతిని మాత్రం తులసితో పూజించరాదు. (దైవం ఒకరే అయినా వివిధ నామరూపాలతో వ్యక్తమైనప్పుడు, ప్రత్యేక శక్తుల్ని వెలువరిస్తూ, ప్రత్యేకమైన పూజా విధానాలు కలిగి ఉంటాడు.) అయితే వినాయక చతుర్థినాడు మాత్రం ఏకవింశతి (21) పత్రాల పూజలో తులసితో పాటు పూజించ వచ్చు.

***ప్ర: వానప్రస్థము అంటే ఏమిటి? ఈ కలియుగంలో మన ఆంధ్రదేశంలో గల కుటుంబ వ్యవస్థలో దాని అమలు సాధ్యమా?***



**జ:** వానప్రస్థం మూడవ ఆశ్రమం. బ్రహ్మచర్య, గృహస్థాశ్రమాల తర్వాత స్వీకరించ వలసినది. బ్రహ్మచర్యంలో విద్యాభ్యాసం చేయాలి. నియమపూర్వకంగా శ్రద్ధగా విద్యనార్జించిన వాడు గృహస్థాశ్రమానికి అర్హుడు. ఈ ఆశ్రమంలో దేవయజ్ఞ, పితృయజ్ఞ, ఋషియజ్ఞ, మనుష్యయజ్ఞ, భూతయజ్ఞాలు ఆచరించాలి. తనవరకు వచ్చిన ధర్మపరంపరను తరువాతి తరాలకు కొనసాగించేందుకు, వంశవృద్ధికి సత్సంతానాన్ని పొంది తీర్చిదిద్దాలి. సామాజిక బాధ్యత, కుటుంబ బాధ్యత నిర్వహిస్తూ, ఆ బాధ్యతల హద్దులలో ధార్మికమైన భోగాను భవంతో జీవితాన్ని సాగించాలి. అయితే ఈ స్థితిలో కేవలం ఒక భాగంగా అప్పుడప్పుడు ఏకాంతం, ఆత్మచింతనతో ఆధ్యాత్మిక సాధనలు కొనసాగిస్తుండాలి. బాధ్యతలు విస్మరించరాదు. వ్యక్తిగా మన ఉనికికీ, మనుగడకీ హేతువైన సమాజం పట్ల మన కర్తవ్యాన్ని అనివార్యంగా పాటించాలి. ఎంత బాహ్యజీవితంలో బాధ్యతలను నిర్వహించినా, చివరికి గ్రహించాల్సింది మన ఆత్మోన్నతినే. దానికి తాత్త్విక చింతన, తపస్సు ముఖ్యం. అది గృహస్థాశ్రమంలో పూర్తి స్థాయిలో చేయలేం. వాటికోసం గృహస్థ బాధ్యతలను వదలరాదు. గృహస్థాశ్రమాన్నే గొప్ప ఆశ్రమంగా శాస్త్రాలు వర్ణించాయి.

అయితే బాధ్యతలు పూర్తిచేశాక ఇంక లౌకిక లంపటాల నుండి మనసును పూర్తిగా మరల్చి భగవచ్చింతనకి, తపస్సుకి కేటాయించాలి. అంటే గృహస్థాశ్రమంలో దైవచింతన కూడదని కాదు. ఆ ఆశ్రమంలో అనేక కర్తవ్యాల వల్ల సంపూర్ణంగా చేయలేని దానిని, ఈ వానప్రస్థంలో పూర్తిగా చేయాలి.

లౌకిక లంపటాల నుండి మరలడమంటే కర్తవ్యాన్ని వదిలేయడం కాదు. అందుకే బాధ్యతల్ని తన తరువాతి తరానికి బోధపరచి, అవి నిర్విఘ్నంగా కొనసాగేలా అందించి 'వనానికి బయలు దేరడమే' వానప్రస్థం. ఈ ఆశ్రమస్థితిలో నిత్య నైమిత్తిక కర్మల్ని మాత్రం విడువ రాదు. ఇది సన్యాసాశ్రమంకాదు కదా! దేవ, పితృ, ఋష్యాది యజ్ఞాలను నిర్వహిస్తూ ఏకాంత జీవితం గడపాలి. భార్య కూడా వానప్రస్థానికి వస్తే తీసుకువెళ్లాలి. ఆమె ఒకవేళ పుత్రాదుల దగ్గరే ఉంటానని అంటే సరేనని అంగీకరించి తానొక్కడే వెళ్లాలి. అంతేగానీ నిర్బంధించరాదు. నగరాదులలోని భోగాలను, ఆహారాలను విడచి ప్రాణరక్షణార్థం మాత్రమే ఆహారస్వీకరణ చేస్తూ కాలం గడపాలి. ఇవి కొన్ని నియమాలు.



ఇక – ప్రస్తుతాంశం. ఈ ఆశ్రమం ఈ కాలంలో సాధ్యమా? సాధ్యమే. అయితే అడవికి పోనక్కర్లేదు. తనంత తాను ఏకాంతంగా నిత్యకర్మల్ని చేసుకుంటూ, లోకవార్తల పట్ల, భోగాలపట్ల, లౌకిక చర్యల పట్ల ఆసక్తిని చూపకుండా – మానసికంగా 'నిస్సంగ' (ఎవరితో సంపర్కం లేని) స్థితికి చేరాలి. పుత్రాదుల విషయాలలో వ్యామోహ పడకుండా, కలగజేసుకోకుండా కేవలం క్షేమ ధర్మాదుల మేరకే, వారు అడిగినప్పుడు సలహా మాత్రమే ఇస్తుండాలి. కోపతాపాదుల్ని పూర్తిగా వదలుకొని, తమ చింతనలో తాముంటూ ఆత్మోన్నతికి ప్రయత్నించాలి. రుచులకోసం తాపత్రయం, భౌతిక కథల జోలిలేకుండా పూర్తి నిగ్రహాలకు ప్రయత్నిస్తూ, అంటీ అంటకుండా, తామరాకుపై నీటి బొట్టులా వర్తిస్తుండాలి. ఒక్క మాటలో చెప్పాలంటే 'మానసిక ఏకాంతాన్ని' పూర్తిస్థాయిలో సాధించాలి. ఇది హాయిగా ఈ కాలంలోనూ సాధ్యమౌతుంది. సంకల్పమూ, కాస్త పట్టుదల ఉంటే చాలు.

**ప్ర: 'ప్రపత్తి' (ప్రపద్యే) అంటే ఏమిటి?**

**జ:** 'ప్రపద్యే' అనే మాటకి 'వేడుకుంటున్నాను' 'ఆశ్రయిస్తున్నాను' అని అర్థం. శరణాగతి, ప్రపత్తి – ఈ రెండూ భగవంతుని కృపను అందించే సాధనలు. **"శరణమహం ప్రపద్యే"** 'సర్వస్వమూ పరమేశ్వరుడే' అని శరణువేడి ఆశ్రయించడం ఈ

మాటలో అర్థం. ఆశ్రయ భావం ప్రపత్తి.

ఈ ప్రపత్తి సిద్ధాంతం ప్రకారం – ఆచార్య కృత్యం, పురుషకార కృత్యం, ఉపాయ కృత్యం – ఈ మూడింటినీ భగవదర్పణం చేయాలి. గురువై గతి చూపించేదీ, ప్రయత్నాన్ని చేయించేదీ, మోక్షానికి ఉపాయాన్ని (సాధన) చూపించేదీ సర్వమూ నీవేనని పూర్తిగా శరణువేడడమే ప్రపత్తి. భగవంతుడు ప్రపత్తి మార్గ సులభుడు. సర్వకర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చేస్తూ, అహంకారాదులను త్యాగం చేయడమే అసలైన ప్రపత్తి. ఇలా ప్రపత్తిని చేసే వానిని 'ప్రపన్నుడు' అంటారు. భక్తునికి ఉండవలసినది 'ప్రపన్నత', దైవానికి ఉన్నది 'ప్రసన్నత'.

ప్ర: **శక్తి ఆరాధనలో సరస్వతికి ప్రాముఖ్యత నివ్వరెందుకు? నవ రాత్రులలో ఒక్కరోజు మాత్రమే ఆరాధిస్తారెందుకు?**

**జ:** శక్తి ఒక్కరే. ఆమె జగన్మాత. ఆ జగన్మాతను ఏ పేరుతో పిలిచినా పలుకుతుంది. ముగురమ్మలూ ఆ తల్లే. అనంత రూపాలతో భాసిస్తున్న జగదంబ ఒక్కతె.

**'అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం'** అని వేదం ఆ ఆద్యాశక్తిని కీర్తించింది. పుట్టుకలేని, ఏకస్వరూపిణి – రజో గుణ, సత్త్వగుణ, తమోగుణాలను నియమిస్తూ మూడువర్ణాల (ముగురమ్మల) రూపంతో కనిపించింది. అమ్మ రూపాలలో ఏ రూపాన్ని ప్రీతిగా ఆరాధిస్తే, ఆ రూపమే అన్ని రూపాల మూలరూపంగా భావించాలి. లక్ష్మి ఆరాధకు లకు లక్ష్మియే ముగురమ్మల మూలపుటమ్మ. అలాగే సరస్వతీ ఆరాధకులకు ఆ దేవియే సర్వస్వరూపిణి. అలా అభీష్టం మేరకు ఏ రూపాన్ని ఆరాధించినా, ఆ రూపంగా కనబడే ఒకే జగజ్జనని ముగురమ్మలుగా – ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులతో అనుగ్రహిస్తుంది.

సరస్వతీ ప్రాధాన్యం శ్రుతిస్మృతులలో, మంత్రశాస్త్రంలో పుష్కలంగా ఉంది. ఋగ్వేదం సరస్వతీ సూక్తాలను బహుళంగా అందించింది. మంత్ర శాస్త్రం శుక్ల సరస్వతీ, నీల సరస్వతీ, వాగ్వాదినీ, నకులీ సరస్వతీ వంటి అనేక శారదా మూర్తులను అందించింది. దేవీమాహాత్మ్యం – బ్రహ్మ జ్ఞాన స్వరూపగా, సర్వాభీష్ట ప్రదాయినిగా, మూడు శక్తులలో పరాకాష్ఠగా వర్ణించింది. శుంభనిశుంభులను సంహరించిన శక్తియే మహాసరస్వతి. నవరాత్రులలో మహాసరస్వతి ఆది.

అలాగే లక్ష్మి, కాళీలకు కూడా ఒక్కొక్క రోజు ఉన్నాయి. కానీ మొత్తంగా ఆరాధింప బడే శక్తి ఒక్కటే. నవరాత్రులూ మనకిష్టమైన అమ్మరూపాన్ని ఆరాధిస్తున్నా ఆ తల్లి

"మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీ స్వరూపిణీ" అని భావించి ఆరాధించాలని శాస్త్రం. అసలు ముఖ్యమైన నవరాత్రుల పేరే 'శారదా నవరాత్రులు'.

జ్ఞానమే గొప్ప సిద్ధి, ఆ సిద్ధినిచ్చే గొప్ప శక్తి సరస్వతి. ఆ తల్లి కృప లేకపోతే చదువు మాత్రమే కాదు, సంపదలు కూడా లభించవు. సంపదను, ఆహారాన్ని ఆర్జించాలనే బుద్ధి, ఆర్జించే విజ్ఞానం, వినియోగించే తెలివి ఇవన్నీ సరస్వతి ఇవ్వవలసినవే. ఋగ్వేదం ఈ తల్లిని 'అన్న ప్రదాయినిగా' కీర్తించింది. ప్రాణశక్తిగా అభివర్ణించింది. ఇంత ప్రాధాన్యమున్న దేవి సరస్వతి.

ప్ర: **మహిషాసుర మర్దిని స్తోత్రంలో "కపర్దిని" అని ఉంది. మహేశ్వర పంచరత్నాలలో (4వ పద్యంలో) "ఘనకపర్ద" అనే శబ్దముంది. వివరణ ఇవ్వగలరు?**

**జ:** 'కపర్దము' అంటే శివుని జటాజూటం. శివునికీ, శక్తికీ అభిన్నత. రాక్షస సంహారం చేసేటప్పుడు ఆ తల్లి కదలికలలో సౌందర్యంగా కనిపించే కపర్దాన్ని (కేశపాశాలను) దర్శించి, "రమ్యకపర్దిని" అని స్తుతించారు. "గొప్ప జటాజూటం" కల శివుడు "ఘనకపర్ద" అని స్తుతింపబడ్డాడు. కపర్దము కలవానిని "కపర్ది" అంటారు. స్త్రీ లింగంలో కపర్దిని.



– ఒక అర్థంలో 'కం పర్దయతి' (కం=జలమును పాలించు జడలు) అని చెప్పారు. గంగా జలాలను పాలించే జటాజూటం కనుక 'కపర్దం'. శివునకూ శక్తికీ అభేదాన్ని చెప్తూ ఇదే నామాన్ని ఉభయులకూ వాడారు. 'రుద్ర – రుద్రాణి' – 'శర్వ – శర్వాణి వలె.

ప్ర: **భగవదనుగ్రహానికి భక్తి, సర్వ జీవులందు ప్రేమ ప్రధానం కదా –మరి 'శివుడు అభిషేక ప్రియుడనీ, ఫలాని వాటితో అభిషేకిస్తే, పూజిస్తే ఫలాని ఫలం కల్గుతుందనీ', 'జగన్మాత పాయసాన్న ప్రియ' అనీ, 'వినాయకుడు ఉండ్రాళ్ళ ప్రియుడ'నీ అనడం ఎంతవరకు సబబు? వాటన్నిటికీ అంతరార్థాలు ఉంటాయని అనవచ్చు. కానీ ఆ విషయాలు చెప్పకుండా, కేవలం క్రతువుల ప్రాధాన్యాన్ని, వాటి వల్ల కలిగే ఫలితాలను (సంతాన ప్రాప్తి, కీర్తి, వాహన ప్రాప్తి, అలంకార ప్రాప్తి మొదలైనవి) గూర్చి వివరించడం, భక్తుల అవగాహనలో ప్రాపంచిక సుఖాల ప్రాధాన్యాన్ని బలపర్చినట్లు కదా?**

**జ:** సూక్ష్మశక్తి స్వరూపాలైన దేవతలు భగవంతుని స్వరూపాలు. ఒక్కొక్క దేవత ప్రధానంగా ఒక్కోవిధమైన శక్తిని ప్రసరిస్తుంటుంది. లోకంలో మానవులు తమ అభీష్ట సిద్ధికి, అనిష్ట పరిహారానికి దేవతారాధన చేస్తారు. భక్తి, జ్ఞానం తాత్త్విక స్థాయికి

చెందినవి. ఆ స్థాయికి మానవుడు ఎదగాలి. కానీ లోకంలో అందరూ తత్త్వ జిజ్ఞాసులు కారు. అభీష్టసిద్ధి, ప్రాపంచిక సుఖాలు తీసిపారేయలేనివి. వాటికి ప్రాధాన్యం లేక పోయినా, వాటి అవసరాలుంటాయి. వాస్తవానికి భగవదనుగ్రహంతో వాటిని సంపాదించడం మంచిదే. తద్వారా ఆ వస్తుప్రాప్తికి భగవచ్ఛక్తి, పవిత్రత లభించి – ఆ వస్తు వినియోగం ద్వారా చిత్తశుద్ధి లభించి, క్రమంగా జ్ఞాన, భక్తులకు హేతు వౌతుంది.

తాత్త్వికంగా కాక, దేవతాదృష్టితో చూస్తే – వేదం ఈ విషయాన్నే స్పష్టం చేస్తుంది. ఒక్కొక్క యజ్ఞ ప్రక్రియలో, ఆయా దేవతలకి ప్రీతికర పదార్థాలు చెప్పబడ్డాయి.

అందరూ తాత్త్విక స్థాయికి చెందలేరు కదా! వాటిలో పెద్ద అంతరార్థాల కోసం వెతకనక్కర్లేదు. సుఖప్రాప్తికి భౌతిక ప్రయత్నాలు ఎలాంటివో, ఈ దేవతారాధనలు అలౌకికోపాయాలుగా అలాంటివే. ఇవి ఉదాత్త తాత్త్విక చింతనకు చెందక పోయినా, నింద్యములు కావు కనుక – వీటిని కాదనక్కర్లేదు. పైగా– తత్త్వదృష్ట్యా ఇవి చిత్తశుద్ధి హేతువులు.

భక్తి, భూతదయ అనే వాటికి ఇవి అవరోధాలు కూడా కావు. నిజాయితీగా చెప్పాలంటే అలాంటి ఔన్నత్యం సర్వజన సాధారణంకాదు. కష్టాలు దాటి, లోకయాత్ర సాగించడం కూడా జీవితంలో భాగమే. వీటికి దేవతా సహాయం, అందుకు అనుష్ఠానం సమర్థ నీయాలే. ఇతరులకు హానికరం కాని కోరికను కాదనవలసిన అవసరమూ లేదు. మానవ సహజమైన లక్షణాలను సహజ ప్రక్రియలో నిగ్రహించుకోవాలి. అసహజంగా నిరాకరించరాదు. దైవానుకూలత లేనిదే ఏ సిద్ధీలేదు కనుక, ఆ అనుకూలతను సాధించే ప్రక్రియలే ఈ విధమైన ఆరాధనలు. పారే ఏరుని పంటకోసం కాలువకట్టి నట్లుగా, దైవశక్తిని మన అనుకూలత కోసం ప్రార్థించడం తప్పుకాదు.

ప్ర: **నిన్న వాడిన దీపపు వత్తులు (సగం కాలి ఆరినవి) ఈ రోజు తిరిగి నూనె పోసి వెలిగించవచ్చా? అలాగే నిన్నవాడిన రాగి ఇత్తడి పాత్రల్ని కడిగి వాడితే సరిపోతుందా?**

జ: నిన్న వాడిన వత్తులు సగం మిగిలినట్లయితే, ఈ రోజు తిరిగి వాడడం తగదు. నిర్మాల్యాన్ని తిరిగి వాడిన దోషం లాంటిదే సంక్రమిస్తుంది. నిన్నటి రాగి, ఇత్తడి పాత్రల్ని తిరిగి కడిగివాడితే సరిపోదు. వాటిని తోమి వాడాలి. పాత్ర మట్టితో (పొడితో) తోమడం చేత శుద్ధమవుతుంది.

**ప్ర: సరస్వతీ దేవిని నదిగా మారమని ఎవరో శిక్షించారనీ, అలాగే త్రిమూర్తులనీ గాయత్రి నదిగా మారమన్నదనీ పురాణాల్లో కథలు వింటుంటాం. ఇవన్నీ కట్టు కథల్లా అసంగతంగా అనిపిస్తాయి. వీటిలో ఏవైనా అంతరార్థాలున్నాయా? ఇంత అజ్ఞాన కరమైన కథలు ఉన్న పురాణాలని ఎలా నమ్మడం? దేవతలకి కూడా కోపతాపా లుంటాయా?**

**జ:** ఈ శాపకథల్ని కాదనడానికి వీలు లేదు. ఉదాహరణకి – సరస్వతీదేవి శాపవశాత్తూ నదిగా మారిందనీ, కలియుగ ప్రారంభానికి శాపవిమోచనమై అంతర్ధాన మౌతుందని పురాణ కథ. దానిని నిన్న మొన్నటి దాకా కొట్టిపారేశారు. కానీ ఇటీవల కొన్ని దశాబ్దాలుగా – శాటిలైట్స్ పంపిన ఫోటోల ఆధారంగా, ఐదువేల ఏళ్ళకు పూర్వం భారతదేశంలో ఒక మహానది ప్రవహించేదన్న జాడలు కనిపించాయి. అది సరస్వతీ నదేనని ఋజువై, వేద పురాణాల్లో వర్ణించిన సరస్వతీ నది –ఊహాజనితం కాదని సాక్ష్యాలతో నిరూపణ అయ్యింది. పైగా పురాణం చెప్పిన కథ ప్రకారం – సరస్వతీ శాపవిమోచనం కలియుగారంభానికే నన్నది – ఐదువేల ఏళ్ళ క్రితం అంతరించినది అన్న విషయంతో సరిపోతోంది.

దీనిని బట్టి పురాణాలను కొట్టిపారేయనవసరం లేదనీ, సరియైన దృష్టితో పరిశీలించవలసిన బాధ్యత ఉందనీ అర్థమౌతోంది. సూక్ష్మమైన దైవీయ భూమికలలో జరిగే అంశాలని, మన లౌకికస్థాయిలో అన్వయించరాదు. పురాణకథల్లో కేవలం చరిత్ర మాత్రమే ఉండదు. మంత్ర సంకేతాలు, యజ్ఞ సంకేతాలు, ఉపాసనా మర్మాలు, వైజ్ఞానిక సూత్రాలు, ఖగోళ విజ్ఞానాలు, తాత్త్విక మర్మాలు, ధార్మిక మర్మాలు కలగలసి ఉంటాయి. వాటి శాస్త్ర పరిచయంతో పురాణాలను సరిగ్గా విశ్లేషించాలి.

సృష్టి నిర్వహణకు ఉపకరించే పరమేశ్వరుని శక్తులే దేవతలు. వాటి స్పందనలు, ప్రకోపాలు, ప్రభావాలు వివిధ భావాలుగా సంకేతించారు. సృష్టి స్థితి లయకారకమైన భగవత్ శక్తులే పృథ్విలో జలదేవతలుగా, వాయు, అగ్న్యాది పంచభూత శక్తులుగా ప్రవర్తిల్లుతుంటాయి. చూడడానికి నదులన్నీ ఒకేలా ఉన్నా వాటి జల లక్షణాలలో తేడాలు ఉంటాయి. అవి భౌతిక విజ్ఞానానికి అందేవి కొంత మాత్రమే. అత్యంత సూక్ష్మమైన దైవీయ విజ్ఞానానికి సంబంధించిన దైవీయ విజ్ఞానాలు చాలా ఉన్నాయి. వాటిని దర్శించిన మహర్షులు ఆయా నదుల్లో ఉన్న దేవతాశక్తుల మహిమను మనం పొందాలని వాటి విషయాలను అందించారు. దేవతాశక్తులు పృథ్విపై అడుగిడడానికి దైవీయ భూమికలలో జరిగే సంకల్పాలు, ప్రేరణలే పురాణ కథల్లో చెప్పారు. మన

కోపతాపాలకి స్థాయి అల్పమైనది. దేవతల స్థాయి లోకకల్యాణార్థం జరిగే లీలా విలాసం.

ప్ర: **ఉపనిషత్తులు ఎన్ని? కొందరు 10 అనీ, కొందరు 108 అనీ అంటుంటారు. దేనిని నమ్మాలి? శంకరులు పదింటిని మాత్రమే ఎందుకు ఎంచుకున్నారు? ఆ పది ఏమిటి? మహావాక్యాలేమిటి?**

**జ:** నాలుగు వేదాలలో కలిపి 1180 ఉపనిషత్తులున్నాయి. ఋగ్వేదంలో 21, యజుర్వేదంలో 109, సామవేదంలో 1000, అథర్వణ వేదంలో 50. వీటిలో వేదవిద్యతో పాటు చాలా ఉపనిషత్తులు అంతరించాయి (లభ్యం కావడం లేదు).

అయితే శ్రీరాముడు హనుమంతునికి 108 ఉపనిషత్తులని మాత్రమే సంగ్రహించి ఉపదేశించినట్లు గ్రంథాలు బోధిస్తున్నాయి. అవి సంగ్రహించి చెప్పినవే కానీ, మిగిలిన ఉపనిషత్తులు లేవని అర్థం కాదు. ఆది శంకరులు, ఇతర ఆచార్యులు పదింటికి భాష్యం వ్రాశారు.

**అవి:** ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండుక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యక ఉపనిషత్తులు. అయితే వీటిని మాత్రమే వ్రాయడంలో మిగిలిన వాటిని వారు అంగీకరించలేదని అర్థంకాదు. వీటి భాష్యసరళిని గమనించి, ఉపని షత్తులను అవగాహన పరచుకోవచ్చని వారి ఉద్దేశం.

వేదములు (వేద శాఖలన్నీ) నాలుగు భాగాలుగా ఉంటాయి. అవి: సంహిత, ఆరణ్యకం, బ్రాహ్మణం, ఉపనిషత్తు. నాలుగవది వేదములకు చివర కనుక 'వేదాంతం' అంటారు. అంతేకాక 'చివరిమాట' అంటే 'తీర్పు' అని అర్థం. వేదముల తీర్పు–అంటే పరమతా త్పర్యం – జ్ఞానం (ఆత్మ జ్ఞానం). దానిని ప్రస్ఫుటంగా అందించే ఉపని షత్తులను 'వేదాంతం' అన్నారు.

ఉపనిషత్తులు బ్రహ్మవిద్యను బోధిస్తాయి. ఆత్మవిచారణగా కొన్ని, ఉపాసనగా కొన్ని, యోగపరంగా కొన్ని ఉపనిషత్తులున్నాయి. దీని అర్థం– మూడింటి పరమార్థం ఆత్మ జ్ఞానమేనని చెప్పడం.

ఆది శంకరులు పది ఉపనిషత్తులకే కాక శ్వేతాశ్వతర, నృసింహ తాపినీ ఉపనిషత్తులకు కూడా భాష్యం రచించారని కొందరు చెబుతారు. ఆ లెక్కలో ద్వాదశోపనిషత్తులు ప్రసిద్ధం.

నాలుగు వేదాలలో ఎన్నో ఉపనిషత్తులున్నా – నాలుగు వేదాల నుండి నాలుగు

ఉపనిషత్తులలోనూ, జీవ బ్రహ్మైక్యాన్ని చెప్పే నాలుగు మహావాక్యాలను చెప్పారు. **అవి :** 1. ప్రజ్ఞానం బ్రహ్మ (ఋగ్వేదం. ఐతరేయోపనిషత్తు, లక్షణ వాక్యం), 2. అహం బ్రహ్మాస్మి (యజుర్వేదం. బృహ దారణ్యకోపనిషత్తు, స్వానుభవ వాక్యం), 3. తత్త్వమసి (సామవేదం, ఛాందోగ్యోపనిషత్తు, ఉపదేశవాక్యం), 4. అయమాత్మా బ్రహ్మ (అథర్వణ వేదం. మాండూక్యోపనిషత్తు, సాక్షాత్కార వాక్యం)

ఇవి కాక – శ్రీరాముడు హనుమంతునకు 108 ఉపనిషత్తుల నుండి 108 మహా వాక్యాలను ఉపదేశించినట్లు ఒక గాథ ఉంది. అవి కూడా లభ్యమౌతున్నాయి. 'మహా వాక్యరత్నావళి' అని వాటి పేరు.

అవే కాక– 1008 మంచి వాక్యాలను కొందరు ఏరి 'మహావాక్య భాగ్యరత్నావళి' అని సమకూర్చారు. అద్భుతమైన ఉపనిషద్విద్యను మనకు అందించడానికి మేధావులు చేసిన వివిధ ప్రయత్నాలివి. ఏదేమైనా – జీవబ్రహ్మైక్యాన్ని తెలియజేసే మహా వాక్యాలు నాలుగింటికి ఎక్కువ ప్రసిద్ధి.

ప్ర: **ఈ మధ్య 'పద్మ పురాణంలోని రామకథ' అంటూ చదవడం తటస్థించింది. అందులో సేతుబంధనం బదులు, శివుడు పినాకధనువును వేస్తే సముద్రాన్ని దాటినట్లుగా వర్ణించి ఉంది. మనకు ప్రాచుర్యంలో ఉన్న రామాయణంలో సేతుబంధనం ఉంది. దేనిని నమ్మాలి? ఇలాగే అధ్యాత్మరామాయణం, తులసీరామాయణాల్లో భిన్న గాథలు న్నాయి కదా!**



**జ:** పద్మ పురాణంలోని రామకథ పద్మకల్పంలో జరిగినది. అనేక కల్పాలలో రామ, కృష్ణాది అవతారాలు జరుగుతుంటాయి. కొన్నికొన్ని మార్పులు కూడా అందులో ఉంటాయి. పద్మకల్పంలో జరిగిన రామకథలో శివుడు పినాక ధనువును సముద్రంపై వేయగా, దానినే వారధిగా దాటారు.

ప్రాచుర్యంలో ఉన్న కథ వాల్మీకి అందించారు. అది ఈ కల్పంలో (ప్రస్తుతం శ్వేత వరాహకల్పంలో) జరిగిన కథ. అందుకే అదే ప్రాచుర్యం, ప్రమాణం.

అనంతకాలంలో, అనేక కల్పాలలో జరిగిన రామకథలు పురాణాలందించాయి. శివపురాణం, అధ్యాత్మ రామాయణాల్లో చెప్పిన రామకథల్ని తులసీదాసు స్వీకరించారు. ఏనాటి కథలైనా వాటి వైరుధ్యాలను చూసి, అయోమయంలో పడరాదు. అవి జరిగాయా, లేదా అనేదానికన్నా – వాటి ద్వారా అందే సందేశాన్ని పరిశీలించాలి. పురాణకథలు చరిత్రను మాత్రమే చెప్పవు. అందులో కొన్ని మంత్రసంకేతాలు,

కొన్ని జరిగిన కథలు (ఏ కల్పంలోనివైనా), కొన్ని ప్రతీకాత్మకాలు(Symbols), కొన్ని ధర్మ ప్రబోధకాలు, కొన్ని కల్పిత ఉదాహరణలు. వాటన్నిటి ప్రయోజనం ధర్మాన్నీ, భక్తినీ ప్రబోధించడమే. తులసీరామాయణం భక్తి ప్రధానం.

ప్ర: **కొబ్బరికాయ కొట్టేటప్పుడు మధ్యలో చక్కగా పగలాలనీ, లేకుంటే అనర్థమనీ కొందరంటుంటారు. కొబ్బరికాయని కొట్టి, అలాగే ఆ పగిలిన కాయని పట్టుకొని అభిషేకం చేయవచ్చా? కొబ్బరికాయని కొట్టడంలో ప్రయోజనం ఏమిటి?**

**జ:** కొబ్బరికాయను కొట్టడం శాంతికారకం. అరిష్టనాశకం. శాస్త్రం చెప్పిన ప్రకారం కొబ్బరికాయను కొట్టడంలో కొన్ని నియమాలున్నాయి. వాటిని సంగ్రహంగా చూద్దాం.

- ✦ భగవన్నివేదనకు కొబ్బరికాయను కొట్టబోయే ముందు దానిని స్వచ్ఛమైన నీటితో కడిగి, ఆ తరువాత కొబ్బరి కాయను జుట్టున్న ప్రదేశాన చేతబట్టుకొని, భగవంతుని స్మరిస్తూ కొట్టాలి. రాతిపై కొట్టేటప్పుడు ఆ రాయి ఆగ్నేయకోణంగా ఉండడం మంచిది.
- ✦ కాయను కొట్టేటప్పుడు తొమ్మిదంగుళాల ఎత్తునుండి కొట్టడం మంచిది.
- ✦ సరిగ్గా రెండు భాగాలుగా పగలడం మంచిదే. అలా కాక వేరుగా పగిలినా, కుళ్ళు కనిపించినా దిగులుపడక్కర్లేదు. అదేదో హాని కలిగిస్తుందని చింతించ నవసరం లేదు. 'శివాయనమః' అనే మంత్రాన్ని 108 మారు జపించితే ఆ దోషం పోతుంది.
- ✦ కొబ్బరినీటిని అభిషేకించేటప్పుడు కొబ్బరికాయను కొట్టి దానిని విడదీయ కుండా చేతబుచ్చుకుని అభిషేకం చేయరాదు. అలా చేస్తే ఆ కాయ మరి నివేదనకు పనికిరాదు.
- ✦ కాయను కొట్టి ఆ జలాన్ని ఒక పాత్రలోకి తీసుకొని, కాయను వేరు చేసి వేరే ఉంచాలి. పాత్రలోని కొబ్బరి నీటిని మాత్రమే అభిషేకించాలి. వేరుగా ఉంచిన కొబ్బరికాయ రెండు ముక్కల్నీ నివేదన సమయంలో నివేదించాలి.

ప్ర: **తక్కిన ఏ దేవుళ్ళకూ లేని జల నిమజ్జనం వినాయకునికి మాత్రమే ఉంది. ఎందుకు?**

**జ:** వినాయకుని ప్రతిమలన్నిటికీ జలనిమజ్జనం చేయరు. కేవలం మృత్తికతో (మట్టితో) చేసిన మూర్తిని మాత్రమే నీటిలో నిమజ్జనం చేస్తారు. వినాయక చవితినాడు పూజించి ముందురోజు, లేదా నవరాత్ర దీక్షతో ఆరాధించిన తరువాత నిమజ్జనం చేయడం సంప్రదాయం. నిత్యపూజలందుకుంటున్న మూర్తులకు నిమజ్జనాలుండవు. మట్టితో

చేసి ఆరాధించే వాటిని జలంలో కలపడం విధి. పార్థివ లింగాలను కూడా నిమజ్జనం చేస్తారు. వెండి, బంగారం వంటి లోహాలతో చేసే విగ్రహాలను నిమజ్జనం చేయరు కదా!

**ప్ర: లలితా సహస్రనామస్తోత్రాన్ని పారాయణ చేసేటప్పుడు, అంగన్యాసం, కరన్యాసం చేయాలా? వశిన్యాది వాగ్దేవతలను స్మరించాలా? ఆ దేవతలు ఎవరు?**

**జ:** బాలా, పంచదశి, షోడశి–లాంటి శ్రీ విద్యామంత్రాల ఉపదేశం ఉన్నవారు మాత్రమే ఆ మూలమంత్రాలతో యథావిధిగా అంగన్యాస, కరన్యాసాలు చేయాలి. మంత్రో పదేశం లేనివాళ్ళు న్యాసాలు చేయనక్కరలేదు. ధ్యానశ్లోకాలు చదివి, స్తోత్రపారాయణం చేస్తే చాలు. వశిన్యాది వాగ్దేవతలను స్మరించడం మంచిది. వారివల్లనే ఆ మహాస్తోత్రం లభించంది కనుక– వారు ఋషి స్థానీయులు. వారి పేర్లు. 1. వశిని, 2. కామేశ్వరి 3. మోదిని, 4 విమల, 5. అరుణ 6. జయిని, 7. కౌళిని, 8. సర్వేశ్వరి. 'అ' వర్గము', 'క' వర్గము, 'చ' వర్గము, 'ట' వర్గము, 'త' వర్గము, 'జ' వర్గము, 'య' వర్గము, 'శ' వర్గము అనే ఎనిమిది వర్గాల అక్షరాలకు ఈ (సర్వానందమయ చక్రం) నుండి మూడవదైన అష్టత్రికోణ చక్రం (సర్వరోగహర చక్రం) వీరి స్థానం.



లలితా సహస్రనామ స్తోత్రం చదివే ముందు–

***"వశిన్యాదిభ్యో వాగ్దేవతాభ్యో ఋషిభ్యోనమః–***

***శ్రీ లలితా మహా త్రిపుర సుందరీ దేవతాయైనమః..."*** అని నమస్కరించడం శ్రేష్ఠం.

**ప్ర: ప్రదోష సమయంలో రుద్రాభిషేకం చేయాలంటే సాయంత్రం వరకు ఉపవాసం ఉండాలా? లేక ఉదయం 'చప్పిడి పిండి' తినవచ్చా? నా వయస్సు 76 ఏళ్లు. మా శ్రీమతికి 69. మేం కటిక ఉపవాసం ఈ రోజుల్లో ఉండలేకపోతున్నాము. దానికి తోడు అనారోగ్యాలు.**

**జ:** ప్రదోషవేళ శివార్చన చేయాలంటే ఉపవాసం ఉండాలి. అయితే మనల్ని మనం హింసించుకోరాదు. నియమించుకోవడం, హింసించుకోవడం.. అని రెండు విధాలు. మొదటిది తపస్సు. శరీరం భరించగలిగినంత మేరకు నియమం. అలసత్వం, (బద్ధకం) సోమరితనం వంటివి లేకుండా ప్రాణరక్షణ కోసం 'చప్పిడి' వంటివి తినవచ్చు, లేదా వండని పదార్థాలు (పాలు, పళ్ళు వంటివి) తీసుకోవచ్చు. అంతేగానీ కటికోపవాసం చేయనవసం లేదు. అందులోనూ ఆరోగ్యాన్ని దెబ్బతీసుకోవద్దు. చప్పిడి, పాలు, పళ్ళు వంటివి తిన్నా ఉపవాసం క్రిందనే లెక్క.

**ప్ర: తిరుమల శ్రీ వేంకటేశ్వరుడు నారాయణుడని కొందరు, ఈశ్వరుడని కొందరు, సుబ్రహ్మణ్యుడని కొందరు, శక్తి అని కొందరు అంటుంటారు. ఇంతకీ ఏది ప్రమాణం?**

**జ:** అసలు ఇలాంటి వాద వివాదాలు అనవసరం. హిందూమతం సర్వదేవతా సమన్వయ మతం. సర్వదేవతామయుడైన పరబ్రహ్మ వేంకటేశ్వరుడు. రామభక్తులు శ్రీరాముడనీ, కృష్ణ భక్తులు శ్రీకృష్ణుడనీ ఒకే విష్ణువును ఆరాధించినట్లే – ఒకే బ్రహ్మమును శివకేశవాది నామ రూపాలలో వారి వారి అభీష్టానుగుణంగా కొలుచు కుంటారు. అయితే, పురాణ ప్రమాణాల ప్రకారం– శ్రీమన్నారాయణుడు అనాదిగా విహరించే శేషాద్రి వేంకటాచలం. మొదట ఆదివరాహ రూపంతో అక్కడ విహరించిన శ్రీహరి, కలియుగారంభంలో వేంకటేశ్వర స్వరూపంలో ఆవిర్భవించాడు.

ఈశ్వర శబ్దం శివునకూ, శ్రీహరికీ కూడా వర్తిస్తుంది. పరమాత్మ సృష్టి స్థితిలయలు చేసేటప్పుడు ఈశ్వరుడు. ఈ మూడు పనులు చేసేది ఒక్కడే. మూడు పనులకు ధరించిన మూడు రూపాలు (బ్రహ్మ, విష్ణు, రుద్రులు) ఒకే ఈశ్వరునివి. ఆ రూపాలను ధరించినది లోక కల్యాణం కోసం. కల్యాణం, మంగళం, క్షేమం, మోక్షం అనే అర్థాలను తెలియజేసే శబ్దం– 'శివ'.

'వేంకటేశ్వరుడు నారాయణుని స్వరూపం విష్ణు తేజం' అని అన్ని పురాణాలు చెబుతున్నాయి. శివునకు లింగరూపం ఆరాధన ప్రసిద్ధి. ఇక సుబ్రహ్మణ్యుడు, శక్తి... అని అన్నా అభ్యంతరం లేదు. ఎవరి అభీష్టదైవాన్ని వారు ఆ నారాయణుని లో దర్శించవచ్చు. "హరి అవతారములే అఖిల దేవతలు" "ఎంత మాత్రమున ఎవ్వరు తలచిన" వంటి కీర్తనలలో అన్నమయ్య బోధించినదిదే.

శ్రీ వేంకటేశ్వరుని రూపంలో శివ, శక్తి, సుబ్రహ్మణ్య, విష్ణు, అగ్ని దేవతా చిహ్నాలను దర్శించారు. వారి వారి భావాలకనుగుణంగా వ్యాఖ్యానించుకున్నారు. స్వామి అందరినీ అనుగ్రహిస్తున్నాడు. అందుకే ఈ వాదవివాదాలతో మన సనాతన వైదిక సమన్వయ శక్తిని కోల్పోరాదు. వేద వేద్యమైన పరబ్రహ్మయే నారాయణుడు

**'స్కంద విష్ణ్వాత్మికా శక్తిః వేంకటేశ ఇతీరితః'** అని స్కాంద పురాణ వచనం.

స్కంద, విష్ణుమయమైన శక్తి విశేషం వేంకట నారాయణునిలో ఉంది. విష్ణు, వైష్ణవీ తత్త్వాలకు భేదం లేదు. ఈ కారణాల చేత –దేవతా భేదాల గొడవల జోలికి పోరాదు. శివుడైనా, కేశవుడైనా, శక్తియైనా మన వైదిక దేవతలే. 'సబ్రహ్మ స్సశివః సహరిః

సేంద్రః'- అన్న వైదిక హృదయానికి సాక్షాత్కారం వేంకటేశ్వర స్వరూపం. 'నమశ్శ్రీవేంకటేశాయ'.

ప్ర: **ముకుంద, మురారి - అనే నామాలు విష్ణునివా, కృష్ణునివా? వీటికి అర్థాలు ఏమిటి?**

జ: విష్ణువే కృష్ణుడు కనుక ఇద్దరికీ ఈ నామాలు వర్తిస్తాయి.

**'ముక్తిం దదాతీతి ముకున్దః'** - ముక్తినిచ్చువాడు ముకున్దుడు. "ఆశ్రయించిన భక్తులకు దుఃఖము నుండి ముక్తిని (విడుదలను) ఇచ్చువాడు-అవిద్యను తొలగించి శాశ్వత కైవల్యాన్ని ప్రసాదించువాడు" అని ఈ నామానికి అర్థం. శ్రీ మహావిష్ణువు భక్తులకు ఈ విధంగా అనుగ్రహిస్తాడు కనుక ఆయన ముకున్దుడు. శ్రీ కృష్ణునిగా శ్రీమహావిష్ణువు అవతరించినప్పుడు, సర్వులకు ముక్తినిచ్చాడు. వ్రజవాసులకు, అక్రూర ఉద్ధవాదులకు ముక్తినిచ్చిన శ్రీకృష్ణుని 'ముకున్దుడు' అని కీర్తించారు.

నరకాసురుని మిత్రుడు 'ముర'అనే రాక్షసుడు. ఇతడికి పంచ శిరస్సులు. శ్రీకృష్ణుడు నరకాసురుని సంహరించడానికి ముందుగా 'ముర' రాక్షసుడ్ని సంహరించాడు. ఈ విధంగా 'ముర' రాక్షసునకు 'అరి' (శత్రువు) కనుక శ్రీ కృష్ణుని 'మురారి' అన్నారు.

ప్ర: **నదుల్లో, సముద్రాల్లో పవిత్ర స్నానాలు చేసేటప్పుడు ఎలాంటి నియమాలు పాటించాలి?**



జ: నిద్రించిన వస్త్రాలతో నదిలో మునుగరాదు. ముందు నదీదేవతను, క్షేత్రదేవతలను స్మరించి, సంకల్పం చెప్పుకొని స్నానం చేయాలి. పుణ్యనదులలో పాపపరిహారార్థం చేసే పవిత్ర స్నానాలలో కచ్చితంగా నియమాలు పాటించాలి. నదిలో వస్త్రాల్ని పిండరాదు. సర్ఫ్‌లాంటివి ఉపయోగించరాదు. ఉతకరాదు. అభ్యంగన స్నానాలు చేయరాదు. (తలంటుకొనడం వంటివి కూడదు. ఇంక- షాంపూలు, కుంకు దులు వంటివి కూడదని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.) పొరపాటున కూడా నదిలోగానీ, నదీతీరాల్లోగానీ మల మూత్ర విసర్జనలు మహాపాపం. ఉమ్మరాదు. నీళ్ళను పుక్కిలించి ఉమ్మడం కూడా దోషమే. అవాచ్యాలు, కసురుకోవడాలు వంటివి కూడా చేయరాదు. సముద్రాన్ని కేవలం పర్వసమయాల్లోనే తాకాలి. సాన్నం చేయాలి. మామూలు సమయాల్లో తాకడం కూడా కూడదు. నదులనీ, సముద్రాలనీ దేవతాస్వరూ పాలుగా భావించి తగిన మర్యాదలతో ప్రవర్తించాలి. స్నానసమయంలో సంకల్పా దులు చెప్పుకోవాలి.

ప్ర: **ఏదైనా పారాయణను, జపాలను కొన్ని రోజులపాటు దీక్షగా సాగించాలంటే ఏ నియమాలను పాటించాలి?**

**జ:** రోజూ తలస్నానం చేయాలి. ఒక నిర్దేశిత స్థలంలోనే రోజూ సాధన చేయాలి. వీలైనంత వరకు మౌనం పాటించాలి. (అనవసరమైన మాటలు తగ్గించుకోవాలి.) కోపాదుల్ని నిగ్రహించుకోవాలి. బ్రహ్మచర్యం, భూశయనం ముఖ్యం. పారాయణకి ఉపయోగించే గ్రంథాన్ని గంధ, కుసుమాదులతో అర్చించి ప్రారంభించాలి. ఒళ్లో పెట్టుకొని, చేతులతో పట్టుకొని చదవడం కాకుండా పీఠంపై ఉంచి చదువుకోవచ్చు. దీక్షగా స్వీకరించిన కాలంలో క్షురకర్మ, గోళ్ళు తీసుకోవడం వంటివి పనికిరాదు. సాత్త్వికాహారాన్ని మితంగా, నియమితకాలంలో భుజించాలి. రోజూ స్వయంపాకం (ఇంటి భోజనం) చేయాలి. వండిన ఆహారాన్ని ఒక్కపూటే స్వీకరించి, రెండవ పూట అల్పాహారంగాని, ఫలాహారంగాని గ్రహించాలి. మిగులు వంటల్ని బైట ఆహార పదార్థాల్ని గ్రహించరాదు. పగటి నిద్ర పనికిరాదు. సంధ్యలలో నిద్రపోరాదు. గణపతిని, గురువును, అభీష్టదైవాన్ని స్మరించి, నమస్కరించి ప్రారంభించాలి. శుచిగా ఉంచిన వస్త్రాల్నే సాధన సమయంలో (జప, పారాయణ వేళల్లో) దీక్షావస్త్రాలుగా వాడాలి. దీక్షా వస్త్రాలతో భుజించరాదు. వాటిని వేరుగా ఉంచాలి. వేరే శుచి వస్త్రాలతో భుజించాలి. చిరుతిళ్ళను విసర్జించాలి.



ఇవి దీక్షలకు సాధారణ నియమాలు. ప్రత్యేక మంత్రాలకు, సాధనలకు ప్రత్యేక దీక్షలుంటాయి. అవి గురుముఖతః, ఆయా ఉపాసనాపరుల ద్వారా తెలుసుకొని పాటించాలి. అలాకాక నిత్యపారాయణలకు పెద్దపెద్ద దీక్షా నియమాల అవసరం లేదు. స్నానం చేసి, నిత్యమూ ఆచరించే శుచితో పారాయణాదులు చేసుకోవచ్చు.

**ప్ర: క్షేత్రయాత్రలు చేసేటప్పుడు పెద్దగా శుచివంటి నియమాలు పాటించనక్కర్లేదంటారు. నిజమేనా?**

**జ:** క్షేత్రంలో అనంతశక్తి ఉంటుంది. అందుకే ఏది చేసినా అనంతఫలం ప్రాప్తిస్తుంది. పుణ్యకర్మ ఎలా ఎన్నోరెట్లు ఫలాన్నిస్తుందో, అలాగే పాపకర్మ కూడా అత్యధిక ఫలాన్నిస్తుంది. క్షేత్రాలకు వెళ్లే ముందే సంకల్పించుకున్న రోజు నుండి ప్రత్యేకంగా జపాది నియమాలను పాటించడం మంచిది. క్షేత్రయాత్రల్ని విహార యాత్రలుగా, వినోద కాలక్షేపాలుగా చేయరాదు. క్షేత్రాలలో ఉన్నంతకాలం సత్యంగా, మృదువుగా, నియమంగా, మితంగా మాట్లాడాలి. నామజపమో, ఉపదేశింపబడిన మంత్రమో జపిస్తుండాలి. పారాయణాదులు కూడా మంచివి. ఆహారనియమం తప్పనిసరి.

ప్రాణరక్షణార్థం నియమిత కాలాల్లో మిత హిత సాత్త్వికాహారాన్ని స్వీరించాలి. క్షేత్రాధి

దేవతల్ని స్మరించి నమస్కరించాలి. వృథా కాలక్షేపాలను, పరనిందలను, లౌకిక వ్యవహారాలను చర్చించరాదు. వీలైనంత ఏకాంత సాధన మంచిది.

ఒక క్షేత్రంలో తిరుగుతున్నప్పుడు మరో క్షేత్రంతో పోల్చడం కూడదు. దీనికన్నా అది ఎక్కువనీ లేదా తక్కువనీ పోల్చి మాట్లాడరాదు. కోపం వచ్చిన సందర్భాలు ఎదురైనా నిగ్రహించుకోవాలి. కామక్రోధాదుల్ని తప్పనిసరిగా నియంత్రించ లేనివాళ్ళు క్షేత్ర యాత్రలకు అనర్హులు. రుచులకోసం వెంపర్లాడరాదు. మాటతో గానీ, క్రియతో గానీ, తలపుతోగానీ ఎవరినీ హింసించరాదు.

ప్ర: **'గజేన్ద్రమోక్షం' కథ వింటే అసంగతంగా ఉంటుంది. అది కేవలం సంకేతంగా కూర్చిన తత్త్వ కథా? లేక నిజంగా జరిగిందా? ఏనుగు భగవంతుని కీర్తించడ మేమిటి?**

**జ:** 'గజేన్ద్రమోక్షం' ఒక అద్భుతమైన తత్త్వ విజ్ఞాన ఘట్టం. అది 'మన' కథ. అన్నీ అను కూలించినంతకాలం తానే గొప్పవాడిననుకొనేవాడికి – నిజానికి తాను ఏకాకిననీ, నాదనుకొనేవి ఏవీ నావి కావనీ గ్రహించి, సర్వవ్యాపక చైతన్యాన్ని ప్రార్థించాడు. ఆ స్తోత్రం విశ్వజనీన ప్రార్థన.



మనకు అత్యవసరమైన సత్యదర్శనాన్ని కలిగించడానికి మహర్షి వ్యాసుడు ఈ కథను అందించాడు. అయితే ఇది జరగలేదని చెప్పడానికి మనమెవరం?

మనమున్నది వైవస్వత మన్వంతరంలోని (ఇది 7వ మన్వంతరం) 28వ మహా యుగంలోని కలియుగంలో. గజేన్ద్రమోక్షం కథ జరిగినది నాల్గవ మన్వంతరమైన తామస మన్వంతరం. ఏ జీవిలో ఏ ఆలోచన రేకెత్తుతుందో మనకేం తెలుసు? *ఎంత వేదవిజ్ఞానం బుద్ధి జీవులమైన మనముందు ఉన్నా, నిత్యసత్యాలు కనిపిస్తున్నా మన బుద్ధికి వివేకం రాకపోవడం ఎంత ఆశ్చర్యమో; అడవిలో ఉన్న ఏనుగుకి వివేకం కలగడమూ అంతే ఆశ్చర్యం.* పైగా ఏనుగుకి ఆ సమయంలో విష్ణుస్ఫురణ కలగడం 'పూర్వజన్మలో సంస్కారబలం' అని స్పష్టంగా భాగవతం వివరించింది. **"తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికం"**అని గీతావచనం.

"పూర్వజన్మల సంస్కారాల వల్ల బుద్ధియోగం కలుగుతుంద"ని అర్థం. ఈ విషయాన్ని స్పష్టం చేస్తూ – "ప్రాగ్జన్మన్యనుశిక్షితం" అన్నాడు వ్యాసదేవుడు. "గతజన్మల అభ్యాస బలం" వలన – అని. యోగమనేది ఒక జన్మలో ప్రారంభిస్తే, అది తరువాతి జన్మ లకి కూడా కొనసాగింపబడి సిద్ధిస్తుంది. ఈ గజేన్ద్రుడు గత జన్మలో ఇన్ద్రద్యుమ్నుడనే

రాజు. విష్ణుభక్తుడు. కానీ అగస్త్యమహర్షిని నిర్లక్ష్యం చేసిన దోషం చేత దేహాభిమానం కలిగిన గజేంద్రుడ య్యడు. మొసలితో పోరాటం చేత, గత సంస్కారం మేల్కొని నాటి విష్ణుస్మరణ కలిగి ఈ జన్మలో మోక్షం పొందాడు.

అదే విధంగా–'హూ హూ' అనే గంధర్వుడు జలవిహారం చేస్తూ, తన సఖులను మెప్పించడానికి, జలంలో దూరి ఒడ్డున ఉన్న 'దేవలుడ'నే అనే మహర్షి కాళ్ళు పట్టుకొని లాగాడు. ఆ దోషానికి ఫలితంగా మొసలిగా జన్మించి, తిరిగి మరో భాగవతోత్తముని (గజేంద్రుని) కాలుని పట్టుకొని, విష్ణు చక్ర స్పర్శ వలన మరల గంధర్వుడయ్యాడు. ఇవి గతజన్మల సంస్కారవాసనలు. అందుకే మనం ఉత్తమ సంస్కారాలను ఏర్పరుచుకోవాలనీ, అహంకారం వల్ల దుష్కర్మల నాచరించకుండా, అప్రమత్తంగా ఉండాలనీ ఈ కథ బోధిస్తోంది. ఏనాడో జరిగిన కథని, ఈనాటి మనకు జ్ఞాన బోధకంగా అందించిన మహర్షుల సునిశిత దృష్టికి జోహారులర్పించాలి.

ప్ర: **నాకు వయస్సు వచ్చింది కానీ, దానితో అజ్ఞానం కూడా పెరుగుతూ చీకటిలో తడుముకొంటున్నాను. భగవంతుడు ఇన్ని రకాలుగా ఇన్ని భేదాలతో ఉండి ప్రజలలో భిన్నత్వం–అంటే కొందరు వైష్ణవులనీ, కొందరు శైవులనీ– ఎవరి దేముడు వారికి గొప్పగా చెప్తారు. సర్వవ్యాపియగు భగవంతుడు ఒక్కడే కదా! అలాంటప్పుడు ఇన్ని రూపాలు, భేదాలు ఎందుకు? ఒకానొకప్పుడు అనిపిస్తుంది– మహ్మదీయ మతమే బాగుందని. వారికి 'అల్లా' ఒక్కడే నిర్గుణ దైవం. అలాగే క్రైస్తవులకు సైతం ఒక్కడే. నా అజ్ఞానం నుండి విముక్తి కలిగించండి.**



జ: వయస్సురీత్యా పెద్దవారైన మీకు నమస్సులు. ఇక మీ ఆలోచన అజ్ఞానంగా మీకే తెలిసిరావడం కొంత మేరకు అదృష్టమే. తన అజ్ఞానాన్ని గుర్తించేవాడు కొంత మేరకు జ్ఞాని. ఈ ప్రశ్నలు చాలా చాలా మార్లు చాలా మంది వేశారు. వాటికి చాలా చాలా రకాల సమాధానాలు చాలా చాలామంది మేధావులు చెప్పారు. అయినా ఈ ప్రశ్నలు పుడుతూనే వున్నాయి. శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానంద వంటి ఎందరో మహాత్ములు వీటికి సూటిగా, స్పష్టంగా సమాధానా లిచ్చారు. అలాంటి సద్గ్రంథాలను పఠించండి.

మనం పుట్టిన మన మాతృమతం, మాతృ ధర్మం కన్నా గొప్పది మరొకటి ఉందని ఆకర్షితం కావడం మహాపాపం. అలాగని ఇతర ధర్మాలు గొప్పవి కావని కాదు. వేటికవే గొప్పవి కానీ స్వధర్మం కన్నా పరధర్మం గొప్పదేమో అనే ఊహ కూడా

ప్రమాదాన్ని కలిగిస్తుంది.

మన శరీరం మనది. దానికున్న కొలత, లోపలి వ్యవస్థ అది పూర్తిగా స్వీయం(తనకు సంబంధించినది). దానిలో గొప్పతనం వుంది, కాని లోపాలూ ఉండవచ్చు. ఏవో కొద్ది లోపాలు లేకుండా ఏ శరీరమూ ఉండదు. అంత మాత్రాన ఇంకొకడి శరీరం బాగుందనో, లేదు ఏ పక్షిగానో మారిపోతే ఆకాశంలో ఎగరొ చ్చనో, ఏ పులిగా మారిపోతే అడవిలో విహరించవచ్చనో తన స్వదేహాన్ని నిర్మూలించు కోవాలను కోవడం ఎంత అజ్ఞానమో, మన అద్భుతమైన సనాతన ధర్మాన్ని అర్థం చేసుకోలేక, అర్థం చేసుకునే ప్రయత్నం చేయక పరధర్మాల వైపు మొగ్గు చూపడం అంతే అజ్ఞానం. అంతే ప్రమాదకరం.

ముస్లిములలో ఎన్ని భేదాలున్నాయో, క్రైస్తవులలో ఎన్ని ఉన్నాయో మనకేమి ఎరుక? మన మతంలో ఏ ధర్మాన్ని మనం నిష్ఠగా అనుష్ఠించాం?

ఇక నిర్గుణత్వం వల్లనే పర ధర్మం మీకు బాగున్నట్లయితే, ఆ నిర్గుణ భావన కూడా మన సంస్కృతిలోనే ఉందని మరచిపోయారా?



**పుంరూపం వా స్మరేద్దేవం**
**స్త్రీ రూపం వా విచిన్తయేత్।**
**అథవా నిష్కళాం ధ్యాయేత్**
**సచ్చిదానంద విగ్రహమ్॥**

సత్యం, జ్ఞానం, ఆనందం అనే లక్షణాలతోనున్న పరమాత్మ ఒక్కడే. ఆ తత్త్వాన్ని పురుష రూపంగా స్మరించవచ్చు. స్త్రీ రూపంగా చిన్తన చేయవచ్చు. లేదా నిర్గుణంగా ధ్యానించవచ్చు.వారి వారి జీవలక్షణాలననుసరించి ఉంటుందది.

ఒకే వ్యక్తి ఉద్యోగిగా, తండ్రిగా, భర్తగా, కళాకారుడిగా, అనేక వ్యవహారాల్లో అనేక విధాలుగా ఉంటాడు. ప్రతి వ్యవహారంలో కనబడినప్పటికీ అతడొక్కడే కదా! భగవంతుడు సర్వవ్యాపకుడే. ఒక్కడే "ఏకంసత్".

***"ఏకో దేవః సర్వభూతేషు గూఢః"*** అని చాలా స్పష్టంగా వేదమంత్రాలు చెప్పాయి. ఆ ఏకం ఏకంగా లేదు. అనేకంగా వ్యక్తమయింది.

"నేను" అనే ప్రాణశక్తి మన శరీరంలో భిన్న భిన్న ఇన్ద్రియాలలో ప్రసరించినా అవన్నీ భిన్నంగా భావించకుండా అంతా కలిపి "నేను" అనుకోవడం లేదా! అలాగే భిన్నంగా కనిపించే విశ్వవ్యాపక ఈశ్వరతత్త్వం సృష్టి, స్థితి, లయ, విద్య, ఐశ్వర్యం,

పరాక్రమం... ఇలాంటి భిన్న భిన్న శక్తుల్ని ప్రదర్శిస్తోంది. వాటికనుగుణమైన నామ రూపాల ద్వారా వ్యక్తమవుతోంది.

మన జీవలక్షణాలననుసరించి ఏ దైవాన్ని ఆరాధించినా అది ఆ 'ఏక' తత్త్వమే కనుక, అదే సమస్తంగా మనకు గోచరిస్తుంది. ఆ మార్గంలో మనం వెళ్ళవచ్చు. 'వెరైటీ' (పలు రకాల వైఖరి) సృష్టి లక్షణం. అందులో ఉన్నాం మనం. దానిని అంగీకరించక తప్పదు.

ఇందరు దేవుళ్ళు ఎందుకు? అని ప్రశ్నించడానికి మనమెవ్వరం? మనం సృష్టించుకున్న వాళ్ళు కారు దేవతలు. ఒకే దైవ శక్తి విశ్వరక్షణ కోసం, విశ్వ నిర్వహణ కోసం పలురకాలుగా వ్యక్తమయింది. వారే దేవతలు. ఆ ఏకత్వాన్ని మనం విష్ణువన్నా, శివుడన్నా తప్పులేదు.

ఇన్ని చెట్లెందుకు? ఇన్ని నక్షత్రాలెందుకు? ఇన్ని కొండలెందుకు! ఇన్ని పువ్వులెందుకు? ఇన్ని నదులెందుకు? ఇందరు మనుషులెందుకు? ఇన్ని గ్రహా లెందుకు? ఇన్ని అవయవాలెందుకు? ఈ ప్రశ్నలు వేయడానికి మనమెవరం? ఇందరిలో ఒకరిమైన మన శక్తి ఎంత? ఇందరు దేవతలెందుకు? అని మన మెవరం నిర్దేశించడానికి. విభిన్న ప్రకృతి శక్తుల్ని నియిమించే విభిన్న సూక్ష్మ దైవీశక్తులే దేవతలు. ఒక్కొక్క శక్తిని జాగృతం చేసుకొని ఒక్కొక్క ప్రయోజనం పొందవచ్చు. ఒకదానిని అభీష్టంగా కొలుచుకున్నా, మిగిలినవి అవే రూపాలుగా భావించి నమస్కరించవచ్చు. మన ధర్మంలో ఉన్న విలక్షణత, గొప్పతనం అదే.



ఇన్ని మందులెందుకు? ఇన్ని వైద్య విధానాలెందుకు? అని ప్రశ్నించగలమా? ఇన్ని రకాల సంగీత విద్వాంసులెందుకు? సంగీతాలెందుకు? ఒకరికి ఒక గాయకుడు ఇష్టం. ఇంకొకరికి ఇంకొకడు. ఇద్దరు గాయకులూ సంస్కారవంతులైతే ఒకరినొకరు గౌరవించుకుంటారు. రుచి తెలిసినవాడు ఇద్దరిలోని భిన్న భిన్న ప్రత్యేకతలని ఆస్వాదిస్తూ ఆనందిస్తాడు.

అనేక రకాల ఆహార పదార్థాలు కనబడగానే 'బాబోయ్ ఇన్ని ఎందుకు?' అని వదిలిపెడతామా? ఆకలితోనే పస్తు పడుకుంటామా? తిని హరాయించుకొనే వాడు అన్నీ తింటాడు. అన్నీ తినలేనివాడు ఏదో ఒకదానితో సరిపెట్టుకుంటాడు. ఏది తిన్నప్పుడు అదే గొప్ప.

నలుగురు పిల్లలపై సమానంగా ప్రేమను పంచలేక పోతున్నానని కన్నతల్లి ఏ

ఒక్కడ్నే మిగిల్చి మిగిలినవారిని చంపడంగానీ, వదులుకోవడంగానీ చేస్తుందా? మన ధర్మం నుండి పరధర్మంలోకి మారడం ఆత్మహత్యా సదృశం. పరులని మన ధర్మంలోకి మార్చడం హత్య చేసినంత మహాపాతకం. ఒక పరంపరాగత విశ్వాసాన్నీ, ధర్మాన్ని మార్చే హక్కు మనకెక్కడిది? అనేక బుద్ధులు, అనేక సంప్రదాయాలు, ఏదో ఒక్కటి రాజ్యమేలాలనే ఆక్రమణ బుద్ధి హింసకు దారి తీస్తుంది. ఏ దేహంతో పుట్టామో, ఏ మతంలో పుట్టామో దానిని నాశనం చేసుకో రాదు. బాగున్న లేపనాలు ఎన్ని పూసుకున్నా అసలు దేహాన్ని వదలరాదు. అలానే మన దేహానికి 'ఎలర్జీ' కలిగించే పదార్థాలనీ వాడరాదు కదా! అలాగే మన స్వాభావిక, జన్మసహజ మతాన్ని విడనాడితే భ్రష్టత్వమే.

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్।**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥**

–అని ఎంతో అద్భుతంగా చెప్పిన మన మతం యొక్క విశాలతనీ, విశిష్టతనీ గ్రహించ లేక పోవడం ఒక దౌర్భాగ్యం. దీనిని అర్థం చేసుకోవడానికి శాస్త్ర ప్రమాణాలదాకా వెళ్ళనక్కర లేదు. కనీసం వివేకం ఉంటే చాలు. దానిని కూడా కోల్పోకుండా జాగ్రత్త పడవలసిన అవసరముంది.



మీరు వ్రాసిన అతి పెద్ద ఉత్తరంలో మీ నాన్నగారు గొప్ప భక్తులనీ, గొప్పగా నిత్యం భగవద్గీత, భాగవతం వంటివి పారాయణ చేసి ఆచరణలో పెట్టిన కర్మయోగి అనీ, మరణించేటప్పుడు నిశ్చలంగా ఆనందంగా ఉండి 'నిశ్చింత' అంటూ కన్ను మూసు కున్నారనీ వ్రాశారు. మరి వారెవరికీ మీకొచ్చిన ప్రశ్నలు రాలేదా? అంత చక్కని సార్థక జీవితం గడిపిన తండ్రిగారు మీకు మార్గదర్శకం కాక, పరాయి మతంవైపు చూపు వెళ్ళిన దుఃస్థితి ఎందుకు? (క్షమించాలి)

ఎంత చెప్పినా అజ్ఞానం తొలగలేదంటే, మనలో సాధనా బలం లేదని అర్థం. అందుకు అజ్ఞానం తొలగించమని ఏదో ఒక అభీష్ట దైవాన్ని ప్రార్థించండి. అలా ఎంచుకొనే స్వేచ్ఛ మీకుంది. ఎంచుకోలేక పోతే అందుబాటులోకి వచ్చిన మన సనాతన ధర్మపు దైవాలందరికీ దండం పెట్టుకోండి. ప్రశ్న మీరడిగినదే అయినా, ఎందరిలోనో ఇంకా తొలుచుతున్న ప్రశ్న. ఎన్ని మార్లో పెద్దలు స్వానుభవంతో చెప్పిన సమాధానాలే ఇవి. అంతే కాదు ఋషిపీఠమ్ ఎన్నో మార్లు చెప్పింది. రాజసగుణం, తామసగుణం విజృంభించినవారికి అన్నీ భిన్నం గానే కనిపిస్తాయనీ, సాత్త్వికగుణం కలిగిన వారికి

భిన్నమైనవి గోచరిస్తున్నా అన్నిటా ఏకత్వమే స్ఫురిస్తుందని శ్రీకృష్ణుని గీతావచనం. **"అవిభక్తం విభక్తేషు తత్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్"** (18వ అధ్యాయం. భగవద్గీత) అందుకే సాత్త్వికాహారం స్వీకరిస్తూ, సాత్త్విక కర్మలు చేస్తూ ధ్యాన, అర్చనాది క్రియలు చేయండి. ఇంత మంది దేవతలు బలగం కలిగిన గొప్పమతం మనది. ఇది దీని ప్రత్యేకత. ఈ గొప్పతనాన్ని గుర్తించండి. నిర్గుణ, సగుణ తత్త్వాలన్నీ మన ధర్మంలోనే ఉన్నాయి. కొత్తగా ఎక్కడి నుండో తెచ్చుకోనక్కర్లేదు. రంగులూ, రంగులు లేని స్ఫటికతత్త్వమూ అన్నీ మనకున్నాయి.

అద్భుతమైన యోగవిద్య, ధ్యాన మార్గం, యజ్ఞాలు, విభిన్న భక్తి మార్గాలు... ఇంత వైవిధ్యం, విస్తృతీ ఉన్న భారతీయతకి వారసులం మనం.

ఇతరులలోకి మనవారు మరలిపోకుండా మాతృస్థానమైన స్వధర్మాన్ని వీడకూదని మనం ధర్మాన్ని ప్రచోదనం చేస్తాం. అంతేగానీ, ఇతరుల్ని మనలోకి రమ్మని ప్రచారం చేయం. అది మన ఉత్కృష్టత. సంస్కారం. వారంతటవారు దీని ఔన్నత్యాన్ని గ్రహించి వస్తే అది వేరే విషయం. అన్ని మార్గాలూ ఈ మతంలో ఉన్నాయి. అందుకోసం కన్న తల్లినీ, ఉన్న ధర్మాన్నీ వీడనవసరం లేదు. వీటిని మీరు గ్రహించి, తరువాతి తరాల వారికి గ్రహింపచేయండి. స్వధర్మాన్ని వదలాలనే హృదయ దౌర్బల్యాన్ని రానీయవద్దు.

ప్ర: ***"అపవర్గం" అంటే అర్థం ఏమిటి? 'స్వర్గాపవర్గాలు' అంటారు కదా! 'స్వర్గం' అంటే అర్థమయ్యింది. కానీ 'అపవర్గం' అంటే తెలియలేదు.***

**జ:** 'స్వర్గం' పారలౌకిక సుఖం. అపవర్గం పరలోక సుఖం కన్నా గొప్పది. శాశ్వత బ్రహ్మానంద ప్రాప్తినే 'మోక్షం', 'కైవల్యం' అంటారు. అదే 'అపవర్గం'. పరమాత్మ సాయుజ్యం వలన అది లభిస్తుంది. జ్ఞానులు దానినే లక్ష్యంగా సాధన చేస్తారు.

ధర్మ, అర్థ, కామములను - 'త్రివర్గం' అంటారు. వాటికంటే అతీతమైన మోక్షమే 'అపవర్గం'. 'ప' వర్గానికి చెందనిది అపవర్గం... అని అర్థం. అక్షరాలలో 'ప' వర్గము 'ప, ఫ, బ, భ, మ'. వీటితో మొదలయ్యే పదాలు 'ప' వర్గానికి చెందినవి.

**పంచత్వం, ఫల, బంధాశ్చ, భయం చ, మమతా పి చ।**
**పంచైతే యత్రనో సంతి సః అపవర్గః ప్రకీర్తితః॥**

'పంచత్వం' (మృత్యువు), ఫలం (కర్మఫలం- పుణ్యపాపాలు), బంధం (సంసార బంధం), భయం, మమత్వం - ఈ అయిదు బాధలు లేనిది 'అపవర్గం'.

**ప్ర: బ్రహ్మలోకం వైకుంఠలోకం ఊర్ధ్వలోకాలుగా ఉన్నాయి. కానీ కైలాసలోకం మాత్రం భూమిపై, మానస సరోవరం వద్ద ఉంది? ఏమిటిందులో విచిత్రం?**

**జ:** భూమిపై, మానస సరోవరం వద్ద ఉన్నది కైలాసలోకం కాదు. కైలాస పర్వతం. ఇది హిమవత్పర్వత ప్రాంతాన ఉంది. అసలు కైలాసలోకం ఊర్ధ్వలోకమే. చతుర్దశ భువనాలు (14 లోకాలు) బ్రహ్మాండం లోనివి. ఇవి మహాప్రళయాలలో నశించేవి. వీటికిపైన ఉన్నవి వైకుంఠలోకం, కైలాసలోకం. ఇవి శాశ్వతలోకాలు. పరమేశ్వరుడు శివరూపంగా కైలాసం లోనూ, విష్ణురూపంగా వైకుంఠంలోనూ విరాజిల్లుతుంటాడు. ఆ కైలాస విభూతి పృథ్విపై, మునీంద్రాదులను అనుగ్రహించడానికి పర్వతరూపంగా వెలసింది. ఊర్ధ్వ లోకాన ఉన్న ఆ మహోన్నత కైలాసం నుండి ఒక కిరణం ఈ పర్వతంపై నిరంతరం ప్రసరిస్తుంటుందని, దాని ఫలంగా శివత్వశక్తి దీనినుండి వెలికి వస్తుందని యోగులమాట.

ఇది భూమి మీద వెలసిన పవిత్ర క్షేత్రం. అంతేగానీ శివుని శాశ్వతమైన కైలాసలోకం కాదు. కాశీ, కేదారాల వలె శివుడు హిమశిఖరాలపై వెలసిన ఒక క్షేత్రం. అత్యంత పవిత్రమైనదిది.



యోగపరంగా చూస్తే పరబ్రహ్మానుభవమే కైలాసం. 'కైలాసం' అంటే 'ఆనంద ధామం.' పరిపూర్ణమైన ఆనందానికే కైలాసమనీ, వైకుంఠమనీ పేర్లు. యోగి ఆరుచక్రాలను దాటి సహస్రార కమలాన లీనమై పొందే బ్రహ్మానుభూతి, జ్ఞాని పొందే పరమ కైవల్యం వీటినే భక్తులు లోకాలుగా అనుభవిస్తారు. ఆ సహస్రార భూమిక శివభక్తునకు కైలాసంగా, విష్ణుభక్తునకు వైకుంఠంగా, శక్తిభక్తునకు మణిద్వీపంగా అనుభవ మౌతుంది. దీనినే 'పరంధామ'మంటారు.

ఈ యోగసిద్ధిని కలిగించడానికి అనువుగా మన సాధనను పండించేవే క్షేత్రాలు. కైలాస పర్వతం శివానంద ప్రాప్తికి చక్కని క్షేత్రం. సుస్థిరమైన సచ్చిదానంద ధామానికి సంకేతమిది. ఇదే పరంధామం.

**ప్ర: 'ధర్మో రక్షతి రక్షితః' అనే మాట చాలా ప్రసిద్ధం. ఇంతకీ ఈ వాక్యం దేని నుండి స్వీకరించబడిందో తెలియదు. ఏ గ్రంథంలో, ఏ సందర్భంలో ఇది చెప్పబడిందో తెలియ జేస్తారా?**

**జ:** ఈ వాక్యం 'మనుస్మృతి' లోనిది. ధర్మం గొప్పతనాన్ని తెలియజేస్తూ మనువు తన ధర్మ శాస్త్రంలో 8వ అధ్యాయం, 15వ శ్లోకంలో ఈ వాక్యాన్ని చెప్పారు. ఆ శ్లోకం

పూర్తి పాఠమిది.

**ధర్మ ఏవ హతో హన్తి**

**ధర్మో రక్షతి రక్షితః।**

**తస్మాద్ధర్మో న హన్తవ్యో**

**మా నో ధర్మో హతో వధీత్॥** –ధర్మాన్ని హింసించిన వాడు హింసింపబడతాడు. ధర్మాన్ని రక్షించినవాడు రక్షింపబడతాడు. కనుక ధర్మాన్ని దెబ్బతీయరాదు. ధర్మం యొక్క సరియైన స్వరూపాన్ని తెలిసి, దానిని అనుసరించి ఆచరించడమే ధర్మాన్ని రక్షించడం. దాని వలన సుఖశాంతులు, శ్రేయస్సు లభిస్తాయి. ధర్మ విరుద్ధాన్ని ఆచరించడమే ధర్మాన్ని హింసించడం. ఇటువంటి వారికి పరిణామంలో దుఃఖమే కలుగుతుంది. విహిత ధర్మాచరణలో ఉన్నవానికి వాని ధర్మమే రక్షిస్తుంది. ధర్మం వల్ల తాత్కాలిక భౌతిక ప్రయోజనాలు లభించలేదని, అధర్మాన్ని ఆశ్రయిస్తే శాశ్వత దుఃఖం తప్పదు. ధర్మం ఆత్మను కాపాడుతుంది. పరమమైన శ్రేయస్సును లభింప జేస్తుంది. ఈ శ్లోకం మహాభారతంలో కూడా కనబడుతుంది.

ప్ర: **అష్టాక్షరి 'ఓం' కారంతో ప్రారంభమౌతుందనీ, పంచాక్షరి అలా కాదు కనుక – అష్టాక్షరి సహజసిద్ధమైన వైదిక మంత్రమనీ, పంచాక్షరి కన్నా గొప్పదని ఓ వైష్ణవా చార్యుడు ఒక పత్రిక ఇంటర్వ్యూలో సెలవిచ్చారు? ఇది ఎంతవరకు సమంజసం?**



**జ:** ఇవే మన మతంలో పుడుతున్న ముసలాలు. ఒకదాని గొప్పదనాన్ని చెప్పడానికి, ఇంకొక దానిని అవమానించవలసిన పనిలేదు. దేని ప్రత్యేకత దానిదే. ఎవరు ఏ మంత్రాన్ని అభీష్టంగా ఉపాసిస్తారో వారికి అదే పరమం. కానీ ఇంకొకరి మంత్రాన్ని కించబరచడం మహాపాపం. 'ఓం' కారం కలపనవసరం లేకుండానే మహామంత్రంగా విలసిల్లే తారకమంత్రం పంచాక్షరి. 'తారకం' అంటే మోక్షకారక మంత్రం. ఈ తారకమంత్రాలు అష్టాక్షరి, పంచాక్షరి, శ్రీ విద్య, శ్రీరామమంత్రం – వంటివి. యజుర్వేదాంతర్గతమైన రుద్రనమకాలలో 'నమస్తారాయ నమశ్శంభ వేచ' అని మొదలు పెట్టి 'నమశ్శివాయ' అని పంచాక్షరీ మహామంత్రాన్ని వేదమాత ఆవి ష్కరించింది. విద్యలలో వేదవిద్య, అందులో రుద్ర మంత్రాలు, అందులో పంచాక్షరి... శ్రేష్ఠతమాలని వైదికశాస్త్రాలు చెబుతున్నాయి.

'ఓం' కారం సూక్ష్మ ప్రణవం. 'పంచాక్షరి' స్థూలప్రణవం. అందుకే ప్రత్యేకించి 'ఓం' కారం లేకుండానే పంచాక్షరి 'నమశ్శివాయ' లేదా 'శివాయనమః' అని జపించ

వచ్చు. ఉపదేశం పొందినవారు 'ఓం'కారం సహితంగా జపించడం వేదంలోనే చెప్పబడింది. అథర్వణ బృహజ్జాబాలోపనిషత్తులో – ప్రణవ సహిత పంచాక్షరి విషయం స్పష్టంగా ఉంది. పంచాక్షరి మహిమ అపారం. దాని తత్త్వం, అంతరార్థం ఆ ఉపాసకులకు తెలుసు. ఒక ఔషధం సేవించేవారు మరో ఔషధాన్ని నిందించడం, ఒక ఫలాన్ని తినేవారు మరో ఫలాన్ని తూలనాడడం ఎంత అవివేకమో తన మంత్రం తాను ఉపాసిస్తూ మరో మంత్రాన్ని కించపరచడం అంతే అవివేకం.

మరొక ప్రత్యేకత– వేదాలలో ఎవరూ కాదనలేని ప్రధానమైన 'సంహితా' భాగంలో ఉంది పంచాక్షరి.

ఈ భేద దృష్టి కలవారిని ఆచార్యులుగా భావించడమే దోషం. పంచాక్షరీ, అష్టాక్షరీ కూడా పరమాత్మ ప్రాప్తికి సాధనలు. రెండూ వైదిక మంత్రాలు. తంత్ర శాస్త్రాలలో, పురాణాలలో బహుధా నిరూపితాలు. శివ కేశవ నిందకునికి, పంచాక్షరీ అష్టాక్షరీ మంత్రాలను కించపరచేవారికి సద్గతులుండవని శాస్త్రవచనం. దయచేసి అవైదిక వాదనలను నిరసించండి.



ప్ర: ***దేవతలను పద్మాలలో కూర్చున్నట్లుగా వర్ణిస్తారు. ముఖ్యంగా మహాలక్ష్మిని. ఏ కారణం చేత?***

**జ:** పద్మం పరిపూర్ణకుసుమం. అది ఐశ్వర్యానికీ, వికసించిన జ్ఞానానికీ సంకేతం. జ్ఞానంలోనే దేవతాశక్తి దీపిస్తుంది. అదే విధంగా దేవతాశక్తి అనుగ్రహించినప్పుడే ఐశ్వర్యం లభిస్తుంది. దేవత అంటేనే ఐశ్వర్యశక్తి. వాక్కు, జ్ఞానం, ధనం, ధాన్యం, సంతోషం, ఆయువు – ఇవన్నీ ఐశ్వర్యాలే. వీటిని అధిష్ఠించి ఉంటారు దేవతలు. ఐశ్వర్యాధిదేవత లక్ష్మిని 'కమల'గా వర్ణించారు.

హృదయాన్ని కూడా పద్మంగా పేర్కొన్నారు. సద్భావాలతో పరిమళించి, శాంతానందమే అనుభూతిమకరందంగా, మెత్తదనమే లక్షణంగా, జ్ఞానంతో వికసించిన మనఃపద్మంలో దైవం గోచరిస్తాడు. దానికి సంకేతంగా పద్మంలో దైవాన్ని దర్శిస్తారు. యోగపరంగా – సుషుమ్నా నాడి మార్గంలో ముఖ్య ప్రాణరూపంగా ప్రసరించే దైవ చైతన్యాన్ని ఆరు చక్రాలలో ఆవిష్కరించుకుంటాం. ఆ ఆరు చక్రాలు స్పందించి వికసిం చాలి. ఏ అవరోధాలు లేకుండా శక్తిని ఆవిష్కరించుకొనేలా ఆ చక్రాలు వికసించినప్పుడు పద్మమువలె భాసిస్తాయి. ఆ ఆరు చక్రాలనే ఆరు పద్మాలుగా వర్ణించారు. వాటిలో ప్రకాశించే ఆత్మ చైతన్యమే దేవత. పరమపదంగా బహు

విధాలుగా బ్రహ్మ రంధ్రంలో ప్రకాశమానమైన సహస్రార కమలంలో పరిపూర్ణ పరబ్రహ్మ తేజస్సు గోచరిస్తుంది. ఈ స్థితిని గ్రహించడానికే కమలంలో దైవాన్ని ఆరాధించడం.

ప్ర: **ఏవైనా ప్రకృతి ఉపద్రవాలు, వేదనలు కలిగితే 'ధర్మానికి దెబ్బతగలడం వల్లనే ఇలా జరిగింది' అంటారు. ఇది మూఢ నమ్మకం కాదా! భూమికింద మార్పులు జరిగితే భూకంపం వస్తుంది. సముద్రంలో అల్ప పీడనాదులు కలిగితే తుపాను లొస్తాయి. అంతేకానీ, ధర్మగ్లాని వల్ల ఉపద్రవాలు కలిగాయనడం సమంజసమా!**

జ: ఒంట్లో బాక్టీరియావో, వైరస్సో చేరితే అనారోగ్యం వస్తుంది. నిజమే. కానీ ఆ ప్రమాదకర పదార్థం చేరడానికి కలుషిత పదార్థాల వాడకం వంటి మరేదో కారణం ఉంటుంది కదా! కనబడే కారణాలకు మూలమైన కనబడని కారణాలు చాలా ఉంటాయి. పైపై కారణాలను భౌతికవిజ్ఞానం చెబితే, ప్రభావవంతమైన సూక్ష్మకారణాలను సూక్ష్మవిజ్ఞానం చెబుతుంది. కొమ్మలేనిదే పళ్లు లేవు –అనేది ఒక కారణం. కానీ మూలం లేనిదే కొమ్మలేదు – అనేది ముఖ్యకారణం.

ధర్మానికీ, ప్రకృతికీ అవినాభావ సంబంధముంది.ప్రకృతి జడపదార్థం కాదు. అది చైతన్యవంతం. ప్రకృతి శక్తులు మానవ ప్రవర్తనల్ని పరిశీలిస్తూంటాయి. ధర్మానికి విఘాతం ఏర్పడితే పంచ భూతాలు క్షోభిస్తాయి. ఇది విశ్వనియమం. కేవలం తాత్కాలిక భౌతిక సుఖాలను దృష్టిలో పెట్టుకొని శాశ్వత ధర్మాన్ని దెబ్బతీస్తే ప్రకృతి శక్తులు విజృంభించక తప్పవు. సత్యం, శుచి(శుద్ధత), ధర్మమయ సంపాదన, అహింస, ఇంద్రియ నిగ్రహం.....ఇవి ప్రధాన ధర్మసూత్రాలు. వీటిని విడనాడినప్పుడు ఆ దుష్ఫలితాలను అనుభవించక తప్పదు.



ప్ర: **తిరుమలలో నెలవైన దేవుడు శ్రీనివాసుడుగా పురాణ ప్రశస్తి, దేవునికి వేంకటేశ్వర నామం ఎప్పుడు ఏర్పడింది? ప్రచారంలో ఉన్న ఈ రెండు నామాలను వదలి 'గోవింద' స్మరణ జరపడానికి మూలమేమిటి?**

జ: 'శ్రీనివాస', 'గోవింద' నామాలు విష్ణువునకు సహజనామాలు. 'వేంకటేశ' నామం క్షేత్రదైవంగా వచ్చిన నామం. లక్ష్మీదేవి (శ్రీ) ఎల్లప్పుడు నారాయణుని ఆశ్రయించుకొని ఉండడం చేత ఆయనను 'శ్రీనివాస' అన్నారు. 'గో' అంటే వేదవాక్యాలు, 'భూమి' అని రెండర్థాలు. 'గోవిందుడు' అంటే 'వేదములచే నుతింపబడే పరతత్త్వం', 'వేదాల ద్వారా తెలియబడే పరబ్రహ్మ' అని అర్థంతో పాటు 'భూమిని గ్రహించి,

ప్రళయ జలాల నుండి ఉద్ధరించిన ఆదివరాహస్వామి' అని కూడా అర్థం ఉంది. ఇంక కృష్ణుడు గోపాలకుడు కనుక 'గోవిందుడు' –ఇలా మూడు అర్థాలలోనూ నారాయణుడు తెలియబడుతున్నాడు.

కృతయుగంలోనే భూదేవి ప్రార్థన మేరకు, బ్రహ్మాదుల కోరిక మేరకు నారాయణుడు పృథ్విపై తన విభూతులతో విహరించదలచుకున్నాడు. ఆయన విహారం కోసం ఆదిశేషుడే పర్వతంగా వెలశాడు. అందుకే అది శేషాద్రి. ఆదివరాహ స్వామి (భూమిని ఉద్ధరించిన గోవిందుడు) రూపంలో అక్కడ మొదటిసారిగా విహరించాడు శ్రీహరి. శ్రీహరి విహారం చేత ఆ పర్వతం పరమపావనమై దర్శించిన వారి పాపాలను నశింపజేసే శక్తిమంత క్షేత్రమయ్యింది. 'వేం' అంటే 'పాపములను', 'కట' అంటే సంహరించునది' అని అర్థం.

"వేంకట–పాపసంహారకం". ఆ పర్వతంపై వెలసి భక్తులను పావనులను చేసే స్వామి కనుక శ్రీ వేంకటేశ్వరుడు. మరొక అర్థంలో "వేం" అమృతబీజం, "కట" ఐశ్వర్య వాచకం. అమృతం(ఆనందం), ఐశ్వర్యం అందించే విష్ణు పరత్వం వేంకటాచలం.



కలియుగారంభంలో మరియొక రూపంలో స్వామి ఈ పర్వతానికి వచ్చి శ్రీ లక్ష్మి అవతారమైన పద్మావతిని వివాహమాడి, తన ఆదిరూపమైన వరాహస్వామి అనుమతి తో ఇక్కడ వెలశాడని పురాణకథ.

**ప్ర: శ్రీనివాస కల్యాణం పద్మావతీ దేవితో జరిగినట్లు పురాణ కథనం. మరి తిరుమలలో జరిపే కల్యాణం శ్రీదేవి, భూదేవులతో ఉంటుంది. ప్రవరలో శ్రీనివాసుని విష్ణుమూర్తి పౌత్రుడుగా చెబుతారు. ఈ వైరుధ్యాలకు పొంతన ఏమిటి?**

**జ:** పురాణ కథ ఎలా ఉన్నా, పద్మావతి మహాలక్ష్మి స్వరూపం. విశ్వవ్యాపకమైన విష్ణుని విభూతి (ఐశ్వర్య), శ్రీదేవి. భూమిగా ఉన్న లక్ష్మి భూదేవి. ఈ రెండూ ఒకే తల్లి రూపాలు. వృష్టి చైతన్యానికీ, విశ్వచైతన్యానికీ ఈశ్వరుడు (ప్రభువు) శ్రీహరి. ఈ తాత్విక భావనే ఉభయ దేవేరుల వివాహంలో గ్రహించాలి. ఆగమ సంప్రదాయాను సారం ఉభయదేవేరులకే పెళ్ళి జరిపిస్తారు. దేవతల విషయంలో పుత్రపౌత్రాది బంధాలు మానవుల వంటివికావు.

నారాయణుడే అవతారక్రమంలో శ్రీవేంకటేశునిగా అర్చావతారంగా వెలశాడు. అనాది యైన శ్రీ విష్ణువు ఒక కాలంలో ఇలా వెలయడం చేత ఈ రూపం పౌత్రునిగా కల్యాణ సంప్రదాయంలో ప్రస్తావించబడింది. దీనికి పురాణకథ ఆధారం కాదు.

**ప్ర: శివపంచాక్షరస్తోత్రంలో 'యక్షస్వరూపాయ' అని శివుని వర్ణించారు. శివుడు యక్షుడుగా ఎప్పుడు ఎలా అవతరించాడు? దాని అంతరార్థమేమిటి?**

**జ:** ఒకప్పుడు దేవతలు రాక్షసుల్ని జయించి, విజయోత్సాహాన్ని జరుపుకుంటున్నారు. అంతా తమ నిర్వాకమేనని ప్రగల్భాలను చెబుతున్న సందర్భంలో వారిముందు పరబ్రహ్మ 'యక్ష' రూపంతో ప్రత్యక్షమయ్యాడు.

**తద్ధైషాం విజజ్ఞౌ, తేభ్యోహ ప్రాదుర్బభూవ**
**తన్న వ్యజానంత కిమిదం యక్షమితి॥ (కేనోపనిషత్)**

దేవతలు ఆయనను గుర్తించలేక ఈ యక్షుడెవరని ఆశ్చర్యపడ్డారు. అప్పుడు అగ్ని ఆతనిని తెలుసుకోడానికై ముందుకు వచ్చి, 'నువ్వెవర'ని ప్రశ్నించాడు. అప్పుడా యక్షుడు దేవతల ప్రతాపాన్ని తెలుసుకోడానికి వచ్చానని చెప్పి – ఒక తృణాన్ని ఎదురుగా ఉంచి అగ్ని యొక్క ప్రతాపాన్ని చూపించమన్నాడు. అగ్ని తన శక్తినంతటినీ వినియోగించినా, ఆ తృణం దహింపబడలేదు. అలాగే వాయువు కూడా దానిని కదిలించలేకపోయింది.

అప్పుడు ఇంద్రుడు వినయంగా ఆ యక్షుని ప్రార్థించగా, అక్కడ జగదంబ బ్రహ్మ విద్యాస్వరూపిణిగా సాక్షాత్కరించి 'తాను ఉమాదేవిననీ, ఆ యక్షుడు పరమాత్మ అనీ, ఆతని శక్తిని' తాననీ పరబ్రహ్మ గురించి బోధించింది. అలా యక్షునిగా గోచరించిన శివపరమాత్మ దేవతలకు సైతం దైవత్వాన్నిచ్చిన పరంజ్యోతి. ఇది కేనోపనిషత్తులోను, కొన్ని పురాణాలలోను చెప్పబడిన కథ. ఈ ఇతివృత్తం ఆధారంగా 'యక్షస్వరూపాయ జటాధరాయ పినాకహస్తాయ సనాతనాయ' అని శివపంచాక్షర స్తోత్రం వర్ణించింది.'యక్ష' శబ్దానికి 'పూజ్యుడు' అని ఒక అర్థం ఉంది.

**ప్ర: కర్ణాటకలో చాలా చోట్ల 'చెన్న కేశవ' అని విష్ణ్వాలయాలున్నాయి. ఆంధ్రదేశంలో కూడా ఆ పేరుతో విష్ణుమందిరాలు కనిపిస్తుంటాయి. 'కేశవుడు' విష్ణుని పేరని తెలు స్తోంది. 'చెన్న' శబ్దానికి అర్థం ఏమిటి?**

**జ:** కర్ణాటకలో 'చెన్న' శబ్దానికి చక్కదనం, మంచితనం అని అర్థాలు. 'చక్కనైన కేశవుడు' అనే అర్థంలో 'చెన్నకేశవుడు' శబ్దాన్ని వాడతారు. నారాయణుడు సచ్చిదానంద మయుడైన సౌందర్యస్వరూపుడు. అందుకే ఆయనను ప్రేమగా 'చెన్న' కేశవుడు అన్నారు. తెలుగులో కూడా 'చెన్ను' అనేమాట సొగసును తెలియజేస్తుంది. 'చెన్ను'గ, 'చెన్ను మీరగా' – వంటి మాటలు తెలుగు గ్రంథాలలో కనిపిస్తుంటాయి. 'చెన్ను

మీరగను శృంగారంబగు ఇదిగో భద్రాద్రి' – అని రామదాసు కీర్తన. తెలుగు భాషలో సైతం 'చెన్నకేశవ' అనేమాట చక్కనైన శ్రీహరి దివ్యమంగళ విగ్రహాన్ని స్ఫురింప జేస్తుంది.

**ప్ర: గాయత్రీధ్యాన శ్లోకంలో 'అంకుశ కశా శుభ్రం కపాలం గదా' అని వర్ణించారు. అమ్మవారు ధరించిన ఆయుధాలు ఏమిటి? 'కపాలం' అంటే 'పుర్రె' అని అర్థం కదా! గాయత్రీదేవి పుర్రెను ధరించడంలో అంతరార్థం ఏమిటి?**

**జ:** గాయత్రీదేవి పదిచేతుల్లో వరద, అభయ, అంకుశ, కశ (కొరడా), శుభ్రమైన కపాలం, గద, శంఖం, చక్రం, రెండు పద్మాలు – ధరించి ప్రకాశిస్తోంది. సర్వ దేవతల స్వరూపాలనీ స్ఫురింపజేసే ఆయుధాలివి. 'కపాలం' అంటే పుర్రె అని మాత్రమే అర్థం కాదు. వేద సంప్రదాయంలో యజ్ఞ ప్రక్రియలలో వినియోగించే కొన్ని పాత్ర విశేషాలకు 'కపాలం' అని పేరు. అందులో కొన్ని యజ్ఞ ద్రవ్యాలను ఉంచుతుంటారు. గాయత్రి వేదమాత, యజ్ఞ స్వరూపిణి. ఆ సంకేతంగా యజ్ఞపాత్రను ధరించింది. ఆ పాత్రయే కపాలం. ఇక–'కపాలం' అనే మాటకి 'పుర్రె' అనే అర్థం కూడా ఉంది. మన శరీరంలో చైతన్యం ప్రధానంగా కపాలంలో జ్ఞానమయంగా దీపి స్తోంది. బ్రహ్మరంధ్రస్థానం కూడా కపాలమే.



ఆలోచనకు కేంద్రమైన మేధస్సు, దర్శనశక్తి, శ్రవణశక్తి, వాక్శక్తి, ఘ్రాణ (వాసన) శక్తి, శ్వాస, స్పర్శ – మొదలైన జ్ఞానేంద్రియాలకు స్థానమిది. ఇన్ని ఇంద్రియాలున్న ప్రధానాంగం శిరస్సు. దీనిని ధరించిన జ్ఞాన చైతన్యం పరమేశ్వరీ స్వరూపం. 'కపాల ధారిణి' అనడంలో సంకేత మిది.

మన కపాలంలో ప్రసరించే చైతన్యమే మన శరీరానికి ప్రధానం. ఆ చైతన్యం సర్వ చైతన్య స్వరూపిణియైన పరాశక్తి వల్లనే ప్రసరిస్తోంది. ఈ సత్యాన్ని అమ్మవారు కపాల ధారణతో బోధిస్తారు.

**ప్ర: నేను ఈ మధ్య అయ్యప్ప దీక్షను స్వీకరించి, నియమంగా దీక్షాపాలన చేసి శబరిమల వెళ్లివచ్చాను. తిరిగివచ్చాక మళ్లీ మామూలు జీవితం. దీక్షాకాలంలో రోజూ చక్కగా ధూపదీపాలు, పూజలతో కళకళలాడిపోయింది. ఇప్పుడు నిత్యం పూజలు ఏం చేయాలో తోచడంలేదు.**

**జ:** 'దీక్ష' అనేది మన జీవితంలో భగవత్ చైతన్యాన్ని అనుసంధానింపజేసే ప్రక్రియ. దేవతానుష్ఠానాన్ని అలవాటు చేసే సాధన. మీరు దీక్షాకాలంలో ఏ పూజలు చేశారో,

ఆ పూజల్ని దీక్ష తరువాత కూడా కొనసాగించవచ్చు. సాధారణంగా మన హిందూ మతంలో ఏ దేవతనైనా పూజించే విధానం ఒకటే. ధ్యానం, ఆవాహన, గంధం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం, నీరాజనం – ఇవి మామూలే. వాటిని దీక్షాకాలంలో మీరు అలవాటు చేసుకున్నారు. దీక్షలో చేసిన నియమాలు తరువాత కూడా కొనసాగించడం మంచిది. అయితే దీక్షలో చేసినంత అధికంగా కాకున్నా వీలు వెంబడి సమయానుకూలంగా పూజాదులు చేసుకోవచ్చు. దీక్షలో చేసిన పూజల్నే తరువాత కూడా చేయవచ్చు. లేదా ఏదైనా మీ అభీష్టదైవాన్ని ఆరాధించాలనుకున్నా పూజా విధానాల గ్రంథాలు ఇప్పుడు అనేకచోట్ల లభ్యమౌతున్నాయి. వాటి ఆధారంగా మీరు నిత్యపూజ చేసుకోవచ్చు.

ప్ర: **ఎవరైనా మరణించినప్పుడు సంవత్సర సూతకంలో ఆ ఏడాదిపాటు ఇంట్లో దీపం పెట్టవచ్చా? విష్ణు సహస్ర జపం, లలితా సహస్ర నామాదులు పారాయణం, జపం చేయవచ్చా?**

**జ:** మరణించిన 12 రోజులవరకు పుత్రాదులు దేవతారాధన, దేవతలకు దీపారాధన, పారాయణ, జపాదులు చేయరాదు. నామజపానికి అభ్యంతరం లేదు. శుద్ధి జరిగిన తరువాత ఏడాది కాలంలో నిత్యపూజ, దీపారాధన, పారాయణ, జపాదులు యథా ప్రకారం చేయవచ్చు. క్షేత్ర యాత్రలు, పర్వదినపాలనలు, ప్రత్యేక పూజలు, వ్రతాలు మాత్రం ఏడాది తరువాత మాత్రమే చేయాలి.



ప్ర: **మాయకు ఆవరణ, విక్షేప– అనే లక్షణాలున్నాయంటారు. ఈ రెండు పదాలకు అర్థమేమిటి?**

**జ:** 'ఆవరణ' అంటే 'కప్పుట' అని అర్థం. విక్షేపం – అంటే 'చెదరుట'. ఉన్న దానిని తెలియనివ్వనిది 'ఆవరణ'. ఒక దానిని మరొక దానిలా భ్రమింపజేయునది – 'విక్షేపం'. దీనికి ఉదాహరణగా 'రజ్జుసర్పభ్రాంతి' అంటారు – 'వేదాంత పరిభాషలో. 'తాడును చూసి పాము అనుకొనుట' అని దీని భావం. తాడును తెలుసుకోలేకపోవడం 'ఆవరణ' అయితే, పాములా భ్రమించడం 'విక్షేపం'.

ప్ర: **'సరసిజనాభ సోదరి, శాంకరి...' అనే కృతిలో శాంకరిని పద్మనాభుని సోదరిగా వర్ణించారు. ఇది ఎలా పొసగుతుంది. కొన్ని గ్రంథాల్లో 'అంబిక నారాయణ సహోదరి, లక్ష్మీదేవి బ్రహ్మసోదరి, సరస్వతి శివుని చెల్లెల'ని ప్రస్తుతించారు. ఈ విషయాన్ని విశదీకరించ ప్రార్థన.**

**జ:** దేవతల సంబంధాలన్నీ సంకేతాలుగా గ్రహించాలి. ఏకతత్త్వాన్ని ప్రకటించే స్వరూపాలను సోదరీసోదరులుగా సంకేతించాయి మన శాస్త్రగ్రంథాలు. సహాయకరమైన అవిభాజ్యశక్తుల్ని పత్నీపతులుగా చూపించాయి. వాటిని లౌకికబంధాలతో పోల్చరాదు. పాంచభౌతిక దేహాలను ధరించిన వారం మనం. దేవతలు తేజశ్శరీరులు. వారికి మనవంటి బంధాలు వర్తించవు.

స్థితికారకశక్తి నారాయణుడు. ఆయన యొక్క స్త్రీరూపం లలితా, గౌరి. వీరు స్థితికారణ శక్తులు. ఈ శక్తి శివునికి సహకారి. లయకారకునికి స్థితితో సమన్వయం కావాలి. అదే హరిహరాత్మక తత్త్వం. హరి స్వరూపిణి గౌరి. వీరిరువురూ ధర్మరక్షనార్థం దేవతలను కాపాడే శక్తులు. అందుకే సోదరీసోదరులు **"యా ఉమా సా స్వయం విష్ణుః"** – అని స్మృతి.

ఈ యోగమాయా శక్తితోనే విష్ణువు అవతరించి ధర్మస్థాపన చేస్తాడు. **"సంభవామ్యాత్మమాయయా"** అనే గీతావచనం, **"యోగమాయా సమాశ్రితః"** అనే భాగవత వచనం ఈ విషయాన్నే దృఢపరుస్తున్నాయి. రాక్షస సంహరణార్థం గౌరీ విష్ణువులే ఉద్యుక్తులౌతుంటారు.



సృష్టికి పూర్వం బ్రహ్మాండంలోంచి స్త్రీ పురుషాకృతులు కలిసి మూడుగా వచ్చాయని – వారే కవలలుగా వచ్చిన రెండు మూడులు. బ్రహ్మ, లక్ష్మి సోదరీ సోదరులుగా, అలాగే సరస్వతీ శివులు, కాళీ విష్ణువులు అవతరించారు. సృష్టికారకమైన రజశ్శక్తి లక్ష్మి. బ్రహ్మకు సోదరి. ఈ సహకారంతో లక్ష్మి పత్నిగా సత్త్వ గుణ నియామకుడైన విష్ణువు స్థితికారకుడయ్యాడు.

జ్ఞానము ద్వారా ప్రాపంచిక కర్మబంధాలను లయం చేసే శివుడు, సరస్వతీ విద్యామూర్తులుగా సోదరస్థానంలో సంకేతాలు.

ఈ జ్ఞానం సృష్టికి సహకరించేందుకు బ్రహ్మకు భార్యా స్థానం (సహకార స్థానం)

ఈ సోదరీసోదర, పతీపత్నీ భావనలు – ఒకే విశ్వచైతన్యం యొక్క వ్యక్తీకరణలు. బహువిధములైన ప్రధానమైన సృష్టి స్థితి లయలకు త్రిగుణాల వినిమయం (పరస్పరం సహకారం) ఈ విధంగా పోల్చబడింది. నిజానికి ఒకే పరబ్రహ్మము– ఆయన యొక్క ఒకే శక్తి ఎప్పుడూ ఉన్నవి.

లోకరచనా వ్యవహారంలో ఆ రెండు భిన్నభిన్నముగా కలసి వివిధ కృత్యాలను నిర్వహిస్తున్నాయి.

ఇక –శ్రీ విష్ణువు శ్రీకృష్ణునిగా అవతరించినప్పుడు దుర్గ ఆయనకు సోదరిగా నందుని యింట జన్మించిన గాథ భాగవతంలో, ఇతర పురాణాలలో వర్ణించబడింది. ఆమె 'నందా' దేవిగా వింధ్య పర్వతంలో స్థిరురాలై 'వింధ్యవాసిని'గా పేరుపొంది రాక్షస సంహారం చేసింది. ఈ విధంగా కూడా తన విష్ణుసోదరీ లక్షణాన్ని అవతారకార్యంలో సైతం ప్రదర్శించిన కారణంగా శివపత్ని 'విష్ణు సహోదరి'గా సుప్రసిద్ధురాలు. 'లలితా సహస్రనామాలలో' 'పద్మనాభ సహోదరి' అనే నామం ఉన్నది.

'రామ సహోదరి రాజరాజేశ్వరి' అని త్యాగబ్రహ్మమువారు, 'శ్యామకృష్ణ సహోదరి' అని శ్యామశాస్త్రిగారూ, విష్ణు సోదరి భావననే పలుకీర్తనలలో ముత్తుస్వామి దీక్షితుల వారు ప్రస్తుతించారు.

**"ఇందిరారమణ సోదరీం మనసి భావయామి పరదేవతాం"** అని ఆది శంకరులు దేవీ నవరత్న మాలికా స్తోత్రంలో కీర్తించారు.

**ప్ర: 'వైద్యో నారాయణో హరిః' అనే మాట యొక్క పూర్తి శ్లోకం ఏమిటో తెలియజేయగోరిక.**

**జ:** ఇది అనూచానంగా వస్తున్న శ్లోకం లోనిది.

**శరీరే జర్జరీ భూతే**
**వ్యాధిగ్రస్తే కళేబరే ।**
**ఔషధం జాహ్నవీతోయం**
**వైద్యో నారాయణో హరిః॥** –ఆ శ్లోకం పూర్తి పాఠమిది. "కృశించి పోయే లక్షణం గల, వ్యాధిగ్రస్తమైన ఈ శరీరానికి నిజమైన ఔషధం గంగాజలం. వైద్యుడు నారాయణుడైన శ్రీహరి అని అర్థం. శరీరం ధరించిన జీవుడు తనలోని జన్మాంతర పాప పంకిలాన్ని శుద్ధి చేసుకోవడం ముఖ్య కర్తవ్యం. అందుకు పవిత్ర గంగా జల పానం, శ్రీహరి స్మరణ ముఖ్యం. ఈ రెండే జీవన సార్థకతలు. జన్మకి సాఫల్యాలు అని చెప్పే బోధన ఇది.

అంతేకాక –గంగాస్మరణ, నారాయణ స్మరణ శక్తిమంతమైనవి. ఈ శ్లోకం చదివిన వారికి వైద్యునిలోనున్న 'ప్రతిభా'రూపమైన నారాయణ శక్తి అనుకూలిస్తుంది. సరియైన స్ఫురణతో శ్రీహరి వైద్యుని ప్రేరేపిస్తాడు. వైద్యునిలోని వైద్యశక్తి పరమేశ్వరుడైన శ్రీహరి రూపమే కదా! హరిస్మరణతో అది మనల్ని బాగు చేసేలా ప్రేరేపించబడు తుంది. అలాగే గంగా స్మరణతో ఔషధం పవిత్రమై, ప్రభావశాలి అవుతుంది. పరానికీ, ఇహానికీ పనికివచ్చే ప్రయోజనాలను ఇచ్చే పరంపరాగత శ్లోకమిది.

**ప్ర: శ్రీ రుద్రనమకంలో "తస్కరాణాం పతయే నమః" అని ఉంది. ఈశ్వరునికి 'తస్కర పతి' (దొంగల నాయకుడు) అని పేరు రావడానికి ఏదైనా పురాణ కథ ఉందా? లేక, సర్వాంతర్యామి, సర్వాధిపతి అని తెలియజేసే ఒక విశేషమా? కాస్త వివరించగలరు.**

**జ:** 'తస్కరపతి' అనడానికి, ప్రామాణిక పురాణ కథ ఏదీ లేదు. అది సర్వాంతర్యామి త్వాన్నీ, సర్వాధిపత్యాన్నీ తెలియజేసే విశేషం. పరమేశ్వరుడు జీవులకు కర్మఫల ప్రదాత. విశ్వంలో దీపించుతూ – వివిధ విధాలుగా తన శక్తులను వివిధ ఉపాధుల ద్వారా ప్రేరేపించి ప్రసాదిస్తుంటాడు. పుణ్యఫలాలను 'అఘోరరూపం'లోనూ (ఆనందకర స్వరూపం), పాపఫలాలను 'ఘోర' రూపంలోనూ ప్రదానం చేస్తాడు.

విశ్వంలో ఉన్న ప్రతి శక్తి శివుడే అని దర్శించేవానికి అఘోరత్వం (ప్రసన్నత) సామీప్యమై, ఘోరత్వం రక్షకమై కాపాడుతుంది. అక్రమార్జన మొదలైన పురాకృత పాపాలకు ఫలంగా చోర, అగ్ని, రాజులలోని శక్తి ప్రేరేపించబడి మనపై దాడి చేస్తుంది. ఈశ్వరుని ఆరాధించే వారికి తస్కర, అగ్న్యాదుల రూపాలలోనున్న శక్తి పీడించకుండా, తొలగుతుంది. 'శివుని ఆనలేనిదే చీమైనా కుట్టదు' అనడంలో అంతరార్థం అదే.



అంతేకాక –చోరునిలోనూ 'నైపుణ్యం, పరాక్రమం' ఉంటాయి. ఆ శక్తి సహజంగా గొప్పదే. వినియోగంలోనే దోషం. అయితే దోషం ఆచరించే స్వభావం ఉన్న వానిలోనే అది ప్రేరేపించబడుతుంది. ఇదే చోరత్వ నైపుణ్యం చోరుని పట్టుకొనే రక్షకాధికారికీ ఉంటుంది. ఆ నైపుణ్యం చేతనే చోర లక్షణాలను గ్రహించి చోరుని నిగ్రహించగలుగు తాడు. అందుకే నైపుణ్యం భగవత్స్వరూపం, ఆ నైపుణ్యానికి నమస్కరించింది రుద్ర నమకం. అన్ని వృత్తులవారిలోనూ, అన్ని ఉపాధులలోనూ ఈశ్వరుడే చైతన్యంగా వ్యాపించి ఉన్నాడని చెప్పడమే రుద్రనమకం యొక్క తాత్పర్యం. **"ఈశావాస్య మిదం సర్వం"** అన్న ఉపనిషత్సిద్ధాంత దర్శనమే రుద్రోపనిషత్తు హృదయం.

**ప్ర: కేశాలను తొలగించడం క్షేత్ర యాత్రలలో, కొన్ని ప్రాయశ్చిత్త విధులలో, కొన్ని కర్మలలో ముఖ్యం. ఎందుచేత? స్త్రీలకు శిరోముండనం ఉందా?**

**జ:** చేసిన పాపాలు అంతరంగాన్ని ఆశ్రయించి జీవుని అనుభవంలోకి వస్తుంటాయి. అయితే వాటి ప్రభావాన్ని దేహంలో గ్రహించి, వదలకుండా పట్టుకొనే చోటు కేశాలు. అందుకే వాటిని తొలగించి స్నానాదులు చేసినవారు శుద్ధులౌతారు. దీక్షా కాలమంతా

మరి వాటిని తొలగించరు. దీక్షానంతరం తొలగిస్తారు. దీక్షాకాలంలో చేసిన నియమ పాలన అంతరంగాన్ని శుద్ధి చేస్తుంది.

మిగిలిన కొన్ని పాపాలు, దీక్షాకాలంలో పొరపాటున జరిగిన దోషాలు పోవడానికి విరమణ తరువాత కూడా కేశాలను తొలగిస్తారు.

**మేరు మందర తుల్యాని పాపాని వివిధాని చ।**

**కేశానాశ్రిత్య తిష్ఠంతి తస్మాత్ కేశోవపామ్యహమ్॥** –అని ధర్మశాస్త్రం, 'కొండ లంతటి బహుపాపాలు కేశాలనా శ్రయించుకొని ఉంటాయి. అందుకే వాటిని తొలగి స్తున్నాను' అయితే శాస్త్రరీత్యా స్త్రీకి కేశములు మంగళస్థానీయములు. వారు దీక్షాకాలంలో, కర్మలలో కేశాలను తొలగించనవసరం లేదు. వారి దేహ ధర్మరీత్యా ఋషులు నియమించిన విధి ఇది. వారు గోమయం, పంచగవ్యాలు, మృత్తికాజలం (తులసిమట్టి నీరు), పసుపు రాసుకొని స్నానం చేయడం వంటివి శుద్ధిని కలిగిస్తాయి.

ప్ర: **గుడిలో ఆత్మప్రదక్షిణ, సాష్టాంగ దండప్రణామం చేయవచ్చా?**

జ: గుడిలో ఆత్మప్రదక్షిణ చేయరాదు. ఆలయ ప్రదక్షిణ చేయవచ్చు. ధ్వజ స్తంభానికీ, దైవానికీ మధ్య సాష్టాంగ దండ ప్రణామం చేయరాదు. ధ్వజస్తంభానికి ఆవల చేయ వచ్చు. ఇంట్లో దేవతా పూజ చేశాకే ఆత్మప్రదక్షిణ, సాష్టాంగ దండప్రణామం చేయాలి.



ప్ర: **లలితాదేవిని 'పరదేవత' అంటారు కదా! అంటే – పరానికే తప్పు, ఇహానికి ఆ దేవతను ఉపాసించరాదని మా మిత్రులొకరు అన్నారు. నిజమేనా?**

జ: పదానికి అర్థం తెలియక ఏది తోచితే దానిని చెప్తే ఇలాంటి తప్పుడర్థాలే వస్తాయి. 'పరదేవత' అంటే 'ఇంతకు మించిన దేవతలేదు', 'సర్వోన్నతురాలు' – అని అర్థం. అంతేకానీ కేవలం 'పరమే' తప్ప, 'ఇహం' కాదు – అనే అర్థం లేదు. ఇక్కడ 'ఇహ పరాలు' అనే భావమే లేదు. 'ధనధాన్యవివర్ధినీ', 'సర్వసౌభాగ్యదాయినీ', 'సర్వవ్యాధి ప్రశమనీ', 'ధర్మిణీ ధర్మవర్ధినీ', 'దౌర్భాగ్యతూలవాతూలా – జరాధ్వాంతర విప్రభా', 'లోక యాత్రావిధాయినీ'.... ఇలాంటి ఎన్నో నామాలు లలితా సహస్ర నామాలలో గోచరిస్తాయి. అలాగే 'ధ్యానధ్యాతృ ధ్యేయరూపా', 'కేవలా', 'కైవల్య ప్రదాయినీ' –వంటి నామాలూ ఉన్నాయి. ఈ రెండు విధాలైన నామాలను పరిశీలిస్తే – అమ్మ వారు ఇహ, పరాలను ప్రదానం చేసే జగదంబిక అని స్పష్టమౌతుంది. లలితాదేవిని ఆరాధించేవారికి – ఐహిక సుఖాలేకాక, పారమార్థిక జ్ఞానం, మోక్షం కూడా లభిస్తాయి.

**ప్ర: వేదమంత్ర పఠనానికి ఉచ్చారణ ముఖ్యమంటారు. మరి ఉత్తర భారతంలో చాలా మంది వేదపండితుల ఉచ్చారణ చాలా మార్పుగా, పేలవంగా ఉన్నట్లనిపిస్తుంది. మరి అలాంటి ఉచ్చారణలో ఫలితం ఉంటుందంటారా?**

**మరోప్రశ్న : ఈ మధ్య తలెత్తుతున్న 'ప్రాంతీయ భాషాభిమానం'– దేవాలయంలోనూ, వివాహాది శుభకార్యాలలోను మంత్రాలను సంస్కృతంలో కాకుండా, ప్రాంతీయ భాషలలోనే ఉచ్చరించాలని పట్టు పట్టేంతవరకు వచ్చింది. ఇది ఎంతవరకు సబబు?**

**జ:** దక్షిణ భారతంలో ప్రసిద్ధిగా మనం వింటున్నది కృష్ణ యజుర్వేదం. ఉత్తర భారతంలో ఎక్కువగా శుక్లయజుర్వేదం వ్యాప్తిలో ఉంది. ఈ రెండింటికీ స్వరాలు వేరు. ఈ స్వరం మనకు అలవాటవడం వల్ల, ఆ స్వరం 'పేలవంగా' ఉన్నట్లు, ఉచ్చారణ సరిగ్గాలేనట్లు అనిపిస్తుంది. అంతేగానీ అందులో ఉచ్చారణాదుల లోపం లేదు. అదీ సంప్రదాయబద్ధమైన స్వరంతో కూడినదే కనుక తప్పకుండా ఫలితం ఉంటుంది.

ఇక – మీ రెండవ ప్రశ్నకు... మంత్రానికి భాషే ప్రధానం కాదు. అలాగే భావం మాత్రమే ముఖ్యం కాదు. మంత్రాలలో అర్థంతోపాటు శబ్దశక్తికి ప్రాధాన్యం ఉంది. స్వరం, సంస్కృత శబ్దం–వీటి ఉచ్చారణ వల్ల దేవతాశక్తి జాగృతమౌతుంది. ప్రాంతీయ భాషలు వ్యవహారానికి మాత్రమే. ప్రార్థనలను, గీతాలను కూడా ఈ భాషల్లో సమకూర్చి గానం చేసి భగవంతుని మెప్పించవచ్చు.

కానీ దేవతారాధనల్లో, వివాహాది వైదిక కర్మలలో సనాతనంగా వచ్చే మంత్రాలను, శ్లోకాలను సంప్రదాయానుగుణంగా వినియోగించవలసిందే. భాషాభేదాలు రాజకీయాలకు ఉపయోగించవచ్చేమోగానీ, పవిత్రమైన యజ్ఞ కర్మలలో ఇలాంటి అసంప్రదాయ ధోరణులను ఆమోదించరాదు.

ప్రభుత్వాలు, రాజకీయ పార్టీలు తెలిసీ తెలియని మిడిమిడి జ్ఞానంతో, రాజకీయ స్వార్థాలనుపయోగించి ప్రాంతీయాభి మానాలను రేకెత్తించి – మన మతంలో జోక్యం చేసుకోవడాన్ని ప్రజలే ప్రతిఘటించాలి.

**ప్ర: ఒక జింక కేకయరాజువల్ల మృతి చెందిందనీ, దాని జంటయైన ఆడజింకకు తల్లి కేకయరాజును శపించిందనీ, ఆ జింకయే మంథరగా జన్మించిందనీ ఒకచోట చదివాను. ఇది నిజమేనా?**

**జ:** ఈ కథ ఏ రామాయణంలోనూ లేదు. ఇలాంటి పూర్వజన్మ కథల్ని కొందరు

కల్పించారు. ఇవి చదవడానికి బాగుంటాయి కానీ, ప్రమాణాలుగా స్వీకరించరాదు.

**ప్ర: అక్షరాభ్యాసంలో 'ఓం నమశ్శివాయ సిద్ధం నమః' అని వ్రాయిస్తారు గానీ 'ఓం నమో నారాయణాయ' అని ఎందుకు నేర్పించరు?**

**జ:** ఇలా ఆలోచించవలసిన అవసరం లేదు. ఒకవేళ 'ఓం నమో నారాయణాయ' వ్రాయించి ఉంటే, 'నమశ్శివాయ' ఎందుకు వ్రాయించరు? అని అడుగుతాం. ఇందులో 'నారాయణు'ని వ్రాయించకపోవడం పెద్దల ఉద్దేశం కాదు. అంత మాత్రాన అష్టాక్షరిని కాదన్నారనికాదు. పంచాక్షరి (నమశ్శివాయ) ఏభై అక్షర శక్తులకు మూలమైన తత్త్వాన్ని కలిగి ఉంది. ఇది సిద్ధమంత్రం. యజుర్వేదంలోనిది. దేని ప్రాధాన్యం దానిదే. నారాయణ మంత్ర ప్రశస్తి కూడా వేదప్రామాణ్యం కలది. రెండింటికీ ఎక్కువ తక్కువలు చూడరాదు.

అక్షరాభ్యాసంలో **'ఓ నమః శివాయః సిద్ధం నమః"** అని వ్రాసేవారు పూర్వులు. పంచాక్షరి, అష్టాక్షరి వంటి మంత్రా లను నేరుగా వ్రాయించరు. అందుకే చిన్న మార్పుతో పై విధంగా వ్రాయించేవారు. కానీ ఈ సంప్రదాయం తెలియక ఇప్పుడు నేరుగా వ్రాయిస్తున్నారు. పంచాక్షరి, షడక్షరి, అష్టాక్షరి గురూపదేశంతో సంపూర్ణంగా గ్రహించి జపించడం పూర్వీకుల ఆచారం.



**ప్ర: ఏ గ్రహదోషమైనా పోయేందుకు మార్గం సూచించండి.**

**జ:** ప్రతి ఆదివారం నాడు గోవునకు ఫలాలనో, తోట కూరనో, గ్రాసాన్నో సమర్పించుకొని –గ్రహదోషాలు తొలగాలని ప్రార్థిస్తే మంచిది. ఇది సర్వసాధారణ సమస్యల్ని తొలగిస్తుంది. అయితే ఏ గ్రహదోషంతో బాధపడేవారు ఆ రోజున (ఉదా॥ శని దోషబాధితులు శనివారం రోజున), తద్గ్రహ సంబంధమైన ధాన్యాన్ని, ఫలాది గ్రాసాన్ని సమర్పిస్తే చాలు, ఆ గ్రహదోషాలు నివారణ అవుతాయి.

గోవుకి ఆహారాదుల్ని సమర్పించుకున్న వారికి అగ్నిహోత్రం చేసిన ఫలితం, ఉత్తమ స్థితిగతులు సమకూరతాయని శాస్త్రోద్బోధన.

మరొక్కమాట – తాజా అన్నాన్నే ఆవుకి పెట్టాలి. మిగులు అన్నం ఆవుకి, దూడకి, కోడెకి పెట్టరాదు. ఇలాంటి శాస్త్ర నియమాలను చేసినందువల్ల ఉత్తమ ఫలితాలు వెంటనే లభిస్తాయి. వీటితోపాటు గ్రహజపాలు, రుద్రాభిషేకాలు చేయించడం మంచిది.

**ప్ర: 'స్వధర్మం' అనే మాటకి 'ఎవరి వృత్తి వారు చేయటం' అని మాత్రమే అర్థమా? లేక – వేరే ఏదైనా అర్థం ఉన్నదా? 'శ్రేయాన్ స్వధర్మో విగుణః' అనే వాక్యంలో 'మన వృత్తి తక్కువగా కనిపిస్తున్నా, దానినే శ్రద్ధగా ఆచరించాలి' అని అర్థాన్ని గ్రహించవచ్చా?**

**జ:** 'స్వధర్మం' అనే మాటకి కేవలం వృత్తిపరమైన అర్థాన్ని గ్రహించరాదు. వ్యక్తి ధర్మాలలో వృత్తిధర్మం ఒక భాగం మాత్రమే.

ఒక వ్యక్తి తల్లిదండ్రులకి పుత్రుడిగా, భార్యకి భర్తగా, పిల్లలకి తండ్రిగా, శిష్యులకి గురువుగా లేదా గురువుకి శిష్యునిగా, కొందరికి మిత్రుడిగా, ఒక వర్ణానికీ ఆశ్రమానికీ గృహస్థు / సన్న్యాసి/ బ్రహ్మచారి) చెందినవానిగా, అన్నదమ్ములకి సోదరుడిగా.... ఇంకా అనేక విధాలుగా గుర్తింప బడతాడు. వీటన్నిటినీ బాధ్యతగా, నిజాయితీగా నిర్వహించటమే స్వధర్మం అని స్థూలంగా గ్రహించవచ్చు.

అదే విధంగా – తాను ఉన్న స్థితికి అనుగుణంగా దేవ, పితృ, ఋషి ఋణాలను తీర్చుకోవాలి. ఇదీ స్వధర్మంలో ప్రధానాంశమే.

తాను పుట్టిన మతధర్మం, దేశధర్మం కూడా స్వధర్మంలోని భాగాలే. వీటిని లోప రహితంగా, సమర్థవంతంగా పాలించేవాడు కృతకృత్యుడు. శాస్త్రవిహిత కర్మాచరణ స్వధర్మం.



**ప్ర: 'ఆత్మగుణాలు' అంటే ఏమిటి? ఆత్మకి గుణాలు ఉన్నాయా?**

**జ:** ఆత్మ శబ్దానికి అనేక అర్థాలున్నాయి. శరీరం, జీవుడు, పరమాత్మ – అనే మూడు వ్యవహారాలకి 'ఆత్మ' శబ్దం వాడతారు. 'తాను', 'మనస్సు' – అనే అర్థాలను కూడా 'ఆత్మ' పదం ద్వారా వ్యవహరిస్తాడు. ఆత్మోన్నతిని, ఆత్మ సాక్షాత్కారాన్ని, ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించే దివ్య గుణాలు – అని అర్థాన్ని గ్రహించాలి. దయ, క్షాంతి (ఓరిమి), అనసూయ, శౌచం, అనాయాసం, మంగళం, అకార్పణ్యం, అస్పృహ – ఈ ఎనిమి దింటినీ 'ఆత్మగుణాలు' అంటారు.

1. సర్వ ప్రాణులయందు కరుణ, 2. సహనం, 3. అనసూయ– 'పరోత్కర్ష అసహి ష్ణుత్వం అసూయా' – ఇతరుల మేలును చూసి సహించలేకపోవటం అసూయ. అసూయ లేకపోవటం అనసూయ. 4. అంతర్గత శుద్ధి, సదాచారం –శౌచం, 5. కలవరపాటు లేనితనం, 6. శుభమైన ఆలోచనలు, ఆచరణ అవలంబించటం, 7. లోభత్వం లేకపోవటం, 8. దేనినీ అంటుకోని లక్షణం....

ఈ ఎనిమిది పై గుణాలకు వివరణ.

**ప్ర: ఋషి, తపస్వి – ఈ రెండు పదాలకి తేడా ఏమిటి?**

**జ:** "ఋషిర్దర్శనాత్ – ఋషీగతౌ – ఋషంతి అవగచ్ఛంతి ఇతి ఋషయః" – అని అర్థాలు 'ఋషి' శబ్దానికి ఉన్నాయి. ఇంద్రియాలకు అతీతమైన సత్యాన్ని దర్శించే వాడు ఋషి. జ్ఞానం పొందినవాడు ఋషి.

ఋషయో మంత్ర ద్రష్టారః – అని సంప్రదాయ వాక్యం. అపౌరుషేయ దివ్యశబ్దాలను దర్శించువారు ఋషులు. జప, తప, ధ్యానాది నియమాలను దీక్షగా అవలంబించు వాడు తపస్వి – అని స్థూలార్థం. 'తప ఆలోచనే' అనే ధాత్వర్థాన్ని అనుసరించి – ఆలోచించువాడు, (దీక్షాది నియమాలతో) తపించువాడు – అని 'తపస్వి' పదానికి అర్థం. "తపస్స్వధర్మ వర్తిత్వం" స్వధర్మాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ తప్పకుండా నిర్వ హించడమే తపస్సు – అని మహాభారతంలో ధర్మరాజు వచనం.

**ప్ర: 'వేదోఖిల ధర్మ మూలం' అనే మాట చాలా చోట్ల ఉటంకిస్తుంటారు. ఇంతకీ ఈ వాక్యం దేనిలోనిది?**

**జ:** ఇది 'మనుస్మృతి' లోని శ్లోకం. 'గౌతమ స్మృతి'లాంటి ధర్మశాస్త్ర వాక్యాలలో కూడా ఈ మాట కనిపిస్తుంది. ధర్మానికి మూలాలు ఏమిటో చెబుతూ మను స్మృతిలో ఒక శ్లోకం ఉంది.

**వేదోఖిలో ధర్మమూలం స్మృతి శీలే చ తద్విదామ్।**
**ఆచారశ్చైవ సాధూనామాత్మనస్తుష్టిరేవ చ॥**

ధర్మానికి మూలాలు – 1. వేదం, 2. స్మృతి, 3. శీలం, 4. ఆచారం (ఆచరణ), 5. సత్పురుషుల మనస్సు సంతోషించేవి. వీటన్నిటిలో వేదం ప్రధానం – అని మనువు ఉద్దేశం.

**ప్ర: పుస్తకాల్నీ, కలాన్నీ పూజించటం, కాళ్లు తగిలితే అపచారం జరిగినట్లుగా భావించి కళ్లకద్దుకోవటం మా చిన్నప్పటినుంచి అలవాటు. పెద్దవాళ్ళు చెప్తే వారిమాటపై గౌరవంతో అలా చేసేవాళ్ళం. కానీ ఇప్పుడు మా పిల్లలకి చెప్తే 'ఎందుకలా చేయాలి?' అని అడుగుతున్నారు, వాళ్లకి ఏం సమాధానం చెప్పాలి?**

**జ:** భారతీయులకి జ్ఞానం అత్యంత పవిత్రం, పూజనీయం. లౌకిక విద్యలుగానీ, ఆధ్యాత్మిక విద్యలు గానీ (అపరా, పరావిద్యలు) దైవంగా పూజ్యభావంతో ఆరాధించటం మన సంప్రదాయం. పూజ్యభావం ఉన్నప్పుడు జ్ఞానాధిష్ఠాన దేవత మనల్ని అనుగ్రహిస్తుంది. జ్ఞానాన్ని అందించే విద్యలకు ఆధారమైన గ్రంథాలు, కలం వంటి విద్యాసాధనా

లన్నింటిలోను విద్యాదేవత సరస్వతిని దర్శించే గొప్ప సంస్కారం భారతీయ ప్రాచీన సంస్కృతిలో ఉంది.

అందుకే వాటిని పూజించటం, మన సంప్రదాయంలో భాగం. వాటికి కాళ్లు తగిలితే దేవతకు కాళ్లు తగిలినంత అపచారం. పవిత్రమైన, ఉన్నతమైన సంస్కారాలకు భౌతిక కారణాలను వెతకాలనుకోవటం అవివేకం.

**సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి।**

**విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥** – అని స్మరించి చదువుకోవటం,

**"తల్లీ! నిన్ను తలంచి పుస్తకము చేతన్ బూనితిన్..."** –అంటూ పద్యాన్ని పఠించటం... మన వారి సంప్రదాయం. సరస్వతి అనుగ్రహంతో విద్య మనలో స్ఫురించి, సద్వినియోగం కావాలంటే ఆ తల్లిని తలంచుకోవాలి.

**ప్ర: దేవతల్లో నాలుగు చేతులు, ఎనిమిది చేతులు, పద్దెనిమిది చేతులు, పది చేతులు ఇలా ఎందుకుంటాయి? అన్ని చేతులున్న వాళ్లెక్కడైనా ఉంటారా?**



**జ:** మనకి కనిపించే మనలాంటి జంతువులతో దేవతల్ని పోల్చుకోనక్కర్లేదు. మన వలె ఉండని వారే దేవతలు. వారి బహుశక్తి సంపన్నతకు సంకేతాలు బహు బాహువులు. నాలుగు దిశలలో విస్తరించిన విశ్వచైతన్యశక్తి(Cosmic energy) దైవం. ఆ దిశలని ఎనిమిదిగా (మూలలతో–విదిశలతో కలిపి) చూస్తే – అష్టదిశలా ఆవరించిన అష్టభుజాలు. పరిపూర్ణ సంఖ్యకు (1+8=9) సంకేతంగా పూర్ణశక్తి సంకేతం అష్టాదశ భుజాలు. ఇవీ దేవతల చేతులకి సంకేతాలు. ఇంతేకాక – మనకు తెలియని రహస్యాలు చాలా ఉంటాయి. జంతు ప్రపంచంలోనే మనకంతు పట్టని దేహ స్వభావాలున్నవి అసంఖ్యాకం. మరి దేవతా జగతి గురించి మన బుద్ధులతో అంచనా వేయగలమా!

పై సంకేతాలే కాక–ఆయా దేవతలకి సంబంధించిన శబ్ద స్వరూపమైన మంత్రాలలోని బీజాక్షరాలు, మంత్రాక్షర నిర్మాణం కూడా దేవతాకృతిలో గర్భితమై ఉంటుంది. ఆయా మంత్రాలను శ్రద్ధగా ఉపాసిస్తున్న కొద్దీ ఆ దేవత అనుగ్రహిస్తుంది. ఆ అనుగ్రహంతో దేవతాతత్త్వం అవగతమవుతుంది.

**ప్ర: ఏవైనా స్తోత్రాలను పారాయణ చేసేటప్పుడు మూడుమార్లు, పదిమార్లు, వందమార్లు ఇలా పలుమార్లు చదివేటప్పుడు వాటి ఫలశ్రుతులను కూడా అన్ని మార్లు చదవాలా?**

**జ:** అన్నిమార్లు పారాయణ చేసేటప్పుడు కేవలం స్తోత్రభాగాన్ని మాత్రమే ఆవృతం చేయాలి. ఫలశ్రుతులు చదవవలసిన అవసరం లేదు. అనుకున్న పర్యాయాలు స్తోత్రం పఠించడం పూర్తయ్యాక, ఫలశ్రుతి చదవాలి.

**ప్ర: పురుడు, మైల పట్టకపోతే ఏం జరుగుతుంది? అసలు ఎందుకు పట్టాలి?**

**జ:** ఒక జీవి రాక, పోకల సమయంలో సూక్ష్మజగతిలో కొన్ని ఘర్షణలు ఏర్పడుతాయి. ఆ జీవునికి సంబంధించిన వారిపై వాటి ప్రభావం ఉంటుంది. అది భౌతికంగా కనబడదు. భౌతికమైన వైరస్‌లు కూడా కంటికి కనబడవు. కానీ క్రమేణా ఫలితం చూపిస్తాయి. అలాగే పురుడు, మైల పట్టకపోతే వచ్చిన అశుచి తొలగదు. ఆ సమయంలో దేవతారాధనలు కూడా పనికిరావు. అశుచి వాతావరణంలోకి దేవతలు రారు. అందుకే శుద్ధి అయినంత వరకూ దేవతల్ని ఆహ్వానించరాదు. వీటిని పాటించకపోతే అశుచి శాశ్వతమై, దేవతల అనుగ్రహం లభించక, విపరీత (నెగెటివ్) శక్తులైన పిశాదులు ఇంటినీ, ఒంటినీ ఆక్రమించి వంశంపై ప్రభావం చూపించి మానసిక శారీరక రుగ్మతలకీ, కలహాలకీ కారణమౌతాయి. నమ్మినా నమ్మకపోయినా ఇవి జరుగుతాయి. వాటికి మన నమ్మకాలతో సంబంధం లేదు. నమ్మినవాడు జాగ్రత్తపడతాడు. జాగ్రత్తపడ్డవాడు బాగుపడుతాడు.



**ప్ర: సుందరకాండలో హనుమంతుని సముద్రలంఘన సందర్భంలో శ్రీరాముని పూర్వీకులను పొగడి విశ్రాంతి కోసం కృతజ్ఞతగా మైనాకుని ప్రేరేపించిన సముద్రుడు – సేతుబంధన సందర్భంలో ఎందుకు భీష్మించుకున్నాడు? తిరిగి రాముడు కోపోద్రిక్తుడై కోదండాన్ని ధరిస్తేకానీ కాళ్లబేరానికి రాలేదు. ఎందుచేత?**

**జ:** తన ప్రాకృతిక గుణాన్ని ఉపసంహరించుకోలేనని విన్నవించుకున్నాడు. తిరిగి – రామానుగ్రహంతోనే వారధి బంధనానికి అనుకూలుడయ్యాడు.

రాముడు నిష్కారణంగా కోదండాన్ని సంధించడు. ఇప్పుడు ఆయన కోదండాన్ని సంధించేలా చేసి, అటుపై శరణు వేడాడు. శరణాగతులను మన్నించే ఉదారుడు రాముడు. కానీ సంధించిన శరాన్ని వెనుదీయడు. 'దీనిని ఎవరిపై ప్రయోగించాలి?' అని ప్రశ్నించాడు. సాగర తీరంలోని ఒక ప్రాంతంలో (ద్రుమకుల్యలు)కొందరు రాక్షసులు తమ అధర్మ వర్తనతో సముద్రుని ప్రాకృతిక నియమాలకు వ్యతిరేకంగా హింసిస్తున్నందున, వారిపై ప్రయోగించమని రాముని వేడుకున్నాడు. అప్పుడు శ్రీరాముడు ఆ బాణాన్ని సంధించి ఆ రాక్షసుల్ని సంహరించాడు.

రామునిచే శరసంధానం చేసి, ఈ శుభప్రయోజనాన్ని సాధించడానికే సాగరుడు ఆగి ఉన్నాడు. ఇంతేకాక – శ్రీరామునిలో నున్న సర్వభూత శాసక శక్తి లోకానికి ప్రకటించడం కూడా ఒక ప్రయోజనం.

ప్ర: **సభల్లో మాట్లాడేటప్పుడు 'సభ్యులు' అని కొందరు, 'సభికులు' అని కొందరు అంటారు? ఇందులో ఏది సరియైన మాట? అసలు 'సభ', 'వేదిక' అనే మాటలకు మూలమేమిటి?**

**జ:** పదిమంది ఒక చోట కూడితే సభ. అయితే 'సభికులు' అనే మాటను నీచుల సమావేశంలో వాడతారు. ఈ పదానికి 'జూదరులు' అని అర్థం. అందుకే సరియైన సభల్లో 'సభికులు' అనే మాటను వాడరాదు. 'సభ్యులు' అనే మాట మర్యాదస్థుల మాట. సభలలో కూర్చొనడానికి తగిన యోగ్యత గలవారు సభ్యులు.

అయితే యజ్ఞాలకు సంబంధించిన పదాలివి. వేదిక, సభ, యజమాని.... ఇవన్నీ యజ్ఞ సంబంధ శబ్దాలు. మన సంస్కృతి యజ్ఞాలనుండి వర్ధిల్లింది. యజ్ఞాలలో వివిధ వేద శాస్త్రాదు ల్లోని మహాపండితులు సమావేశమవుతారు. వారి సమా వేశమే సభ. **'యే చ సభ్యాః సభాసదః' – 'నమస్సభాభ్యః సభాపతి భ్యశ్చ'** అని శ్రుతి వచనాలున్నాయి. యజ్ఞాగ్నికుండాన్ని ఉంచిన స్థానం 'వేదిక', దేవతాత్మకమైన అగ్నిని తెలియజేసే చోటు. యజ్ఞము చేయువాడు యజమాని.



ప్ర: **'యా పంచప్రణవద్విరేఫనళినీ' – అని శ్రీరాజరాజేశ్వరీ స్తోత్రంలో ఉన్నది. ఈ మాటకి అర్థం ఏమిటి? 'పంచ ప్రణవాలంటే ఏమిటి? మాకు తెలిసి ఓంకారాన్ని 'ప్రణవం' అంటారు. *అది ఒకటే కదా! ఐదు ప్రణవాలనే మాటకి అర్థం వేరే ఉందా?***

**జ:** ప్రణవం అంటే ప్రధానంగా 'ఓం'కారాన్ని చెప్తారు. 'ప్ర–నవ' – ఈ శబ్దానికి నిరుక్తం, పురాణాలు, ఇతర ఆగమాలు చాలా అర్థాలు చెప్పాయి. ప్రధానంగా "ప్రకృష్టంగా (గొప్పగా) దాటించునది" అని అర్థం. దాటించడాన్నే 'తారకం' అంటారు. ప్రణవ మన్నా, తార(క)మన్నా ఒక్కటే. "ఓంకారస్తారః" అని శాస్త్ర వచనం. వేదాలలో ఐదు ప్రణవాలు ఉంటాయి. 'ప్ర–ణౌతి' గొప్పగా స్తుతించుట, ఆహ్వానించుట అని అర్థం కూడా ఉంది. దేనితో దేవతలను స్తుతిస్తామో, ఆహ్వానిస్తామో, మనం తరిస్తామో దానిని "ప్రణవం" అంటారని ముఖ్యార్థాన్ని గ్రహించాలి.

వేదానుసారం ఓంకారం, స్వాహాకారం, స్వధాకారం, వషట్కారం, నమస్కారం...

ఇవీ పంచప్రణవాలు. వీటి ద్వారా ఆహ్వానింపబడి, స్తుతింపబడి, మనలను తరింప చేసే పరమేశ్వరశక్తినే (పరబ్రహ్మను) రాజరాజేశ్వరీ దేవిగా ఉపాసిస్తున్నాం – అని వేదపరంగా చెప్పవచ్చు.

శాక్తేయ సిద్ధాంతానుసారం – శక్తి ప్రణవాలు అయిదు.

ఐం, శ్రీం, హ్రీం, క్లీం, సౌః. ఈ పంచప్రణవాలే తుమ్మెదలై అమ్మ కమలంలా ఉన్నది. తుమ్మెదలు కమలం చుట్టూ ఝుంకారం చేసినట్లుగా ఈ ప్రణవాల నాదమే అమ్మకు ఆరాధన. భ్రమరాలు కమలంలోని మకరందాన్ని ఆస్వాదించి నట్లుగా ఈ అయిదు ప్రణవాలతోనే జగదంబ దివ్యతత్త్వ మాధుర్యాన్ని ఉపాసకుడు గ్రహించగలడు. ఈ భావంతో 'పంచ ప్రణవాలనే తుమ్మెదలకు కమలం వంటిదెవరో' ఆ రాజరాజేశ్వరీ దేవికి నమస్కారం అని చెప్తూ ఈ మాటను వ్రాశారు.

ప్ర: **తమిళనాడు ప్రాంతాల్లో శరభేశ్వరుడనే పేరుతో శివుని పూజిస్తున్నారు. అసలు పురాణాల్లో ఈ కథ ఉందా? నరసింహస్వామి ప్రతాపాన్ని నిగ్రహించడానికి ఈ స్వరూపం వచ్చిందని అంటారు. ఆయన పాదాల క్రింద నరసింహ రూపం కూడా ఉంది? ఎవరు ఇందులో ఎక్కువ?**



**జ:** ఇందులో ఎక్కువ తక్కువలు లేవు. ఇది మంత్ర శాస్త్రపరమైన ఉపాసనా విషయం. అనేక కల్పాలలో అనేక మార్లు నృసింహావతారాలు జరిగాయి. శివస్వరూపుడైన వీరభద్రుని తేజమే శరభుడు. ఈ శరభేశ్వరునికి సంబంధించే మంత్రం, అనుష్ఠాన విధానం ఉన్నాయి. శత్రు సంహారకం, గ్రహదోషనివారకం, అభీష్ట సిద్ధిదాయకం అయిన స్వరూపమిది.

ఒక కల్పంలో–నృసింహుని ఉగ్రత తగ్గకపోయేసరికి – దేవతల ప్రార్థన మేరకు శివుడు శరభాకృతి ధరించి ఆ ఉగ్రతని ఉపసంహరించినట్లుగా పురాణ కథ. శివ, స్కందాది పురాణాల్లో చెప్పబడినది. "శరభోపనిషత్" పేరుతో ఒక ఉపాసనాపరమైన ఉపనిషత్తు ఉంది. శైవంలో "శరభ శరభ దశ్శరభ" అని ఘోషించి, 'వీరభద్ర పళ్లెం' వంటివి జరిపే సంప్రదాయాలు ఇప్పటికీ ఉన్నాయి. కథ ప్రకారం – ఆ సందర్భం వరకే గ్రహించాలి. అంత మాత్రాన ఎక్కువ తక్కువల చర్చ చేయరాదు. ఎవరి ఉపాస్యం వారికి ఎక్కువ – ఎవరి ఆహారం వారికి పోషకమైనట్లు. పురాణాల్లో కొన్ని చోట్ల శివాధిక్యం, కొన్నిచోట్ల విష్ణ్వాధిక్యం ఆయా సందర్భానుగుణంగా ఉంటాయి. తత్త్వతః అభేదమే. కథలు లీలా మాత్రమే. శరభం సింహం కన్నా

భీషణ మృగం. అతి శక్తిమంతమైనది. అత్యంత బలవంతమైన చాలా మృగజాతులు ఇప్పటికే అంతరించాయి. శరభాలు ఇప్పుడు కానరాకపోవచ్చు. కానీ ప్రాచీన కాలంలో శరభ మృగాలున్నట్లు మన పురాణాల్లోనే కాక, కావ్యాలలో, ఇతర సాహిత్యాలలో గోచరిస్తుంది.

ఈశ్వర విభూతియే వివిధ జంతువులలో ప్రతాపంగా, పరాక్రమంగా, శక్తిగా వ్యక్తమవుతోంది. **"యద్యద్విభూతి మత్సత్త్వం"**– అని గీతలో శ్రీకృష్ణ పరమాత్మ చెప్పినట్లుగా. ఆ శక్తి యొక్క దివ్యత్వస్థాయియే దైవం. అది ఉపాసన ద్వారా ఉపాసకుని అనుగ్రహిస్తుంది. అలా కొన్ని విభిన్న శక్తులను కేంద్రీకరించుకున్న అక్షర, భావ సముదాయంతో కూడిన మంత్రంగా ఉన్న శరభేశ్వర మంత్రాన్ని ఉపాసించేవారిని అత్యుగ్రమైన శివాకృతి అనుగ్రహిస్తుంది.సింహం కన్నా గొప్ప జంతువు కనుక– నరసింహుని ఉగ్రతని ఉపసంహరించేందుకు వచ్చిన స్వరూపంగా పురాణం కథ చెబుతున్నది.

ఈ స్వరూపం 'శరభ సాళువ పక్షిరాజ' స్వరూపమని వివరణ. రెక్కలు, పెద్ద పాదాలు కలిగి బహు భుజాలతో సింహమువంటి వదనంతో శోభిల్లే మహాస్వరూపమిది. భయ నిర్మూలన కోసం, దుష్ట శక్తుల వినాశనం కోసం, ఆరోగ్య బలైశ్వర్యాది సంపాదన కోసం, కలహాల నివారణ కోసం శరభోపాసన చేస్తారు.



నిజానికి ఒకే పరమేశ్వరుని వివిధ రూపాలే శివ, కేశవా దులు.విష్ణు సహస్రంలో కూడా **"అతులః,శరభః,భీమః"** అనే నామాలున్నాయి. సాటిలేని భీమత్వం కల శరభుని ఈ నామం తెలియజేస్తున్నది.

శివ, శంభు, రుద్ర, మహేశ్వర, స్వయంభు.. లాంటి శివనామాలను చెప్పిన విష్ణు సహస్రం "శరభ" నామాన్ని చెప్పడంలో ఆశ్చర్యం లేదు. వైష్ణవ సంప్రదాయంలో నృసింహం, శివోపాసన సంప్రదాయంలో శరభం... రెండూ ఒకే శివకేశవ పరతత్త్వపు అభివ్యక్తులు (Manifestations). ఇందులో ఎక్కువ తక్కువలు లేవు.శివుని చేత ఆరాధింపబడే విష్ణువు, విష్ణువు చేత ఆరాధింపబడే శివుడు.. ఇరువురూ మనచే ఆరాధింపబడే వారే. శరభం, నృసింహం కలిసిన విగ్రహం ఒక మంత్ర శక్తి పరమైన అద్భుతమైన కూర్పు. రెండు శక్తుల సమ్మేళన ఈ ఆకృతిలో ఉన్నది. దీనిని ఆరాధించే వారికి అమోఘ సిద్ధులు కలుగుతాయని ఋషులు ఆవిష్కరించారు.

**ప్ర: కర్ణుని రథంపైనున్న ధ్వజం గుర్తు ఏమిటి? 'ఉత్తర గోగ్రహణం'లోని పద్యంలో – "లలితకంబు ప్రభాకలిత పతాకా విహారంబువాడు రాధాత్మజుండు" అని ఉంది. కర్ణ పర్వంలో "కపికేతనము, హస్తి కక్ష్యము" అని ఉంది. ఈ రెండూ సమ న్వయం చేసుకోలేక పోతున్నాం. సరియైన భావాన్ని తెలియ జేయగలరు.**

**జ:** ఉత్తర గోగ్రహణ సందర్భంలో "కాంచనమయ వేదికా..." అనే సీసపద్యంలో ద్రోణ, అశ్వత్థామ, కృప, కర్ణ, దుర్యోధన, భీష్ముల రథ ధ్వజాలగురించి చెబుతూ – "లలిత కంబుప్రభా కలిత" అనే పాదం కర్ణ రథధ్వజం గురించి చెప్పారు (తిక్కనగారి 'ఆంధ్రమహాభారతం') 'కంబు' అంటే శంఖం. వర్ణిస్తున్న అర్జునునికి దూరానికి ఆ పతాకపు రంగు (వెలుగు) గోచరించింది. అది లలితమైన శంఖము వంటి వెలుగుతో నున్నదని వర్ణించాడు. కానీ ఆ రంగుగల కేతనం (జెండా)పై చిహ్నం ఐరావతం. అదీ తెల్లని ఏనుగే. ఆ తెల్లదనాన్నే శంఖంతో పోల్చి చెప్పారు.

ఈ విషయం కర్ణ పర్వంలో స్పష్టం చేశారు. "కపికేతనము హస్తికక్ష్యయు నమ్మహాబలు లిద్దరును" అనే సీసపద్యంలో –"కపి (హనుమంతుడు) అర్జునుని రథ ధ్వజ చిహ్నం. హస్తి – కర్ణుని రథధ్వజంపై గుర్తు" – అని స్పష్టమై ఉంది.



**ప్ర: శ్రీ విష్ణువు భార్య భూమాత కదా! మరి – ఆ భూదేవి పుత్రిక అయిన సీతాదేవిని శ్రీరాముడు (విష్ణు అవతారం) వివాహమాడాడు. ఈ వరస ఎబ్బెట్టుగా లేదా?**

**జ:** శ్రీ విష్ణువు మానవుడు కాదు. విశ్వవ్యాపక చైతన్యం. ఆయన ఈ పృథివిని భరించి, తన శక్తితో దీనిని పాలించడం చేత భూమిని "విష్ణుపత్ని" అన్నారు. దేవతా బాంధ వ్యాలు మానవుల వంటివి కావు. వారు తేజః స్వరూపులు. పాంచ భౌతిక దేహ బంధుత్వాలు వారికి వర్తించవు. ఆయన మానవునిగా శ్రీరామ స్వరూపంతో అవతరిం చాడు. భూశక్తి అయిన లక్ష్మి సీతమ్మగా వచ్చింది. భూ గర్భంలో నుండి వచ్చిన కారణంగా ఆమెను భూదేవి పుత్రిక అన్నారు. విష్ణువుగా కాక రామునిగా భూపుత్రికను వివాహమాడాడు. లౌకికంగా చూసినా – "గత జన్మలో జీవునికి ఒక బంధంగా ఉన్న వ్యక్తి, తరువాతి జన్మలో ఇంకొక బంధంగా రావచ్చు. ఈ బంధాలు ఆ జన్మ ఉపాధి వరకే. గత జన్మలతోగానీ, రానున్న జన్మలతోగానీ కలిపి చూడకూడదు.

**ప్ర: ధనుర్మాసాన్ని 'పీడనెల' అని, ఏ శుభకార్యాలు తలపెట్టరు కదా! మరి ఈ మాసంలో పిల్లలు పుడితే వారికి దోషం అంటుతుందా?**

**జ:** ఏ మాసమూ 'పీడనెల' కాదు. ప్రతి మాసము, ప్రతి తిథీ, ప్రతి వారం, ప్రతి

నక్షత్రం దేవతా స్వరూపాలే. ఐతే నీటిని నిప్పుగా వాడలేం. నిప్పుని నీటిగా వాడలేం. అలాగే ఏ మాసం ప్రయోజనం దానికి ఉంటుంది. అప్పటి సూర్య చన్ద్రాదుల ప్రభావాన్ని అనుసరించి ఆయామాసాలలో కొన్ని చేయవచ్చు – కొన్ని చేయరాదు. కొన్నిటికి అనుకూలం. కొన్నిటికి ప్రతికూలం.

పిల్లల పుట్టుకకీ మాసాల ప్రభావానికీ సంబంధం లేదు. పిల్లల పుట్టుకపై మాసాల నిషేధాలు లేవు. అయితే నక్షత్రానుగుణంగా కొన్ని నక్షత్రాలలో జన్మించిన వారికి కొన్ని శాంతులుంటాయి. అంత మాత్రం జాగ్రత్త పడితే చాలు.

ప్ర: **మహాలక్ష్మి అమ్మవారు అష్టలక్ష్ములుగా అవతరించింది కదా! దానికి సంబంధించిన కథను వివరిస్తారా?**

**జ:** అష్టలక్ష్ములు అవతారాలు కావు. వాటికి కథ లేదు. మనకు కావలసిన ఐశ్వర్యాలు ప్రధానంగా ఎనిమిది. వాటిని ప్రసాదించే ఒకే ఐశ్వర్యాధి దేవత మహాలక్ష్మి. అష్టవిధ ఐశ్వర్యాలుగా విభిన్నంగా చూసినప్పుడు ఒక్క లక్ష్మినే ఎనిమిదినామ రూపాలతో ఆరాధిస్తున్నాం. తద్వారా మనకు అవసరమయ్యే అష్ట ఐశ్వర్యాలు ఆ తల్లి దయలేనని గ్రహించగలం.



ప్ర: **ఆగమ శాస్త్రం కర్త ఎవరు? అది వేదములలో చెప్పబడిందా? తెలుగులో ఆగమ శాస్త్రం ఎక్కడ లభిస్తుంది?**

**జ:** 'ఆగమశాస్త్రం' అనే పేరుతో ఒక ప్రత్యేక గ్రంథం లేదు. ఆగమశాస్త్రాలు లెక్కలేనన్ని ఉన్నాయి. హిందూమతం నిగమ ఆగమాలపై ఆధారపడి ఉంది. 'నిగమం' అంటే వేదం, 'ఆగమం' అంటే మంత్ర శాస్త్రాలు (తంత్ర గ్రంథాలు) అని వాడుక. రెండింటికీ అర్థంలో, శబ్దంలో ఏకత్వం ఉంది. 'పరమేశ్వరుని నుండి వెలువడింది' అని అర్థం. దేవతోపాసనలు, ఆలయ నిర్మాణ విధులు వంటివి ఆగమాలలో విస్తృతంగా ఉన్నాయి. వాటి ఆధారంగానే మన దేవాలయాల నిర్మాణం, విధులు ఏర్పరచారు. వీటి మూలాలు వేదాలలో స్పష్టంగా వున్నాయి. యజ్ఞ భూముల నిర్మాణం, దేవతారాధన వేదాలలోనిదే. వాటిని మథించి ఋషులు దర్శించినవే ఆగమాలు.

ఇవి బాహు సంఖ్యలో ఉన్నాయి.

శైవాగమాలు, వైష్ణవాగమాలు, శాక్తేయాగమాలు విస్తృతంగా లభిస్తున్నాయి. ఇవికాక సౌర, గాణపత్యాది సంప్రదాయాలలోను ఆగమాలున్నాయి. పాంచరాత్ర, వైఖానస, కామిక, పాశుపత…మొదలైన ఆగమగ్రంథాలెన్నో! వీటి ద్వారా ప్రాచీన భారతీయుల నిర్మాణ కౌశలం వంటి భౌతిక విజ్ఞానాంశాలు కూడా గ్రహించబడతాయి.

**ప్ర: తెలుగు లిపిలో 'చన్ద్రశేఖరేన్ద్రుడు' లేక 'చంద్రశేఖరేంద్రుడు' – ఈ రెండింటిలో ఏది సరియైనది?**

**జ:** వ్యవహారంలో 'చంద్రశేఖరేంద్రుడు' అని చదువుతున్నా, 'ం' (పూర్ణానుస్వారం) స్థానంలో 'మ్' అని ఉచ్చరించరాదు. 'న్' అని పలకాలి. సరియైన శబ్దం 'చన్ద్రశేఖరేన్ద్ర'. 'ఇమ్ద్ర', 'చమ్ద్ర' –కాదు ఇన్ద్ర – చన్ద్ర – అని ఉచ్చారణ.

**ప్ర: మన సంప్రదాయాలలో చాలా ఆచారాలుంటాయి. అన్నీ ఆచరించడమూ కష్టమే. కొన్ని ప్రాంతాలలో కొన్ని సాధ్యంకావుకూడా. ఉదాహరణకు వజ్రోత్సవ సంచికలో అందించిన 'ఋషిపంచమి' వ్యాసం. అందులో చెప్పినవన్నీ బొంబాయి లాంటి నగ రాల్లో పాటించలేం. అని చదివితే "అయ్యో! అనేక ధర్మాలను పాటించలేక పోతు న్నామే" అని వేదన పడడమేతప్ప – వేరే ప్రయోజనం లేదు. మరి ఎందుకు వాటిని ప్రచురించడం?**

**జ:** మీ ప్రశ్న చాలా బాగుంది. కానీ కొంచెం లోతుగా ఆలోచిస్తే సమాధానం మీకే లభిస్తుంది. అందరికీ అన్నీ కుదరకపోవచ్చు. కానీ కొందరికైనా కుదరవచ్చు కదా. శ్రద్ధా, పట్టుదల, ఎక్కువగా కలవారు కుదుర్చుకోగలరు కూడా. కుదిరే వారికోసం, కుదుర్చుకోగలిగేవారికోసం మన ఆచారాల విషయాలను అందుబాటులోనికి తేగల గాలి. మరియొక విషయం ధర్మాన్ని మనం ఆచరించలేక పోయినా తెలుసుకో వడం తప్పు లేదు. అలా తెలుసుకోకపోతే మనకు తెలిసిన తెలిసీ తెలియని జ్ఞానమే ధర్మంగా చెలామణి అయ్యే ప్రమాదం ఉంది.

ఎంత ప్రయత్నించినా తెలిసిన ధర్మాన్ని ఆచరించే పరిస్థితులు లేనప్పుడు వేదన పడడం కూడా ధర్మాచరణ ఫలాన్ని కొంత ఇస్తుంది. ధర్మాచరణ మాత్రమే కాదు ధర్మస్మరణ కూడా గొప్పదే (ఆచరించడం సాధ్యం కానప్పుడు).

**'కలౌ స్మరణాన్ముక్తిః'** అనే మాటలోని భావమిదే. ఎప్పుడైనా మనిషి పరిమితుడు. తాను చేయ'గలిగినంత' చేస్తాడు గానీ చేయ'వలసినంత' చేయలేడు. ఈ 'కలిగినంత' అనే మాటకు ఎవరికి వారే ప్రమాణం. "యథాశక్తి" 'శక్తివంచన లేకుండా' (సిన్సి యర్‌గా) అనే మాటలు మన సంకల్పాలలో రావడానికి ఇదే కారణం.

ఆరోగ్యకర జీవనానికి వైద్యశాస్త్రం అనేక ఆహార సూత్రాలను, అలవాట్లను చెబుతోంది. అన్నీ అందరూ చేయలేరు. అయినా చెప్పడం మానరు కదా! చేయగలిగేవారు, చేసేవారు తప్పకుండా ఉంటారు. అలాగే ధర్మశాస్త్రాలు చెప్పే సూత్రాలు కూడా.

అందరూ బొంబాయిలాంటి నగరాల్లోఉండరు. అక్కడి వారిలో అందరూ ఒకేలా ఉండరు. వారి వారి స్థితిగతుల్లో అవకాశాలు విభిన్నంగా ఉంటాయి. కుదరనప్పుడు వేదనపడకుండా, కుదిరినంత చేసి భగవత్ స్మరణ చేసుకోవడం మేలు.

ప్ర: **మన వేదాలు అపౌరుషేయాలు, బ్రహ్మముఖం నుండి వెలువడినవనీ, ఋషులు దర్శించినవీ, వారు ప్రవచించినవీ తప్ప గ్రంథస్థం కానివికదా! అటువంటి వాటిని సోమకాసురుడనే రాక్షసుడు దొంగలించాడనీ, శ్రీమహావిష్ణువు మత్స్యావతారమెత్తి సముద్రగర్భంలో దాచిన వేదాలను వెలికితీసి రక్షించాడని కథనం. ఎలా అన్వయించాలి?**

జ: సామాన్య దృష్టికి 'గ్రంథాలు'గా బొమ్మలువేసి చూపిస్తున్నా, వేదాలు గ్రంథాలు కావు.బ్రహ్మకు పరమాత్మ స్ఫురింపజేసినవి. అసురీశక్తులు బుద్ధిని శక్తులకు (దేవతలకు) అందకుండా దాచి ఉంచడమే సోమకాసురుని చేష్ట. తిరిగి పరమాత్మ ఆసురీ శక్తులను తొలగించివేద విద్యను బ్రహ్మకు స్ఫురింపజేశాడు. మనలో బుద్ధిని కూడా తామస స్వభావం, రాజస స్వభావం సరిగ్గా పనిచేయనివ్వనప్పుడు, తెలిసిన జ్ఞానమే మరుగునపడుతుంది. అప్పుడు అంతర్యామి అయిన పరమేశ్వరుడే ఆ మాంద్య అజ్ఞాన స్వభావాన్ని తొలగించి, అసలు తెలివిని బుద్ధికి కలిగిస్తాడు. ఇదే సోమకాసుర కథనంలోని సంకేతం.

అంతేకాకుండా సృష్టిలో ప్రతి భావానికి, విద్యకీ ఒక స్వరూపం ఉంటుంది. ఒక ప్రబలమైన శక్తితో ఒకరినుండి ఆ భావాన్నీ, విద్యనీ ఆకర్షించి జడీభూతం చేయగలిగే విధానాలున్నాయి. అలాంటి విధానాలను అనుసరించే రాక్షస ప్రవృత్తి కలవారు ఈనాటి సమాజంలో కూడా కనిపిస్తారు. సోమకాసురుడు వంటివారు తీవ్రమైన ఆసురీశక్తిని ప్రయోగించి, బ్రహ్మబుద్ధి శక్తిలోని వేదవిద్యను కబళించారు. సూర్యుని సైతం మబ్బులు మరుగుపరచడం లేదా! అంత మాత్రాన సూర్యుడు అపహరించబడినట్టో, అంతరించినట్టో కాదుగదా! అలాగే రాక్షసశక్తులు దైవీయ విద్యను మరుగున పరుస్తాయి. కొన్ని పురాణాల్లో వేదవిద్యలను బాలరూపాలుగా ఆకర్షించి రాక్షసుడు సముద్రగర్భంలో బంధిస్తే, విష్ణువు అతడిని సంహరించి, బాల రూపాలలోనున్న శ్రుతులను కాపాడినట్లు వర్ణించాడు. ఇది పై భావానికి వ్యక్తీకరణ.

ప్ర: **గణపతి బౌద్ధుల దేవుడా? అమరకోశంలో బుద్ధుని పర్యాయ నామాలలో వినాయక నామం ఉందని చదివాను. గణపతి స్వరూపం, పూజనం బౌద్ధమత ప్రభావం**

**వలన వైదిక మతంలో ప్రవేశించాయని కొందరు పండితులు అభిప్రాయపడ్డారు. ఇది నిజమేనా?**

**జ:** బౌద్ధమతం ఈ దేశంలో ఉద్భవించింది. అప్పటివరకు సనాతన భారత ధర్మంలో ఉన్న నైతిక నియమాలను, అహింసా ధర్మాలను బౌద్ధమతం తమ ధర్మాలుగా వ్యవస్థీకరించుకుంది. ఆ కారణం చేత హిందూమతంలో అంతర్భాగమయ్యింది. దానితో పాటు మన తంత్ర శాస్త్ర గ్రంథాలను అధ్యయనం చేసి బౌద్ధులు తంత్రోపాసనలను చేపట్టారు. చారిత్రక పరిశోధనల్లో ఇవి స్పష్టమౌతున్నాయి. అవలోకితేశ్వరుడు వంటివారు నేపాల్, టిబెట్‌సమీప ప్రాంతాల్లో తార, మహాకాల వంటి దేవతోపాసనలను విరివిగా చేశారు. ఇప్పటికీ వారి ఆరామాలలో ఆ దేవతల పూజలు జరుగుతాయి. మన దశమహావిద్యలలోని తారా (రెండవ విద్య) విద్య వారి సంప్రదాయంలో చేరింది. వారి జాతక కథలుకూడా హైందవ దేవతలను పేర్కొ న్నాయి. ఇదే పద్ధతి జైనులు కూడా అవలంబించారు.

వైదిక మూలాలనుండి తంత్ర శాస్త్రాలలోకి విస్తరించిన గణపతి, సరస్వతి, లక్ష్మి వంటి వైదిక దేవతలను బౌద్ధ జైన మతానుయాయులు ఉపాసించారు. అంతేగాని బౌద్ధం నుండి మనలోకి ప్రవేశించిన దేవతలు లేరు. బౌద్ధ మంత్రాలలోని 'ఓం మణిపద్మేహుం' వంటి మంత్రాలు మన 'ఓం' కారాన్ని, తంత్రాలలోని 'హుం, ఫట్' వంటి బీజాలను ఉపయోగించాయి. గణపతి స్వరూపం, పూజనం వైదిక మతం నుండి బౌద్ధ తంత్రంలోనికి ప్రవేశించినదే కానీ వారి నుండి వైదికంలోకి రాలేదన్నదని సుస్పష్టం.



**ప్ర: శ్రీ కృష్ణ భగవానుడు 'ద్వాపర యుగాంతంలో భాద్రపదమాసం అష్టమీ తిథి రోహిణీ నక్షత్రం బుధవారం' ఆవిర్భవించినట్లు కొన్ని పుస్తకాల్లో చెప్పబడింది. మరి కృష్ణావతారం శ్రావణమాసంలోనా, లేక భాద్రపదంలోనా? వివరించగోరతాను.**

**జ:** మనదేశంలో కొన్ని ప్రాంతాలలో సౌరమానం, చాన్ద్రమానం, మరికొన్ని చోట్ల బార్హస్పత్యమానం వాడుకలో ఉన్నాయి. కొందరి కాలగణన సంప్రదాయం ప్రకారం పూర్ణిమ నుండి పూర్ణిమకు మాస గణన ఉంటుంది. ఆ లెక్కన శ్రావణ పూర్ణిమ తరువాతి దినం నుండి భాద్రపద పూర్ణిమ వరకు వారికి భాద్రపదమాసం. అందుచేత మన శ్రావణ బహుళాష్టమి వారికి భాద్రపద అష్టమి అయింది.

**ప్ర: చక్కగా పూజ చేసుకోవాలని ఉన్నా, ఇల్లంతా అమర్చుకోవడం, పూజగది శుభ్రం చేసుకోవడం, పూజా సామగ్రి నంతా సిద్ధపరచుకోవడం వాటితోనే చాలా సమయమై పోతుంది. ఇంక పూజ చూస్తే కొద్దిసేపే! ఇది దోషం కాదా? ఏం చేయాలి?**

**జ:** అసలు పూజకోసమని ఇంటిని శుభ్ర పరచుకోవడం, అమర్చుకోవడం దగ్గర్నుండీ పూజ ప్రారంభించినట్లే. అందుకోసం చేసే ప్రతి అమరికా అర్చనే. దేవతా మందిరాన్ని శుభ్రపరచినా, కడిగినా, దీప కుసుమాదులు అమర్చినా ఎన్నో పుణ్య ఫలాలున్నాయని శాస్త్రం చెబుతోంది. కనుక ఇంటిని బాగు చేసుకోవడం నుండి భగవత్పూజగా భావించి నామస్మరణమో, స్తోత్ర పఠనమో చేస్తూ దైవచింతన చేస్తుంటే అసలు పూజతోపాటు ఇవన్నీ కలసి పరిపూర్ణ పూజాఫలం లభిస్తుంది.

**ప్ర: పరమశివుడు భిక్షాపాత్ర పట్టుకొని అన్నపూర్ణాదేవి వద్దకు భిక్షకు వెళ్ళినట్టు ఫోటో చూశాను. ఏ సందర్భంలో అలా వెళ్తాడు? సందేహం తీర్చగలరు.**

**జ:** అది కాశీక్షేత్రానికి సంబంధించిన అంశం. కాశీ విశ్వేశ్వరుడు నిరంతరం అమ్మ వారి చేతి భిక్షను స్వీకరిస్తాడని పురాణగాథ. అన్నపూర్ణ జగదంబ. ప్రకృతి. విశ్వ నాథుడు జగజ్జనకుడు. పరమేశ్వరుడు ప్రకృతి ద్వారా సకలజగతిని పోషిస్తున్నాడు. అలా మనం పొందే ప్రాకృతిక ఐశ్వర్యాలన్నిటినీ మొదటిగా ఈశ్వరార్పణ చేసి స్వీకరించాలి. ఆ సంకేతమే ఇందులోని ఆంతర్యం.

ఇంకోరకంగా భావిస్తే–విశ్వమనే గృహంలో గృహిణి పార్వతి. గృహస్థు శివుడు. పోషించే అఖిలైశ్వర్యాలే అన్నం. జీవులందరూ పిల్లలు. తల్లి మొదటిగా తండ్రికి పెట్టి, తరువాత మనందరికీ ఆరగింపునందిస్తోంది.

**ప్ర: నాకు సైనస్ కారణంగా ఉపవాసం ఉన్నరోజు తల స్నానం చేయలేకపోతున్నాను (సోమ, శుక్ర, శని వారాలలో). వారానికి ఒక్కసారే చేయగలుగుతున్నాను. ఏదైనా దోషమా?**

**జ:** ఆరోగ్యానికి దెబ్బతీసే పద్ధతుల్ని పాటించనవసరం లేదు. ఆరోగ్యవంతులు పాటించే నియమాలు, అవి పాటించలేని అనారోగ్యవంతులకి వర్తించవు.

తలస్నానం చేయలేని వారు కంఠస్నానం చేసినా పూర్ణ స్నానంతో సమానమే. స్త్రీ పసుపు రాసుకొని స్నానంచేసినా పూర్ణమే. కనుక స్నానం చేయలేకపోతున్నానని వేదన పడనక్కర్లేదు. శాస్త్రాలలో, ఆరోగ్యరీత్యా కుదరని వాళ్ళు చేయగలిగే విధానాలు సైతం ఉన్నాయి. తలస్నానం చేయకున్నా, మీరు ముఖానికి పసుపు రాసుకొని

గోవింద, గంగా నామస్మరణలతో (తల మినహాయించి) ముఖ, కంఠ స్నానాలు చేయండి.

ప్ర: **నేను 'శ్రీరామ' నామం వ్రాయాలని ఒక నోట్‌బుక్ కొని మొదలుపెట్టాను. ప్రతిరోజు 108 సార్లు వ్రాయలను కుంటున్నాను. అనుకోకుండా మా అత్తగారు అదే ఏడాదిలో చనిపోయారు. వయసు 85 ఏళ్ళు. మరి నేను వ్రాయడంవలన పొరపాటు జరిగిందా? మళ్ళీ మొదలు పెట్టవచ్చా? అది పూర్తయ్యాక దానిని ఎక్కడివ్వాలి?**

జ: శ్రీరామనామం వ్రాయడానికీ, మీ అత్తగారి మరణానికీ సంబంధం లేదు. ఆవిడ ఆయువు తీరి పరమపదించారు. మీరు రామనామం వ్రాసిన ఏడాదిలో జరగడం కేవలం యాదృచ్ఛికం. రామనామం వ్రాయడం వలన ఏ దోషాలు జరుగవు. పైగా అది శుభకరం. మీరు రామనామాన్ని మొదలు పెట్టవచ్చు. అది పూర్తయ్యాక స్వీకరించే ఆలయాలు చాలా ఉన్నాయి. ముఖ్యంగా భద్రాచలం రామాలయాన్ని సంప్రదించండి.

ప్ర: **శ్రీకృష్ణుడు అర్జునుని రథం నడుపుతున్నట్లు ఉన్న గీతాబోధన చిత్రం మా ఇంట్లో ఉంది. ఒకాయన మా ఇంటికొచ్చి అది ఇంట్లో ఉంటే కలహాలు జరగుతాయని, ఆ చిత్రాన్ని తీసేయమని చెప్పారు. ఆ మాట నిజమా?**



జ: అది యుద్ధరంగానికి సంబంధించిన చిత్రంగా బహుశా వాళ్ళు భావించి ఉండవచ్చు. కానీ కృష్ణార్జునులున్న ఆ పార్థసారథి చిత్రాన్ని ఇంట్లో ఉంచడం వల్ల ఏ ప్రమాదమూ, కలహమూ జరుగవు. పైగా –

**యత్ర యోగీశ్వరః కృష్ణో**
**యత్ర పార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీః విజయో భూతిః**
**ధ్రువానీతిర్మతిర్మమ ॥** –అని గీతా శ్లోకం.

కృష్ణార్జునులున్న చోట ఐశ్వర్యం, విజయం, సంపదలుంటాయని శాస్త్రం. ఆ చిత్ర మున్న కారణంగా జ్ఞానం, విజయం లభించి గీతాచార్యుడైన శ్రీకృష్ణపరమాత్మను స్మరించే అవకాశం చేకూరుతుంది.

ప్ర: **ఒక్కొక్క మాసంలో విష్ణువునకు ఒక్కొక్క పేరు ఉంటుందనీ, దానిని మాస నామ మంటారనీ విన్నాను. అవి ఏమిటో వివరిస్తారా? నక్షత్రాల ఆధారంగా 'అశ్వినీ – చూ చే చో లా' వంటి నామాలు పెట్టాలంటారు. అది శాస్త్ర సమ్మతమేనా?**

జ: ఈ "అశ్వినీ–చూ చే చో లా" వంటి నామాలకు శ్రౌత (వేదసమ్మత) ధర్మశాస్త్రాలలో

అంతగా చెప్పబడలేదు. కానీ జ్యోతిష్య గ్రంథాలలో ఉన్నమాట నిజమే. కానీ వాటిని అంతగా ప్రమాణంగా గ్రహించవలసిన పనిలేదు. అయితే మాసనామా లకు ధర్మశాస్త్ర ప్రమాణం ఉంది.

**చైత్రాది మాసనామాని వైకుంఠోథ జనార్దనః ।**
**ఉపేంద్రో యజ్ఞపురుషో వాసుదేవ స్తథా హరిః ।**
**యోగీశః పుండరీకాక్షః కృష్ణోనంతోచ్యుత స్తథా ॥**
**చక్రీతి ద్వాదశైతాని క్రమాదాహుర్మనీషిణః ॥**

చైత్రం–వైకుంఠ, వైశాఖం–జనార్దన, జ్యేష్ఠం – ఉపేంద్ర, ఆషాఢం – యజ్ఞపురుష, శ్రావణం–వాసుదేవ, భాద్రపదం–హరి, ఆశ్వయుజం–యోగీశ, కార్తీకం– పుండరీ కాక్ష, మార్గశీర్షం–కృష్ణ, పుష్యం–అనంత, మాఘం–అచ్యుత, ఫాల్గుణం –చక్రి.

ఆయా మాసాలలో పుట్టినవారికి నామకరణం చేసేటప్పుడు మామూలుగా పెట్టే పేరు మాత్రమే కాక, మాసనామం కూడా పేర్కొనడం ఆనవాయితీ. ఈ నామాలు నామకరణానికి సంబంధించి మాత్రమే.



ప్ర: **ఉపనిషత్తులలో పూజలు, పునస్కారాల గురించి చెప్పలేదు, చక్కని తత్త్వవిచారణ మాత్రమే ఉంది. హాయిగా ఆ జ్ఞానాన్ని గ్రహించకుండా, ఈ దేవతా పూజలతో కాలం వ్యర్థం చేసుకోవలసిన అవసరముందా?**

**జ:** ఉపనిషత్ జ్ఞానానికి దేవతా పూజల పట్ల విరుద్ధ భావమేమీ లేదు. వైద్యం గురించి, వంటల గురించి కూడా ఉపనిషత్తులలో చెప్పబడలేదు. అలాగని వైద్యాన్ని, వంటల్ని విడిచి పెడుతున్నామా! ఉపనిషత్తుల జ్ఞానం వేరు. వైద్యం లాంటి శాస్త్రాలు వేరు. ఇవి శరీరాన్ని బాగుచేయడానికి, పోషించడానికి చెప్ప బడినవి. ఉపనిషత్తు తత్త్వాన్ని చెబు తోంది. తత్త్వాన్ని చింతనలో ఉంచుకొని మన క్షేమం కోసం చేయవలసిన కర్మల్ని మానకుండా చేసుకుంటాం.

అలాగే ఉపనిషత్తత్త్వాన్ని మననం చేసుకొని జ్ఞానాన్ని సంపాదించుకుంటూనే, దేవతా పూజలు చేయవచ్చు. ఉపనిషత్తులు దేవతాపూజల్ని నిషేధించలేదు. దేని ప్రయోజనం దానిదే. ఒకదానికొకటి ప్రత్యామ్నాయం కాదు.

దేవతాపూజ కేవలం అభీష్టసిద్ధికీ, అనిష్ట పరిహారానికీ మాత్రమే కాక 1. కృతజ్ఞతా భావంతోను, 2. చిత్తశుద్ధి కోసం, 3. కృతఘ్నతా దోష నివారణ కోసం చేయాలి. దేవతల వల్లనే ప్రకృతి శక్తులు, మన ఇంద్రియ శక్తులు సమర్థవంతమౌతున్నాయి

కనుకనే కృతజ్ఞతగా వారిని అర్చించాలి. లేని పక్షంలో కృతఘ్నుతా దోషం వస్తుంది. అందుకే - ఉపనిషత్తు - **"దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్"**- దేవపిత్రు కార్యాలలో ఏమరపాటు కూడదు-అంటే 'దేవతలను, పిత్రుదేవతలను మరువరాదు'. యజ్ఞ, అర్చనాది కర్మల ద్వారా వారిని ఆరాధించడం మన విధి. వారి ఆరాధన వల్ల శుద్ధమైన చిత్తానికే తత్త్వవిచారం సాధ్యమౌతుంది.

ప్ర: **గణపతి ఉపాసనలో 'ఉచ్ఛిష్ట గణపతి' వామాచారంలో, క్షుద్రోపాసనలో చెప్పబడిన దేవత అని అంటారు. అసలు ఈ గణపతి ఎవరు? అవతార కథ ఏమిటి? దీనికి వైదికమూలం ఉందా?**

జ: ఉచ్ఛిష్టగణపతి ఉపాసన వామాచారంలో కూడా ఉంది. ప్రతిదేవతోపాసనకీ రెండు వైపులూ ఉంటాయి. సాత్త్విక, తామసికాలలో సాత్త్వికం మనకు క్షేమంకరం. తామసం వామాచారం. అది అనుసరణీయం కాదు. అలాగే 'ఉచ్ఛిష్టగణ' శబ్దం బట్టి అశౌచ సమూహాలలోని శక్తుల్ని వశం చేసుకొనే తామసతంత్ర ప్రయోగాలు ఉండవచ్చు. కానీ వాటిని గ్రహించ వలసిన పనిలేదు.

ఇక సాత్త్వికంగా, తాత్త్వికంగా ఆలోచిస్తే- గణపతి వాక్స్వరూపునిగా, శబ్ద స్వరూపు నిగా, మంత్రాధిపతిగా వేదాలలో పేర్కొనబడ్డాడు. 'గణానాం త్వా గణపతిం హవా మహే" అనే వైదిక మంత్రం ఈ భావననే చెబుతోంది. మంత్ర ములకు గణములు, కవులు- అని పేర్లు. వాటికి అధిపతిగా ఉన్న పరమేశ్వర చైతన్యమే గణపతి. మంత్ర ములన్నీ అక్షరాత్మకములు. అక్షరాలన్నీ నోటిద్వారా ఉచ్చరింప బడతాయి. అందుకే అక్షరాలే ఉచ్ఛిష్టాలు. (ఎంగిలి) సర్వాక్షరములకు, మంత్రాలకు పతియైనందున పరబ్రహ్మయే ఉచ్ఛిష్టగణపతి. గణపతి సహస్ర నామాలలో "జిహ్వా సింహాసనః ప్రభుః" అనే నామం ఉంది.



నోరు అనే కలుగు(రంధ్రం)లో నాలిక అనే మూషికంపై తిరిగే అక్షరాకృతే ఉచ్ఛిష్ట గణపతి. సాత్త్వికంగా ఇలా భావించి ఉచ్ఛిష్టగణపతిని ఉపాసించే వైదికాచారంలో ఉత్తమ ఫలితాలు లభిస్తాయి. ఈ విషయాన్నే మహోపాసకులైన కావ్యకంఠ వాసిష్ఠ గణ పతి ముని వివరిస్తూ- "జిహ్వా స్థలే నాథ విహారమానం, త్వామా హురుచ్ఛిష్ట మిహచ్ఛలోక్యా" అన్నారు.

ఇంకొక అర్థంలో-ఉత్+శిష్ట=ఉచ్ఛిష్ట.(శిష్ట-మిగిలినది) విశ్వంలో మాయామయ మైన విషయాలన్నిటినీ 'నేతి-నేతి' (ఇది కాదు-ఇది కాదు) అనే నిషేధ వాక్యా

లతో తొలగిస్తూ వెళితే, సర్వోత్కృష్టంగా మిగిలే ఆత్మతత్త్వమే 'ఉచ్ఛిష్టం'. అదే ఇంద్రియగణాలను నడుపుతూనే, వాటికి అతీతంగా ఉండే పరతత్త్వం. కనుక అది 'ఉచ్ఛిష్టగణపతి'. ఇది వేదాంతార్థం. ఈ సాత్త్విక, వేదాంత (తాత్త్విక) అర్థాలే మనకు ప్రమాణాలు. దీనికి ఆధారంగా వేదవాక్యాలే గోచరిస్తాయి.

అథర్వవేదంలో పరమాత్మపరంగా 'ఉచ్ఛిష్ట' శబ్దాన్ని వాడారు.

**ఉచ్ఛిష్టే నామరూపం చోచ్ఛిష్టే లోక ఆహితః॥**
**ఉచ్ఛిష్ట ఇంద్రశ్చాగ్నిశ్చ విశ్వమన్తః సమాహితమ్॥**
**నవభూమిః సముద్రా ఉచ్ఛిష్టోధిశ్రితా దివః।**
**ఆసూర్యో భాత్యుచ్ఛిష్టే అహోరాత్రేపి చ తన్మయి॥**
**సన్నుచ్ఛిష్టే అసంశచో భౌ....**

**లౌక్యా ఉచ్ఛిష్ట ఆయత్తా ప్రశ్చ ద్రశ్చాపి శ్రీర్మయి॥** –లాంటి వైదికమంత్రాలున్నాయి. ఇలా పరిశీలిస్తే గణపతి స్వరూపాలన్నీ వైదికాలేనని స్పష్టమౌతుంది. ఇది అవతారమూర్తిగా కాక ఉపాస్యదేవతగా మంత్రశాస్త్రాల ద్వారా గ్రహించగలం.

228 ప్ర: **కొందరు ఆచారాలను కొంచెం 'అతి'గా పాటిస్తుంటారు. అవి చిరాకును కలిగిస్తుంటాయి. 'అత్యాచారం' అంటే అదేనా?**

**జ:** లోకంలో ఏ పనిచేసినా ఒక్కొక్కరిదీ ఒక్కొక్క తీరు. లౌకిక వ్యవహారాల్లో కూడా ఎక్కువ జాగ్రత్త, ఒకటికి పదిమార్లు పరిశీలించుకోవడం కొందరి నైజం. ఇంకొందరు అదే పనిని అలవోకగా, అంటీ అంటనట్లుగా చేస్తారు. అలాగే సంప్రదాయమైన ఆచారాల్లో కూడా కొందరు అధికంగా జాగ్రత్తపడవచ్చు.

ఇది 'అతి' అనీ, ఇది 'మితి' అనీ ఎవరు తేల్చగలరు. సడలిస్తూ వెళితే ఏ ఆచారమూ మిగలదు. ఒకరికి 'అతి' ఐనది ఇంకొకరికి 'మితి'. మనం మామూలుగా పాటించే వాటిని కూడా కొందరు 'అతి'గా భావించవచ్చు.

ఈ అతి, మితులను శాసించేది శాస్త్రం. పరంపరాగత సంప్రదాయం. ఈ రెండింటినీ ఆధారంగా ఆచారాన్ని నిర్ణయించాలి.

'అత్యాచారం' అంటే 'అధికంగా ఆచరించడం' అని అర్థం కాదు. ఆచారాన్ని అతిక్రమించడం– అని అర్థం. చేయవలసిన దానిని చేయకపోవడం, చేయకూడని దానిని చేయడమే 'అత్యాచారం'.

**ప్ర: మా కుమారునికి వివాహమయ్యాక రెండునెలల తర్వాత కాశీక్షేత్రానికి వెళ్ళారు. అలా పెళ్లయిన వెంటనే కాశీకి వెళ్ళకూడదని ఒక మిత్రులన్నారు. నిజమేనా?**

**జ:** పెళ్ళయిన తక్షణం కూడా కాశీకి వెళ్ళవచ్చు. దైవదర్శనార్థం పరమపవిత్రమైన ఆ క్షేత్రానికి వెళ్ళడం మంచిది కూడా. తోచినట్లు అభిప్రాయాల్ని చెప్పేవారి మాటల్ని అంగీకరించవద్దు. కాశీ మంగళక్షేత్రం. చివరకు మరణాన్ని సైతం మంగళంగా మార్చే చోటు. అంతటి శుభస్థలం.

కాశీలో పెళ్లిళ్ళు చేసుకొనే వాళ్ళు లేరా? ఆదిదంపతులు విశాలాక్షీ విశ్వనాథుల దీవెనలు నూతన దంపతులకు లభించడం కూడా శ్రేయస్కరమే.

**ప్ర: 'భుక్తి ముక్తులు' అని ఎక్కువగా వాడుతుంటారు. దైవాన్ని 'భుక్తిముక్తి ప్రదాయకః', 'భుక్తి ముక్తి ప్రదాయినీ' అంటారు. అలాగే కొన్ని స్తోత్రాలను పఠిస్తే 'భుక్తిం ముక్తించ విన్దతి' అని కూడా చెప్తారు. 'భుక్తి' అంటే 'ఆహారం' అని అర్థం కదా! కేవలం 'ఆహారం' లభిస్తుంది అని చెప్పడం అంతముఖ్యమా? లేక వేరే ఏదైనా అర్థం ఉందా!**

**జ:** 'భుక్తి ముక్తులు' అనే మాట 'భోగం-మోక్షం' అని అర్థాలను తెలియజేస్తుంది. ఇహలోకంలో భోగం. జీవునికీ అంతిమ ప్రయోజనం మోక్షం. రెండింటినీ దైవం ప్రదానం చేస్తున్నాడు. స్తోత్రాదుల అనుష్ఠానం వల్ల ఈ రెండూ కలగాలని ఋషుల భావన. 'భుక్తి' కర్మానుభవం. 'ముక్తి' కర్మబంధనం నుండి విమోచనం. ఈ రెండింటినీ తెలియజేసే పదాలివి.

**ప్ర: నేను లలితా సహస్రనామ పారాయణ చేస్తాను. ఈ మధ్య ఒక పుస్తకంలో లలితా సహస్రనామ పారాయణకు ముందు వేయిసార్లు షోడశాక్షరీ మంత్రజపం చేయాలన్నారు. ఆ మంత్రజపం ఏమిటి?**

**జ:** శ్రీవిద్యకు సంబంధించిన మంత్రం షోడశాక్షరి. లలితాసహస్రనామస్తోత్రం శ్రీవిద్య లోనిదే. అందుకే షోడశాక్షరిని జపించాలి. లలితా సహస్రనామాలను పఠించాలి అని శ్రీవిద్యోపాసకుల నియమం. అలాగే బాలా, పంచదశీ- వంటి శ్రీవిద్యామంత్రాలను జపించి, సహస్రనామాలకు పారాయణ చేస్తుంటారు కొందరు. కానీ సరియైన పద్ధతిలో సరియైన గురువుద్వారా సంప్రదాయ సిద్ధంగా ఆ మంత్రాలను గ్రహించాలి. అయితే ఆ మంత్రాలను జపించాకనే లలితా నామాలను పఠించాలి అనుకోనక్కర లేదు. ఉపదేశం ఉన్నవారు కొంతసంఖ్యలో జపించి పఠించవచ్చు. ఉపదేశం లేనివారు

"శ్రీమాత్రే నమః" అనే మంత్రాన్ని కుదిరినంత జపించి పారాయణ చేయవచ్చు. ఈ విషయానికి ప్రమాణంగా లలితాసహస్ర పీఠికలోనే– 'శ్రీవిద్యాం వేత్తి వా నవా' శ్రీవిద్య తెలిసినా, లేకున్నా ఈ స్తోత్రాన్ని పఠించవచ్చని అమ్మవారి వాక్యం ఉన్నది. అందుకే షోడశాక్షరిని జపిస్తేగానీ లలితా సహస్రం చదవరాదని అనుకోవద్దు. షోడశాక్షరి మంత్రం కోసం వెదుకులాడవద్దు.

**ప్ర: గుళ్ళను దేవుడు రక్షించడెందుకు?**

**జ:** దేవతలు తమకు తాముగా ఏమీ చేయరు. ఈ గుళ్ళు, గోపురాలు వారు కట్టు కోలేదు; కట్టమని కోరలేదు. మానవుడు తనకోసం నిర్మించుకొన్నాడు. కాపాడు కోవటం కూడా తన బాధ్యతే. దేవుడు సాక్షిమాత్రుడు. కట్టినవాడికి పుణ్యమిస్తాడు. పడగొట్టినవాడికి పాపమిస్తాడు. ఆయా పాపపుణ్యఫలాలను పరిపక్వకాలంలో అను భవిస్తారు. ఒకడెవడో తనకు గుడి కట్టాడుగదా అని దేవుడక్కడ కాపలా ఉండి ఆలయ నాశకులను శిక్షిస్తూ ఉండడు. పూజలు చేస్తే కోరికలు తీరుస్తాడు. పాపములు చేస్తే కాలాంతరమున ఫలం అనుభవింప జేస్తాడు.

తనను రక్షించుకోలేనివాడు, తన గుడిని నాశనం చేస్తుంటే, దోచుకొంటుంటే చూస్తూ ఊరుకొన్నవాడు (ఇక) భక్తులనేమి కాపాడతాడు – అనేది ఆధునిక వాదన. దీనికి జవాబు: భక్తితో ప్రార్థించిన వారి కోరికలు తీర్చగలడు. తన గుడిని రక్షించుకోవాలని మాత్రం సంకల్పించడు. ఎందుకంటే, ఆయనకు (తనవే అయిన) సంకల్ప వికల్ప ములు లేవు. కోరగల భక్తుడు, పిలువగల భక్తుడు, ఆవాహన చేయగల భక్తుడు పిలిస్తే, కోరితే, గుడిని రక్షించమంటే ఆ భక్తుని కోసం రక్షిస్తాడు; తన కోసం మాత్రం కాదు.

**ప్ర: పాముల కోసమని పుట్టలో పాలుపోస్తే పాములు తాగుతాయా? అలాగే చలిమిడి, నువ్వుల వంటకాలు, ధూపదీపాలతో పుట్టల దగ్గర హడావిడి చేస్తే– పాపం! నాగజాతికి బాధేతప్ప, పూజ ఎలా అవుతుంది?**

**జ:** సర్పదేవతలు అంతరిక్ష సంబంధమైన సూక్ష్మశక్తులు. పృథివిలో ఉన్న జీవులందరి ఉపాధులలోనూ ఒక్కొక్క జాతి ఉపాధిలో ఒక్కొక్క విధమైన దేవతా చైతన్యం వ్యక్త మవుతుంటుంది. స్త్రీలో అమ్మవారిని, వేదవేత్తలో విష్ణువుని భావించి ఆరాధించుతాం. కానీ ఆ స్త్రీ, పురుషుల వ్యక్తిత్వాలు, నామరూపాలు అక్కడ ప్రధానం కావు. వారిలో నున్న స్త్రీ రూపచైతన్యం, వేదవిజ్ఞానరూప చైతన్యమే అక్కడ పూజార్హాలు. అలాగే

సర్పఉపాధులలోని సర్పదేవతా చైతన్యాన్ని ఆరాధించడం ఈ పూజల్లో కనిపిస్తుంది. పాముపుట్టలు కొంత ఆ దేవతాశక్తికి సామీప్యాలు.వాటిని పూజించడం చేత సర్ప దేవతలు సంతోషిస్తారు. సర్పాలు కావు.

దేవతలు దర్శనమాత్ర సంతుష్టులు. చూడడం చేతనే ఆనందించేవారు. అందుకే దేవతలకు నివేదనలు. ఆ దర్శనమాత్రమే వారికి తృప్తిదాయకం. ఇవి కాక– ఇంకా ఎన్నో రహస్యాలు వీటిలో ఉంటాయి.

ప్ర: **ఉదయం స్నానం చేసి శుద్ధులమై పూజ చేస్తాం. తరువాత ఎప్పుడు మలమూత్ర విసర్జనలు చేస్తే మళ్లీ స్నానం చేస్తేగాని శుద్ధులం కాలేమా! అప్పుడేం చేయాలి? కొందరు కాళ్లు కడుక్కొంటే చాలు అంటారు. కొందరు స్నానం చేయాలంటారు. ఏది విధి?**

జ: అనేక ధర్మశాస్త్రాలలో అనేకాంశాలు చెప్పబడ్డాయి. వాటిని క్రోడీకరించి, దేశ కాల ధర్మానుగుణంగా పరిశీలించి చెప్పాల్సి వస్తే– మలవిసర్జనాదులు ఏ వస్త్రం ధరించి చేస్తామో ఆ వస్త్రాన్ని తిరిగి తడిపి ఆరవేయకుండా వాడరాదు.

విసర్జనానంతరం విసర్జనాంగాలను శుభ్ర పరచాక, కటిస్నానం (నడుము నుండి పాదాల వరకు స్నానం) చేయడం మంచిది. అటుపై పుక్కిలించాలి. (గండూషం). ఆహార పదార్థములు తిన్నా, విసర్జన చేసినా పుక్కిలింతతో కానీ శుద్ధికాదు.

దంతాలను నడిమి వ్రేలితో గానీ, ఉంగరపు వ్రేలితో గానీ, బొటనవ్రేలితో గానీ తోమి (చూపుడు వ్రేలు వాడరాదు)–అటుపై ఎనిమిది మార్లు పుక్కిలించాలి. ఆ నీటిని నడుమవైపే వదలాలి. మనకు ముందువైపున దేవతలు, కుడివైపున పిత రులు, వెనుక వైపున ఋషులు ఉంటారు కనుక "వామే గండూష మాచరేత్" – ఎడమవైపునే పుక్కిలించాలని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి.

ప్ర: **ఈ మధ్య గుళ్ళలో పూజలు చేయిస్తే, లేదా– కొన్ని యజ్ఞయాగాలకు, అర్చనలకు వెళితే, మాసపత్రికలు కొంటే ఉచితంగా ప్రసాదం పేరుతో యంత్రాలు కూడా ఇస్తున్నారు. అవి ఏం చేయాలో తెలియదు. ఇంట్లో ఉంచితే ఏ నియమాలు పాటిం చాలో అంతకన్నా తెలియదు. వాడకుండా ఉంచితే మంచిదో కాదో అని భయం. మేమేం చేయాలి?**

జ: యంత్రాలన్నీ ఇళ్ళల్లో, పూజామందిరాల్లో ఉంచడం తగని పనే. కొన్ని సాధారణ మైనవి ఉన్నా, చాలా భాగం అసాధారణమైనవి ఉంటాయి. శక్తిమంతమైనవి

యంత్రాలు. దేవతాచిత్రాల కన్నా యంత్రాలు, యంత్రాల కన్నా మంత్రాలు – ఉత్తరోత్తర (ఒకదాని కంటే ఒకటి) బలీయాలు. అందుకే యంత్రాల స్థాపనకు, అర్చనకు తత్సంబంధమైన మంత్రం, ఆవరణ పూజావిధానం, శుచి, నైవేద్యం వంటివి అవసరం. చిత్రపటాలకు వీటంత నియమాలుండవు.

ఈ కారణాల రీత్యా ఆ యంత్రాలను స్వీకరించడం తగనిదే. మన పూర్వీకులు సాధారణంగా మంత్రాన్నీ, యంత్రాన్నీ గురుముఖతః స్వీకరించి, నియమాలను తెలుసుకొనేవారు. చిత్రపటాల్లా అమ్మడం, కొనడం, ఇళ్ళల్లో పెట్టుకోవడం యంత్రాలకు వర్తించవు. ప్రజలను ఆకర్షించడానికి ఈ రోజుల్లో యంత్రాలను కూడా వ్యాపారం చేస్తున్నారు. మనం వీటిని ప్రోత్సహించరాదు. ఇంటికి తీసుకురారాదు.

ప్ర: **వివాహానికి రెండు మనసులు కలిస్తేచాలు, రెండు కుటుంబాలు కలిస్తే చాలు. అంతేగాని జాతకాలు కలవాలనే పట్టింపు అవసరమా! 'టెక్నికల్'గా ఎంతో అభివృద్ధి చెందుతున్న ఈ కాలంలో వీటిని ఎంతవరకు నమ్మవచ్చు? జాతకాలకి వ్యతిరేకంగా వెళితే ఏమైనా అవుతుందా? జాతకాల పెళ్ళిళ్ళన్నీ సఫలమౌతాయా?**



జ: జాతకం ఒక శాస్త్రం. అది ఏనాడో అభివృద్ధి చెందిన ఒక 'టెక్నికల్' జ్ఞానం. ఆ టెక్నిక్ వేరు. ఎంత టెక్నికల్‌గా భౌతికంగా మనం ఎదిగినా నక్షత్ర, గ్రహాదుల ప్రభావాల విజ్ఞానం మారదు. మనసులు కలవడం, విడిపోవడం నిలకడ లేనివి. ఇవాళ ఎంతో 'గాఢం'గా భావించిన అనుబంధమే, కొన్నాళ్ళకి చాలా తేలిగ్గా విడిపోతుంది. అన్యోన్యం అనిపించుకున్నవి కూడా అన్యాయంగా చెదిరిపోతు న్నాయి. మనసులు, మనుషులు, ధనాలు, దారిద్ర్యాలు అన్నీ ఇప్పటి స్థితి నుండి అంచనావేసి భవిష్యత్తును నిర్ణయించలేం. ఎన్నో ప్రేమవివాహాలు భయంకరంగా విఫలమైనవి కనిపిస్తున్నాయి. జాతకాలకు అనుగుణంగా జీవితాలుండడం ప్రత్యక్ష ప్రమాణంగా ఎన్నో గోచరి స్తాయి. అయితే శాస్త్రానికి –శాస్త్రవేత్తలకీ తేడా ఉంది. వైద్యశాస్త్రం గొప్పదే. కానీ వైద్యులందరి ప్రావీణ్యం ఒక్కటి కాదుకదా! అంతేకాదు – ఏ శాస్త్రానికైనా కొన్ని పరిమితులుంటాయి. వాటిని తెలుసుకొని అన్ని వైపులా పరీక్షించి రెండు జీవితాలను కలపడం శ్రేయస్కరమని సంప్రదాయజ్ఞుల మాట.

ప్ర: **వాలి ఎదురుగా నిలబడి యుద్ధం చేస్తే, ఎదుటివాని బలంలో సగం వాలికి వస్తుందని అంటారు. ఆ వరం వాలికి ఎవరు ప్రసాదించారు? అందుకేనా శ్రీరాముడు వాలిని చెట్టు చాటునుండి సంహరించినది?**

**జ:** వాల్మీకం ప్రకారం – వాలి ఎదురుగా నిలబడి యుద్ధ చేయడం వల్ల ఎదుటివాని బలం సగం వానికి వస్తుందన్న విషయం లేదు. అయితే –బలం తరగని విధంగా ఉండే రత్నహారం ఇంద్రుడు వాలికి బహూకరించినట్లుగా వాల్మీకి రామాయణం వర్ణిస్తోంది. చెట్టుచాటు నుండి కొట్టడంలో ధార్మిక కారణాలు చాలా ఉన్నాయి. దానికీ, కంఠహారానికీ ఏ సంబంధమూ లేదు. అయితే తులసీరామాయణం వంటి రామాయణాల్లో ఈ కంఠహారం సగం బలాన్ని లాగివేయడం గాథ ఉన్నది. ఇంద్రదత్త కంఠహారం వాలి ధరించాడన్న వాల్మీకి రామాయణ ప్రస్తావన ఆధారంగా అల్లిన కథ ఇది.

**ప్ర: ఇంట్లో శ్రీరాముని పటం ఉండరాదనీ, రాముని పూజిస్తే కష్టాలొస్తాయని కొందరంటున్నారు. ఎంతమేరకు నిజం? రామదాసు, త్యాగయ్య కష్టాలనుభవించారని ఉదాహరణ చూపిస్తున్నారు.**

**జ:** కలి ముదురుతున్న కొద్దీ ఇలాంటి మాటలు వినవస్తుంటాయి. వీటిలో ఏమాత్రం సత్యం లేదు. దైవాన్ని పూజించడం వల్ల కష్టాలు రావు. మన పురాకృత పాప ఫలంగా కష్టాలొస్తాయి. 'శ్రీరామరక్ష సర్వజగద్రక్ష'. శ్రీరామారాధన ఇహ పర సుఖ సాధన. రామదాసు కష్టాలకి రాముడు కారణం కాదు. ఆయనను చెరనుంచి విడిపించినది రాముని కృప. త్యాగయ్య ఏ కష్టాలూ అనుభవించలేదు. జీవితంలో కష్టసుఖాలు ఎవరికైనా సామాన్యమే. ఏ దేవతని పూజించినా అవి రాకమానవు. అయితే శుద్ధభక్తితో, జ్ఞానంతో భగవంతుని పూజించిన వారు వాటికి చలించరు. వాటి తీవ్రత వారిని బాధించదు. సరికదా జ్ఞానానికీ, సిద్ధికీ హేతువుగా ఆ పూజ ఫలిస్తుంది. 'ఆపదామపహర్తారం – దాతారం సర్వసంపదామ్' ఆపదలు తొలగించి, సంపదలు కలిగించేవాడు శ్రీరాముడు.

అయితే ఇహసుఖాలను ఆశించక, రామునే శరణువేడిన మోక్షకాంక్షులు, నిజమైన భక్తులు త్యాగరాజాదులు. 'నిధి చాలా సుఖమా! రాముని సన్నిధిసేవ సుఖమా' అని కీర్తించిన భాగవతులు. ఇలాంటి భాగవతులు లౌకికుల దృష్టిలో కష్టాలు పడుతున్నట్లు కనిపించినా, నిజమైన బ్రహ్మానందం వారిదే. వారి స్థాయి వేరు. లౌకికస్థాయిలో వాంఛలతో శ్రీరాముని సేవించిన వారికి కూడా శుభాలు ప్రాప్తిస్తాయడంలో సందేహం లేదు. నిరభ్యంతరంగా శ్రీరాముని పటాన్ని ఇంట్లో ఉంచవచ్చు. ఆయనను పూజించి కష్టాలు తొలగించవచ్చు.

**ప్ర: అష్టసిద్ధులు – అంటే ఏమిటి? ఇవికాక ఇంకేవైనా సిద్ధులున్నాయా? ఆ సిద్ధుల వివరాలేమిటి?**

జ: ***అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా।***
***ప్రాప్తిః ప్రాకామ్య మీశిత్వం వశిత్వం చాష్టసిద్ధయః॥***

1. అణిమ, 2. మహిమ, 3. గరిమ, 4. లఘిమ, 5. ప్రాప్తి, 6. ప్రాకామ్యం, 7. ఈశిత్వం, 8. వశిత్వం.

**1. అణిమ :** శరీరాన్ని అల్పపరిమాణంగా కుదించుకొనుట,

**2. మహిమ :** దేహాన్ని అధిక పరిమాణంగా విస్తృతిపరచుకొనుట,

**3. గరిమ :** బరువుగా మలచుకొనుట,

**4. లఘిమ :** తేలికగా అవగలుగుట,

**5. ప్రాప్తి :** ఎక్కడి వస్తువునైనా సాధించగలుగుట/ ఇంద్రియాధిదేవతల ద్వారా తగిన శక్తులను సంపాదించుకొనుట.

**6. ప్రాకామ్య :** కోరిన సుఖాలను పొందగలుగుట

**7. ఈశిత్వం :** ఎవరిపైనైనా అధికారాన్ని సాధించుట / మాయను నిగ్రహించుట.



**8. వశిత్వం :** వశపరచుకొనుట / ఇంద్రియాలను నిగ్రహించడం ద్వారా నిస్సంగాన్ని పొందగలుగుట.

వీటిని యోగసాధనల ద్వారా, మంత్రానుష్ఠానాల ద్వారా కూడా సాధిస్తారు. అయితే ఆధ్యాత్మికంగా మాయాజయమే ఎనిమిదింటిలోనూ దాగిన అంతరార్థం. ప్రకృతికీ, ప్రకృతి జనితమైన మోహశోకాదులకు లొంగిపోకుండా నిగ్రహశక్తిని సాధించడంలోని స్థాయిలే ఈ ఎనిమిది.

ఇవి కాక ఆకలి దప్పులను జయించుట, దూరశ్రవణ, దూరదర్శన, దూరగమ, కామరూప, పరకాయ ప్రవేశ... మొదలైన సిద్ధులు కూడా ఉన్నాయి. దేవతలతో క్రీడించుట, భూతభవిష్యత్ జ్ఞానం, ఇతరుల మనసులోనిది గ్రహించుట, శీతోష్ణాదుల తీవ్రతకు చలించకుండుట, అగ్ని విషాదులను హరించుట, అపరాజితునిగా (ఓడిపోని లక్షణం) ఉండుట... మొదలైన సిద్ధులను భాగవతం వర్ణిస్తోంది.

**ప్ర: ఏకాదశీవ్రతం పాటించేటప్పుడు ప్రధానంగా పాటించవలసినదేమిటి? ముందురోజు కూడా ఉపవాసముండాలా?**

జ: ఏకాదశి ముందురోజు దశమినాటి రాత్రి భోజనం చేయరాదు. ఫలహారం స్వీకరించ

వచ్చు. ఏకాదశినాడు యథాశక్తి ఉపవసించాలి లక్ష్మీనారాయణులను పూజించి పారాయణం, జపం, ధ్యానం సంకీర్తన వంటివి ఆచరించాలి. వీలైనంత మౌనాన్ని అవలంబించాలి (వృథా సంభాషణలు, నింద, పరుషవచనాలు పలుక రాదు). మరుసటి రోజున (ద్వాదశినాడు) మళ్ళీ పూజ చేసి, శుచిగా వండిన ఆహారాన్ని భగవంతునికి నివేదించి విష్ణుస్వరూపంగా భావిస్తూ శక్త్యనుసారం విప్రునకు భోజనంపెట్టి, తదనంతరం తాను భుజించాలి. ఇది ఏకాదశీ వ్రతవిధి.

ప్ర: **'సూత్రాలు' అని శాస్త్రంలో అంటుంటారు. ఉదాహరణకు – యోగ సూత్రాలు, భక్తి సూత్రాలు, బ్రహ్మ సూత్రాలు... ఇలా. అసలు 'సూత్రం' అంటే ఏమిటి? మంగళ సూత్రం–అంటే 'మంగళకరమైన దారం' అని అర్థం కదా. శాస్త్రంలో 'సూత్రాలు' ఏమిటి?**

జ: 'సూత్రం' అంటే లౌకికంగా 'దారం' అని అర్థం. ఒక కొనసాగింపును కలిగినది కనుక దారాన్ని సూత్రం అన్నారు. శాస్త్రంలో 'సూత్రం' చాలా బలీయమైనది. ఒక్క వాక్యంలో ఎంతో జ్ఞానాన్ని పొదిగించి, అత్యంత క్లుప్తంగా చెబితే 'సూత్రం' అంటారు. ఇది జ్ఞాపకం ఉంచుకొనడం తేలిక. సూత్రంలోని అంతరార్థాన్ని వివరిస్తే 'భాష్యం' అంటారు. ఇంగ్లీష్ భాష ప్రకారం సూత్రాన్ని 'ఫార్ములా' అనవచ్చు. తొలుత 'సూత్రం' వ్యాకరణశాస్త్రంలో ఉద్భవించింది. తదనంతరం ప్రతి శాస్త్రం సూత్రపద్ధతిని అవలం బించింది. వేదాంతాన్ని 'బ్రహ్మసూత్రాలు' గా వ్యాసదేవులు అందించారు.



భక్తిసూత్రాలను నారదుడు, యోగసూత్రాలను పతంజలి రచించారు. ఇలా దర్శన శాస్త్రాలన్నీ సూత్రసాహిత్యాలను అభివృద్ధి చేశాయి. బౌద్ధ జైనాలు, శైవ శాక్తేయాది సంప్రదాయాలు కూడా సూత్ర రచనలను ఏర్పరచుకున్నాయి.

ప్ర: **వేదాలకు 'కల్పశాస్త్రం' ఒక అంగం అంటారు. వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం – అంటే అర్థమయ్యాయి. ఈ 'కల్పం' అంటే ఏమిటి?**

జ: యజ్ఞయాగాది కర్మలని సమగ్రంగా తెలియజేసే శాస్త్రం కల్పం. ఇది రెండువిధాలు. 1.శ్రౌత సూత్రకల్పం, 2. స్మార్త సూత్రకల్పం. ఋగ్వేదానికి – ఆశ్వలాయన కల్ప సూత్రం, గృహ్యసూత్రం. శుక్ల యజుర్వేదానికి కాత్యాయన శ్రౌతసూత్రం. కృష్ణ యజుర్వేదానికి బోధాయనకల్పసూత్రం, ఆపస్తంబ కల్పసూత్రం. సామవేదానికి లాట్యాయన శ్రౌత సూత్రం, జైమిని, గోభిల గృహ్యసూత్రం. అథర్వ వేదానికి–వైతాన శ్రౌతసూత్రం, కౌశిక సూత్రం. ఇవి ప్రసిద్ధమైనవి. వేదమంత్రాలను కర్మలుగా ఎలా

వినియోగించాలో, వాటి ద్వారా ఏ ఫలితాలను సాధించాలో చెప్పే శాస్త్రం కల్పశాస్త్రం. అలాగే వేదాలను సామాన్యులకు సైతం అందుబాటులోకి తెచ్చిన ధర్మ శాస్త్రాదులు చెప్పినవి స్మార్తసూత్ర కల్పం. ఇవి గృహ్యసూత్రాలు, ధర్మసూత్రాలు అని రెండువిధాలు. వివిధ వ్రతాలు, పూజలు ఇవన్నీ ఈ స్మార్తసూత్ర కల్పంలోనే ఉంటాయి.

ప్ర: **శ్రీరాముడు రావణ సంహారానంతరం, బ్రహ్మహత్యా పాతకం నశించడానికై శివలింగ ప్రతిష్ఠ చేశాడనీ, అదే రామేశ్వరక్షేత్రమనీ చెప్తారు. శ్రీరామునకు హత్యాపాతకం ఏమిటి? లోకరక్షణ కోసం రావణ సంహారం చేసిన ధర్మమూర్తికి పాపమా? దానికి ప్రాయశ్చిత్తమా? అందుకే కొందరు రామేశ్వర కథ కల్పితమనీ, అది వాల్మీకి రామా యణంలో లేదనీ అంటారు. కాస్త వివరించండి.**

**జ:** సేతుబంధనం చేసేముందు శివలింగాన్ని శ్రీరాముడు ప్రతిష్ఠించినట్లు శివపురాణం వర్ణిస్తోంది. ఇతర పురాణాల్లో కూడా రాముడు శివలింగాన్ని ఆరాధించిన విషయం కనిపిస్తుంది. కొన్నిచోట్ల హత్యాపాతక నివారణార్థం శివలింగ ప్రతిష్ఠలు చేసిన గాథలున్నాయి. వీటిని కాదనలేము. వాల్మీకి రామాయణం కావ్యం. కావ్యంలో క్షేత్ర, మంత్ర విషయాలుండవు. అవి ఆగమాలలో, పురాణాలలో చెప్పబడతాయి. ఆ మాట కొస్తే శ్రీరామనామం తారకమంత్రం అనీ, ఉపాసనావిధానం కూడా రామాయణంలో లేవు. అంతమాత్రాన అవి కల్పితాలని అనలేముకదా! రామ ప్రాధాన్యం కల రామా యణంలో రామమంత్ర, ఉపాసనాదులు రహస్యంగా, గర్భితంగా నిబద్ధం చేశాడు వాల్మీకి. వాటిని పురాణాలు, మంత్ర శాస్త్రాలు విడమరచి అందించాయి. పురాణాలను కాదని వెలితే మనకీ క్షేత్రాలేవీ మిగలవు. భద్రాచలంలాంటి క్షేత్రాల గురించి కూడా రామాయణం చెప్పలేదు. పురాణం చెప్పింది. ఇక–హత్యాపాతకం అంటారా? అంతరార్థాన్ని పరిశీలిద్దాం.

శ్రీరాముడు నారాయణుడు. ధర్మమూర్తి. దుష్టసంహారం ఆయన విధి. అయితే దానిని సంకల్పమాత్రం చేత చేయగలడు. కానీ అవతరించి, అంత కథ నడిపి చేయాలా? అది ఆయన లీల మాత్రమే. ఆ లీలలో భాగమే ఇది కూడా.

సర్వశక్తి సంపన్నుడైన స్వామికి విశ్వామిత్రుని అస్త్రాలు ఎందుకు? ఆదిత్య హృదయం ఉపదేశం ఎందుకు? వానరుల సహాయం ఎందుకు? అన్నీ ధర్మా చరణలో భాగాలు. లీలా రచనలు.

క్షత్రియధర్మం ప్రకారం దుష్టశిక్షణ చేయాలి. అది తప్పనిసరి హింస. అయితే అందు

వల్ల పాపం రాదుకానీ, కొంతదోషం ఉంటుంది. ఆ దోషం ఉన్నా స్వధర్మంగా ఆ కర్మచేసి, దోష నివారణార్థం ప్రాయశ్చిత్తం చేయాలి. శరీరంలో ఎక్కడైనా వ్రణం వస్తే శస్త్రచికిత్స చేస్తారు. అది అనివార్యం. కానీ శస్త్రచికిత్స చేయడంవల్ల వచ్చే 'ఇన్‌ఫెక్షన్' వంటివి పోవడానికి మరో మందును వాడతారు కదా! ఇన్‌ఫెక్షన్‌కి భయపడో, మరో మందును వాడడానికి శంకించో చికిత్సను మానరాదు కదా! వాటికి పరిహారాలు చేసి చికిత్సచేయాలి. చికిత్సకు ముందు, వెనుక జాగ్రత్తలు తీసుకోవాలి. అది ధర్మం. అలాగే క్షత్రియుడు ధర్మరక్షణార్థం శత్రు సంహారం చేసినా, అందులోని అనివార్యమైన హింసాదోష పరిహారార్థం పరిహారం చేయడం కూడా ధర్మంలో ముఖ్యం. అలాంటి దోషాలకే ప్రాయశ్చిత్తం. అంతేగానీ స్వార్థం కోసం చేసే అధర్మానికి ప్రాయశ్చిత్తం అంత తేలికకాదు. అనేక మంది రాజులు యుద్ధానంతరం శివాలయాలు ప్రతిష్ఠ చేసిన వైనాలు ప్రత్యక్షసాక్ష్యాలు. ఇది సంప్రదాయం.

**"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః**

**సయత్ ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే"** – అని గీతాచార్యుని మాట. లోకానికి ఆదర్శాన్ని చూపే విష్ణువు తనకు అభిన్నమైన శివునే ఆరాధించాడు. రాముడు ఎంత శివభక్తుడో, శివుడంతటి రామభక్తుడు. ఒకరి హృదయం ఒకరు. ఒకరొకరిని పూజించడం అంటే పరస్పరం గౌరవించుకోవడం. అంతమాత్రాన ఒకరు ఎక్కువ – ఒకరు తక్కువ కాదు. ఉదాత్త చరిత్రగలవారు ఇంకొకరి ఉదాత్తతని ఆరాధించడానికి వెనకాడరు.

ప్ర: **శ్రీరామునికి సీతావియోగంలాంటి బాధలు ఎందుకు కలిగాయి? దీనికి భృగుపత్ని శాపం కారణమనీ, మరోచోట మరియొకరి శాపం కారణమనీ చెప్తారు. ఇవీ పురాణాల కల్పనేనా? వీటిని ఎలా సమర్థించడం? విష్ణువునకు కూడా శాపమా! పాపమా!**

**జ:** సృష్టి రక్షణ కోసం స్వధర్మాన్ని ఆచరించే దేవతలు కూడా వారికి పాపం అంటకున్నా – విశ్వనియమాలను పాటిస్తారు. ఆ మాటకొస్తే శివుడే బ్రహ్మ చేసిన తప్పును భైరవరూపంలో శిక్షస్తూ ఒక తలను ఛేదించి తనంత తానుగా బ్రహ్మ హత్యా పాతకాన్ని వెంటపెట్టుకొని భిక్షాటన చేస్తూ పరిహారం చేసుకొని, చివరకు వైకుంఠంలో లక్ష్మీదేవి చేతిభిక్షను స్వీకరించి, కాశీక్షేత్రంలో ప్రవేశించి ఆ పాత కాన్ని పరిహరింప జేసుకున్నాడు. ఇవన్నీ తాము సైతం విశ్వనియమాలను పాటిస్తామనీ, అలాగే మనం కూడా పాటించాలని చెప్పడమే. ఇక – రామునికి శాపాల గురించి...

సుఖదుఃఖాలకీ, వాటికి మూలమైన సంఘటనలకీ గతజన్మల కర్మలు కారణాలు. జన్మేలేని భగవంతుడు అవతరించాలంటే ఆ అవతారంలోని సంఘటనకి కర్మబీజా లుండాలి కదా! అందుకే విష్ణువుగా తను చేసిన లీలలలో ఇలాంటి 'శాపం' లాంటి కర్మబీజాలను తన మాయాశక్తితో తానే కల్పన చేసుకొని, అవతారంలో వాటిని సంఘటనలుగా మలచుతాడు. "నీ లీలలు అంతుపట్టవు" అని మహాత్ములు కీర్తించడం లో ఆంతర్యమిదే. కార్య-కారణ సంబంధాలను బహుజాగ్రత్తగా అల్లిక చేసే పర మాత్ముని లీలారచనలివి. స్థూలంగా పరిశీలించి, మన పరిమిత దృష్టిలో లౌకికంగా ఆలోచిస్తే అర్థం కావు. ఎన్నో ఆంతర్యాలు వీటిలో దాగి ఉంటాయి.

**ప్ర: సూర్యుడు కదలని జ్యోతిర్మండలం కదా? మరి ఉత్తరాయణం, దక్షిణాయనం - అంటూ సూర్యునికి గమన మున్నట్లు భావించిన మన శాస్త్రాలు ఎలా హేతుబద్ధాలు?**

**జ:** సూర్యుడు కదలకున్నా భూభ్రమణం వల్ల ఆయన శక్తి భిన్నభిన్న ప్రాంతాలకు భిన్నంగా లభిస్తుంది. భూపరిభ్రమణం వల్ల ఆదిత్యప్రకాశం ప్రధానంగా రెండు విధాలుగా ఈ భరతవర్షం పై ప్రసరిస్తోంది. ఆ ప్రసరణను 'గమనం' అని భావించారు. ఆ ప్రసరణ వలన ఏర్పడే రెండు ముఖ్యమైన మార్పుల్ని రెండు అయనాలుగా పేర్కొన్నారు. ఆ మార్పులు మనకు స్పష్టంగా అనుభవాలు. అందు వలన ఉత్తరాయణ, దక్షిణాయనాలలో మనం కాదనలేని హేతుబద్ధత స్పష్టంగా ఉంది. ప్రకృతిలో సైతం చాలా పరిణామాలను ఈ సమయాల్లో పరిశీలించవచ్చు. మన నుండి సూర్యుడ్ని గమనిస్తే ఆయన చలిస్తున్నట్టు కనిపిస్తుంది. ఇది సాపేక్షం.



**ప్ర: అశ్వినీదేవతల పేర్లు ఏమిటి? వారి తల్లిదండ్రులెవరు?**

**జ:** అశ్వినీదేవతలు సూర్యపుత్రులు. 'అశ్వ' శబ్దానికి 'వేగంగా ప్రసరించునది' అనే అర్థం. అది కాంతికి సంబంధించినది. సూర్యకాంతిలో అనేక శక్తులున్నాయి. అందులో రోగహరణ శక్తులే అశ్వినీదేవతలు. పురాణ కథలో అవి సంకేతాలు.

సూర్యుని భార్య సంజ్ఞ (తేజశ్శక్తి) తన నీడను ఛాయాదేవిగా మార్చి, తాను అశ్వ రూపాన్ని ధరించగా, ఆమెకు సూర్యుని ద్వారా కలిగిన పుత్రులు అశ్వినీ దేవతలు. వీరి పేర్లు నాసత్యుడు, దస్రుడు.

**'నాసత్యా వశ్వినౌ దస్రా వశ్వినేయౌ చ తా వుభౌ'.** -నాసత్యుడు- అసత్య మాడనివారు. దస్రు - రోగనాశకులు... అని అర్థాలు.

**ప్ర: శివకేశవుల అభేదం గురించి తరచు చెబుతుంటారు. నేనూ విశ్వసిస్తాను. కానీ**

**భాగవతంలో విష్ణువే పరముడు (సర్వోన్నతుడు) అని ఉన్నది. భస్మాసురుని విషయం లోను, భృగుమహర్షి త్రిమూర్తుల్ని పరీక్షించే సందర్భంలో శివుని కంటే విష్ణువు అధికుడని ఉన్నది కదా!**

**జ:** పురాణ కథల్ని చక్కగా సమన్వయించుకోవాలి. విష్ణుభక్తులకు విష్ణువునందు నిష్ఠ కల్పించే విష్ణుపారమ్య పురాణాలలో భాగవతం ఒకటి. అలాగే శివ పారమ్యాన్ని నిరూపించే పురాణాలు కూడా ఉన్నాయి. శివుడు అగ్నిలింగంగా ఆవిర్భవించినప్పుడు బ్రహ్మవిష్ణువులు తుదిమొదళ్ళు తెలుసుకోలేకపోయారనీ, అలాగే-విష్ణువు, శివుని అర్చించి సుదర్శన చక్రాన్ని పొందాడనీ, దక్షయజ్ఞ ఘట్టంలో యజ్ఞరక్షకుడుగా ఉన్న విష్ణువు వీరభద్రుని చేతిలో ఓడిపోయాడనీ అనేక ఉదాహరణలు శివ సంబంధ పురాణాలలో చాలా కనిపిస్తాయి. వాటిని చూపించి 'శివుడే పరముడు' అని నిరూపించ వచ్చు. అలాగే శక్తి సంబంధ పురాణాల ఆధారంగా దేవీపారమ్యాన్ని (దేవియే సర్వోన్నతురాలని) ఋజువు చేయవచ్చు.

ఇవన్నీ ఒకే వ్యాసుడు రచించాడని మరచిపోవద్దు. అక్కడ ఇతర దేవతలని తక్కువ పరచాలని ఉద్దేశంకాదు. దీనిని 'నహినిందాన్యాయం' అంటారు. (ఇందులో ఇతర దేవతల నిందలేదు- అని అర్థం). తాను ఉపాసించే దైవాన్ని సర్వాధిక భావనతో కొలుచుకొనడమే ప్రధానోద్దేశం.



ఒకే పరమమైన తత్త్వాన్ని విష్ణువని కొందరు ఉపాసిస్తే, ఇంకొందరు శివుడని ఆరాధిస్తారు. మరికొందరు శక్తి అంటారు. ఉపాసనా సంప్రదాయాలు ఎన్నైనా - వాటిలో సమైక్యంగా ఉన్న పరమాత్మ తత్త్వాన్ని వివేకంతో సమన్వయించి బోధించ వలసిన బాధ్యతను పండితులు మరువరాదు. దైవాన్ని తన కోరిక తీర్చే ఒక దేవత రూపంగా భావించేవారికి ఆ కోరిక తీర్చడం వరకే దేవత బాధ్యత. ఆ దేవతను పరతత్త్వంగా భక్తితో ఉపాసించేవారికి జ్ఞానం, ముక్తి లభిస్తాయి.

భస్మాసురుడు, శివుని తన కోరిక తీర్చే దేవతగా పూజించాడు. అంతవరకే అతడి దృష్టి. అతడికి పరమాత్మ భావనలేదు. కనుక జ్ఞానం లభించలేదు.

అయితే - ఏ రూపంలో దేవత వరమిస్తుందో, ఆ రూపంలో శిక్షించదు. అందుకే భస్మాసురుని శివుడు సంహరించలేదు. ప్రళయకాలంలో కాలాగ్నిరుద్రుడై సర్వ జగతినీ దహించే స్వామికి భస్మాసురుడు ఒక లెక్కా? దేవతానియమం ప్రకారం - వరమిచ్చిన రూపంలో శిక్షించరాదు కనుక శివుడు ఉపేక్షించాడు. ఆ తత్త్వమే విష్ణురూపంలో

శిక్షించింది. ఇలా అన్వయించి గ్రహించాలి. అలా కాకుండా – విశాలతలేని సంకుచిత బుద్ధులతో, ఒకే గ్రంథానికి లేదా సంప్రదాయానికి పరిమితమై ఇతర సంప్రదాయాలను, దేవతలను నిందించితే జ్ఞానము, ముక్తీ లభించవు.

ఎవరు ఏ సంప్రదాయంలో ఉన్నా విశాలబుద్ధితో ఆలోచించి సమన్వయించుకొనే సుహృదయం ఉన్నప్పుడే తరించగలరు.

**ప్ర: ద్వాదశాదిత్యులు ఎవరు? ఒకే సూర్యునికి పన్నెండు పేర్లా? కాక పన్నెండు సూర్యులా?**

**జ:** సూర్యమండలాలు చాలా ఉన్నాయి. కానీ మన భూమికి కారణమై, పోషకమైన సూర్యమండలాన్నే మనం స్తుతిస్తున్నాం. సూర్యుడు ఒకడే అయినా, ఒక్కొక్క నెల ఒక్కొక్క ప్రకాశంతో పృథివికి తన శక్తినిస్తున్నాడు.

ఆ ప్రకారంగా పన్నెండు నెలలలో పన్నెండు విధాలుగా ప్రకాశించే లక్షణాలను ద్వాదశాదిత్యులంటున్నాం.

1.'ధాత' పేరుతో చైత్రానికి, 2.వైశాఖంలో అర్యముడు, 3.జ్యేష్ఠంలో మిత్రుడు, 4. ఆషాఢంలో వరుణుడు, 5.శ్రావణంలో ఇంద్రుడు, 6.భాద్రపదంలో వివస్వంతుడు, 7. ఆశ్వయుజంలో త్వష్ట, 8. కార్తికంలో విష్ణు, 9.మార్గశిరంలో ఆర్యముడు, 10.పుష్యంలో భగుడు, 11. మాఘమాసంలో పూష, 12.ఫాల్గుణంలో క్రతువు.



